# విషయసూచిక



హనుమంతుఁడు సముద్రమును దాఁటుట.   సు—1

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర

# వచనరామాయణము

## సుందరకాండము

### 1-వ సర్గము

**హనుమంతుఁడు సముద్రమును దాఁటుట**

అవతారిక :—పూర్వకాండమున నెన్ని తెఱఁగులనైనను మిత్ర రక్షణము చేయఁదగినది యని చెప్పఁబడినది. ఈ సుందరకాండమున దూత యిట్టిట్లుండవలయుననియు, పతివ్రతయగు భామ యీ యీ తీరున నడచుకొనవలయు ననియుఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

అట్లు జాంబవంతుఁడు ప్రోత్సాహపఱచినతరువాత శత్రువులను నశింపఁజేయఁగల హనుమంతుఁడు రావణునిచే నపహృతయైన సీతాదేవి యున్న తావు గనుఁగొనుటకై, చారణు లనెడి దేవయోనివిశేషులు సంచరించెడి యాకాశమార్గమునఁ బోవఁగోరి, చేయనలవికాని కార్యము నడ్డులేకుండఁ జేయఁగోరినవాఁడై, ఎత్తయిన తలయు, మెడయుఁగల, యాఁబోతువలె వెలుఁగుచుఁ, బెంపొందిన సింహమువలెఁ బక్షులను బెదరించుచు, ఱొమ్మతోఁ జెట్లను గ్రిందఁద్రోయుచుఁ బెక్కు మృగము లను జంపుచు, పచ్చులవంటి వన్నెగలవియయి, జలమువలె చల్లనై యుండు పచ్చికపట్టులందు బలగర్వములు మెఱయించుచుఁ దిరుగు చుండెను.

నీలి యెఱుపుఁ బసుపు నాకు పచ్చవన్నెలుఁ దెలుపు నలుపు వన్నెలుం గలయట్లు స్వభావముచే నేర్పడియున్న పలురంగులుగల గైరి

కాదిధాతువులు మిక్కుటంపుసొంపు గలిగింప, కోరినరూపమెత్తఁగల దేవతుల్యులైన యక్ష కిన్నర గంధర్వు లంతటఁ దిరుగఁ బెక్కుమదపు టేనుఁగులు విహరింపవెలయు నా మహేంద్రపర్వత ప్రదేశమున నుండు నా హనుమంతుఁడు కొలనియందుండు నేనుఁగుకైవడి వెలుఁగు చుండెను.

నేర్పరియగు హనుమంతుఁడు సూర్యునికిని, వేల్పు తేనికిని, బ్రహ్మదేవునికిని, భూతములకును దోసిలియొగ్గి, ప్రయాణము సలుపఁ దలఁచి, తూర్పుతట్టునకుఁ దిరిగి తన తండ్రియగు వాయుదేవునకు మ్రొక్కులిడి, దక్షిణదిశకుఁ బోవ నుంకించి, తనదేహమును బెంచి, కపివీరులు చూచుచుండ, రామునికార్యమునకై యెగురఁదలఁచిన వాఁడై, పర్వకాలములందలి సముద్రముచాడ్పున నుప్పొంగి, పరిమితి లేని యొడలితో నొప్పుచు, సముద్రమును దాఁటఁగోరి, చేతులతోను, గాళ్ళతోను నాపర్వతమున నూఁదిఁ యుదియఁ బోయెను.

మహేంద్రము కదలనిదిగ్గైనను, ముహూర్తకాల మా హను మంతుని కాలుసేతుల త్రొక్కిడిచే బిట్టుగఁ గదల, నాపర్వతమునందలి పూచిన తరువులకొనలనుండి పువ్వు లవ్వారిగ రాలెను. ఇట్లు చెట్ల కొనలనుండి రాలిన సుగంధికుసుమరాసు లంతటఁ గ్రమ్ముకొనఁ బుష్ప మయంబోయన నాగిరి యొప్పుమీఱె, సాటిలేని మగటిమిగల హను మంతునివలన నదుమఁబడుచు, మదపుటేనుఁగు మదజలము గార్చు చందమున నీటిధారల నెడలించెను.

బలిమిగలవాఁడగు నా హనుమంతుఁడు తట్టిన తట్టున కాపర్వ తమునందలి బంగారు వెండి కాటుకయుఁగల బండలు చీలఁగా, నా బం డల పగుళ్ళనడుమనుండి వెండి బంగారు కాటుకవన్నెగల ధారలు వెలు వడెను. అగ్నిహోత్రునుండి నడిమి దను ధూమ్రవర్ణయను పేరుగల జ్వాలతో పొగగుంపులు లేచుచందమున మణిశిలలతోఁగూడిన పటిపు గల బండ లాపర్వతమునుండి దొఱలెను. హనుమంతుఁ డదిమిన యదు ముడునకు మహేంద్రపర్వతమడలఁగా, నా పర్వతగుహాలలోనున్న జంతువులెల్లఁ దొట్రుపడి వికృతధ్వనులతోఁ గూసెను. ఆ పర్వతపు రాయిడివలనఁ బుట్టిన యా గొప్పజంతువుల ధ్వని యుద్యానములం దును, భూమియందును, దెసలందును నిండి మెండుకొనెను.

ఆ పర్వతమునందలి సర్పము లా రాయిడి కోర్వఁజాలక, కోపము గొనుచుఁ దమపడగలమీఁది రేఖలు బయలుపడ గొప్పపడగలు పైకెత్తి గుభుల్గుభులుమని మండుచున్న యగ్నిని గ్రక్కుచుఁ దమ వాఁడికోఱలతో నా పర్వతమునందలి శిలలను గఱవఁగా, నా పాములు కోపముతో విషమెక్కునట్లు కొఱికినందున నా పర్వతమునందలి గొప్ప బండలెల్ల నగ్నిజ్వాలలతోఁగూడి, మండుచుఁ బటపట పగిలి వెక్కు వ్రయ్యలయ్యెను. అప్పర్వతమునఁ బొడమియుండు మూలికలు విషము నడఁపఁజాలిన వయినను, ఆ సర్పములవిషముఁ బోఁగొట్టఁజాలకుండెను.

అంతఁ దాపసులును, భూతము లీపర్వతముం బగుల నడం చెడినో యని భయంపడిరి. మఱియు నాపర్వతమున పుష్పమాలలు ధరించి మదించి, యెఱ్ఱని వన్నెగల పూలదండలను దాల్చి, కుంకు మారుణమగు చందనము నలఁదికొని, స్వాభావికముగాఁ దెలిదామర పువ్వువంటి వన్నెగలవయ్యు మద్యపానముచే నెఱ్ఱనైయున్న కన్నులు గల విద్యాధరు లులికిపడి, మద్యపానముచేయుస్థలమునందలి బంగరు కల్లుకుండలను, వెలగల పానపాత్రలను, బంగారు గిండ్లను, నానా విధములగు లేహ్యములను, భక్ష్యములను, వెక్కు తెఱఁగులైన మాంసములను, ఋషభచర్మముతోఁ జేయఁబడిన కేడెములను, బంగారు పిళ్ళుగల కత్తులను విడిచి, ముత్యాలసరమును, అందెలను; వంకీలను, కంకణములను దాల్చిన తమతమ రమణీమణులను దోడ్కొని, యుప్ప రమున కెగురఁగా, నాయతివలు విస్మయపడుచు లేనగవుతో నొప్పుచు నాకసమున నిలఁబడియుండిరి.

విద్యాధరశ్రేష్ఠు లాప్రకారము నిలఁబడి, తమ యణిమాద్యష్ట సిద్ధుల నుపయోగించుచు నాకసమున గుంపులుగూడి యా మహేంద్ర పర్వతమును జూచిరి. పరబ్రహ్మధ్యానము చేయుతాపసులును, నిర్మల మగు నాకాశమున నుండు సిద్ధులును చారణులును, "పర్వతమువలె నెత్తైనవాఁడగు హనుమంతుఁడు రామునికార్యము నెఱవేర్చుటకును, తన వానరులకొఱకును జేయనలవికాని పని చేయఁగోరి గడు వేగ ముతో నెగిరి, దాఁటనలవిగాని సముద్రమును దాఁటి లంకాపురము నకుఁ బోవనున్నాఁడు" అని యొండొరులతోఁ జెప్పుచుండఁగా, నా

విద్యాధరు లామహర్షుల పలుకులు విని, కొలఁదియిడరాని మేనుగల వానరశ్రేష్ఠుఁడగు హనుమంతునిఁజూచిరి.

అంతటఁ బర్వతముకైవడి నొప్పుమీఱు నప్పవమాననందనుఁడు రోమములు విదిర్చి, యొడలు కదలించి, కడు గొప్పదగు కాఱుమబ్బు ఉఱుముచందమున నొప్పు గొప్ప బొబ్బరింత పెట్టి, తా నుప్పరమున కెగయఁబోవుచు ఆదోఁకపాటున రోమములతో నిండియున్న తోఁకను వేడబెట్టి, గరుత్మంతుఁ డురగంబునుం బోలెఁ బైకిఁజిమ్మెను. ఉరవడిఁ బూనిన యా హనుమంతుఁడు చుట్టి పైకివిసరిన యాతనితోఁక యాతని వెంబడి గరుఁడుఁ డెత్తికొనిపోవు సర్పముకైవడి నొప్పుచుండెను. మహాబలుఁడగు హనుమంతుఁడు గొప్ప గుదియలంబోలు భుజములను స్తంభింపఁజేసి దేహము గ్రుంగఁబట్టి పాదములును, చేతులును ముడిచికొని, మెడ గుదియించి, తేజమునుగైకొని, సత్తువ దెచ్చుకొని, మగఁటిమిఁబూని, పైకిఁ జూపు నిగిడించి, కడుదూరమునకు మార్గమును చూచి, యాకాశమును జూచుచుఁ బ్రాణముల బిగియఁబట్టి, మిక్కిలి దిట్టముగాఁ బాదము లూని, చెవులు రెండు. నిక్కించి యెగయఁబూని యా వానరవీరులం జూచి యిట్లనియె:

“ఓ కపీంద్రులారా! ఏను రాముఁడు ప్రయోగించిన సాయకము చందమున, వాయువేగముబోలు వేగముగలవాఁడనై రావణుఁ డేలెడి లంకాపురమునకుఁ బోయి చేరెదను. అచ్చట నారామునిపత్నిని జానకీ దేవిని గాంచనేని, యిదే పరుగుతో స్వర్గలోకమునకుఁ బోయెదను. స్వర్గలోకమునను సీతను గాంచ నేని, అలఁతనొందక రాక్షసేంద్రుఁడగు రావణుని పెడతెక్కలు విఱిచికట్టి, యీడ్చి తెచ్చెదను. ఎట్టకేలకుఁ గార్యంబు సాధించికొని సీతనుదోడ్కొని వచ్చెదను. కాదేని యీ లంకాపట్టణమును రావణునితోఁగూడఁ బెళ్ళగించి తెచ్చెదను.” అని వానరోత్తముఁడగు వడిగలవాఁడయిన హనుమంతుఁడు వానరులతోఁ జెప్పి, వడిగాఁ బైకెగిరి, తన్ను గరుడునిఁబోలినవానిఁగఁ దలఁచెను.

ఆ హనుమంతుఁ డుప్పరమున కెగయుటయు, ఆతఁ డెగురు వేగమునకు నా పర్వతమునందలి వృక్షములు కొమ్మలన్నింటితోఁగూడఁ బెళ్ళగిలి పైకెగిరినవి. ఆ హనుమంతునితొడలవేగమునకు క్రొవ్విన కొక్కెరలతోఁగూడిన కొన్ని వృక్షములు పుష్పములచే నొప్పారుచు

నిర్మలమగు నాకాశమున కెగిరి, యూరికిఁబోవు తమ బంధువును గొంత దూరము సాగనంపఁబోవునట్లును, సేనలు రాజును వెంబడించిపోవు నట్లును గొంతదూరము పోయినవి. అట్లు పుష్పించిన కొనలతోఁగూడిన పెక్కువృక్షములు వెంబడింప, పర్వతాకారుఁడయిన హనుమంతుఁడు చూపఱకు మహానందముఁగలిగించెను. మఱియుఁ జేవకల కొన్ని మహా వృక్షము లుప్పునీటిసముద్రమునఁబడి, పర్వతములు వేయిగన్నులవేల్పు నకు వెఱచి సముద్రమున మునుఁగుచున్నవో యనునట్లు తోఁచెను.

నానావిధములగు పుష్పములును, మొగ్గలును, అంకురములును నాపర్వతోపముఁడైన హనుమంతుని చుట్టు నిండియుండుటంజేసి, యా హనుమంతుఁడు మిణుఁగురులతోఁగూడిన పర్వతముకైవడిఁ దోఁచెను. జనులు తమబంధువులను సాగనంపుటకై నీటివఱకుఁబోయి మఱలి వచ్చు చందమున, నతనివేగమునకుఁ బెళ్ళగిలి పైకి పోయిన వృక్ష ములు పువ్వులఁదొఱఁగి, సాగరమునఁ బడినవి. మఱియు హనుమంతుని వేగమునకు నెక్కువ బలముగలవృక్షములు సముద్రమునఁ బడినవి. తక్కువబలముగల వృక్షము లా హనుమంతునిఁ గొంతదవ్వు వెంబ డించి, మఱలి సముద్రమునఁ బడినవి. నానావృక్షములందలి విచిత్ర కుసుమములు మఱింత తేలికయైనవగుటచేతఁ గడుదవ్వతనివెంబడి నేగి, సముద్రమునఁ బడుటంజేసి, మహాసముద్రము నక్షత్రములచే శోభిత మైన యాకాశముపగిదిఁ దోఁచెను. నానావిధములగు పుష్పములరాసు లా హనుమంతునిఁ గొంతదవ్వు వెంటనంటిపోవఁగా, నాకాశమున నా హనుమంతుఁడు మెఱపులగుంపుతోఁ గూడిన మేఘమువడువున వెలుఁగుచుండెను. అ హనుమంతునివడిచే నెగిరివచ్చిపడిన కుసుమనికర సముద్రోదకముదయమునొంది చెలువుమీఱియున్న రిక్కలగుంపుచేత సొబగుమీఱు గగనతలముమాడ్కి వెలుఁగుచుండెను.

హనుమంతుఁ డెగిరిపోవునప్పుడు చాఁచిన యయిదువేళ్లతోఁ గూడిన యాతని బాహువులు పర్వతాగ్రమునుండి వెలువడిన యైదు తలలం బోలుపాఱు పాముల భాతిఁదోఁపఁగా, మహాతేజుఁడగు నాతఁడు సముద్రముపైనఁ బోవునపు డలలతోఁ గూడ మహాసముద్రమును గ్రోలఁగడఁగినవిధమునను, మఱింతఁ బైనఁ బోవునపు డాకసము నప్ప ళింపఁ బూనినట్లును తోఁచెను. వాయుమార్గమునఁ బోవునట్టి వానర

శ్రేష్ఠుఁడగు హనుమంతునియొక్క నయనములు మెఱుపువంటి కాంతి గలవియగుటం జేసి, పర్వతంబునుండియుప్పతిల్లిన యగ్నులకైవడిని, పచ్చనికాంతిగలిగి, విఱివిమీఱి గుండ్రనివై యుండుటచే నేకకాలమున నుదయమగు సూర్యచంద్రులభాతినిఁ బ్రకాశించినవి. ఎఱ్ఱనిముక్కుచేఁ గెంజాయమీఱిన మోము సంధ్యారక్తిమతోఁ గూడిన సూర్యమండలముపగిదిఁ దోఁచెను. ఆకాశమున నేగుచుండు నా పవననందనుఁడు పైకెత్తిన యాతని వాల మున్నతమయిన యింద్రధ్వజముగతిఁ దోఁతెంచుచుఁ దెల్లని కోఱలతో నొప్పుచున్న తనకుఁ జుట్టుకొనఁగా, నతఁడు పరివేషముతోఁగూడిన సూర్యునిమాడ్కి వెలుఁగుచుండెను.

ఆ కపీంద్రుఁ డంతట నెఱ్ఱనైన కటిప్రదేశముగలవాఁడై వ్రయ్యలయిన గొప్ప కావిఱాయిగల పర్వతముపగిదిఁ బరిఢవిల్ల నాతని ప్రక్కల నిండియుండు వాయువు జీమూతముచందంబున గర్జిల్లుచుండ, ఉత్తరదిక్కునుండి యాకాశమునకు వెడలినతోఁకతోఁగూడిన దట్టపు మిణుఁగురులుగల తోకచుక్కచందమునఁ దోఁచుచు, నడచుచుండు సూర్యుండువోలె వెలుఁగుచు నతిదీర్ఘకాయుఁడై, నడుమునపట్టగట్టుటచే నిడుపుపెరిగిన యేనుఁగుమాడ్కిఁ బొలుపారుచుండెను. హనుమంతుఁడు నీటిపైనఁ దెలియు శరీరమును, నీటిలోపలఁ గనఁబడు మేని ప్రతిబింబము నొక్కటియై కనఁబడుచుండ, సముద్రములోపల మునిఁగిన అడుగుభాగమును, బైనను్న పైభాగమును గలదై వాయువశమునఁ బోవుచున్న నావమాడ్కి నొప్పుచుండెను. ఆ హనుమంతుఁడు సముద్రమునఁబోయిన చోటులెల్ల నాతని యూరువేగమునకు సుడులు పడుట, నుఱుగులు వెలువరించుట, ధ్వనించుట మొదలగునవి గలవగుటచేత, సముద్రము మూర్ఛారోగముగలవానికైవడిఁ దోఁచెను. అప్పుడు మహావీరుఁడగు హనుమంతుఁడు పర్వతములవలె నెత్తయిన యలలవరుసలను ఱొమ్ముయొక్క వేగముచేఁ బుట్టినగాలితో నణఁగఁగొట్టుచు మహాసముద్రమును దాఁటఁ దొడఁగెను. వడిగల యాకపీంద్ర గమనవేగసంజనితమైన వాయువును మేఘవాయువును గలిసి స్వాభావికముగా గర్జించుచుండుసముద్రమున మఱింత ధ్వనిగలుగునట్లు చేసెను. ఆ కపిశార్దూలుఁడు లవణసముద్రమునందలి గొప్ప యలలగుంపును భూమ్యంతరిక్షములందుఁ జల్లు పెల్లున వెనీవిరియఁజేయుచు, మేరు

మందరపర్వతములంబోలి, మహాసముద్రోద్భవములైన తరంగములను లెక్కించువాఁడునుంబోలెఁ గడువేగిరముగా సముద్రముఁ గడవ దాఁటెను. అతఁడెగురువేగముచేఁ బైకెగిరిన జలము మేఘములతోఁ గూడినదై, యంతట వ్యాపించిన శరత్కాలమేఘశకలముల మాడ్కిఁ బ్రకాశించెను. అప్పుడు కట్టుబట్టలవిడిచిన శరీరుల యవయవములు చక్కఁగాఁ దెలియునట్లు, సముద్రమునందలి జలము పై కెగురుటచే నందలి చిఱుచేఁపలు, సొఱచేఁపలు మొసళ్లును జక్కఁగాఁ గానవచ్చు చుండెను. ఆ సముద్రముననుండు సర్పములు సముద్రమును బైన దాఁటు చున్న యా హనుమంతునిఁ జూచి, తమ్ముఁ బట్టుకొనవచ్చిన గరుత్మంతుఁ డని వెఱచినవి.

పదియోజనముల వెడల్పును, ముప్పదియోజనముల నిడివియుఁ గలిగి గొప్పదయి మిక్కిలి సొంపుమీఱిన యా హనుమంతుని నీడ సముద్రమునఁ బర్వఁజేసిన నిర్మలమేఘముల దట్టంపువరుసమాడ్కి వెలయుచుండెను. మఱి యమ్మహాతేజుఁడగు గొప్పమేనివాఁడైన కపీంద్రుఁడు నిరాధారమయిన యాకాశమున ఱెక్కలుగల పర్వతము మాడ్కి శోభిల్లెను. ఆ మహాసముద్రమునఁ గపికుంజరుఁడు జవసత్త్వములు మెఱయఁ బోవుమార్గమున సముద్రము దోనెగాఁ జేయఁబడి నట్లు తోఁచెను. కపిశ్రేష్ఠుఁడు పక్షులు దిరుగు మార్గమున గరుత్మంతుని మాడ్కిఁ బోవుచు, వాయువువలె మేఘములసమూహము నీడ్చి కొనుచు నతివేగమునఁ బోవుచుండ, నాహనుమంతునివేగముచే నీడ్వఁ బడినవై తెల్లనివి, ఎఱ్ఱనివి, నీలివి, పసుపుపచ్చనివియైన మహామేఘము లంతట వ్యాపించుచుఁ జెన్నుమీఱియుండెను. ఆకపివీరుఁడు కొంత తడవు మేఘములఁ జొఁఱఁబాఱుచు మఱల మఱల వెలువడుచు సారె సారెకు మేఘాచ్ఛాదితుఁడై, వెలువడు చంద్రునికైవడిఁ గనఁబడెను.

అత్తెఱఁగున నాకాశమునఁ బోవుచుండు నాప్లవగోత్తమునిఁ జూచి దేవగంధర్వదానవులు విరులవానఁ గురిపించిరి. సూర్యుఁడు వేఁడిమిగలిగింపఁడయ్యె. సీతాన్వేషణరూపమయిన రామునికార్యము సాధింపఁబోవు తన పుత్త్రునికి బడలికలేకుండుటకై పవనుఁడుచల్లగా వీచెను. ఋషులు స్తోత్రములుసల్పిరి. దేవగంధర్వు లతని గొప్ప బలిమిని గొనియాడుచు గానములు సల్పిరి. మహాసముద్రమును దాఁటుచుం

గొంచెమేనియు శ్రమంబుఁగాంచని యాహనుమంతునిఁ జూచి, దేవ గంధర్వయక్షరక్షఃపక్షిపన్నగులు స్తోత్రములు సలిపిరి.

హనుమంతునకు మైనాకుఁ డెదురగుట

ప్లవంగమశ్రేష్ఠుఁడయిన యా హనుమంతుఁడు తన్ను దాఁటుచుండఁగా, సముద్రుఁడు తాను సగరునిచేఁ బెంచఁబడినవాఁడగుటచే నా యిక్ష్వాకువంశస్థుల సమ్మానింపఁగోరినవాఁడై, తనలోఁ దానిట్లని వితర్కించెను: "నేనిప్పుడీ హనుమంతునికిఁ దోడ్పాటు చేయనేని, నే నందఱినోళ్లలోను బడిపోవుదును. నేనిక్ష్వాకువంశ ప్రధానుఁడయిన సగరునివలనఁ బెంపువడసితిని. ఇతఁడన్ననో యీ యిక్ష్వాకువంశము వారిదూత. ఇతఁడు శ్రమపడఁజనదు. ఈ కపిసత్తముఁడు గొంతతడవు నాయందు బడలికదీర్చుకొని, తక్కినదారి సులువుగ దాఁటిపోవునట్టి యుపాయము సేయవలయు" అని మంచితలంపునేసి, తనలోపల నీటిలో దాఁగియున్న బంగారు శిఖరములుగల మైనాకమను పర్వతోత్తమముఁ జూచియిట్లనెను:

ఓ పర్వతశ్రేష్ఠుఁడా! నిన్ను దేవేంద్రుఁడు పాతాళలోకమున నుండు దానవులకు గడియమ్రాఁకునుగా నాయందు స్థాపించినవాఁడు. నీవు మహావీర్యసంపన్నులైన రాక్షసులు మాటిమాటికి వచ్చుచుండు నప్రమేయమగు పాతాళద్వారము నడ్డగించుకొని యున్నాఁడవు. మైనాకమా! నీకు మీఁదికిని, క్రిందికిని, యడ్డముగను బెరుగుటకుఁ శక్తిగలదు గావున నిన్నుఁ బ్రేరించెదను. గిరిసత్తమా! పైకిలెమ్ము. భీకరములగు పనులుసేయు వీరుఁడగు హనుమంతుఁడు సీతాన్వేషణ మను రామునికార్యమునిమిత్తమై యిదిగో నీమీఁదుగ నాకసమునఁ బోవుచున్నాఁడు. చూడుము. ఇక్ష్వాకువంశమువారికి సేవకుఁడయిన యీతనికి నేను సాయముచేవలయును. ఇక్ష్వాకువంశపురాజులు నాకు మిక్కిలి పూజింపఁదగినవారుగదా! నాకంటె నీకు మఱింత పూజింపఁ దగినవారు. కావున మనకార్యము చెడకుండ నీవు సాహాయ్యమొనర్పుము. ఏకార్యమేని ముఖ్యముగాఁ జేయవలసినదియయి యుండు నప్పుడు దానిని జేయకుండినయెడల సాధువుల కాగ్రహము పుట్టును. కావున మైనాకుఁడా! నీవు నీటిలోనుండి పైకిరమ్ము. ఈ వానరుఁడు

నీయందుఁ గొంతతడవు విశ్రమించి తక్కిన దారి సాగిపోవును. ఈ వానరశ్రేష్ఠుఁడు మనచే మర్యాదసేయఁదగినవాఁడు. పసిండి శిఖరము గలవాఁడవు, దేవగంధర్వులచేఁ గొల్వఁబడువాఁడవునైన యో మైనాకుఁడా! హనుమంతుఁడు గొంతసేపు నీయందు విశ్రమించి, యావల మిగిలినదారిని దాఁటిపోవును. ఇదిగో వీర్యవంతుఁడగు నా కపిశ్రేష్ఠుఁడు నీమీఁదుగఁ బోవుచున్నాఁడు. రాముని దయాళుత్వమును, సీత విదేశమున నుండుటయు హనుమంతుఁడు పడు ప్రయాసముం దలఁచి నీవు వెంటనేలేచి పైకిరమ్ము" అని సముద్రుఁడు చెప్పెను.

బంగారు శిఖరములుగల మైనాకుఁడు సముద్రుఁడు సెప్పిన మాట విని, గొప్పచెట్లను తీఁగెలను గూడఁ దీసికొని, సూర్యుఁడు తన వేఁడివెలుఁగులఁ బ్రసరింపఁజేయుచు మేఘమండలము భేదించుచు వెలువడునట్లు సముద్రజలమును భేదించికొని వెలువడి, నీటిచేఁ గ్రమ్మఁబడి, కిన్నరులు మహాసర్పములుగల్గి, సూర్యోదయమువలె వెలుఁగుచు నింగి నొఱయుమాడ్కినున్న పసిఁడి శిఖరముల మెఱుఁగులు ఇనుమువలె నల్లనైన యాకాశమును బంగారువన్నెగల దానినిఁ జేయఁగా, తమంత వెలుఁగు బంగారు శృంగములతోఁగూడి నూర్వురు సూర్యులమాడ్కిఁ దోఁతెంచెను.

కడువేగముతోఁ బోవుచున్న హనుమంతుఁ డొక్కటిగాఁ దన యెదుట బొడమియున్న యాపర్వతముఁజూచి, మహాసముద్రమునఁ దనకిది యొక్క యాటంకమని తలఁచినవాఁడై, మిక్కిలి యెత్తయియున్న యాపర్వతమును మారుతుఁడు మేఘముంబోలె ఱొమ్ముతోఁ బడఁగొట్టెను. మైనాకుండు హనుమంతునిచే నట్లు త్రోయఁబడి, యాతని వేగమునెఱిఁగి మనమున హర్షమునొంది రోమాంచితదేహుఁడై మానవరూపముతోఁ దనశిఖరాగ్రమున నిలిచి యాకాశమునఁ బరతెంచు కపీంద్రుఁజూచి సంతోష విస్మయంబులు పెనఁగొన నిట్లనియె:

వానరోత్తమా! నీవితరజన దుస్సాధ్యమయిన యీపని చేయఁ బూనితివి. శిఖరములపై వాలి కొంతతడవు స్వేచ్ఛగా బడలిక దీర్చికొనుము. రఘువంశోద్భవులైన సగరులచే సాగరము పెంపొందింపఁ బడినది. ఆసాగరుఁడు రఘురాముని కార్యార్థమేగు నీకుఁ బూజసల్పఁ గలవాఁడు. ఉపకారికిఁ బ్రత్యుపకారమొనరించుట యనాదిసిద్ధమయిన

ధర్మము. కావున నీసముద్రుఁడయ్యుపకారమునకు బదు లుపకారముఁ గావింపఁగోరినవాఁడై, నీవు దాను జేయునతిథిపూజను గ్రహించుట వలనఁ గలుగుగౌరవము నొందఁగోరుచున్నాఁడు. ఓ కపిశార్దూలుఁడా! సముద్రుఁడు నాకడకేతెంచి, "ఓ మైనాకుఁడా! ఈ హనుమంతుఁ డాకాశమున నూఱుయోజనములదవ్వును దాఁటఁబూనియున్నాఁడు. ఇతఁడు కొంతతడవు నీచఱియందు విశ్రమించి తక్కినభాగముఁ బిమ్మట దాఁటును గావున నీవు పైకిలేచి యతనికడ్డముగానిలువు" అని నన్నుఁ బురికొలుపఁగా, నేను పైకిలేచితిని. కపికుంజరా! నాయెడ నిలిచి గొంతసే పలఁతదీర్చుకొని పిదపఁ దక్కినదారి దాఁటుము. ఇప్పుడిచటనుండు సువాసనగలిగి తియ్యనైయుండు గడ్డలను, దుంపలను, పండ్లను దిని నేదఁదీర్చుకొని యావలఁ బోదువు. కపిముఖ్యా! మాకును నీతోడి సంబంధముకలదు. సత్పురుష సంపూజనము ముల్లోకములందును ప్రసిద్ధి గాంచినది. పవనతనయా, వడిగా దాఁటిపోవు వానరులలోపల నిన్ను ముఖ్యునిఁగాఁ దలఁచుచున్నాఁడను. సామాన్యునయినను వచ్చిన యతిథిని బుద్ధిమంతుఁడు సమ్మానముచేయవలయును. నేను సకలధర్మముల నెఱిఁగినవాఁడ. నీవో కడుగొప్పవాఁడవు. నీబోటివానిని సకలధర్మముల నెఱిఁగిన నేను బూజింపవలయుననుట కేమైనను సందియమున్నదా? మఱియుఁ గపికుంజరా! నీవు మహాబలశాలియగు దేవోత్తముఁడయిన పవనునికిఁ బుత్రుఁడవు. వేగమున నాతనికే సమానుఁడవు. ధర్మజ్ఞుఁడా! నిన్ను నేఁ బూజింతునేని, వాయుదేవుఁడును నాచేసిన పూజను బొందినవాఁడగును కావున నీవు నాచేఁ బూజింపఁదగినవాఁడవు. ఇదియకాక నిన్ను నేనుగౌరవింప మఱియొక్క కారణ మున్నది చెప్పెద వినుము.

నాయనా! తొల్లి కృతయుగమునఁ బర్వతముల కన్నింటికిని ఱెక్కలుండెను. అవి యప్పుడు గరుడవాయువులవేగముఁబోలు వేగముగలవై యన్నివైపులకుఁ బోవుచుండెను. అవి యట్లు పోవుచుండఁగా, దేవతలు, మహర్షులు, సకలభూతములు తమపైఁ బడునేమో యని వెఱచిరి. అంత వేల్పుతేఁ డలిగినవాఁడై, యచ్చటచ్చటనున్న పెక్కుపర్వతముల ఱెక్కలను వజ్రాయుధముతో నఱికెను. అట్లే నా ఱెక్కలను నఱుకుటకై నాదాపున కేతెంచెను, నే నతనికి వెఱచి వాయు

దేవుని శరణు గోరఁగా, నతఁడుగడు వేగిరముగాఁ దెచ్చి నన్నీసముద్రము లోపలఁ ద్రోసి యడుగునకుఁ జేర్చెను. నీతండ్రి నా ఱెక్కలు పోసీయక నన్నింద్రునినుండి తప్పించి కాపాడెను. కావున మారుతుఁడు నాకు గారవింపఁ దగినవాఁడు. కావున నా వాయుదేవునిపుత్త్రుఁడవైననిన్ను నే గారవించెదను. వానరముఖ్యా! మహాగుణంబుగల యీ సంబంధము నీతోడ నాకుఁ గలదు. మహావానరా! మనకీ రీతిని సంబంధమున్నది గావున నీవు కడు మోదమునొంది మా యతిథిపూజను గైకొని, నాకును సముద్రునకును సంతసమును గావింపుము. కపిసత్తమా! నా శిఖరములపయి వ్రాలి శ్రమదీర్చుకొనుము. మా యతిథిసత్కారము గ్రహింపుము. మా సత్కారమును గొప్పగాఁ దలఁపుము. నిన్నుఁ జూచుటచే మిక్కిలి సంతసించితిని" అని మైనాకుఁడు హనుమంతునిఁ బ్రార్థించెను.

వీర్యవంతుఁడైన కపిశ్రేష్ఠుఁడా మైనాకునిపలుకులు విని, "పర్వతేంద్రుఁడా! నీ వొనర్చిన యాతిథ్యమునకు సంతసించితిని. భవద్దర్శనాదులచేతనే యాతిథ్యమొనర్చినట్లయ్యె. నీ వొనర్చిన యతిథిపూజ నేను గైకొననైతినని యాగ్రహము పూనకుము. కార్యసమయము నన్నుఁ ద్వరపెట్టుచున్నది. ప్రొద్దును బోవుచున్నది. నే నిచ్చట నిలిచితినేని, యీ దిన మిచ్చటనే యుండవలసివచ్చును. నేను నాతోడివానరుల యెదుట సముద్రమధ్యమున నెచ్చటను నిలువక లంకకుఁబోయి చేరెదనని ప్రతిజ్ఞ యొనర్చితి" నని చెప్పి, యా మైనాకునిఁ జేతితోఁ దాఁకి, చిఱునవ్వుమోముతో నాకాశమున కెగిరి, యాసముద్రమైనాకులు రామకార్యసిద్ధికిఁదగిన దీవనలు సల్పి గారాబముతోఁ జూచుచుండఁగా, మిక్కిలి పైకెగిరి యా పర్వతమును సముద్రుని విడిచి తనతండ్రియగు వాయువు యొక్క మార్గము నొంది, మఱింత పైకిఁబోయి తలవంచి యాపర్వతము జూచుచు నిరాధారమై నిర్మలమైయున్న యాకాశ మార్గమునఁ బోయెను. ఆ హనుమంతుఁడు చేసిన యితరులకుఁ జేయ నలవికాని రెండవ వింతను (మైనాక పర్వతమున విడిసి యలఁతదీర్చుకొనకయె పోవుటను—మొదటివింత సముద్రమును దాఁటఁబూనుట—మైనాకమున విడియకయేపోవుట రెండవవింత—యని తెలియవలెను.) జూచి, వేల్పులందఱును, సిద్ధులును, మహర్షులును మిగుల నానందమునొందిరి.

వేల్పులును, వేల్పుదొరయు నాకాశముననుండి యా కాంచనశృంగ ములుగల మైనాకునికార్యముఁ జూచి మోదమునందిరి.

అంత శచీపతి యా మైనాకునిపనికి సంతసించి, కడు మోద ముతో నా పర్వతరాజగు మైనాకునికడకు స్వయముగా నేగుదెంచి, "పుత్తడిశృంగములు గల యో మైనాకుఁడా! హనుమంతునివిషయ మున నీ వొనర్చిన కార్యమునకు సంతసించితిని. నావలని భయంబుగల వాఁడవయి యున్నను, నిర్భయుఁడవయి నూఱుయోజనములు దాఁటఁ బూనిన హనుమంతునికి సాయముచేసితివిగాన నీ కభయము నొసఁగు చున్నాను. నీ విఁక నావలనివెఱపు మానియుండుము. ఈ వానరవీరుఁడు రామునికి దూతయై యాతని పత్నియగు సీతను వెదకుటకై సముద్రము దాఁటుచున్నాఁడు. ఇట్టి హనుమంతునికి నీవు సాయమొనర్చి నన్ను సంతోషపఱచితివి" అని చెప్పఁగా, పర్వతసత్తముఁడు నూఱుజన్నముల వేల్పు, వేల్పులదొరయునగు నింద్రుఁడు తన కార్యమున కామోదించి, తన కభయమొసఁగుటం కూర్చి మిక్కిలి సంతోషము నొందెను. వేల్పు దొరయు వేల్పులతో నంతర్ధాన మొందెను. మైనాకుఁడును దేవేంద్రుని వలన వరముబడసి నెమ్మదిగలవాఁడయ్యెను. హనుమంతుఁడును మైనాక పర్వతముండు కడలి చక్కిని ముహూర్తకాలములోపల దాఁటి పోయెను.

## హనుమంతుఁడు సురసను నిరాకరించుట

అంతట దేవ గంధర్వ సిద్ధ మహర్షులు పాములతల్లియగు సుర సను బిలిచి, సూర్యునిఁబోలునట్టి యా సురసతో నిదె శ్రీమంతుఁడగు వాయునందనుఁడు హనుమంతుఁడనువాఁడు కడలిని దాఁటుచున్నాఁడు. నీవు పర్వతముఁ బురుడించు రాక్షసరూపము ధరించి, భయంకరము లగు కోఱలును, పచ్చనికన్నులును గలిగి భయముఁదోఁపించు నాకాశము వంటి గొప్పవాయి తెఱచికొని యతనిని గొంతసేపడ్డగింపుము. మేమాతనిబలపరాక్రమముల నింకను దెలియఁగోరెదము. ని న్నతఁ డుపాయముతో గెలుచునో, లేక దిగులొందునో చూచెదము" అనిచెప్పి యామెను మర్యాదసేసి పంపఁగా, నా సురసయు రోఁత పుట్టించునదియు, రూపుసెడినదియు నందఱకు బీతుగావింపునదియగు

నైన రక్కసి రూపు దాల్చి సముద్రమున దాఁటిపోవుచున్న యా హనుమంతుని కడ్డముగా నిలఁబడెను. అంత హనుమంతుఁడు దగ్గఱకువచ్చినతోడనే యా సురస "ఓ వానరోత్తమా! వేల్పులు నిన్ను నా కాహారముగ నేర్పఱచిరి. ఈ నా నోటఁ జొరఁబడుము" నిన్ను నేను తినెదను. అని చెప్పఁగా శ్రీమంతుఁడగు హనుమంతుఁడు చిఱునగవు మోమునఁ గదుర నడఁకువ దోఁప నిట్లనెను.

"ఓ రాక్షసీ! దశరథనందనుఁడగు రాముఁడనునాతఁడు తండ్రి పనుపునఁజేసి, తన తమ్ముని లక్ష్మణుని, తన పత్నిని జానకిని దోడ్కొని దండకావనమునఁ బ్రవేశించెను. రాక్షసులతోఁ బగవూనిన యతఁడు వేఱొక్కపనినిమిత్తము పోయియుండఁగా, రావణుఁడు పతివ్రతయగు నాతనిభార్యను సీతాదేవి నెత్తుకొనిపోయెను. నే నా రామునిపనుపున నా సీతాదేవికడకు దూతనుగాఁ బోయెదను. నీవును రామునిరాజ్యమున నుండుదానవు గావున నీ వతనికి సాయముచేయఁదగును. అట్లు కాదంటివేని నేను సీతను జూచివచ్చి యా సంగతి రామునికి నివేదించి, యాతనివిచారము మాన్పి మఱలివచ్చి నీవాయి చొచ్చెదను. నీకు సత్యముగాఁ బ్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను."

అని సురసతో హనుమంతుఁడు చెప్పఁగాఁ గామరూపిణియగు సురసయు నాహనుమంతునిఁ గూర్చి, "యిది నాకు వరము. దీని నెవ్వఁడును మీరఁజాలఁడు" అని చెప్పియు, తనమాట సరకుసేయక యాహనుమంతుఁడు పోవుచుండుటగని, యాతనిబలము నెఱుఁగఁగోరినదై, "ఓ వానరోత్తమా! నీవు నా నోటఁ జొచ్చియే పోవలయును. ఇది నాకు మున్ను బ్రహ్మదేవుఁ డొసఁగిన వరము" అని చెప్పి, త్వరపడుచు నా వాయునందనుని ముందటఁ దన నోరు తెఱచికొని నిలఁబడెను. అప్పుడు హనుమంతుఁడు సురసమాట విని కడుఁ గినుకవూని, "యట్లె కానిమ్ము. నన్నుఁ మ్రింగఁజాలువిధమున నోరుతెఱవుము చూత" మని చెప్పి, పదియోజనములనిడివియు, బదియోజనముల వెడల్పును దొడరునట్లు తనదేహమును బెంచెను. (మహామేఘసన్నిభంబయిన యాతని రూపును జూచి, సురసయు నిరువదియోజనముల వైశాల్యము గలుగునట్లు తననోటిం దెఱచెను. అది కాంచి కుపితుఁడై హనుమంతుఁడు ముప్పదియోజనములపఱపు నంతటిపొడవుంగల యట్లు తన మేని

భించెను. సురసయు నలువదియోజనము లంతనోరు చేయఁగా, హనుమానుఁ డేఁబదియోజనములంత దేహము గలవాఁడయ్యెను. అంత సురస యఱువదియోజనములంత మోము పెంపఁగా, హనుమంతుఁడు డెబ్బదియోజనములంతగఁ బెరిగెను. వెండియు సురస యెనుబది యోజనములంతగ మోము పెంపఁగా, హనుమంతుఁడు పర్వతము మాడ్కి తొంబదియోజనములంత మేను పెంచెను. సురసయు నూఱు యోజనములంతగాఁ దన నోటిని దెఱచెను.) అంతట హనుమంతుఁడు మిక్కిలి యుక్తశాలి గనుకఁ బొడవునాలుకగలిగి కడు వెఱపుగలిగించునదై నరకకూపముఁ బోలియున్న యా సురసమోమును గాంచి, తన దేహమును క్షణములోపలఁ గుఱుచపఱచి బొట్టనవ్రేలియంతటిరూపము దాల్చినవాఁడై, కడువేగముతో నా సురసమోము చొచ్చి వెలువడి వచ్చి, యంతరిక్షమున నిల్చి, కాంతిచే మెఱయుచు నిట్లనెను.

"ఓ దక్షపుత్రీ! నేను నీ నోరుసొచ్చి వెలువడితిని. నీకు మ్రొక్కెదను. నీకు బ్రహ్మదేవుఁ డొసఁగిన వరము నెఱవేఱెను. ఇఁక నేను సీత యుండుచోటిని వెదకఁబోయెదను" అని హనుమంతుఁడు పలుకఁగా, సురస స్వస్వరూపము ధరించి, తన మోమునుండి వెలువడి, రాహువుమోమునుండి వెడలిన చంద్రునిమాడ్కి వెలుఁగుచున్న హనుమంతునిఁ జూచి, "వానరశ్రేష్ఠా! కార్యసాధనమునకై స్వేచ్ఛగాఁ బొమ్ము. సీతాదేవిని దెచ్చి మహాత్ముఁడగు రామునితోఁ జేర్పుము" అని చెప్పి స్వర్గలోకమునకుఁ జనియెను. అప్పుడు సకలభూతము లా హనుమంతుఁ డొనర్చిన మూఁడవవింతను జూచి బళెబళెయని యాతనిఁ గొనియాడిరి.

ఇట్లు గరుత్మంతునిఁబోలు హనుమంతుఁడు దాఁట నలవికాని సముద్రముపై నాకాశమున కెగిరి, వారిధారలు గురియుచుండ, పక్షు లెగురుచుండ, నృత్తగీతవాద్యాదులయందు నేర్పరులగు తుంబురు నారద ప్రభృతులయిన మునులు దిరుగుచుండఁగా, నైరావతమను నింద్రధనుస్సు పర్వఁగా, సింహములు, వ్యాఘ్రములు, ఏనుఁగులు, పక్షులు, పాములు వాహనములుగఁగల యొచ్చెములులేని విమానములు వచ్చుచుఁ బోవుచు సొంపుగలిగించుచుండఁగా, వజ్రాయుధము యొక్కయు, పిడుగులయొక్కయు నొఱపిడివలనఁ బుట్టిన యింగలములు

వెలుఁగు లీనఁగా, పుణ్యములొనర్చి, స్వర్గమునుబొందిన మహాపురుషుల యునికిచే సొంపొదవుచుండఁగా, వేల్పుల కొఱకుఁగుటకై యగ్ని హోత్రుఁడు పెల్లుగా యజమానులిచ్చు హవిస్సులను గొంపోవుచు శోభిల్లఁగా, అంగారకాది గ్రహములును, తక్కిన నక్షత్రములును, సూర్యచంద్రులును, సొంపుపెంపు గలిగించుచుండఁగా, మహర్షులు గంధర్వులు, బన్నగములు, యక్షులును సంతట నిండియుండఁగా, విశ్వావసుఁడను గంధర్వరాజు వసింపఁగా, దేవేంద్రునిగజము దిరుగుచుండఁగా, పెక్కు విద్యాధరవీరులు గుంపులుగూడి విహరించుచుండఁగా, జీవలోకమునకు విటివిగలయట్లు బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడిన మేల్కట్టువలెఁ దోఁచుచు, సూర్యచంద్రులకు దారియై నిర్మలమయి యేకతమయి సర్వత్ర నిండియున్నట్లుగాఁ దోఁచునిరాధారమయిన వాయుమార్గమున గరుత్మంతునిమాడ్కిఁ జనుచు నంతటవారికిఁ గనఁబడుచు వ్రేలాడుచుండు తెక్కలుగల పర్వతోత్తమముకై వడి నాధారములేని యాకాశమునఁ జొఱఁబాఱెను.

### హనుమంతుఁడు సింహికను నిరాకరించుట

ఇవ్విధమున నెగసిపోవుచుండు హనుమంతునిఁ జూచి, కామరూపిణియగు సింహికయను రక్కసి తనయొడలు పెంచి, "నేను చాల కాలమునుండి యాఁకలిగొనియుంటిని. ఇదె గొప్పజంతు వొక్కటి నాకుఁ జిరకాలమునకు దొఱకినది" యని తనలోపలఁ దలఁచికొని, యా హనుమంతునినీడ నీడ్చి పట్టెను.

ఆ సింహిక యట్లు హనుమంతుని నీడ నీడ్చిపట్టఁగా, వానరపుంగవుఁడు, పట్టువడి కుంటుపడిన పరాక్రమముగలవాఁడయి "యేమి యీవింత! యింతలో, నెదురుగాలిచే నడ్డుపెట్టఁబడ్డ నావయుఁబోలె నిలుపఁబడినవాఁడ నైతిని" అనియెంచి నలుప్రక్కలను, బైనను, క్రిందను దృష్టి సారించి, సముద్రమధ్యమున వెలికిలఁబరుండియున్న గొప్పజంతువును జూచి, దాని వికృతంపుమోమునుగని, "ఓహో! ఇది మనరాజు సుగ్రీవుఁడు చెప్పిన వెఱఁగుచూపును నెక్కువ పరాక్రమమునుగల నీడనుపట్టుకొను రాక్షసిరూపమయియుండును! దీనికి సందియములేదు" అని తలఁచెను. బుద్ధిమంతుఁడు గావునఁ

గార్యముల కలరూపు నెఱింగిన హనుమంతుఁ డది సింహికయని తెలిసినవాఁడై, వార్షికమేఘముచాడ్పునఁ దనమేనిని బెంచెను.

హనుమంతుఁడు తనదేహము పెంచుటను జూచి, ఆ సింహికయు పాతాళగుహంబోలు తన నోటిని దెఱచికొని, మేఘపంక్తివలె నుఱుముచు నా వానరునిమీఁదికిఁ గవియఁబోయెను. అట్లు తన దేహమును మ్రింగుటకుఁ దగినంతగాఁ దెఱచిన యా సింహిక మోమును యాయపట్టులనెల్లనుజూచి, వజ్రదేహుఁడును, బలిష్ఠుఁడునగు హనుమంతుఁ డూహగలవాఁడగుటం జేసి, దేహమును కుఱుచచేసి, తెఱచియుండు నాసింహికనోటఁ బ్రవేశించెను. సిద్ధులు, చారణులు, సింహికనోటఁ జొచ్చుచుండు హనుమంతునిఁజూచి రాహువుచే మ్రింగఁబడు పున్నమనాఁటి నిండుచంద్రునితో సాటిగాఁ దలఁచిరి. అంత హనుమంతుఁడు సింహికకడుపులోని యాయపట్టులనెల్లఁ దనగోళ్ళతోఁ జీల్చి, మనోవేగమున వెలువడి సూక్ష్మదృష్టితోఁ జూచి, నేర్పు మెఱయ, ధైర్యముపూని చుఱుకుదనముతో నా సింహికను ఒమ్మున నడిచి, మఱల నెప్పటియట్ల మేనిని బెంచెను. సింహికయు గుండెనువియ డస్సినదై సముద్రమునఁ బడెను. హనుమంతుఁ డట్లు సింహికను పడఁ ద్రోయుటనుజూచి, యాకాశమున సంచరించు మహాభూతములెల్ల హనుమంతు నుద్దేశించి, "వానరోత్తమా! నీవొకగొప్ప ప్రాణినిజంపి యొక గొప్పకార్యము చేసితివి. మేలుగలుగుఁగాక! నీయిష్టార్థమును సాధింపుము. వానరోత్తమా! నీకుఁబోలె నెవ్వనికి ధైర్యమును, కార్యముల కలరూపు నెఱుఁగఁగల సూక్ష్మదృష్టియు, కార్యనిశ్చయరీతియు, పనిసేయఁ గలుగుటయు నున్నవో, వాఁడు తనకార్యములందు దైన్యము నొందఁడు" అని చెప్పి, పూజ్యుఁడైన తన్ను గౌరవించుచుండఁగా, నిష్టార్థసిద్ధిం బడసినవాఁడై గరుడునిమాడ్కి వాయుమార్గమును బ్రవేశించిపోయెను.

మఱియు నా హనుమంతుఁ డించుమించుగా నొడ్డుచేరినవాఁడై, యంతటఁ జూడ్కి నిగిడించి, నూఱుయోజనములు గడచినతరువాత వనములవరుసం జూచి, పొఱుచునే పెక్కు తెఱంగుల వృక్షములతోఁ జెన్నారు ద్వీపము నొక్కదానిని, మలయపర్వత ప్రాంతవనములను, సముద్రమును, సముద్రతీరమునందలి జలప్రాయభూములను (నీటి

వసతిగల భూములను) అట్టి సాగరప్రాంతజలప్రాయ భూములందు మొలచిన వృక్షములను, నదులయొక్క ముఖద్వారములను జూచుచు గొప్ప మేఘముం బురుడించునదై, యాకాశమును గ్రమ్మునంత విస్తారముగలిగియున్న తనమేనిం జూచికొని, "రాక్షసులీ నాగొప్ప శరీరమును, కడువడినిం జూచిరేని, "యితం డెవండో క్రొత్తవాం"డని నన్నుం జూచుటయందే మనము గలవారగుదురు" అని తలంచి, అజ్ఞానము దొలంగినవాండైన తపస్వి స్వస్వరూపమునందునట్లును, వామనావతారుండయిన విష్ణువు బలిచక్రవర్తి గర్వము నడంచుటకై, గొప్ప రూపముదాల్చి, మూండడుగులచే భూమ్యాకాశములం గొలిచి మఱల నిజరూపము నొందిన కైవడినిం బర్వతముంబోలు తనరూపము సంకోచపఱచి యెప్పటియట్ల రూపమునొందెను. పెక్కు తెఱంగులయిన మనోహరరూపములు ధరించువాండును, శత్రువులకు సాధ్యపడనివాండును నైన యా హనుమంతుండు సముద్రముయొక్క యావలితీరమునుజేరి, యతిప్రమాణమయిన తన యాకారమునుజూచి, యటుమీంద జరుగవలసిన కార్యము నాలోచించి, ప్రకృతకార్యానుసారముగా సూక్ష్మరూపము దాల్చెను. గొప్ప పర్వతశిఖరముంబోలు నామహాత్ముండైన హనుమంతుండు సూక్ష్మరూపము ధరించి, పెక్కు తెఱంగులైన యాశ్చర్యములుగలదియు, మొగలి, చంద్ర, టెంకాయచెట్లతో నిండినదియు, సకలవస్తుపూర్ణమైనదియునైన లంబపర్వతశిఖరమునం గూలెను. అట్లు లాహనుమంతుండు, రాక్షసులతోను, సర్పములతోనుగూడి, గొప్ప యలలతో నొప్పారు సముద్రమునుదాంటి, పూర్వరూపమువదలి స్వస్వరూపమునొంది, లంబపర్వతశిఖరముననెఱంగి యచ్చటినుండియే యమరావతిం బురుడించు లంకాపురమును జూచినవాం డయ్యెను.

## 2-వ సర్గము

### హనుమంతుండు లంకలోం బ్రవేశింప వేచియుండుట

వేగవంతుండు బలవంతుండునగు హనుమంతుండు దాటనలవికాని మహోదధిని లంఘించి, నీలవర్ణములగు పచ్చికపడియలు వెలయు, గొప్పబండలు, తిప్పలును శోభిల్ల, నెత్తావులతోంగూడినపర్వతములను, పుష్పితములయిన వనరాజులను జూచుచుం బోయి, లంబపర్వతమున

డిగఁగా, నాతనిపాటునకుఁ గదలినవృక్షములనుండి యాతని పయిరాలి పూవులచేఁ బుష్పమయుఁడయిన వానిమాడ్కి శోభించుచు నాతఁడ శతయోజనవిస్తీర్ణమగు సముద్రమునుదాఁటియు, బలిమి కొంఱఁతవఁ మిచే మార్గాయాసజనితశ్రమ సూచకమగు దీర్ఘనిశ్వాసమును విడ వకయు, బడలికనొందకయు నుండుటయేకాక, "నే నెన్ని శతయో జనములైనను దాఁటఁగలననునపుడు నూఱుయోజనములపరిమితిగఁ యీ సముద్రము దాఁటఁగలుగుట చెప్పవలెనా? అని తనలోఁ దానను కొనుచు నలుదెసలఁ జూడఁగా, సరళ, కర్ణికార, ఖర్జూర, ప్రియాళ పిచుమంద, కుటజ, కేతక, ప్రియంగు, నీప, సప్తపర్ణ, అసన, కోవిదార కరవీరాది మహావృక్షములు ముకుళపుష్పవంతములై, పుష్పముఁ భారములచేఁ గొమ్మలతో ముందుకువ్రాలఁగా, పక్షులు కలయ నిండ యుండఁగా, కొనలు గాలికిఁ గదులుచుండఁగా నొప్పారుచుండునట్ల కనఁబడెను. మఱియు, హంససారస శోభితములై, కమలోత్పలాలఁ కృతములగు కొలఁకులును, వివిధములగు తోఁటలును, పెక్కు జల శయములును, సర్వర్తుపుష్పఫలశోభితములైన వృక్షములతో నిండి యుద్యానవనములును నుపవనములును నా హనుమంతునికి దృష్టి గోచరము లయ్యెను.

జయలక్ష్మిచే వెలుఁగుచున్న యా వాయునందనుఁడు రావణ పాలితమగు లంకాపురమును సమీపించి పద్మోత్పలశోభితములగు నగడిత లొప్పుచుండ, రావణుఁడు దాఁ దెచ్చిన సీత నెవ్వరు నెత్తికొని పోకుండుటకై భీకరములగు ధనుస్సులను దాల్చి రాక్షసవీరులు పుర మెల్లఁ గాచుచుండఁగా, పసిఁడిప్రాకారము చుట్టును వెలుఁగుచుండ శరత్కాలమేఘములంబోలెఁ దెల్లనై సూర్యచంద్రాదులమాడ్కి వెలుఁగు గృహములతోఁగూడిన సుధాధవళములైన యున్నత గృహ ములుగల పెద్దవీథులు పురమెల్ల నిండియుండఁగా, అట్లల్లను మత్స్యా చిహ్నవంతములగు ధ్వజములును, సాధారణపుఁ దెక్కెములున లతాదిరేఖావిశిష్టములగు పసిఁడితోరణములును శోభనుగలిగించు చుండ, దేవనగరముఁబోలెను, ఆకాశనిర్మితమగు పురముబోలె సౌంధ మీఁటినదై, ప్రాకారమను జఘనమున నిర్మలమైన యగడ్తయందలిజల మను దువ్వలువ మెఱయుచుండ, శతఘ్ని శూలము లనెడి కొప్పువుం

తొందు అట్టళ్లనెడి శిరోభూషణములు వెలుఁగుచుండ నొప్పు నతివదూ యనఁబరగియుండునదియు, వాస్తవముగా విశ్వకర్మచే నిర్మితమయినను, సొంపుదిలకింప మనోనిర్మితమొ యనఁదగియుండునదియునై యాకాశ మునఁ దేలుచున్నట్లుండునదియు, కైలాసశిఖరముంబోలి యాకసము నొరయునట్లును, సున్నతగృహములుగల దగుటచే నాకాశమున కెగురు చట్లును, పెక్కురాక్షసులచే నిండినదగుటచే, నాగులచేనిండిన భోగవతీ పురమువలెను విరాజిల్లుచుఁ దొల్లికుబేరునికునికిపట్టయి, పిదప రావ ణునిచే నాక్రమింపఁబడినదియు, బాగుగా నిర్మింపఁబడినదై చక్కఁగాఁ గనఁబడుటచే నెన్నరాని చక్కఁదనముగలదియు, శూలముద్గరాది నానా విధాయుధధారులైన వాఁడికోఱలుగల శూరులగు పెక్కండ్రు రాక్షసులచే విషవంతములగు పన్నగములచే గుహవలె సంరక్షింపఁబడు నదియునగు లంకాపురమునుగాంచి, దాని గొప్పసంరక్షణమును, సముద్ర మును, భీకరుఁడైన పగతుఁడగు రావణునిఁ దలఁచికొని యివ్విధముగఁ జింతింపసాగెను:

"వానరు లీమహాసముద్రము దాఁటివచ్చియు నిష్ప్రయోజకు లగుదురు. యుద్ధముచేసి యీ లంకాపురమును గెల్చుటకు దేవతల కైనను నలవిగాదు. కష్టసాధ్యమయి చొఱనలవికాకయున్న రావణ పాలితమగు నీలంకాపురమునకుఁ బ్రసిద్ధవిక్రముఁడగు రాముఁడు వచ్చి నను యేమిపనిచేయఁగలఁడు? రాక్షసులయెడ సామమునకేని, దాన మునకేని, భేదమునకేని యవకాశము గన్పట్టకున్నది. ఇఁక యుద్ధమున కవకాశమే కాన్పింపదు. బలశాలురగు వానరులందఱిలోపల నంగ దుఁడు, నీలుఁడు, నేను, మారాజు సుగ్రీవుఁడు ననునలుగురికే యిచ్చటికి రా వీలుపడును. మేము నలువురము వచ్చి యయ్యెడుపనియా యిది. అయినను సీత జీవించియున్నదా అని మొదటవిచారించి యాసీతాదేవి ప్రాణములతో నుండుట తెలిసికొని యప్పుడు కదా కర్తవ్యముంగూర్చి విచారింపవలెను. ఇప్పుడేల యావిచారము" అనికపివీరుఁడు గొంత తడవుచింతించి, రామునికి మేలుసేయఁగోరినవాఁడై, యాపర్వతశిఖ రమున నుండియె మఱల నిట్లాలోచింపఁదొడఁగె: "క్రూరులగు రాక్షసులు కావలియుండుటచే నీపురమున నీరూపముతోడఁ బ్రవేశింప వీలుగాదు. ఈరాక్షసులు గొప్పపరాక్రమము గలవారలు, బలిమిగలవారలు, సీతను

వెదకవచ్చిన నేను వీరిని గనుమొఱఁగి వంచింపవలయునే కాని వేఱు పాయము లేదు. నేను మహాకార్యసాధనము సేయఁ గోరుదునేని, కనఁబడియుఁ గనఁబడకయునుండు రూపముతో రాత్రి సమయమునఁ బురము జొచ్చుట యుచితము" అనికొంతతడవు చింతించి, సురాసురులకుఁగూడఁ జొఱనలవికాకయున్న యవ్విధమయిన పురమును జూచి, పలుమాఱు నిశ్చయించియు, మఱల నిట్లని చింతింపఁ దొడఁగెను.

"దురాత్ముఁడగు రాక్షసేంద్రుఁడయిన రావణునికిఁ గనఁబడక యెవ్విధముగా నీపురములోపలఁజొచ్చి, జానకీదేవిని జూడఁగలను? జ్ఞానరూపుఁడయిన యారామునికార్య మెట్టులు సెడకయుండును? ఒంటరినిగా నీపురము లోపలఁజొచ్చి, యేకాంతమున నొంటరిగానే నాసీత నెట్లు చూడఁగలను? రాజును మంత్రులును జక్కఁగా యోచించి చేసిన కార్యములైనను జేతగాని దూతనుబొంది దేశకాలములకుఁగాక బెడిసినవై, సూర్యోదయమునఁ జీఁకటియట్లు చెదరిపోవుచున్నవి. అంత మాత్రమే కాక యివి చేయఁదగినవి యివిచేయఁదగనివియని రాజు మంత్రులాలోచించి చేసినపనులైనను, పందయైన దూతవలన రాజులకు మంత్రులకును చేతరాని వారను పేరుగూడఁ దెచ్చుచున్నవి. తమకు సర్వము దెలియునని తలఁచునహంకారులగు దూతలు కార్యములు చెడఁగొట్టుదురు. ఎట్లు కార్యము సెడకయుండును! ఎట్లుమూఢుఁడను పేరు నాకు రాకయుండును! ఎట్లు సముద్రము దాఁటుటయు వ్యర్థము గాకయుండును? రావణునివలనఁ జెలుపుగలుగునని శంకించుచుండిన నాయీకార్యము వ్యర్థమేయగును. రాక్షసరూపముతోఁగాని మఱియే రూపముతోఁగాని, రాక్షసులకుఁ దెలియక యిచ్చట నుండుటకు వీలు గాదు. వాయుదేవుఁడైనను వీరికిఁదెలియక సంచరింపఁజాలఁడని నాకుఁ దోఁచుచున్నది. కడుబలవంతులగు రాక్షసులకుఁ దెలియనిది యొక్కటి లేదు. ఇచ్చట నేను స్వస్వరూపముతో నుందునేని, నన్నీఘోరరాక్షసులు పొలియింతురు. అంత నాప్రభువుకార్యమును చెడిపోవును. కావున నేను నారూపముతోనె సూక్ష్మరూపినై రాత్రివఱకు వేచియుండి, రామకార్యము సాధించుటకై రాత్రియందుఁ జీఁకటిపడిన తర్వాతఁ బురము ప్రవేశించి లోపలిగృహములందెల్ల సీతాదేవిని వెద

కెదను" అని కార్యనిశ్చయముచేసికొని, శూరుఁడయిన హనుమంతుఁడు సీతాసందర్శనాభిలాషతో ప్రొద్దు క్రుంకుటకై వేచియుండెను. ఇంతలో సూర్యుఁడు పశ్చిమాద్రిం జేరెను.

సూర్యుఁ డస్తమింపఁగా వీరుఁడగు మారుతనందనుఁడు తన దేహమును గుఱుచపఱచి పిల్లియంతరూపముదాల్చి చూపఱకువింతగొల్పుచు, వరుసలువరుసలుగా నిర్మింపఁబడి, పసిఁడివెండి స్తంభములును, సువర్ణ వాతాయనములు (కిటికీలు) ను గలవై యొప్పుమీఱి, చక్కఁగాఁ దీర్చిన రాజవీధులు వెలయుచుండ నేఁడెనిమిది యంతస్తులు గలిగియుండు మేడలతోఁగూడి మనసునకుసంతోషము గొల్పునట్టిదగు లంకాపురము ప్రవేశింపఁబూనెను. ఆరాక్షసులభవనముల క్రిందినేలలు చలువరాలు పఱచి బంగారు వెండిపనితనముగలవియై శోభిల్లుచుండెను. మఱియు రాక్షసులయిండ్లలోనేలలు వైడూర్యమణులచేతను ముత్తెములచేతను నలంకృతములయి ప్రకాశించుచుండెను. చక్కఁగాఁ గైసేయఁబడి యున్నలంకాపురమునందంతటఁ గట్టఁబడియుండు సువర్ణమణిఖచితము లైన తోరణము లాపురమునకు శోభాజనకములైయుండెను. ఇట్లు సున్నపుఁబూతచేఁ దెల్లనైన యేడంతస్తులమేడలవీధులు గలదై, సువర్ణ వికారములగు గవాక్షములు, తోరణములుంగలదై రావణుని బాహుబలముచేఁ గాపాడఁబడుచు శత్రువులవెఱపించు బలముగల రాక్షసులచే నంతటను రక్షింపఁబడుచున్న లంకాపురమునుజూచి సీతాదేవిని జూడఁగోరియున్న హనుమంతుఁ డాపురముయొక్క సొడిమికి సంతోషమును, చొఱరాకయున్నందుకై విచారమునుబొంది యోచించుచుండెను. చంద్రుఁడును నక్షత్రమండలమధ్యమున వెలుఁగుచు, సముద్ర మైనాకులవలెఁ దానును హనుమంతునికిఁ దోడ్పడుటకోయన్నట్లు, తనకిరణజాలములను లోకములఁ బ్రసరింపఁజేయుచు నుదయించెను. శంఖక్షీర మృణాళములవలెఁ దెల్లనై యుదయించుచు నలుదెసలను వెలుఁగఁజేయుచు, తటాకమున మీఁదుమిక్కిలి యెగురుచున్న హంసయుంచను బోలిన యాచంద్రుని హనుమంతుఁడు చూచెను.

## 3-వ సర్గము

### హనుమంతుఁడు లంకలోపలికిఁ బ్రవేశింపఁబూనుట

బలవంతుఁడగు వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు లంబమను పేరు గల త్రికూటపర్వతశిఖరముననుండి, యుత్సాహముపూని, మనోహరములగు వనములతోఁగూడినదియు, చక్కఁగా సున్నపుఁబూఁత పూసియుండుటచే శరత్కాలమందలి మేఘంబులవంటి డాలుగలవి యగు మేడలతో నొప్పుమీఱినదియు, సముద్రము ధ్వనివంటి ధ్వని గలదియు, సముద్రపుగాలి వీచుటచే నింపుగులుకునదియు, అలకాపురముమాడ్కిఁ జక్కఁగా బలిసిన సేనలయలబలములతో నిండినదియు, చక్కని బహిర్ద్వారములందు మదించినయేనుఁగులు గలదియు, సున్నపుఁబూఁతచేఁ దెల్లనైన ద్వారములు, తోరణములుఁ గలదియు, పాముల కునికిపట్టయి, చక్కనికాపుదల గలిగియుండు రమ్యమయిన భోగవతీపురముమాడ్కి విలసిల్లునదియు, మెఱుపుగల మొగుళ్లతోను నిండినదియు, దిక్కులతెరువుఁదాఁకునదియు, తిన్నగా వీచుచున్న గాలిగలఁదియు, నింద్రుని యమరావతివలె గొప్ప బంగారంపుఁ బ్రాకారముచేత జుట్టఁబడినదియు, చిఱుగజ్జెలమ్రోఁతలుగల టెక్కెములచే శోభిల్లునదియు నైన యాలంకాపురముయొక్క ప్రాకారమునొద్దకుఁ జేరి, యత్యంత విస్మయవికసితమానసాబ్జుఁడై పట్టణమునంతటఁ గలయఁజూచి, హర్షము నొంది, వెండియు, వైడూర్యవజ్రస్ఫటిక ముక్తాఫలములచే నలంకరింపఁబడిన తిన్నెలును, నవరత్నములు చెక్కిన పైభూములును, అపరంజితోఁజేసిన మదపుటేనుఁగులును గలవియు వెండితోఁ జేయఁబడినవైనందున మిక్కిలి తెల్లనివియు, పచ్చలతోఁజెక్కిన మెట్లును, స్ఫటికపు ముంగిళ్లును గలవియు, మనోహరములగుబవంతులతో నొప్పుమీఱినవియునైనందున నాకసమున కేగినవో యన్నట్లుండునవియు, క్రౌంచపక్షులు, నెమళ్లు, రాయంచలు గలిగియుండునవియునగు బంగారుద్వారములు గలదయి అంతట నిండినవాద్యభూషణధ్వనులతో నొప్పుమీఱినదియునైనందున నింద్రునియమరావతీపురముఁ బురుడించునదియు, ఎత్తయినయిండ్లచే నాకాశమునకుద్గమించుచున్నట్లుండునదియు సకలసంపదలతో నిండినదియుఁ, బరమోత్కృష్టమయినదియునగు

రాక్షస రాజగు రావణునిదైన లంకాపురముఁజూచి, వెండియు నిట్లు తనలోఁ దాను చింతించెను.

ఈలంకాపురమును రావణునిసేనలెల్లప్పు డాయుధపాణులై కావలికాచుచుందురు గనుక, నీపురము నితరులు బలవంతముగా ముట్టడింపఁజాలరు. కుముదుఁడు గాని, అంగదుఁడుగాని, మైందద్వివిదులు గాని, సుషేణుఁడుగాని, ప్రసిద్ధుఁడగు సూర్య పుత్త్రుఁడైన సుగ్రీవుఁడు గాని, కుశపర్వుఁడుగాని, కేతుమాలుఁడుగాని, నేనుగాని యీలంకా పురమునఁ బ్రవేశింపఁగలుగుదు మేమోకాని, తక్కినవారీ పురమున నడుగిడఁజాలరు. అంతియకాక, రామలక్ష్మణులు పరాక్రమవంతులు గనుక నొక్కవేళ, వారుసాధించినను సాధింతురు" అని రామలక్ష్మణుల పరాక్రమమునుగూర్చి తలఁచి మనసున సుప్పొంగి, రత్నములనెడివలు వలుగట్టి, ఉగ్గ్రాణములనెడు కర్ణావతంసము గలిగి, యంత్రాగార ములను పాలిండ్లుగలదియై, చక్కఁగా నలంకరించుకొనిన జవరాలిచంద మున నొప్పునదియు, సూర్యునివలెఁ దేజరిల్లు మేడలతోఁజెన్ను మీఱి నదియునైన రాక్షసరాజపురియగు లంకను గలయం జూచెను.

రావణపాలితయగు లంకయుఁ దనలోపలఁ బ్రవేశించునట్టి బల వంతుఁడగు వాయునందనుని హనుమంతునిఁజూచి, తాను వికృతపు మోముగల రూపుదాల్చినదై యావాయుసూనుని కడ్డముగానిలిచి, బిట్టుగనఱచుచు, "ఓరీ! నీవెవ్వఁడవు? నీవు వనములం దుండువాఁడవు. నీ విక్కడికేలవచ్చితివి? నీప్రాణములను గొనెదను. వాస్తవమును దెలు పుము. ఈపురమునకు నెల్లప్పుడు రావణునిభటు లెల్లెడల, గావలియుం దురు. ఓరీ కోఁతీ! దీనిలోపలఁ బ్రవేశింప నీకునలవిగాదు" అనియడిగెను.

అంతట హనుమంతుఁడు తన శౌర్యము మెఱయఁ దనముందట నిల్చియున్న యాలంకాదేవిని జూచి, "నీవు నన్నడిగితివి కావున నీకు నేను వాస్తవము దెలియఁజేయవలసినదే. అదియట్లుండనిమ్ము, వికారము లయినకన్నులుగల నీవెవ్వతెవు? నీవేల పట్టణంపుగవనియం దున్నావు? నాకడ్డుపడి క్రౌర్యముతో నన్నేల బెదరించుచున్నావు? అని యడిగెను.

కోరినరూపమెత్తఁగల యాలంకాదేవి హనుమంతునిమాటలు విని మోమున నలుక గదురఁ బండ్లు పటపటగొఱకుచు, "ఓరీ కోఁతీ! బలశాలియగు రాక్షసేంద్రుఁడగు రావణునియానతివలన నీపురమును

గాచుచుందును. నన్ను గెలువ నేరికిని శక్యముగాదు. నన్నుఁ దిరస్కరించి పురములోపలఁ బ్రవేశింప నీకు సాధ్యముగాదు. నీవు నాచేఁ జావఁ దన్నులుతిని ప్రాణములఁదొఱఁగి, యిచ్చటనే దీర్ఘముగనిద్రింతువు. ఓవానరా! నేనే లంకాపురిని; నేనెల్లప్పుడు దీనిం గాపాడుచుందును. ఇదియే నా వృత్తాంతము నీకుఁ జెప్పితిని" అనెను.

అంతటఁ జమత్కారబలములుగలవాఁడగు వాయునందనుఁడా లంకయొక్క పలుకులు విని, వికృతంపుమగువరూపముదాల్చిన యా లంకాదేవినిగాంచి, పూనికితో నిలఁబడి, "ఓదేవీ! నేను అట్టళ్లతోను, ప్రాకారముతోను, వెలుపలి ద్వారముతోను గూడిన యీలంకాపురమును, దీనియందలి వనములను, ఉపవనములను గొప్పధనికుల మేడలను గలయంజూడఁ గోరికతోవచ్చితిని. నాకీపురము చూడవలెనని యెక్కువ మక్కువగలిగియున్నది. చూడనిమ్ము" అని యడిగెను.

కామరూపము గలదియగు నాలంకాదేవి యాహనుమంతుని పలుకులు విని, కడునలిగినదై, "ఓ మూఢుఁడా! వానరాధమా! నన్ను గెలువక రాక్షసేశ్వరుఁడగు రావణునిచేఁ గాపాడఁబడు లంకాపురము జూడవలవికాదు" అని మిక్కిలి నిష్ఠూరముగాఁ బలికెను.

అంత నాకపిశార్దూలుఁడు లంకాదేవి నుద్దేశించి "యోమంగళకరురాలా! యీపురమును జూచి, పోయినట్లే మఱలివచ్చెదను" అనెను.

అంతట నాలంకాదేవి వెఱపుగలిగించునట్లు బొబ్బ, కడువేగమున నాహనుమంతుని దనయఱచేతితో నప్పళింపగా నవ్వానరోత్తముఁడు లంకచే దెబ్బవడి,కోపముచే నోడలుమఱచి గొప్పయార్భాటముఁ గావించి, యెడమచేతివ్రేళ్లనుముడిచి, పిడికిట నాలంకాదేవి నొకగ్రుద్దు గ్రుద్దెను. ఆఁడుదియను కారణముచే నెక్కువ క్రోధముఁ జూపఁడయ్యె. అంతమాత్రమునకే యాలంకాదేవి సంధిబంధములెల్ల సడలగా వికృతమైనమోముతో వెంటనే క్రిందఁబడెను. అంతట మహాపండితుఁడైన హనుమంతుఁడు లంకాదేవి పడుట చూచి, తాను బలవంతుఁడయినను, ఆఁడుదానితో సాటిగాఁ గయ్యమొనరింపరాదని యెంచి, యాలంకాదేవి నేమియుఁజేయక జాలినెంచెను.

అంత లంకాదేవి మిక్కిలి వెఱపుదోఁప డగ్గుత్తికతో నాహనుమంతునిఁ గాంచి "ఓగొప్పచేతులవాఁడవగు వానరశ్రేష్ఠుఁడా, అనుగ్రహిం

పుము; నన్నుఁగావుము. సాధువా! గొప్పవారు బలముగలవారయ్యు స్త్రీని జంపరాదను మర్యాదను దాఁటకుందురు. వానరోత్తమా! నేనే లంకాపురిని. వీరుఁడా, నీవుబలిమి మెఱయ నన్ను గెలిచితివి. వానరోత్తమా! యిదె నిక్కపుమాట. చెప్పెద నాలకింపుము. తొల్లి నాకు బ్రహ్మదేవుఁడు "ఓలంకాదేవీ! ఎప్పు డొకవానరుఁడు మగటిమిచే నిన్నుఁ బడఁగొట్టునో, అప్పుడు లంకలోని రాక్షసులకుఁ జేటు వాటిల్లు నని, తెలియుము" అని నాకు వరమొసఁగెను. ఓవానరోత్తమా! యిప్పు డాసమయము వచ్చెను. విధిచెప్పినది నిక్కవము. దానికి మాఱు పాటెన్నటికిని గలుగదు. సీతను దెచ్చుటవలన లంకాపురీశుఁడగు రావణునికిని, రాక్షసులకందఱకుఁ జేటుగలిగినదియే. కావున, ఓ హనుమంతుఁడా! వానరనాథుఁడ వయిన నీవు శాపముచేఁ గొట్టుపడియున్న లంకాపురిం బ్రవేశించి, యిచ్చచొప్పునఁ దిరిగి సీతాదేవిని వెదకుము. ఇఁకను వలయుపనుల నన్నింటిని జేయుము" అని చెప్పి, యాహనుమంతునికి మార్గము విడిచెను.

## 4-వ సర్గము

### హనుమంతుఁడు లంకలోపలఁ బ్రవేశించుట

వానరరాజగు సుగ్రీవునికిని మేలుచేయఁగోరువాఁడును, నిడుదచేతులవాఁడును, ఎక్కువవెలుఁగుగలవాఁడునైన వానరోత్తముఁడగు హనుమంతుఁడు కామరూపిణియగు లంకాధిదేవతనుజయించి ప్రాకారము నెక్కి దుమికి, లంకాపురములోపలికిఁ జొఱ మొదలిడి శత్రువుల తలలమీఁద బెట్టినట్లు తొలుత నెడమకాలుఁబెట్టి ముత్యాలచేతను, పువ్వులచేతను వెలుఁగుచున్న రాజమార్గమున నడఁచి పోవఁజొచ్చెను. అప్పు డాలంకాపురమట్టహాసములతోను, వాద్యములనాదములతోను గూడినదై వజ్రమణులచే నలంకృతములయి, సుధాధవళితములై యైరావతముఁబోలియున్న గృహములతోను, తెల్లనిమేఘములవంటి కాంతి గలవై, పలురంగులు గలిగి, పద్మస్వస్తికముల లక్షణములతోను గట్టఁబడియున్న పెక్కుభవంతులతోను గూడినదై, మేఘాచ్ఛాదితమైన యాకసముమాడ్కిఁ గనఁబడెను. సుగ్రీవుని మేలుగోరునట్టివాఁడును కాంతిమంతుఁడునగు హనుమంతుఁడు చిత్రములయిన పుష్పహారములచేతను,

అలంకారములచేతను నలంకరింపఁ బడియున్న యాలంకాపురిని చూచి చోఱనలవికాని యాలంకాపురము చొచ్చుటచేఁ దన ప్రభువుయొక్కయు, రామునియొక్కయుఁ గార్యము నెఱవేఱినదని యానందించెను.

మారుతనందనుఁ డొక్కయింటినుండి మఱొక్కయింటికిఁ బోవుచుఁ బలుతెఱఁగుల యాకారములు రూపములుగల యిండ్లను జూచుచు, స్వర్గలోకమునందలి యప్సరసలయొక్క గానములవలె నున్న మదసంపూర్ణలయిన జవరాండ్రయొక్క యురఃకంఠశిరోదేశములందుఁ బుట్టిన మంద్రమధ్యమతారము లనెడి స్వరములతో మిళితమైయొప్పు శ్రావ్యగానములధ్వనులను, ధనికుల భవంతులందుఁ గాంతలు చిఱుగజ్జెలుగట్టిన మొలనూళ్లను అందెలనుదాల్చినవారై, మేడలనుండి క్రిందికి దిగునప్పుడు మెట్లమీఁద నడుగులు పెట్టునప్పుడు గలుగుధ్వనులను, సంతోషముచేఁ జేయుచేతిచప్పట్లను, సింహనాదములను, మఱియు నచ్చటచ్చట రాక్షసులగృహములందు రాక్షసుల మంత్రఘోషములను, వేదాధ్యయనపరాయణులైన రాక్షసులవేదఘోషములను, రావణుని స్తోత్రముచేసెడి రాక్షసులస్తోత్రశబ్దములను వినుచు, రాజమార్గము నావరించియున్న గొప్ప రాక్షససేనను, నగరమధ్యమునందుండు సేనలగుంపునందలి పెక్కువేగులను, దీక్షవహించినవారిని, జడలుదాల్చినవారిని, బోడినెత్తివారిని గోచర్మములతాల్పులను, బట్టలేనట్టివారిని, (బ్రాహ్మణులహస్తంబులందలి దర్భలు దేవేంద్రుని వజ్రాయుధము వంటివియని చెప్పఁబడియుండుటచేత) దర్భకట్టలును, అగ్నికుండములు నాయుధములుగా నుపయోగించువారిని, కూటముద్గరము లనెడి యాయుధములఁ జేతఁబట్టినవారిని, దండాయుధధారులను, ఒంటికంటివారిని, ఒంటిచెవివారిని వ్రేలుబొజ్జయు, స్తనములు గలవారిని, భయంకరరూపులను, వెగటుదోపఁజేయు రూపము గలవారిని, కుఱుచవారిని, ఖడ్గ, ధను, ర్ముసల, శతఘ్ని నామకాయుధముల ధాల్చినవారలను, దుడ్డుకఱ్ఱలవంటి చేతులుగ గలవారిని, విచిత్రములగు కవచములఁదాల్చినవారిని, మిక్కిలిబలియనట్టియు, మిక్కిలి చిక్కనట్టియు శరీరములుగలవారిని, మిక్కిలిపొడవును, మిక్కిలి కుఱుచయుఁగాకయుండువారిని, ఎక్కువ తెల్లవారు గానివారిని కడునల్లని వారు గానివారిని, మఱిగుజ్జులు, మిక్కిలి గూనివాండ్రునుగానివారిని,

వికృతరూపులను, బహురూపులను, చక్కనిరూపముగలవారిని, మంచి కాంతిగలవారిని, గరుడవానరాది చిహ్నములుగల టెక్కెములను, సాధారణ వస్త్రములుగట్టిన టెక్కెములను బట్టినవారిని, శక్తులు, చెట్లు, పట్టసములు, వజ్రములు, త్రోపుడునాయుధములు, పాశములు మున్నగు నాయుధములఁ దాల్చినవారిని, పూవులసరములుదాల్చి, గంధము నలఁదుకొని, మేటితొడవులందొడిగి, పలు తెఱఁగులయుడుపులను వేసి కొని వేడుకగాఁ దిరుగు పెక్కండ్రు రాక్షసులను, వాఁడిశూలములను దాల్చినవారిని, వజ్రాయుధధారులను, మహాబలులను జూచెను. అనంతర మా హనుమంతుఁ డంతఃపురముముందట నంతటఁ గావలి కాచుటకై రావణునిచే నియమింపఁబడియున్న మూలబలమునుజూచెను.

ఆ ప్రసిద్ధుఁడయిన హనుమంతుఁడును త్రికూటశిఖరమున నిర్మింపఁ బడినదియు, తెల్లదామరపువ్వులే శిరోభూషణములుగాఁగల (తెల్ల దామరపువ్వులతోఁగూడిన) యగడ్తలచే నొప్పినదియు, నలుప్రక్కల నెత్తుగోడలుగలదియు, రథములు, వాహనములు, ఆకాశమునఁ బోవు రథములు (విమానములు), గజాశ్వములు, నాలుగుదంతములుగల తెల్ల మేఘరాసులవంటి యేనుఁగులుగలిగి చెన్నుదాల్చినదియు, దేవ లోకముఁ బోలునదియు, మనోహరములగు వాద్యధ్వనులతోఁ గూడి నదియు, గుఱ్ఱముల సకిలింతలును, భూషణనాదములును గలదియు, చక్కని ద్వారములుగలదియు, విశేషవీర్యముగల పెక్కండ్రు రాక్ష సులచే రక్షితమయినదియు, బంగారువన్నెగల నడిమిప్రదేశముతోఁ గూడినదియు, విలువగల పెక్కుముత్యాలసరములచే నలంకరింపఁబడిన కొనలుగలదియు, సువాసనగల నల్లయగురుగంధముచేఁ బూయఁబడిన దియునైన రావణునియంతఃపురమును బ్రవేశించెను.

## 5-వ సర్గము

**హనుమంతుఁడు రావణునియంతఃపురంబున వెదకుట**

హనుమంతుఁడు రావణునియంతఃపురము ప్రవేశించినవెంటనే, చంద్రుఁ డుప్పరము మధ్యనొందినవాఁడై, వెన్నెలలను వెదచల్లుచుఁ దనకిరణముల నెల్లయెడలఁ బర్వఁజేసి, ఆలమందయందలి మదించిన యాఁబోతుచందమునఁ దిరుగుచు, లోకముల పాపఫలంబులను (దుఃఖ)

ములను) బోఁగొట్టి యాహ్లాదముఁ గల్గించుచు, మహాసముద్రము నుప్పొంగఁజేయుచు, సకలభూతములను విరాజిల్లఁజేయుచుఁ బోవు చుండుటఁ గాంచెను. అప్పుడు చంద్రునియం దొప్పుచుండెడి సౌరు, భూలోకమున మందరపర్వతమందలి సౌరువలెను, ప్రదోషసమయము లందలి సముద్రశోభపగిదియు, నీటినడుమనున్న కమలములదీప్తి మాడ్కియు వెలిఁగెను. అప్పుడు మహాప్రభావముగల శశాంకుఁడగు చంద్రుఁడు సూర్యకిరణ సంబంధముచే మంచుబొట్లనెడి మురికి నశింపఁ జీఁకటి చెదరిపోవఁగా, కాంతివిశేష సంబంధముచేఁ గళంకము చక్కఁగాఁ బ్రకాశించుచుండ, వెండిపంజరమున నున్న రాయంచ వలెను, మందరపర్వత గుహాయం దున్న సింగముచందమునను, మదపు టేనుఁగుపైఁ గూర్చున్న వీరునిభాతియు, అాతిమీఁదఁ గూర్చున్న మృగేంద్రునికైవడియు, యుద్ధరంగముననున్న మత్తగజమురీతియు, సింహాసన మెక్కిన నృపునిగతియు, వాఁడికొమ్ములుగల యాఁబోతు మాడ్కియు, ఉన్నతశిఖరముగల వెండికొండమాడ్కియు, బంగారు పొన్నులువేసిన దంతములుగల యేనుఁగుకైవడియు సర్వకళాపరి పూర్ణుఁడై యంతరిక్షమున వెలిఁగెను. అట్లు చందురుఁడు తనపండు వెన్నెలలఁ బర్వఁజేసి, చీఁకటిఁ బోఁగొట్టఁగా, రాక్షసులు మాంస భక్షణరూపమైన పాపమునఁ బ్రవర్తింపఁగా స్త్రీ పురుషులు దమమనస్సు లందలి ప్రణయకోపము వీడి యొండొరులను వలపుతోఁ జూచుచుం డఁగా, నారాత్రి స్వర్గసదృశమై జనులచేఁ గొనియాడఁదగినదై యుండెను.

తంబురు, వీణెమున్నగు వాద్యములనాదములు శ్రావ్యములై చెలరేగెను. చక్కని నడవడిగల స్త్రీలు తమప్రియులతోఁగూడ నిద్రిం చిరి. జనులకు మిక్కిలి వింతపుట్టించు ఘోరకృత్యము లొనర్చు రాక్ష సులు విహరింపఁబూనిరి. అచ్చట గృహములందుఁ గొందఱు మద్య పానముచే మైమఱచియుండిరి. మఱికొందఱు స్వకృత్యములందు శ్రద్ధ లేక యుండిరి. జనులు గందరగోళముగా నఱచుచుండిరి. రథములు, గుఱ్ఱములు, సింహాసనములు విశేషముగా నుండినవి. వీరలక్ష్మి పురము నందంతటఁ దేజరిల్లుచుండెను. మఱియు రాక్షసు లొండొరులను దమ ఎలిమికొలఁది నీడ్చుచు, బలిసినతమచేతుల నొండొరులమీఁద వేసి

కొనుచు, మద్యపానమువలన నోడలు దెలియక మాటలాడుచు, ఒండొరులను బెదరించుకొనుచు, అొమ్ములఁ గనఁబఱచుకొనుచు, వివిధ రూపములను దాల్చుచుఁ దమయంగములను గాంతలపై వేయుచు, గట్టి విండ్లనుమీటుచునుండిరి. రాక్షసస్త్రీలు కొందఱు గంధపుఁబూఁత పూసికొనుచుండిరి. మఱికొందఱన్నవో నిద్రించుచుండిరి. చక్కని ముద్దుమోమును, రూపునుంగల కొంద ఱతివలు చిఱునవ్వు నవ్వుచుండిరి. మఱికొందఱు ప్రియులపైఁ బొలయలుక గనఁబఱచుచుండిరి. కొందఱు తమప్రియు లింకనురామిచే నిట్టూర్పులూర్చుచు నుండిరి. బృంహితములుచేయుచున్న మదపుటేనుఁగులు, సకలజనపూజితులయిన మహాసత్పురుషులును, తమతోసమముగా యుద్ధముచేయువీరులు దొరకమిచే నిట్టూర్పులు విడుచుచున్న వీరులును గలదైన యాపురంబు బుసకొట్టుచున్న పాములతోఁగూడిన మడుగుఁబోలియుండెను. సూక్ష్మబుద్ధి గలవారు, వ్యవహారనిపుణులు, దైవభక్తిగలవారు, పలురూపములు గలవారు, ప్రియములైన పేళ్లుగలవారునైన పెక్కండ్రు రాక్షసు లచ్చటఁ గనఁబడిరి. మఱియు చక్కనిరూపముగలవారు, సకల సుగుణములు గలవారు, తమసుగుణములకుఁ దగిన చేష్టలుచేయువారు, మీఱిన వెలుఁగుగలవారు, యోగ్యులునగువారును, విరూపులైన వారును గనఁబడిరి.

అటుతర్వాత నచ్చటనే రాక్షసకాంతలు ప్రియులకిష్టులును (లేక ఉత్తమభూషణములను దాల్చినవారును) పాతివ్రత్యమహిమచే వెలయువారును, నక్షత్రములవలెఁ దేజరిల్లువారును, ప్రియులయందును, మద్యపానములందును ప్రీతిగలవారునై యగపడిరి. కొందఱుకాంతలు సౌందర్యముచే మెఱయుచు, ననతోఁగూడి, నడిరేయియందుఁ బ్రియుల బిగికౌఁగిళ్లఁజేరి, ముదముచే సొక్కి, పువ్వులలో డాగిన పక్షులవలె నగపడిరి. కొందఱు పూఁబోడులు పైమేడలమీఁదఁ గూర్చుండిరి. కొందఱు చానలు తమమగల తొడలమీఁద సుఖముగాఁ గూర్చుండిరి. కొందఱు వనితలు మన్మథునిబారింజిక్కి భర్తలకుఁ బ్రియురాండ్రు చేయవలయు శుశ్రూషలుచేయుచు (లేక భర్తలతోఁ గూడి రమించుచు) నుండిరి. అచ్చట వివస్త్రలు కొందఱును, బంగారువంటి మేనిసొరుగల వారు కొందఱును, అందమయిన మేనిఛాయఁగలవారలయు, ప్రియవి

యోగముచేఁ జంద్రునివలెఁ దెల్లనయినవన్నెగలవారు కొందఱునుండిరి. కొందఱు వనితలు తమమనస్సులకెక్కిన ప్రియులకడకుఁ బోయి వారిం గూడి కడుముదముతో నొప్పుచుండిరి. మఱికొంద ఱంగనలు తమ యిండ్లయందే ప్రియులఁగూడి మహానందముగలిగియుండిరి. అప్పుడు హనుమంతుఁ డాస్త్రీలలో నెవ్వరు మనుష్యకాంతలో, ఎవ్వరు రాక్షస కాంతలో తెలియఁగోరినవాఁడై, చంద్రునిఁబోలె వెలిఁగెడి యాకాంతల మోములను, వంకరలైన తెప్పలుగల చక్కనినేత్రముల వరుసలను జూచెను. రాముఁడు చెప్పినభూషణము లేవిన్నైన నున్నవో కనుఁ గొనుటకై యాకాంతలమెడలందున్న మెఱుపుపంక్తులంబోలు నాభరణ ములను జూచెను.

అయినను, మిక్కిలి చక్కఁదనముగలదియు, న్యాయమార్గముఁ దప్పని రాజకులమునఁ బుట్టినదియు, చక్కఁగాఁబూచిన తీఁగెనుబోలి నదియు, అయోనిజాతయు, స్థిరమైన పాతివ్రత్యధర్మమునందుఁ దప్పని పట్టుదల గలదియు, రామునిఁ జూచుటయందుఁ దలంపుగలదియు, రామునివిరహముచే మన్మథునిబాధందగిలినదియు, తనయందే తలంపు గలిగియున్న భర్తయొక్క మనస్సునందుఁ జొచ్చినదియు, లోకము నందలి స్త్రీలందఱిలోపల నెల్లప్పుడు నుత్తమయు, విరహతాపముచే నొచ్చినదియు, విడువక కన్నీరువిడుచునదియు, తనప్రియునితోడ నుండు నప్పు డుత్తమభూషణమును దాల్చినదియు, చక్కని కనుబొమలు గల దియు, తిన్నని కంఠధ్వనిగలదియు, వనమున నాట్యముచేయు నాఁడు నెమలినిబోలినదియు, సూక్ష్మమగు చంద్రరేఖమాడ్కి మిక్కిలిచిక్కి, కాంతిదఱిగియున్నదియు, దుమ్ములోఁబొఱలించిన బంగారుతీఁగెచంద మున మాలిన్యముతోఁగూడినదియు, గాటముగా నాఁటిన బాణపు గాయముఁబోలె లోపలవేదనగలదియు, వాయువుచేఁ జెల్లాచెదరైన మేఘములపంక్తియుంబోలెఁ జిత్తస్వాస్థ్యము లేనిదియునై యుండు సీతా దేవి మాత్రము కనఁబడదాయెను. అంతట వక్తలలో నుత్తముఁడగు రామనృపాలునియొక్కపత్నియగు సీతాదేవిం దానంతసేపు వెదకియుఁ గానకపోవుటచే హనుమంతుఁడు వెంటనే మూఢునివలెఁ గడుదుఃఖము నందినవాఁడయ్యెను.

## 6-వ సర్గము.

### హనుమంతుఁడు రావణాదిగృహంబుల వెదకుట

కామరూపధారియగు హనుమంతుఁడు మొదట రావణునియంతఃపురముచేరి, యచ్చట రాక్షసులనేకులు మేల్కొని యుండుటచే సీతాదేవిని వెదకుట కిచ్చట నిది సమయముగాదని యెంచి, మఱల వెలుపటి కేతెంచి, విమానములందెల్ల వెదకియు సీతనుగానమిచే మిక్కిలి విచారము నొంది, మఱింత వేగముతో లంకాపురమెల్ల వెదకెను. అచ్చట నెక్కడను సీతనుగానమిచేఁ గాంతిమంతుఁడయిన పవననందనుఁడు మఱల రావణుని గృహమునకే మఱలె. ఆరావణునిగృహము సూర్యుని మాడ్కిఁ దేజరిల్లు ప్రాకారముతోఁగూడి, భయంబుగలిగించు రాక్షసులు గావలియుండ, సింహముల రక్షణమందున్న మహారణ్యముపగిదిఁ దేజరిల్లెను. వెండిచేఁ జేయఁబడి, బంగారుభూషణములచే నలంకరింపఁబడిన వివిధవర్ణములగు తోరణములు వెలుఁగుచుండెను. ఆశ్చర్యకరములగు ముంగిళ్లును, మనోహరములగు ద్వారదేశములును నుండెను. శూరులును, శ్రమలేనివారునునగు ఏనుఁగులపై నెక్కిన ప్రధానులును రథముల నీడ్వఁగలవియు నడ్డగింప నలవికానివియునైన గుఱ్ఱములును తిరుగుచుండెను. దంతముతోను బంగారుతోను వెండితోనుచేయఁబడినవియు సింహవ్యాఘ్రచర్మములచేఁ గప్పఁబడినవియు నగునరదములు పెనురొదచేయుచు నిరంతరము నంతటఁదిరుగుచుండెను. ఆనగరు పెక్కు రతనములతో నిండినదై, యుత్తమములగు పీఠములకు నెలవై, మహారథులగు రాక్షసుల కునికిపట్టగుచు గొప్ప రథములమహాధ్వనిగలిగి, రమ్యములగు వింతవింతలైన వేలకొలఁది మృగపక్షులతో నంతట నిండియుండెను. సుశిక్షితులగు బాహ్యరక్షకులును రాక్షసులును నగరునకు నలుదెసలఁ గావలియుండిరి. చక్కని జవరాండ్రంతటఁ దిరుగుచుండిరి. ముగుదలంద ఱుప్పొంగుచుండిరి. రాక్షసశ్రేష్ఠులు చేరువలందు నిల్చియుండిరి. ఉత్తమభూషణములను దాల్చిన స్త్రీపురుషులు దిరుగునప్పుడా భూషణధ్వనులు సముద్రధ్వనుల మాడ్కిఁ జెలరేగుచుండినవి. రాజలక్షణములగు ఛత్రచామరాదులును, అగురుచందనమును విశేషముగా నుండెను. మహాసన

మున సింహములు దిరుగునట్లు గొప్పవారంతటఁ దిరుగుచుండిరి. భేరీ, మృదంగ, శంఖాదివాద్యములమ్రోఁతలు బోరుగొల్పుచుండెను. రాక్షసు లెల్లప్పుడు గంధపుష్పాదులతోఁ బూజలు సల్పుచుండిరి. రావణుఁ డాహితాగ్నియగుటంజేసి యతని గృహమునఁ బర్వదినములందు దర్శపూర్ణమాసాదులగు ఇష్టులు జరుగుచుండెను. రావణునిభవనం బిట్టి సుగుణవిశిష్టమై సముద్రమువలె మ్రోఁగుచు, గంభీరమై, రత్నమయములగు సాధనములతోను మహారత్నములతోను నిండి, రథాశ్వగజములమ్రోఁతలతోఁగూడి చెన్నుమీఱియుండెను. అట్టి రావణాసురుని భవనముఁ జూచి, హనుమంతుఁడు దానిని లంకాపురమున కాభరణముగా నెంచెను.

వీర్యవంతుఁడగు హనుమంతుఁ డిట్టులు దవ్వునుండి యారావణునినగరు చూచి, యచ్చటికిఁ బోవఁదలఁచి, మార్గమునడుమ రావణుని నగరునకు దాపుననుండు రాక్షసు నగళ్లను, ఉద్యానములను నొక్కదానివెంబడినొక్కటిగా నేరికి వెరవక తిరిగెను.

శూరుఁడగు హనుమంతుఁడు కడువడితో నొప్పుచుఁ బ్రహస్తుని యింటిమీఁదికెగిరి యచ్చటినుండి మహాపార్శ్వునిగృహముమీఁదికి నెగిరెను. అట్లొక్కటి వెంబడి నొక్కటిగాఁ గుంభకర్ణ, విభీషణ, మహోదర, విరూపాక్ష, విద్యుజ్జిహ్వ, విద్యున్మాలి, వజ్రదంష్ట్రి, శుక, సారణ, ఇంద్రజిత్, జంబుమాలి, సుమాలి, రశ్మికేతు, సూర్యశత్రు, వజ్రకాయ, ధూమ్రాక్ష, సంపాతి, విద్యుద్రూప, భీమ, ఘన, విఘన, శుకనాస, వక్ర, శఠ, వికట, బ్రహ్మకర్ణ, దంష్ట్ర, రోమశ, యుద్ధోన్మత్త, మత్త, ధ్వజగ్రీవ, నాది, ఇంద్రజిహ్వ, హస్తిముఖ, కరాళ, పిశాచ, రోహితాక్షుల యిండ్లమీఁది కెగిరి దాఁటుచు, చక్కనై యుండు నాయా యిండ్లయం దారాక్షసులకలిమిని జూచుచుఁ బోయి, వారి యిండ్లనన్నింటిని దాఁటి రాక్షసరాజునగరు చేరెను.

ఆరావణునిగృహమున శూలముద్గరశక్తితోమరాద్యాయుధధారిణులై యా రావణాసురునిచేరువఁ బరుండియున్న భీకరదృష్టులగు రాక్షసాంగనలను గాంచెను. కొంతదవ్వేగఁగ, సకలాయుధధారులగు భటులను, శ్వేతరక్తవర్ణములగు నశ్వములను, మంచిజాతియందుఁ బుట్టినవి, రూపముగలవి, శత్రుగజముల నొప్పించునవి, గజశిక్షయందు

నేర్పుగలవి, యుద్ధమున నైరావతముంబోలినవి, శత్రుసేనల సంహారించు నవి, మదజలముగార్చుచుండుటఁ జేసి, తూరపడుచున్న మేఘములను, నీటివెల్లువలను కాఱుచున్న పర్వతములం బోలునవి, మేఘగర్జనముం బోలు గర్జనముగలవి, శత్రువుల జయింప నలవిగానివియునైన యేనుఁగులను, బంగారుకవచములఁ దాల్చినవారు, బాలభానుబింబముపగిదిఁ దోఁచువారునగు పెక్కురుభటులను జూచెను. మఱియొకప్రక్కను పలు తెఱఁగులైనపల్లకులను, తీఁగెలయిండ్లను, చిత్రశాలాయుతములగు గృహములను, తక్కుంగల వేడుకతావులను, కొయ్యతోఁజేసిన పర్వతములను, దివ్యమయిన రతిక్రీడాగృహములను, పగటిపూటఁ గాలము పుచ్చఁదగిన గృహములను జూచెను. రావణునిభవనోత్తమము మందర గిరింబోలినదై, నెమళ్లతో నిండి టెక్కెపుఁ గొయ్యలచే విస్తారమయి యుండుటను, అచ్చటనే పెక్కురత్నములతో నిండియున్న గనుల నన్నింటినిజూచి, యది బుద్ధిమంతులగు జ్ఞాననిష్ఠులైన మునులతపస్సునకు ఫలమైన యీశ్వరునిభవనమువంటిదేయని తలఁచెను.

ఆరత్నముల కాంతియు, రావణునిప్రతాపమునుగూడిన యా భవనము వేయివెలుఁగులతో వెలుఁగుసూర్యునిమాడ్కిఁ దేజరిల్లెను. అంత హనుమంతుఁడు మఱికొంత లోపలికిఁబోయి బంగారుమయములగు మంచములను, పీటలను, అసంఖ్యములైన పాత్రములను జూచెను. తేనెతోఁ బక్వముచేసిన మద్యములచేఁ దడిసినది, మణిమయములగు పాత్రములతో నిండినది, కుబేరునిగృహమువలె నిఱుకుగాక విశాలరమణీయమైనదియు, అందెలయు, మొలనూళ్లయుఁ జిఱుమ్రోఁతలతోను, ధ్వనివిశేషముగల మృదంగముల ఘోషములతోనుగూడి, మాఱుమ్రోఁతలీనుచుఁ బెక్కు ప్రహరిగోడలతోఁగూడి, చక్కని పెక్కురు జపరాండ్ర కునికిపట్టై, విశాలములయినతొట్టికట్టులతో నిండినదియు నైయుండు నట్టిరావణుని నగరులోపలఁ బ్రవేశించెను.

## 7-వ సర్గము

**హనుమంతుఁడు రావణునియంతఃపురమున సీతను వెదకుట**

బలవంతుఁడగు హనుమంతుఁడు పచ్చలుచెక్కిన బంగారుకిటికీలును, పక్షులగుంపులుగలవై, మెఱుపులచేఁ గ్రమ్మఁబడి, పక్షిజాలము

లతోఁగూడియున్న వార్షికమేఘమువలెఁ దేజరిల్లు భవనపంక్తులను, ముఖ్యములయిన ధనుర్బాణశంఖాద్యాయుధములచే విరాజిల్లుచున్న యాయిండ్లలోపలియిండ్లను, పర్వతములవలె నెత్తయిన గృహముల యందలి దివ్యములై పెడల్పైన యుప్పరిగెలను, సకలధనములచే నిండి నవియు, దేవాసురులచేతఁ జక్కఁగాఁ బూజింపఁబడినవియు, ఎట్టియొచ్చె మును లేనివియు, కుబేరుని గెల్చి తనబలముచే సంపాదింపఁబడినవియు, పూనికితోఁ జక్కఁగాఁ దీర్పఁబడినవియు, మయునిచేతనే స్వయముగా నిర్మింపఁబడినవో యనఁబడినవియు, సకలగుణసమృద్ధిగలవియునైన లంకా పురాధీశ్వరుని గృహముల నన్నిటినిఁ జూచెను.

తర్వాత హనుమంతుఁ డున్నతమైన మేఘముయొక్క రూపములుబోలు రూపముగలదియు, బంగారు మయమయినదిగాన నందముగాఁ దోఁచునదియు, సాటిలేనిరూపముగలదియు, రాక్షసేశ్వరుని బాహుబలమునకుఁ దగినదియు, నానావిధములగు రత్నములచేఁ బూర్ణమై, ధగధగమని వెలుఁగుచుండుటంజేసి, కారణాంతరముచేఁ బుడమికి దిగివచ్చి యచ్చటఁ బర్వినస్వర్గలోకమోయనఁదగినదియు, పలు తెఱఁగులగు చెట్లనుండి రాలిన పువ్వులచే నిండినది యగుటవలన పుప్పొడితో నిండిన పర్వతశిఖరముకైవడిఁ దోతెంచునదియు, ఉత్తమ స్త్రీలుగలిగి వెలయునది యగుటచే మెఱుఁగులచే మెఱయు క్రొక్కారు మబ్బువలెఁ బ్రకాశించునదియు, రాజహంసలచే మోయఁబడు కాంతి యుక్తమైన పుణ్యాత్ముల విమానముచందమున నొప్పారునదియు, నానా ధాతువులతోఁ జిత్రముగఁ గానిపించు పర్వతశిఖరము పగిదియు, చంద్ర తారాగణములతోఁగూడి పలువన్నెలు గలదిగాఁ గనఁబడు నాకాశము చొప్పునను, ప్రోగుగాఁజేయఁబడిన నానావిధ మేఘములమాడ్కియుఁ దోఁతెంచునదియు, నానారత్నములు చెక్కినదియునైన లోకోత్తరమైన పుష్పకవిమానమును గాంచెను.

ఆ పుష్పకవిమానమునందలి పుడమియెల్లఁ బర్వతపంక్తులతో నిండినట్లు చిత్రింపఁబడెను. ఆపర్వతములందుఁ బెక్కువృక్షములున్నట్లును, ఆ వృక్షములు పువ్వులగుత్తులతో నిండియున్నట్లును, పుష్పములెల్లఁ బుప్పొడితోను, కేసరములతోను నిండియున్నట్లును చిత్రింపఁబడియుండెను.

తెల్లని పాలగార పూయఁబడినట్లున్న యిండ్లును కోలఁకులెల్లఁ దామర పువ్వులతోఁగూడియున్నట్లున్న కొలకులును చిత్రింపఁబడియుండెను. ఆ కమలములును కేసరములతో నిండియుండునట్లు రచింపఁబడినవి. పలు విధములైన వనములును జిత్రింపఁబడెను. మఱియుఁ బచ్చలు, బంగారు, వెండి, పవడములమయములైన పక్షులును, వివిధములగు సర్పములును, మంచిజాతులయందుఁ బుట్టినయశ్వములబోలు చక్కని యంగములుగల యశ్వములును జిత్రితములయ్యెను. మఱియుఁ గొన్ని పక్షులు చక్కని తెక్కలును ముక్కునుంగలవై, ఒయ్యారముతోఁ దమ తెక్కలను వంచికొని మన్మథునిబంటులో యనునట్లు మన్మథోద్దీపకములై సొంపు మీఱునట్లు చిత్రింపఁబడియుండెను. ఏనుఁగులు తామరకొలఁకులలో డిగి, తొండములతోఁ దామరాకులను, పువ్వుల తెకులను, కేసరములనుఁ జుట్టుకొని తామే వ్యాపించియుండునట్లు చిత్తరులు వ్రాయఁబడియుండె. అట్లె కొలఁకులందు లక్ష్మీదేవి తనచక్కని యిరుచేతులలోను గమలములఁ దాల్చి, తమ్మిగద్దియ యందుఁ గూర్చుండియుండునట్లు లిఖింపఁబడెను.

ఇట్లు పలుతెఱఁగులైన చిత్రములతోఁగూడి, నవరత్నఖచితమై, ఉత్తమగృహములకంటె నుత్తమమయి, మంచుతొలఁగినపిదప మిక్కిలి చొప్పుమీఱె నెత్తావిగల పుష్పాదులతో నిండిన పెక్కుగుహలుగల పర్వతముభాతి శోభిల్లునదియునైన యాపుష్పకవిమానమును గాంచి, యపూర్వమైన దానిసొంపునకు నచ్చెరువందెను. అంత హనుమంతుఁ డారావణపాలితమైన చక్కని లంకాపురమునఁ దిరిగి, పతివ్రతయని కొనియాడఁబడినదియు, భర్తయందలి సుగుణములచే లోఁబఱుపఁబడినదియు నైన సీతాదేవినిగానక మిక్కిలి దుఃఖితుఁడయ్యె. ఆ హనుమంతుఁడట్లు న్యాయమార్గముఁదప్పక, ప్రయత్నములొనర్చి పలుతావులందుఁదిరిగి యొకతూరి చూచినమాత్రముననే యంతయుఁ గరతలామలకముగాఁ (చేతిలోని యుసిరికకాయవత్తుగా) జూడఁగలవాఁడై యున్నను సీతాదేవిని గానక, పెక్కుతెగలగు వగలం గుందుచుండఁగా నాతనిమనంబు గుదురుతప్పినదై చింతాక్రాంతమై యుండెను.

## 8-వ సర్గము

### పుష్పకవిమాన వర్ణనము

ఆరావణుని గృహమధ్యమున నున్నట్టి కెంపులు రవలు చెక్కిన చిత్తరువులుగలిగి, యపరంజితోఁ జేయఁబడిన గవాక్షములతో నొప్పుమీఱియున్న యప్పుష్పకవిమానమును హనుమంతుఁడు కాంచెను. ఆవిమానమును విశ్వకర్మ నిర్మించునప్పు డొక్కొక్కభాగమును నిర్మించి యిది బాగున్నది యిదిబాగున్నది యని తననేర్పును గొనియాడుకొనుచు నిర్మించుటచేత నది యెన్నరాని సాటిలేని చిత్తరువులుగలదై యాకాశమున నిలిచినదై, మఱియెత్తగు వాయుమార్గమున నెలకొనగలదగుచు సూర్యునిమార్గముయొక్క యానవాలో యనఁ బ్రకాశించెను.

ఆవిమానమునఁ బ్రయత్నపూర్వకముగాఁ జేయఁబడినదికానిదియొక్కటియు లేదు. ఆవిమానమున నమూల్యరత్నఖచితము కానిదొక్కటియు లేదు. ఆవిమానమున లేని వింతలు దేవతలవిమానములందును లేవు. అచ్చట గొప్పయాశ్చర్యములేని దొక్కటియు లేదు. తపస్సుచేసియు, బలముచూపియు సంపాదింపఁబడినదియు, మనస్సునకిష్టమయిన నడకలతోఁ బోవునదియు, పలుతెఱఁగులైన గోపురములు మున్నగువింతలతోఁ గూడినదియు; అన్నివైపులఁ గాన్పించు నొక్కటే తీరుగల చిత్తరువులతోఁగూడినదియు, యజమానునిమనస్సును గనిపెట్టి పోవలసినచోటికిఁ బోవునదియు, వాయువేగముఁబోలు వేగముగలదియు, నేరికి నడ్డగింపరానిదియు, పుణ్యాత్ములును, మహాధనసంపన్నులును, కీర్తిమంతులునైన మహాసంతుష్టులగు నింద్రాదులయొక్క భవనములవలె నొప్పారునదియు, మేలయిన రత్నములు మున్నగు వస్తువులు గలదియగుటచే మిక్కిలి వన్నె కెక్కినదియు, విచిత్రములైన పెక్కుశిఖరములచే నలంకరింపఁబడినదియు, శరత్కాలచంద్రునింబోలె స్వచ్ఛమైనదియు, విచిత్రశిఖరములు గలదియునైన మనోహరమగు పర్వతశిఖరముమాడ్కి వెలుఁగునదియు, కుండలములను (అంటుజోళ్లను) దాల్చుటచే శోభాయమానములగు మోములుగలవారును, విస్తారముగాఁ దినువారును, రాత్రులందుఁ ఆకాశమున

దిరుగువారును, గుండ్రనివి, వంకరవి, విరివిగలవియైన నేత్రములుగల వారును గడువడిగాఁ బోవువారునగు పెక్కువేల భూతములచే మోయఁబడునదియు, వసంతర్తువునకు సంబంధించిన యన్ని పుష్పములు గలదియాటచేతఁ జూడనింపైనదియు, వసంతకాలమునకంటె ననుభవ యోగ్యమునైన పుష్పకమనెడి విమానోత్తమమును వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు చూచెను.

## 9-వ సర్గము

హనుమంతుఁడు రావణాంతఃపురమున సీతకు వెదకుట

అట్టివిమానోత్తమమగు పుష్పకము నడుమనుండునదియు, నర్ధ యోజనము వెడల్పును నొక్కయోజనము నిడివియుఁ గలిగి, పెక్కు మేడలతో నిండినదియునై యున్న రాక్షసేంద్రుని గృహమును మారుత పుత్త్రుఁడు చూచెను.

శత్త్రువులఁ బరిమార్చువాఁడయిన యా హనుమంతుఁడు విశాలములగు కన్నులుగలదగు సీతాదేవిని వెదకుచు నంతటను దిరిగెను. హనుమంతుఁడట్లు తిరుగుచు, నాలుగుదంతములు,మూఁడుదంతములుగల యేనుఁగులతోను గూడినదియు, విశాలమైనదియు, ఆయుధధారులైన భటులచేఁ గావలికాచఁబడునదియు, రావణునిభార్యలగు రాక్షసకాంతలతోను, రావణుఁడు బలాత్కారముతోఁ దెచ్చిన రాజకన్యలతోను గూడినదియునై నందున గాలికిఁ గదలుచుండునట్టి నక్రమకరములు, తిమింగిలములు, సామాన్యమత్స్యములు, పాములు మొదలగువాని కునికిపట్టగు సముద్రమును బోలిన రావణునినగరు సొచ్చెను. కుబేరుఁడు, దేవేంద్రుఁడు మొదలగు దిక్పాలురయొక్క భవనములందుండు సౌరు రావణుని గృహము నెడఁబాయకుండెను. కుబేరునిభవనమునను, యమునినగరునను, వరుణునిమనికియందును నెంతటి కలిమిగలదో, యంతటి కలిమియు, నంతకంటె నెచ్చయిన కలిమియు రాక్షసులగృహములం దొక్కొక్కదానియందును గలదు. అట్టిరాక్షసులగృహములకంటె మించిన మెఱుఁగుగలదయిన రావణునినగరు నడుమనుండునదియు, పలుమదపుటేనుఁగుల చిత్తరువులతోఁ గూడినదియు, సొగసయిన పనితరము గలదియునైన మరియొక్క గృహమును మారుత

సూనుఁడు గాంచెను. అయ్యది బ్రహ్మకొఱకు విశ్వకర్మ తననేర్పెల్ల వినియోగపఱచి నిర్మించెను. అది పుష్పకమనఁబడినది; నవరత్నఖచితమైయున్నది. కుబేరుఁడు బ్రహ్మనుగూర్చి తపమొనర్చి, నవరత్నములచే నలంకరింపఁబడిన యా పుష్పకవిమానమునొందెను. రావణుఁడు పరాక్రమమునఁ గుబేరుని జయించి, బంగారుతోను వెండితోను నిర్మించినతోడేళ్ల ప్రతిమలుఁగలిగి, చక్కఁగాఁదీర్చిన స్తంభములచే మోయఁబడి, కాంతిచే వెలుఁగునట్టిదియు, మేరుమందర పర్వతమువలె నెత్తయి యాకాశము నొఱయుచున్నవో యన్నట్టులుండు సొగసైన కూటగృహములచే నంతట వెలుఁగునదియు, సూర్యాగ్నులవలెఁ దేజరిల్లునదియు, పసిఁడిమెట్లు గలదియు పచ్చలును నీలములును బఱచిన యందములయిన తిన్నెలతో సొంపుమీఱునదియు, స్ఫటికమణులతోను, బంగారముతోను నిర్మించిన సోరణగండ్లతోను, కిటికీలతోను గూడినదియు, పలుతెఱఁగులైన పగడములతోను, విలువగల మణులతోను, గుండ్రనైన ముత్యములతోను గట్టఁబడి, విచిత్రమైన పైప్రదేశముతోఁ గూడినదియు, పసిఁడివన్నెగల్గి నెత్తావిచే గుబాళించు నెఱ్ఱని చందనముచేఁ బూయఁబడినదియు, బాలసూర్యునిపగిది దీపించునదియునైన పుష్పకవిమానము నెక్కెను.

అట్టిరమ్యమైన పుష్పకవిమానమును హనుమంతుఁడెక్కి యచ్చటనుండి దివ్యమై మితిమీఱియున్నందుచే, రూపముదాల్చిన వాయువో యనఁదగిన పాన, భక్ష్య, అన్నములనుండి పుట్టిననెత్తావి నాఘ్రాణించెను. లోకమున మనుష్యుఁడు బంధువువచ్చినయెడల, వానినెదుర్కొని తనయింటికిఁ బిల్చుకపోవుచందమున నాగంధము బలవంతుఁడైన హనుమంతు నెదుర్కొని, రావణుఁడున్నచోటికి రమ్మని పిలిచినదో యన్నట్లుండెను.

హనుమంతుఁడు పుష్పకవిమానముపై నెక్కినతర్వాత సీతాదేవిని వెదకుటకుఁ దఱలినవాఁడై, యా పుష్పకవిమానమధ్యమున నుండునింటికిఁ బోవ నుద్యుక్తుఁడై, సుందరాంగనవోలె నారావణుని మనస్సును సంతోషపఱచునట్టి చక్కనైన విశాలమగు నారావణుని గృహమును గాంచెను. ఆగృహమునకు రతనాలుచెక్కిన మెట్లును, బంగారుఁ గిటికీలు నుండెను. అచటనేల పటికపుఱాలు పఱచఁబడి

యుండెను. నడుమనడుమ దంతపుబొమ్మలు నిర్మింపఁబడియుండెను. ముత్యములు, పగడములు, వెండి, బంగారములుకలయ నలంకరింపఁబడి నవి, చక్కనివి, సమమైనవి, మిక్కిలి యెత్తయినవియు అంతటను చక్కఁగా నలంకరింపఁబడినవియునగు పెక్కుగొప్పస్తంభము లుండెను. కావుననది యున్నతములయిన తెక్కలతోన నంతరిక్షమున కెగురఁ బ్రయత్నించినదో యన్నట్లుండెను. నదులు కొండలు సముద్రములు దేశములు మొదలగు భూలక్షణములుగల గొప్పరత్నకంబళము పఱవఁ బడియుండెనుగాన, నాగృహము దేశరాజ్యములతోఁగూడిన విశాలమైన పుడమివలెనుండెను. ఆరావణగృహమున పక్షులు మదించినవై కూఁతలిడుచుండెను. కమ్మనివాసనలు గుబాళించుచుండెను. శ్రేష్ఠములయిన కంబళములు పఱవఁబడియుండెను, నందినియను రాక్షసవీరు లాగృహ ద్వారమునఁ గావలియుండిరి. అగురుధూపము వేయుటచే నాపొగయంతయు వ్యాపించుటవలన నాగృహము దెలుపు నలుపు వన్నెగలదైయుండెను. సున్నపుఁ బూఁతవలన నిర్మలమై హంసవలెఁ దెల్లనైయుండెను. పూవులుచల్లఁబడియుండుటచేఁ జిత్రవర్ణముగల వేల్పుటావువలెఁ బ్రకాశించుచుండెను. మనస్సునకు సంతోషము గలిగించునదియు, వన్నెలకుఁ గూడ వన్నెతెచ్చునదియు, శ్రమను దీర్చునదియు, మిక్కిలి చక్కనై కాంతికిఁబుట్టినెలవో యనునట్లుండునదియునై యుండెను.

రావణునిచేఁ బాలింపఁబడు నాగృహము పంచేంద్రియములకుఁ దనివిఁగలిగించు నుత్తమవస్తువులచేత నాహనుమంతుని పంచేంద్రియములను దల్లివోలెఁ దృప్తినొందించెను. హనుమంతుఁ డట్టిచక్కని రావణుని నగరుచూచి, "ఇది పాతాళము మొదలగు లోకములలో నొక్కటియో, వాయువు, వరుణుఁడు మొదలగు వేల్పులుండెడిలోకమో, దేవేంద్రపురియో, మితిమీఱిన తపఃఫలమైన బ్రహ్మలోకమో" యని తలంచెను. అచ్చట నన్ని బంగారుకంబములందును జూదమాడుచుండునట్లు రెండేసిబొమ్మలు ఒకటి పెద్దదిగాను, మఱియొక్కటి దానికంటెఁ జిన్నదిగాను నిర్మింపఁబడియుండె. అవి బంగారు స్తంభములకడ బంగారముతోడ నిర్మింపఁబడినవి యగుటచే మిక్కిలి ప్రకాశించుచుండెను.

వానిలోఁ జిన్నబొమ్మలు, జూదమాడు మొనగాండ్రతో జూదమాడి కోడిపోయి, యవమానపడి, తాము మఱల గెల్పునొందుటకై

భగవంతునిఁగూర్చి ధ్యానముచేయుచున్న జూదరులమాడ్కి నుండు టను హనుమంతుఁడు గాంచెను. అచ్చట నుంపఁబడియుండు దీపముల కాంతియు, రావణునితేజస్సును, భూషణముల మెఱుఁగులును జేరి యుండుటచే నాగృహము నిప్పంటుకొని మండుచుండునట్లుండెను.

అచ్చట రాక్షసస్త్రీలు పలురంగులచీరలఁ గట్టి, నానావిధాలంకారములఁజేసికొని, విచిత్రములైన పుష్పహారములను దాల్చి, మద్యపానమువలని కైపుచే మైమఱచి, సగమురాత్రివఱకుఁ బ్రియులతోఁ గ్రీడలుసల్పి యలసటచే నిద్రించిరి. అట్లు వారందఱు నిద్రించుటవలన, వారిభూషణములచప్పుడులు వినరాకయుండినందున, కలహంసలకలరవములు, తుమ్మెదలగీపెట్టుటలు లేని మహాపద్మవనముమాడ్కి విరాజిల్లుచుండెను.

ఆరాక్షసేంద్రునిగృహమున నుండు స్త్రీలు దంతములు దెలియకుండునట్లు నోళ్లుమూసికొని, కన్నులుమోడ్చి నిద్రించుటవలనను, సూర్యోదయమున వికసించి, రాత్రి రాఁగా ముడుచుకొన్న కమలములంబోలియున్న సువాసనగల వారిమోములను హనుమంతుఁడు చూచి, యామోముదమ్ములందలి పూఁదేనెను గ్రోలుటకై తుమ్మెదలెప్పుడివి వికసించునాయని మాటిమాటికిఁ బ్రార్థించుచున్నవో యనియు, శైత్యసౌరభ్యాదిగుణములందు కమలములకంటె మించినవో యనియుఁ దలఁచెను.

ఆరావణుని మందిర మాకాంతలమోముదమ్ముల కాంతిగలదియగుటచే నక్షత్రతేజస్సుచే వెలుఁగుచున్న మబ్బుగ్రమ్మిన శరత్కాలమందలి యాకాశమువలె వెలుఁగుచుండెను. ఆరాక్షసకాంతలచేఁ జుట్టఁబడినవాఁడై యున్న రావణాసురుఁడు నక్షత్రగణపరివృతుఁడైన పూర్ణచంద్రునిమాడ్కి మెఱయుచుండెను.

హనుమంతుఁ డచ్చటనున్న సుందరాంగులగు స్త్రీలనుజూచి, వారందఱు పుణ్యశేషముండునప్పుడుప్పరమునుండి పుడమినొక్కచోట గుంపుగాఁబడిన నక్షత్రములో యని తలఁచెను. నక్షత్రములవలె మిగులవెలుఁగుచున్న యాకాంతలమేనిసొరును, రూపమును, నిగనిగమను మెఱుఁగును మితిమీఱియుండెను.

అచ్చటనుండు కాంతలు చక్కగాఁద్రాగి, యాటలాడుచుఁ బాటలుపాడుచు సురతసుఖములఁ దేలుచు, బడలి నిద్రించినందున, వారుదాల్చిన గొప్పపూలదండలును, మేటిభూషణములును స్వస్థానముల నుండి తొలఁగియుండెను. కొందఱుకాంతలకు బొట్టుమాసెను. కొందఱు సుందరులకుఁ గాలియందెలు దావు తప్పియుండెను. కొందఱు చెలువలకు హారములు ప్రక్కలకు జాఱియుండెను. కొందఱు చానలకు ముత్తెపు సరములు దారము దెగినందునఁ జుట్టును రాలియుండెను. కొందఱు క్రాల్గంటులకుఁ గోకలు ముళ్లువీడి జాఱియుండెను. మొలనూళ్లు త్రెగి పోవుటచేఁ గొందఱుకాంతలు మార్గాయాసము దీర్చుకొనుటకై కట్టు త్రాళ్లువిప్పి నేలపైఁబొరలింపఁజేసిన పెంటిగుఱ్ఱములవలెఁ గానఁబడిరి. చక్కనికమ్మలుదాల్చిన కొందఱు పొలతుకలు నలిగి, త్రెగిన పువ్వుల దండలుకలవారగుటంజేసి, కాఱడవియందు మదపుటేనుఁగులచే నలగఁ ద్రొక్కఁబడిన విరులుగల తీఁగెలమాడ్కి శోభిల్లిరి.

కొందఱుస్త్రీలు స్తనములందుఁ దాల్చిన చంద్రహారములు వారి స్తనములనడుమ నిద్రించిన హంసములమాడ్కి వెలుఁగుచుండెను. కొందఱుస్త్రీలు ధరించిన వైడూర్యహారములు కాదంబములను నంచల వలెను. మఱికొందఱు ధరించినబంగారు మెడనూళ్లు చక్రవాకముల వలెను విలసిల్లుచుండినవి. వీరందఱు స్త్రీలును రాయంచలను బెగ్గురు పక్షులంబోలిన వజ్రవైడూర్యహారములును, చక్రవాకపక్షులవలె గుండ్రనైన మెడనూళ్లు ఇసుకదిన్నెలవంటి పిఱుఁదులును గలవారగు టచే హంసకారండవచక్రవాకములతోఁ గూడిన యిసుకదిన్నెలుగల నదులమాడ్కిఁ బ్రకాశించుచుండిరి. అచ్చట నిద్రించు కొంద ఱంగ నలు చిఱుగజ్జెలనెడి మొగ్గలు, బంగారంపుఁదొడవులనెడి గొప్పపద్మ ములు, శృంగారంపుఁజేష్టలనెడి మొసళ్లును, కీర్తిఁదెచ్చెడి చక్కదనమను తీరములును గలవారలై నదులమాడ్కి నుల్లసిల్లిరి. కొందఱతివల యొత్తైన యంగములందును, స్తనాగ్రములందును ఏర్పడిన భూష ణములవలెనే ప్రకాశించినవి. కొందఱు చెలువలచీరెలకొంగులు నోటి వాయువులకుఁ గదలుచు మోములపైననె మాటిమాటికి నెగురుచుండి నవి. చక్కనికాంతిగల భూషణములు దాల్చిన పలురంగులుగల యా కాంతలచీరెలకొంగులు వారినోటిగాలికిఁ గదలుచు, గాలికిఁ బైకెగురఁ

గొట్టఁబడిన ధ్వజపటములమాడ్కిఁ బ్రజ్వరిల్లెను. మంచికాంతిగల కొందఱు సుందరాంగనలయొక్క కమ్మలు నోటిగాలిసోఁకుడువలన మెల్ల మెల్లగాఁ గదలుచుండినవి.

పంచదారగలిపిన మద్యముయొక్క కమ్మనివాసనలును, స్వాభావికమైన సుగంధముంగలదిగ్గొన యాకాంతలనోటిగాలి యారావణుని సోఁకుచుండెను. కొందఱు స్త్రీలు నిద్రయందు తమసవతులమోములను రావణునిమోమని తలఁచినవారలై మాటిమాటికి ముద్దుపెట్టుకొనిరి. రావణునియందు మిక్కిలి దగులుగలిగిన యాయుత్తమాంగనలు నిద్రచే మైమఱచినవారయినందునఁ దమ్ము ముద్దుపెట్టువాఁడు రావణుఁడనియె తలఁచి తమసవతులను మఱల ముద్దుపెట్టుకొనిరి. అచ్చట మఱికొందఱు కాంతలు భుజకీర్తులనుదాల్చిన తమభుజములను దలక్రింద దిండ్లుగాఁబెట్టికొని నిద్రించుచుండిరి. కొందఱుజవరాండ్రు తమ చక్కని చీరెలను దలగడలుగాఁ బెట్టికొని నిద్రుంచుచుండిరి. ఒక్కతె మఱొక్కదానిఱొమ్మునఁ దలపెట్టి నిద్రించుచుండెను. అది మఱొక్కదానిభుజముమీఁదఁ దలపెట్టి నిద్రించుచుండెను. మఱియొకతె యింకొకదానితొడపైఁ దలపెట్టి నిద్రపోవుచుండెను. అయ్యది మఱియొక్కర్తుకచేతులను దలగడగానుంచుకొని నిద్రించుచుండెను. ఇట్లు మోహపరవశలైన జవరాండ్రందఱొకదానితొడమీఁద మఱొక్కతెయు, ఒకదానిప్రక్కలందు మఱొక్కతెయు, ఒకర్తుకవీఁపుమీఁద మఱియొక్కర్తుకయు, ఒకదాని పిఱుఁదులమీఁద మఱియొకతెయుఁ దమతమ యవయవముల నుంచికొని పరుండియుండిరి. ఒండొరుల భుజములపైఁ దలలుంచుకొని పరుండుటచే నల్లనికేశములుగల యాకాంతలు పూఁదేనెఁగ్రోలుటకై వాలిన తుమ్మెదలుగల పూవులదండలలాగునఁ బ్రకాశించిరి.

రావణుని యంతఃపుర స్త్రీ లొండొరుల ముఖమారుత మొండొరులకు సోఁకుటకై యెదురెదురుగాఁ జేతులుగ్రుచ్చుకొనిపరుండి, యొండొరులకొక కొంగులు దగులుకొనునట్లును, ఒకరిచేతు లొక్కరిమీఁద వేసికొని, చిక్కుపడిన యొండొరుల తలవెండ్రుకలుగలవారలై నిద్రించుటవలన వసంతర్తువునందు చక్కఁగాఁ బూచిన తీఁగఁలెక్కువ గాలి వచ్చుటచే నొండొంటితో దండలవలెఁ జేరినవి, యొండొంటితోఁ

గలిసిన పూవులరాసులుగలవి, యొకటితో నొకటి పెనుచుకొన్న కొమ్మలు గలవి, యొండొంటిమీఁదను దుమ్మెదలు వాలుటలుగలవియునై యుండునట్లు ప్రకాశించిరి.

ఆకాంతలంద ఱొండొరులను చేరికొని పండుకొనుటచేత వారు వారుదాల్చిన భూషణము లాయాతావులయం దున్నను గలిసియున్నం దున నీభూషణములొక్కతెవి యీ భూషణములు మఱొక్కతెవియని నిశ్చయించుటకు వీలులేకుండెను. అప్పుడు రావణుఁడు హాయిగా నిద్రించుచుండఁగా, పలురంగులుగల యాస్త్రీలనందఱను పసిఁడికంబము లం దుంపఁబడినదీపములు ఱెప్పపాటులేనివై చూచుచున్నవోయన్నట్లు వెలిఁగెను. ఆరావణుని శయనగృహంబున నున్న రాజర్షి పితృదైత్య గంధర్వ కాంతలును మఱియు నచ్చటనుండు రాక్షసకాంతలును రావ ణుని రూపబలాదులం జూచి మోహించి, మన్మథపరవశలై వచ్చిన వారలేకాని, యా రావణుఁడు సీతనుదప్ప నొక్కతెను బలాత్కార ముతోఁ దెచ్చినవాఁడుకాఁడు. మఱియు రావణుఁడు యుద్ధముగోరి, యొరులకాంతలను గొందఱిని దెచ్చెను. కాని, తానుగాఁ గోరి తేలేదు. కొందఱు మదించిన జవరాండ్రు, రావణునిమీఁది మోహముచే మద నునిబారిందవిలివచ్చిరి. ఆ స్త్రీలలో నందఱును రావణునిగుణములను గోరివచ్చిరేకాని, యాతఁడు తనపరాక్రమము మెఱయ బలాత్కార ముగాఁ దెచ్చినకాంత యొక్కతెయులేదు. రావణునియందుఁ దప్పఁ దక్కినపురుషునియందుఁ గోరికగలదియు లేదు. జానకితప్ప ముందుగా రావణేతరపురుషుని భర్తనుగాఁ బొందినదియు లేదు; రావణుని స్త్రీలలో నొక్కతెయైనను సత్కులమునఁ బుట్టనిదియు, సౌందర్యము లేనిదియు, శృంగారరసాదులందు నేర్పు లేనిదియు, బలిమి లేనిదియు, భర్తకుఁ గోరఁ దగనిదియు లేకుండెను.

రాముని ధర్మపత్నియగు సీత స్వయంవరమునకు పూర్వమె రావ ణునికి పత్నియయినచో, రావణుని జన్మము సార్థకమై యుండెడు నను నీబుద్ధి స్వాభావికముగా మంచిబుద్ధిగల హనుమంతునికిఁగూడఁ గోతి స్వభావమువలనఁ బుట్టెను.

హనుమంతుఁడు మొదట నిట్లుచెడుతలంపు తలఁచియు, మరల విచారమునొంది "సీత సకలగుణములలో నందఱికంటె నుత్తమురాలు,

అట్టి యా సీతాదేవి విషయమున నీరావణుఁడు గొప్పకులమునఁ బుట్టిన వాఁడైనను లోకనింద్యమైన కార్యము నొనరించెను గదా” యని మనమున మిక్కిలి నొచ్చి, చింతించిన వాఁడయ్యెను.

## 10-వ సర్గము

హనుమంతుఁడు రావణునిఁజూచుట

అంత హనుమంతుఁ డా రావణునిశాలయందు స్ఫటికములు చెక్కినవియు, నవరత్నములచే నలంకరింపఁబడినదియునై, దంతముతోను, పసిఁడితోను జేసిన విచిత్రములయిన యంగములతోఁ గూడినవియు విలువగల పఱపులతోను బట్టలతోను గూడినవియగు వైడూర్య ఖచితములైనవియునగు నాసనము లంతట వెలయుచుండ నొప్పారునది గనుక దేవేంద్రునిశయనగృహముంబోలు మేలైన శయనగృహమును జూచెను. ఆ శయనగృహమున నొక ప్రదేశమున నెత్తావి గుబాళించు పూలసరములచే సొంపుమీఱినదియు, చంద్రునిఁబోలునదియునైన తెల్లనిగొడుగును జూచెను. మఱియు హనుమంతుఁడు సువర్ణమయమయినందున నగ్నిహోత్రునిమాడ్కి వెలుఁగునదియు, అశోకపుష్పమాలికలచే విస్తారముగా నలంకరింపఁబడినదియు, రాక్షసకాంతలు వింజామరములు చేతఁబట్టి యంతట వీచుచుండఁగా, పలుతెఱఁగుల చందనముల సువాసనలు గమగమయని పర్వుచుండఁగా, అగురుధూపముల వాసనలెల్లకడల నెసఁగుచుండఁగా, విలువగల పఱపును, దానిపై కంబళ్లను పఱపఁబడియుండఁగా, సువాసనగల పూవులదండలంతటను, శోభను గలిగించుచుండఁగా నొప్పిన యారావణునిపాన్పును జూచినవాఁడయ్యెను.

ఆపాన్పునందు నల్లనిమబ్బుచాయగలవాఁడును, నిగనిగ మెఱయు మేటియంటుజోళ్లు దాల్చినవాఁడును, ఎఱ్ఱనికన్నులుగలవాఁడును, నిడుపుచేతులవాఁడును, పసిఁడిబట్టగట్టినవాఁడును, పరిమళవంతమైన యెఱ్ఱని గంధము నలఁదికొన్నవాఁడునునైనందున సంధ్యాకాలపు మెఱుపు గ్రమ్మియుండ మెఱుపులు మిఱుమిట్లు గొల్పుచుండు నాకాశమున వెలుఁగుచుండు నల్లమబ్బువలె నుండువాఁడును, దివ్యభూషణములఁ దాల్చినవాఁడును, కామరూపుఁడు గనుక రాక్షసరూపుఁడయినను

జూడఁదగినరూపముఁదాల్చినవాఁడును పువ్వులతోఁగూడిన చెట్లుగల వనములతోను, పొదలతోను గూడిన మందరపర్వతమువలె నుండు వాఁడును, రాత్రులందు కేళిసల్పి యలసినవాఁడును, రాక్షసకాంతలకుఁ బ్రియుఁడును, రాక్షసులకుఁ గోరినవి యొసఁగిసుఖము గలిగించు వాఁడును, మద్యముత్రావి మైమఱచి నిద్రించుచుండువాఁడును నైన రావణాసురుని మారుతి చూచెను.

అంతట హనుమంతుఁడు వెలుఁగుచుండెడి యాపాన్పునందు నొడలు తెలియనట్లు నిద్రించుచు, ఏనుఁగువలె బుసకొట్టుచున్న యారావణునిఁజేరి, "యితఁడు పాపాత్ముఁడు. రాముని దేవి యగు సీత నపహరించినవాఁడు. ఈతనిం జేరరా" దని యెంచి, మిక్కిలి వెఱచిన వాఁడువలె నచ్చోటినుండి కొంచెము దూరమునకుఁ బోయెను. అట్లు వెనుకకుఁ గొంతదూరముపోయి, యచ్చటి యొక మెట్టుమీఁదుగా మఱియొకతిన్నె మీఁది కుఱికి నిద్రించుచున్న యట్టిరావణుని బాగుగాఁ జూచినవాఁడయ్యెను.

దివ్యగంధమాల్యాభరణాంబరధరుఁడగు రావణుఁడు శయనించిన యాపాన్పు, మదజలంబుగార్చెడి యేనుఁగు ప్రవేశించిన సెలయేటి ప్రవాహము చందమున వెలుఁగుచుండెను.

అప్పుడు రావణుఁడు బంగారు భుజకీర్తులుగలవియు, నింద్రుని ధనుస్సును బోలినవి, యింద్రుని వెల్లయేనుఁగుతోడిపోరాటములందు దానికొమ్ముల కొనలపోటుపులచేఁ దగిలినగాయములు గలిగినవియు,వజ్రా యుధముచేఁ గీచఁబడిన బలిసిన భుజ శిరస్సులుగలవి, విష్ణుచక్రపుదెబ్బ లచే గాయములు గలవియు, లావుగలవియు, ఎచ్చుతక్కువలు లేని మూఁపులుగలవియు, బలిమితోఁగూడినవియు, శుభలక్షణములుగల గోళ్లను బొటనవ్రేళ్లను గలవియు, చక్కనివ్రేళ్లను, అఱచేయియుఁ గలవియు, చక్కఁగాఁగదిసినవియు, గడియమ్రానులంబోలినవియు, యేనుఁగుతొండములవలె గుండ్రనివియు, కుందేటిరక్తముతో సమా నమై మిక్కిలిచల్లని నెత్తావి గుబాళించు మేలిమియెఱ్ఱగంధముచేఁ బూయఁబడినవి, చక్కఁగా నలంకరింపఁబడినవియు, తెల్లనిపాన్పునందుఁ జాచఁబడియుండుటచే నైదుతలలపాములవలె నొప్పునవియు, చక్కని జవరాండ్రచేఁ బిసుకఁబడునవియు, చక్కనిగంధపుఁ బూఁతగలవియు,

యక్ష, పన్నగ, గంధర్వ, దేవ, దానవుల నేడిపించునవియు, మందర పర్వతమున నిద్రించుకోపముగల గొప్పపాములంబోలినవియునైన తన చేతులను మంచముమీఁదఁ జాచికొని పరుండియుండఁగా హనుమంతుం డట్టిరావణుని భుజములను జూచినవాఁడయ్యెను.

పర్వతోపముఁడయిన రాక్షసరాజగు రావణుఁడు సకలశుభ లక్షణములతోఁ గూడినవాఁడై రెండుశిఖరములతోఁగూడిన మందర పర్వతమువాడ్కిఁ బ్రకాశించెను. మఱియు మావి, సురపొన్న, పొగడపూవులతావివంటి తావిగలదియు, షడ్రసోపేతములయిన భక్ష్య భోజ్యాదులతావియు, మద్యగంధమునుగల గొప్పనిట్టూర్పు శయన గృహము నిండునట్లు రాక్షసరాజగు రావణుని గొప్పనోటినుండి వెలువడుచుండెను.

శిరస్సునందు కొంచెముజారిన ముత్యములుగూర్చిన బంగారు కిరీటమును, చెవులందు దివ్యములైన యంటుజోళ్లను, నిడుపువితెవియుఁ గలిగి బలిసియున్న ఱొమ్మునందెఱ్ఱనిచందనపుఁబూఁతయు, ముత్యాల హారమును, తెల్లనిపట్టు పచ్చడము, పచ్చనిమేలిమికట్టు పుట్టమును నలరారుచుండఁగా, మినుపరాశివలె నల్లనై పామువలె బుస కొట్టుచు, గంగానదీజలమునడుమ నిద్రించు నేనుఁగుంబోలినవాఁడును, మంచమునకు నలువైపులం దుంచఁబడిన నాలుగు బంగారుస్తంభముల దీపములకాంతిచే దేదీప్యమానముగ ప్రకాశించుచున్న దేహముగల వాఁడును, అన్నియంగములు దెలియునట్లు వెలికిలఁ బరుండియుండు వాఁడును, మెఱుఁగులతోఁగూడిన మేఘమువంటివాఁడునగు రావణునిఁ జూచినపదంపడి, ఆబలవంతుఁడగు రావణునిపాదములకడఁ బరుండి యున్న యాతనిప్రేమంపుఁబెండ్లాలను హావని చూచినవాఁడయ్యెను.

అచ్చటఁ జంద్రునివలె వెలుఁగు నందమయిన మోములుగల వారును, చక్కనికుండలములను దాల్చినవారును, వాడనిపూవులసరము లును, తొడవులును ధరించినవారును, ఆటపాటలందును, వీణె మొదలగు వాద్యములు వాయించుటందును జాణలునైన జవరాండ్రను, రావణునిఁ గౌఁగిలించి నిద్రించుచుండు దేవకన్యకలను అచ్చటిస్త్రీలు చెవులకొన లందుఁ దాల్చియుండు కెంపులు, రవలుచెక్కిన పసిఁడికమ్మలను, భుజము లందుఁ దేజరిల్లు బాహుపురులను మారుతి చూచెను. అపుష్పక

విమానము చక్కనికుండలములు దాల్చిన యాకాంతలయొక్క చంద్రుని బోలు మోములవెలుఁగులుగల దగుటచే నక్షత్రగణములతోఁగూడిః యాకాశముమాడ్కి వెలుఁగుచుండెను.

ఆరావణుని పత్నులగు మేటిజవ్వనులందఱు యావనమదమువలః నొనర్చిన సంభోగవ్యాపారములచే నలసినవారలై యచ్చటచ్చటఁ నిద్రించుచుండిరి. నృత్తమునందు నేర్పుగలయొకచామ యెక్కువవాఁడుః వలనఁ నృత్యకాలమునందువలెనే కరచరణాద్యవయముల పొంకముతో బాన్పుమీఁద దేహమునుంచి యొకమూల నిద్రించుచుండెను. మఱి యొకభామ వీణెనుగౌఁగిలించి నిద్రించుటచే, నదీవేగమునకుఁ గొట్టి కొనివచ్చి యోడకుఁదగులుకొన్న తామరతీఁగవలెఁ బ్రకాశించు చుండెను. మఱియొకతె మడ్డుకమను వాద్యమును జంకఁబెట్టుకొని నిద్రించుటచేతఁ బసిబిడ్డను బ్రేమతోనః జంకనెత్తుకొనియె నిద్రించిన కాంతవలెఁ గానఁబడెను. చక్కని స్తనములు మొదలగు నంగములుగల యొకానొకజవ్వని పటహమనువాద్యమును గౌఁగిలించుకొని నిద్రింపఁగా, చిరకాలమునకు వచ్చిన భర్తను బ్రేమమీఱఁ గౌఁగిలించికొని నిద్రించిన కాంతవలె నుండెను. ఒకానొక స్త్రీ పిల్లన గ్రోవిని గౌగిలించుకొని నిద్రిం చుటచేత, నేకతమున మగనిని గామముదీఱఁ గౌఁగిలించికొనినట్టి స్త్రీవలె నొప్పియుండెను. నృత్యమునందు నేర్పుగల యొకవనిత వీణెను పట్టుకొని నిద్రింపఁగా, మగనితోడ నిద్రించినస్త్రీవలె నొప్పారెను. యావనమదముచే నెఱ్ఱకన్నులుగల యొకనాఁతి మద్దెల వాయించు చుండి దానినట్లే ప్రక్కనఁబెట్టికొని, మెత్తనివి, బలిసినవి, పసిఁడివన్నె గలవియుఁ గనుక మనోహరములై యుండు నంగములతో నామద్దెలను గట్టుకొని నిద్రించుచుండెను. చక్కని లక్షణములును సన్ననినడుమును గల యొకకాంత మదమువలనిసురతశ్రమముచే నలసినదై, భుజపార్శ్వ ప్రదేశములకుఁ దగులునట్లు చంకలో పణవమను వాద్యమును బెట్టి కొనియె నిద్రించెను. మఱొక్కకాంత ఒకడిండిమమును బట్టుకొని, మఱియొక్క డిండిమము చంకలోఁబెట్టుకొని నిద్రించుటచేత మగనిని గౌఁగిలించుకొని బిడ్డను చంకలోఁబెట్టికొని నిద్రించిన స్త్రీవలెఁగానఁ బడెను. తామరపువ్వుల ఱేకులఁబోలు కన్నులుగల యొకచెలువ మద్య మదముచే నొడలుమఱచినదై, ఆడంబరమనువాద్యమును రెండుచేతుల

నడుమ నుంచికొని పరుండినట్లు కాన్పించెను. రావణునికి గిండిచెంబు నిచ్చు మఱియొయతివ యాగిండిచెంబును తల క్రిందుగఁ బట్టికొనినందున నాజలము మీఁదఁ బడుటవలనఁ దడిసినదై, వసంతర్తువున నొడలు నెండకువాడకుండునట్లు నీళ్లుచల్లఁబడిన చిత్రవర్ణంపు బూవులదండవలె విరాజిల్లెను. ఒకానొకయువతి బంగారుగిండ్లనుబోలు స్తనములమీఁదఁ జేతులుంచుకొని, నిద్రచే నొడలుమఱచినదై నిద్రించెను. పద్మపత్రములం బోలు కన్నులును, పున్నమచందురుంబోలు మోమునుంగల యొకకాంత యౌవనగర్వముచే మైమఱచి, మఱియొక్క సుంద్రని పిఱుఁదులుగల కాంతను పురుషుఁడను భ్రమచేఁ గౌఁగిలించుకొని నిద్రించెను. కామము గలకాంతలు తమప్రియులను దమకుచములుదగులునట్లు బిగియఁగౌఁగి లించికొనుచందంబున మఱియు ననేకసుందరాంగులైన స్త్రీలు నానా విధవాద్యములను గౌఁగిలించికొని నిద్రించిరి. ఆస్త్రీలపాన్పులకుఁ గొంత సమీపమున నుత్తమమైన యాస్తరణమునఁ బవ్వళించియున్న రూపవతి యగు నొక్కసుందరాంగిని హనుమంతుఁడు చూచెను.

సుందరాంగియు, ముత్యాలు రత్నములుచెక్కిన భూషణముల ధరించినదియై తనసొమ్ముల మెఱుంగులచే నాదివ్యగృహమును దేజరిల్లు నట్లు చేయునదియు, పసిఁడివలెఁ బసిమివన్నెగలదియు చూడఁదగినదియు, అంతఃపురంపురాణియునైన మందోదరి యొకపఱుపునఁబరుండి యుండె. హనుమంతుఁ డా మందోదరిని జూచి, రూపలావణ్యాతిశయముచే సీతయె యది యనుకొని నెక్కువముదముతోఁ గూడినవాఁడై తనకోఁతి స్వభావముఁజూపుచుఁ జేతులు దట్టెను. తోఁకముద్దుపెట్టుకొనెను; పాంగెను; ఇటటు తిరిగెను. కిలకిలారవములుచేసెను; పరుగెత్తెను; కంబము లెక్కెను; అచ్చటినుండి క్రిందఁబడ్డెను. ఇట్లు మారుతి పెక్కు కోఁతిచేష్టలు చేసిన వాఁడయ్యెను.

## 11-వ సర్గము

### హనుమంతుఁడు రాక్షస స్త్రీలను గాంచుట

హనుమంతుఁడా మంద్రోదరిం జూచి, మొదటఁ గోఁతిస్వభావము వలన నామె సీతయనిరియెంచి సంతోషించినను, బిదప నాబుద్ధిని వదలి నెమ్మదినొందినవాఁడై, యాసీతాదేవిని గూర్చి వేఱొకచింత నొందెను.

"పతివ్రతయగు నాసీత రాము నెడఁబాసి యివ్విధమున నిద్రింపఁ జాలదు. ఆసీత రామునిఁబాసి, మఱొక్కనిఁ బొందుటకును, అలంకారములు చేసికొనుటకును, పానముసేయుటకును నియ్యకొనదు. ఆసీత రామునికంటె నితరుని దేవేంద్రునివంటివానినైననుగోరదు. మానవులలోనేకాక, వేల్పులయందైనను రాముని కెనవచ్చువాఁడు లేఁడు. కావున నిది యెంతమాత్రము సీతగాదు మఱియొకతె" యని తలఁచి పావని పానశాలయందంతట సీతను వెదకుచుఁ దిరిగెను.

ఆపానశాలయందు కొందఱు రతిక్రీడలచే డస్సిరి. కొందఱు పాటలచే నలసటనొందిరి. కొందఱు స్త్రీలు నాట్యములచే శ్రమపడిరి. కొంద ఱతివలు పానమదముచే మైమఱచి మురజములు, మృదంగములు, పీటలు, మేలిమి యాసనములు మొదలగువాని నాశ్రయించి నిద్రించుచుండిరి. కపీంద్రుఁడు చక్కనిరూపములుదాల్చి, ముచ్చటలాడుచు, సమయోచితముగా భరతశాస్త్రార్థమును వివరించువారయి దేశకాలములను గనిపెట్టి, పొందికగల మాటలను మాటలాడుచునుండు పెక్కండ్రుకాంతలతోఁగూడి బాహ్యాభ్యంతరసుఖముల ననుభవించి నిద్రించుచుండు రావణునిఁ జూచినవాఁడయ్యెను. నిడివిచేతులు గలవాఁడయిన రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడు గొప్పయాలనడుమనుండు నాఁబోతువలెను, అరణ్యమున నాఁడేనుఁగులచేతఁ జుట్టఁబడిన గజేంద్రునికైవడియుఁ బ్రకాశించెను.

హనుమంతుఁ డట్లు శయనమందిరమునఁ బరుండియున్న రావణుని, అతనిపత్నులను జూచిన తరువాత, కోరినవస్తువులతో నిండినదియగు నారాక్షసేంద్రుని భవనమునందలి పానశాలను జూచెను. అచ్చట జింకలు, దున్నలు, వరాహములు, నెమళ్లు, కోళ్లు, మేకలు, కొక్కెరలు, మత్స్యవిశేషములు మొదలగు మృగములమాంసములు ముక్కలు ముక్కలుగాఁగోసి, పెరుగుతోఁగలిపి, ఉప్పువేసి ఇంగువ మొదలగు సంభారములతోఁ బక్వమయి, వెడల్పుబంగారు పళ్లెరములందు సగము సగముతిని యుంపఁబడియుండుటనుజూచెను. మఱియుఁ బులుసు, ఉప్పు, కారము మొదలగు సంభారములుచేర్చి, శర్కర, తేనె, దానిమ్మపండ్లు, మొదలగు మధురపదార్థములతోఁ బక్వముచేసిన పర్బత్తులు లేహ్యములుననెడి పదార్థములు పసిఁడిపాత్రములందు సగము దిని పాఱవేయఁ

బడియుండుటను జూచెను. అచ్చటనే కొందఱుస్త్రీల ముత్యాలహార ములు, అందెలు, బాహుపురులు నూడఁదీసి పారవేయఁబడియుండెను. పానపాత్రములందు సగముసగము తిన్న పెక్కుపండ్లును, కట్టఁబడిన పుష్పహారములును పానశాలకు మిక్కిలి మెఱుఁగుఁదెచ్చుచుండెను.

ఆపానశాలయం దచ్చటచ్చట పొందికసమర్చియుంచఁబడిన మంచ ములును, పెక్కువిధములుగా నేర్పరులగు వంటవారిచే బెక్కుసంభా రములతోఁ బక్వముచేసి, వెవ్వేలుగాఁ బాత్రలలో నుంచఁబడిన నంజు ళ్లను గలదయి, యాపానభూమి నిప్పులేకయే మండుచున్నట్లు కనఁ బడెను.

ఆపానభూమియందు సముద్రమథనకాలమునఁ బుట్టిన వారుణీ జాతీయములగు నకృత్రిమమద్యములును, కృత్రిమములైన నారికేళాది మద్యములును, చక్కెర, పూఁదేనె, పండ్లరసము మొదలగు వస్తువులచేఁ బక్వముచేయఁబడిన మద్యములును, నానావిధములగు సువాసనపొళ్లతోఁ జేర్చి వెవ్వేలుగా సిద్ధముచేయఁబడి యుండెను. ఆపానశాల యట్టిమద్య ములును, పలుతెఱఁగులైన పువ్వులసరములును, బంగారుతోడను, స్ఫటి కములతోడను జంబూనదియందుఁ బుట్టిన యపరంజితోను జేయఁబడిన యనేకములగు గిండ్లును విస్తారముగాఁ గలదియగుటచే మఱింత శోభా యమానమై యుండెను.

మఱియు హనుమంతుఁడు వెండిబంగారులతోను రత్నముల తోను నిర్మితములగు పాత్రలందు నిండియున్న మద్యములను, ఒకచోట సగము త్రాగియుంచఁబడియున్న పానపాత్రములను, మఱియొక్కచోఁ బూర్తిగాఁ ద్రాగియుంచఁబడిన యుత్తమపానపాత్రలను, వేఱొక్కచోట నేమియుఁద్రాగకయే యుంచఁబడియుండు పానపాత్రలను జూచెను.

హనుమంతుఁడు కొన్నిచోట్ల నానావిధములగు భక్ష్యములను, కొన్నిచోట్లఁ గొంచెముకొంచెముగా నుంపఁబడియుండు పానీయము లను, కొన్నిచోట్ల నన్నముల మిగతభాగములను, కొన్నిచోట్లఁ బగిలి పోయిన గిండ్లను, కొన్నిప్రదేశములందుఁ గలియఁబెట్టఁబడిన కుండలను, కొన్నిప్రదేశములందు నలిగిన పూవులదండలను, కొన్నిప్రదేశములందు నీటికిన్నిబండ్లను, మేటిపెలువలువపఱచిన స్త్రీలపాన్పులను జూచెను. అచ్చట కొందఱు వనిత లొండొరులను గౌఁగిలించుకొని నిద్రించిరి. కొందఱు

కాంతలు నిద్రించుచుండు మఱియొక్కదాని వస్త్రమును దామీఁదఁ గప్పుకొని నిద్రించిరి.

ఆస్త్రీలు గట్టినకోకలును, దాల్చినపూలదండలును అచేతనము లయ్యును, చేతనవస్తువులు తిన్ననిగాలి ననుభవించి యాసుఖాతిశయముచే నిశ్చలముగనున్నట్లు కదలకయుండెను. ఆపుష్పకవిమానమునందలి మందమారుతము చల్లనిచందనముయొక్కయు, మద్యముయొక్కయు, పూఁదేనెయొక్కయు నానావిధపుష్పమాలలయొక్కయు, నానావిధ ధూపములయొక్కయుఁ బలుతెఱఁగుల నెత్తావిని మోసికొనుచు, రస గంధధూపములపరిమళముచే మఱింత వృద్ధినొందినదై, యా పుష్పక విమానము వ్యాపించెను.

ఆ శయనగృహమునఁ బాండురశ్యామదేహకాంతిగల కొంద ఱుత్తమస్త్రీలును, కొందఱు పసిఁడిడాలుగల మేనుగల జవరాండ్రును నిద్రించుచుండిరి. నిద్రపోవునపుడు సైత మాస్త్రీలయొక్క శరీరములు మన్మథవికారహేతుకసంభోగముచే డస్సినవై తామరతీఁగలవలె రమ్యముగ నుండెను. అట్లు మహాతేజుఁడగు వానరేంద్రుఁ డిత్తెఱఁ గున రావణుని యంతఃపురమునెల్లఁ గలయంజూచెను గాని సీతాదేవిని మాత్రము చూడఁడయ్యెను. ఆమహావీరుఁడగు హనుమంతుఁ డాస్త్రీల నందఱను జూచి ధర్మలోపమువలనిభీతిచే నిట్లు చింతను బొందెను: "ఇట్లు నేను గాఢనిద్రచెందియుండు పరకాంతలను గాంచితిని. ఈ విధ మునఁ బరస్త్రీలనుజూచుట నాకు మిక్కిలి ధర్మలోపమును గలిగింపఁ గలదు. నాచూపు పరస్త్రీలమీఁద వ్యాపించునదిగాదు. అయిన నిచ్చట నా కీపరదారావలోకమనెడి మహాదోషము గలిగెను. అక్కటా! నేనెంతపాపము చేసితిని!" అని యిట్లు మనస్సునఁ జింతించెను.

ధైర్యవంతుఁడయిన యాహనుమంతుఁ డిట్లు కొంతతడవు చిం తించి, పిమ్మట నొక్కవిధమున మనసును ఊఱడించేసికొని, కార్యనిర్ణ యముఁ దెలుపు నొకతీరు బుద్ధిని దలపెట్టెను:—"ఏను రావణునియందుఁ బ్రేమగలయాతని భార్యల నందఱిని జూచినది వాస్తవమే. అయినను, నామనసునఁ గించిత్తైనను వికారముగలుగలేదు. మంచిపనులందును చెడ్డపనులందును ఇంద్రియములయన్నిటిప్రవృత్తికి మనసే హేతువు గదా. అట్టి నామనసేమో నిశ్చలముగానున్నది. సీతను నేను వెదకు

స్థలమున వెదకుటకు వీలుగాదుగదా. స్త్రీలను వెదకవలసినదిగానుండిన, స్త్రీలయందేగదా వెదకవలయును. ఏజంతువునకు నేదిజాతియో, యాజాతియందె దానిని జనులువెదకుదురు. కనఁబడకపోయిన జవ రాలిని లేళ్లగుంపునందు వెదకుటయెట్లు? కావున నీరావణునియంతః పురమెల్ల నిశ్చలమైనమనస్సుతో వెదకితినికాని, సీతాదేవిమాత్రము గనఁబడలేదు” అనితలఁచినవాఁడై, వీరుఁడగు హనుమంతుఁడు దేవ గంధర్వనాగకన్యలను జూచెనేకాని, సీతాదేవిని జూడఁడాయెను.

అప్పుడు శూరుఁడయిన కలిమిగల వానరవీరుఁడు సీతను జూడక, యన్యస్త్రీలను జూచుచు నచటినుండి తొలఁగిపోయి, మిక్కిలి చింతించి, మఱల ధైర్యమునొందినవాఁడై పానశాలను వదలి సీతను వెదకుటకు బయలువెడలెను.

## 12-వ సర్గము

### హనుమంతుఁడు సీతను జూడక వగచుట

హనుమంతుఁడు సీతనుజూడఁ దమితో నారావణుని శయన గృహమధ్యమునఁ దీఁగెయిండ్లను, చిత్రగృహములను రాత్రులందుండఁ దగిన గృహములను జొచ్చి వెదకెనుగాని, చక్కని చూడ్కిగల యాసీతాదేవిమాత్రము గనఁబడదాయెను. అట్లు రఘునందనుని ప్రియ పత్నిని సీతాదేవిని వెదకియుఁ గానక మారుతనందనుఁ డిట్లు చింతింపఁ దొడఁగెను:

“సీతాదేవి తప్పక మృతినొందియుండును. కావుననే నేనెంత వెదకినను, నాకుఁ గానరాకున్నది. సీతాదేవి పాతివ్రత్యమహిమము గాపాడుకొనఁ బట్టుపట్టినదై గొప్పదైన సన్మార్గము దప్పకుండఁగా, నీ కడుదుష్టుఁడయిన రావణుఁ డా దేవిని కుత్తుకనులిమి చంపియుం డును. లేదా, హెచ్చుతక్కువరూపమును, వికృతవేషమును, వెడద మోమును, నిడుపువెట్టిచూపులుగల తేజోహీనులగు నీ రాక్షస కాం తలనుజూచి భయపడి జనకరాజపుత్రి మృతినొందియుండును.

నేను సీతనుజూడక, శత్రువులపయమునఁ బరాక్రమము చూపక, బహుకాలము వానరులతోడఁ బ్రొద్దువుచ్చిన నాకు, ఇఁక సుగ్రీవునికడకుఁ బోవలసినయాశ లేదు. అతఁడు కఠినముగా దండన

సేయువాఁడు ; బలవంతుఁడు. అతని నెదిరింప నెవరికిని వీలుకా
అంతఃపుర మెల్లఁ జూచితిని. రావణుని రాక్షస భార్యలను జూచిత
పతివ్రతయగు సీత గానరాదు. నేఁబడిన శ్రమయెల్ల వమ్మయ్యె
నేనిచ్చటినుండి మఱలి సముద్రమును దాఁటఁగా వానరులందఱు గు
గూడి వచ్చి నన్నేమడుగుదురు? "ఓ వీరుఁడా! ఆలంకకుఁబోయి యే
చేసికొనివచ్చితి" వని యడుగుదురు. నే నిచ్చట సీతను గానక యే
బదులు సెప్పుదును. గడువుమీఱుటచేత వారందఱు నిక్కముగ
ప్రాయోపవేశము చేయఁగలరు. వృద్ధుఁడైన జాంబవంతుఁడును, అం
దుఁడును తక్కినవానరులును సముద్రమును దాఁటిన నన్నుఁ జుట్టుకొ
యేమిచేసితివని యడుగుదురు. వారికి నేనేమిచెప్పుదును? ఉత్సా
హామే సంపదకు మొదటికారణము. ఉత్సాహామే పరమసుఖదవ
ఉత్సాహామే యన్నిపనులకు సాధనము. ఆయుత్సాహామే యాం
జంతువుయొక్క కర్మఫలమును సిద్ధింపఁజేయును. కనుక ఉత్సా
ముతోఁ జేసినకార్యమే శ్రేష్ఠము. కావున నేను మఱల వెదలి రావణ
డేలెడు ప్రదేశముల నెల్ల వెదకెదను. చలిపందిళ్లను, పూవులగృహా
లను చిత్రశాలలను, క్రీడాగృహములను, ఇంటితోఁటల నడుమనుం
వీథులను, పెక్కువిమానములను, విచిత్రగృహములను, ఆటయిండ్ల
మఱల వెదకెదను."

హానుమంతుఁ డిట్లెంచుకొని నాలోచించి, మఱల భూమిలోఁ
గృహములందును, నాలుగుత్రోవలుగలియుచోట్లనుండు మండపా
లందును, ఇండ్లకుదూరమున స్వేచ్ఛావిహారమునిమిత్తముగట్టియుం
గృహములందును వెదకఁబూనినవాఁడై, యెత్తుగానుండుతావు
నెక్కుచు, అచ్చటినుండి దిగుచు, మాటిమాటికి నిలఁబడుచు మర
బోవుచు, ద్వారములను దెఱచుచుఁ, దలుపులను బగులఁగొట్టుచు, నిం
లోపలఁ జొచ్చుచు, వానినుండి వెలుపలికి వచ్చుచు, భూబిలగృహము
లోపల దిగుచు మఱల వానినుండి పైకెక్కివచ్చుచు నిట్లెంచుకొ
నా ప్రదేశమంతయు వెదకినవాఁడయ్యెను. రావణునియంతఃపురము
హానుమంతుఁడు వెదకనితావు నాలుగంగుళములంతదైనను లేద
హానుమంతుఁడు ప్రాకారములోపల నున్న మంత్రికుమారులు మొ

లగు వారుండెడి వీథులును, రచ్చచెట్ల కాధారములుగా నుండెడి తిన్నెలును, నడబావులును, తామరకొలఁకులును గలయఁజూచెను.

పలుపలురూపములుగల విరూపలయిన వికృతంపు రాక్షసస్త్రీలతనికిఁ గనఁబడిరేకాని యాజానకి గనఁబడదయ్యె. లోకమున సాటిలేని సౌందర్యముగల చక్కనైన విద్యాధరకాంతలు పెక్కండ్రచ్చటఁ గనఁబడిరేకాని రాముని ప్రియురాలు దృష్టిగోచరము గాదయ్యె. రావణునిఁ జెండ్లాడిన పున్నమచందురునిఁ బోలు మోములుగల నాకలోక స్త్రీలును, రావణుఁడు బలాత్కారముగాఁ దెచ్చిన నాగకాంతలును అచ్చట పెక్కండ్రు గానవచ్చిరేకాని, జనకనందిని మాత్రము గనఁబడదయ్యె.

నిడుదచేతులవాఁడైన మారుతసూనుఁడగు హనుమంతుఁడా సీతను గానక తక్కిన చక్కని పడుచుల నందఱిని జూచి, పలుమఱు వగచి, వానరేంద్రులు సీతాన్వేషణమునకై చేసిన ప్రయత్నమును, తాను సముద్రమును దాఁటినదియు నిరుపయోగ మాయెనని యోచించి, మఱల వగఁగూరి, విమానమునుండి డిగ్గి, శోకముచే మనమున నేమియుఁ దోఁచనివాఁడై, మఱల వగపాలై యుండెను.

## 13-వ సర్గము

### హనుమంతుఁడు విచారపడుట

వడిగల హనుమంతుఁడు తానింతకు మున్నెక్కియున్న విమానమునుండి యట్లు దిగి, ఇంద్రనీలమణులు చెక్కిన ప్రాకారమును దాఁటి, మేఘమధ్యమునవున్న మెఱుపుకైవడి వెలుఁగుచు, రావణునిగృహము విడిచివచ్చి, జనకరాజపుత్రియగు సీతను గానక తనలోఁదానిట్లు యోచింపఁదొడంగెను.

"నేను రామునికి ప్రియము చేయఁగోరి, యీ లంకాపట్టణమెల్లఁ బలుమాఱు గాలించితిని. చక్కని యన్ని యవయవములుగలదగు సీత నాకగపడలేదు. ఈలంకాపురమునందలి గుంటలును, చెఱువులును, కొలఁకులును, చిన్నకాలువలును, నదులును, జలప్రాయములైన వనప్రదేశములును, దుర్గములును, పర్వతములును, భూమియెల్లను వెదకితిని. సీతమాత్రము గానరాదు. గృధ్రలనాయకుఁడగు సంపాతియు,

సీత రావణుని యింటనున్న దని వక్కాణించెను. ఇచ్చట సీతగాన రాదు. సీతయు (అయోనిజ), విదేహదేశాధీశునికుమారి, సుజనుల కునికియగు మిథిలానగరనాయకుని కూతురు; జ్ఞానవంతులలోఁ బ్రసిద్ధుఁడైన జనకమహారాజునకుఁ బుత్త్రిక. ఇట్టి సుగుణగణవిశిష్టురాలగు సీత చేయునది లేక యారావణునికి లొంగినదై యారావణునిఁ బ్రేమతోఁ జేరియుండునా? ఎంతమాత్రము చేరియుండదు. రావణుఁడు సీత నెత్తికొన్నవాఁడై రాముని బాణములకు వెఱచి, వేగముతో నెగిరివచ్చునప్పుడు త్రోవలో జారిపడియుండవలెను. లేదా, సిద్ధులు దిరిగెడి యాకాశమార్గమున రావణుండు తన్నెత్తికొనిపోవుచుండఁగా, సీత సముద్రమును జూచి మనసునదిగులుపడి దానియందు గూలినదేమో? లేదా, రావణుని మిక్కుటమైన వేగముచేతను, వానిచేతులనడుమ నలుఁగుటచేతను నావెడదకన్నులదగు పూజ్యురాలయిన రామునిపత్ని ప్రాణములఁ బాసియుండవలెను. అటుకాదేని, రావణుఁడు సముద్రమును బైపైననే దాఁటుచుఁ బోవుచుండఁగా, నప్పుడు జానకి పొఱలి సముద్రమునఁ బడిపోయియుండవలెను. ఇది నిక్కము. అట్లు కాకపోయిన, సీత తననడవడిని గాపాడఁగోరి రావణుని కెడమీయకుండఁగా నప్పుడు రావణుఁడు సీతపైఁ గోపపడి దిక్కులేని యామెను మ్రింగెనేమో. అక్కటా! యీరావణుఁడెంతకటికివాఁడు! అట్లుకాదేని, నల్లనికన్నులు గల యా పతివ్రతయగు సీతను రావణునిభార్యలు తమకు సవతిపోరొక్కటి గలిగెనన్న తలంపుతో మ్రింగియుందురు. లేదా, నిండుచందురునిఁబోలునదియు, కమలపత్త్రములవంటి నేత్త్రములుగలదియు నైన రామునిముఖమునే ధ్యానించుచు, నాచింతచే నాదేవి ప్రాణములఁ దొఱఁగినదైన నుండవలెను. లేదా, "హారామా! హాలక్ష్మణా! అయోధ్యా! అయోధ్యాపురమా!" యని పలుతెఱఁగుల విలపించి జీవితముఁ దొఱఁగి యుండవలెను. అట్లుకాదేని, రావణుని యంతర్గృహముననే యుంచఁబడినదై, పంజరమున నుంచఁబడిన యాఁడు గోరువంకవలె విలపించుచున్నదేమో? ఇదియొకవేళ వాస్తవముగా నుండవచ్చును. అంతియకాని బ్రహ్మజ్ఞానియగు జనకమహారాజుకూఁతురు, అయోనిజ, పరాక్రమశాలియు జనరంజకుఁడునైన రామునికి భార్య, కలువరేకులవంటి కన్నులుగలది, సన్నని నడుముగలది, ఉత్తమాంగన

యగునట్టి యారాముని దేవి యెన్నటికైన రావణుఁ గోరునా ? ఆతనికి లోఁబడునా ? ఆమె యాతనిఁ గోరదు. ఆతనికి లోఁబడను బడదు.

నాకేల యీవిచారము ? జానకి భూగృహాదులలో నుంచుటచేఁ గనఁబడ లేదో ? సముద్రమునఁబడి ప్రాణములఁ దొఱఁగినదేమో ? లేక రామునిఁదలఁచికొని మృతినొందినదేమో, రామునికి సీత ప్రాణసమాను రాలు. అట్టిరామునికి సీతవృత్తాంతము దెలుపకుండుట యుక్తము గాదు. సీతసంగతి దెలిపినను పాపము సంభవించును. వాస్తవము తెలుపకున్నను స్వామివంచనరూపమైన దోషము సంభవించును. ఇప్పు డెట్లు నేను చేయవలసినది ? అంతయు విరుద్ధముగానున్నది. ఇటువంటి కార్యములం దేది యుక్తముగా నుండును ? ఇప్పుడు నేను సీతను గానక వానరేంద్రునిపురమునకుఁ బోతినేని, నేనేమికార్యము సాధించి నట్లగును ? నేనీసముద్రమును దాఁటినదియు, లంకలోఁ బ్రవేశించి నదియు, రాక్షసస్త్రీలను గాంచుటయు నిష్ఫలమగును. నేను కిష్కింధకుఁ బోఁగానే, సుగ్రీవుఁడును, వానరులును, రామలక్ష్మణులును అందఱును గూడి నన్నేమి యడుగుదురు ? వారందఱు సీతయగపడినదా యని యడుగుదురు.

నేను కాకుత్స్థునికడకేగి, సీతను జూడలేదను కడు నప్రియమగు మాటను జెప్పితినేని, కర్ణకఠోరమును, భయంకరమును, ఉగ్రమును, అసహ్యమును, ఇంద్రియక్షోభకరమునైన యీవాక్యమును విన్న మాత్రముననే యీరాముఁడుండఁడు. రాముఁడు కష్టమునొంది మనస్సున మరణమునకు నిశ్చయింపఁగా, నారాము నెప్పుడును ఎడఁబాయకుండువాఁడును, బుద్ధిమంతుఁడునునైన లక్ష్మణుండు ప్రాణములతో నుండఁడు. అన్నలిద్దఱు మృతినొందిరన్న వార్తవినెనా, భరతుఁడును మృతినొందును. భరతుఁడు మృతినొందినచో శత్రుఘ్నుఁ డుండఁడు. తమపుత్రు లందఱు మృతినొందుటచూచి, వారితల్లు లుండరు. నెనరు గలవాఁడును, ఆడినమాట తప్పనివాఁడునైన వానరాధిపుఁడగు సుగ్రీవుఁడును తమప్రాణమిత్రుఁ డట్టిస్థితినొందుటచూచి, జీవితమును వదలును. సుగ్రీవుఁడు మృతినొందఁగా, నతనిభార్యయగురుమయు దుఃఖితయై, దీనతనొంది, సంతోషములేనిదై చిక్కి భర్తృవియోగవ్యసనముచే మరణమునొందఁగలదు. తార వాలిసుగ్రీవులవలని శోకము

చేతనే మొదలుచిక్కియున్నది. దానికిఁదోడుగా సుగ్రీవుఁడును మృతి నొందెనేని యామె బ్రతికియుండదు. తల్లిదండ్రులు పోవుటచేతను, పినతండ్రియైన సుగ్రీవుఁడు మృతినొందుటచేతను బాలుఁడైన యంగదుఁడెట్లు ప్రాణములతో నుండఁగలఁడు ? తక్కిన వానరులందఱు తమరాజు మృతినొందినతర్వాతఁ దమకేల ప్రాణము లని, పిడికిళ్ళతో నెత్తిని గ్రుద్దుకొనియు, అఱచేతులతో బాదుకొనియుఁ దలలుపగులఁగొట్టుకొనిచత్తురు. కీర్తిమంతుఁడయిన సుగ్రీవుఁడు తనపరిజనులను మంచిమాటలు చెప్పియు, కోరినవి యొసఁగియు, గౌరవమొనర్చియు నున్నాఁడు. అట్టి తమరాజు పోయినతరువాతఁ దమకేల బ్రతుకని, వారు తమ ప్రాణములను వదలఁగలరు. రాజమరణశోకముచేత వానరులు వనములందును, బర్వతములందును, ఇండ్లు మొదలగువానిచేఁ గప్పఁబడియుండు ప్రదేశములందును గూటములుకూడి విహరింపరు. ఇఁకేమి చేయుదురనిన, ఆలుబిడ్డలు పనివారు వీరితోఁగూడి పర్వతశిఖరములెక్కి యచ్చటినుండి పడి తమతలలు పగులఁగొట్టుకొందురు. లేదేని, యావానరులు విషము పుచ్చుకొనియో, ఉరివేసికొనియో, అగ్నిప్రవేశముచేసియో, ఒక్కప్రొద్దులుండియో, కత్తితోఁ గొంతుకోసికొనియో ప్రాణములఁ దొఱఁగుదురు.

కావున నేనిక్కడినుండి మఱలి కిష్కింధకుఁ బోయితినేని, భయంకరమైన గగ్గోలు పుట్టఁగలదు. ఇక్ష్వాకుకులమునకు, వానరకులమునకుం జేటుపుట్టఁగలదు. కావున నేనిచ్చటినుండి కిష్కింధకుఁ బోవనే పోవను. సీతను జూడక నేను సుగ్రీవునిఁ జూడఁజాలను. నేను కిష్కింధకు మఱలిపోక యిక్కడనేయుందునేని, ధర్మాత్ములును, మహారథులునయిన రామలక్ష్మణులు సీతవృత్తాంతము దెలియఁగలదన్న యాశచేఁ బ్రాణములతో నుండఁగలరు. వానరులును సంతసము గలిగియుందురు. నేను జానకిని జూడనేని, చేతఁ జిక్కినది, నోటిలోఁబడినది తినుచు, నియమము పట్టి, చెట్లమొదళ్లయందుఁబరుండి, నానావిధములగుకందమూలఫలములతోను, ఉదకముతోను సముద్రప్రాంతజలప్రాయభూములందు వానప్రస్థుఁడనై యుండెదను. చితిపేర్చి, యరణినుండి నిప్పుచిలికి దాని నాచితియందుంచి చక్కగాఁ బ్రజ్వరిల్లఁజేసి యందుఁ జొచ్చెదను. కాదేని, ప్రాయోపవేశముచేసి శరీరము విడుతును. కాకులు, కుక్కలు, నక్కలు నాకళేబరమును దినఁగలవు. "ఇది మహర్షులంగీకరించిన మరణము" అని

నాతలంపు. లేదా, లోఁతులోపలఁ బ్రవేశించెదను. మొదట లంకాధి దేవతయొక్క విజయముచేత మేలుగావించినదియు, సీతాదేవిని వెదకుట కనుకూలమైన వెన్నెలరాకచే మనస్సున కింపుగలిగించినదియు, సీతను వెదకుటకు సహాయపడినదియని జనులచే నెన్నఁబడు కీర్తియను పుష్ప మాలికగలదియు, హనుమంతుఁడు లంకను ప్రవేశించిన రాత్రియని ప్రసిద్ధిగన్నదియునైన యీదీర్ఘరాత్రి సీతాదర్శనముచేయని నా కిప్పడు వ్యర్థమాయెను. ఒకచెట్టుమొదటఁ గూర్చుండి, నిద్రాహారములు మాని, తపస్సుచేసికొనుచుండెదను. అంతియకాక, యిక్కడనుండి నేనెంత మాత్రము మఱలిపోవను. నేనిచ్చటినుండి సముద్రము దాఁటిపోతి నేని, అంగదుఁడును అతనితో వచ్చిన వానరులును ప్రాణములతో నుండరు. నేనింతసేపు ప్రాణములఁదొఱఁగవలయునని యెంచితిని. అది యుక్తము గాదు. వినాశమునందుఁ బెక్కుదోషములుగలవు. బ్రతికియుండిన మేలుపడయవచ్చును. కావునఁ బ్రాణములతోనుండెదను. ప్రాణము లతోనున్న మేలుపడయుట నిజము. అని యిత్తెఱఁగునఁ బలుతెగలఁ బొరలుచుండు దుఃఖమును మనసున నడఁచుకొని యాశోకమునకుఁ దుదిగానకుండి కొంతధైర్యము తెచ్చుకొని తనలోఁ దానిట్లని చింతింపఁ దొడఁగెను.

"బలవంతుఁడగు పదితలలవాఁడైన యారావణునిఁ బరిమార్చె దను. సీతాదేవిని వాఁడపహరించినాఁడని యెంచికొందము. దానిచే వానిమీఁదిపగ దీర్చుకొన్నట్టులగును. అటుగాదేని, రావణాసురు నెత్తికొని సముద్రమును దాఁటిపోయి, పరమశివునికి బలిపెట్టునట్టు లారామునిముందట నుంచెదను." అని యిట్లు హనుమంతుఁడు సీత యొక్క పోఁబడి తెలియమిచేఁ జింతను బొందినవాఁడై, యటుపిమ్మట నేమి చేయవలసినది యను పని తెఱఁగును, తీరనిదుఃఖమును మనస్సును గలఁతపెట్టుచుండఁగా మఱల నాలోచనచేయఁబూనెను.

"కీర్తిమతియగు రామునిపత్నిని సీతను గాంచువఱకు అంత నీలంకాపురమును మాటిమాటికి వెదకెదను. పోనిమ్ము, సంపాతి మాటనుబట్టి రామునిక్కడకుఁ దోడితెత్తమనిన, రాముఁడు సీత నిచ్చటఁ గాంచఁడేని, తనకు వట్టి ప్రయాసగలిగించినందుకు, వానరు లసత్యము చెప్పినందుకు నలిగినవాఁడై, వానరుల నంతఱను గాల్చివేయును.

కావున నే నిచ్చటనే యాహారమును వర్జించి యుండెదను. అట్లైనచో నానిమిత్తమై వానరు లందఱు మృతినొందక యుందురు. గొప్పవృక్షముల తోఁగూడిన యశోకవనము గన్పట్టుచున్నది. ఈ వనమునకుఁ బోయెదను. ఇచ్చట నేను సీతాదేవి నింకను వెదకలేదు.

"అష్టవసువులను, ఏకాదశ రుద్రులను, పన్నిద్దఱు ఆదిత్యులను, అశ్వినీదేవతలను, మరుత్తులనుగూర్చి నమస్కరించి, రాక్షసులకు శోకము పెంచువాఁడనై, రాక్షసుల నందఱిని సంహరించి, తపస్సు చేయువానికి భగవంతుఁ డిష్టార్థసిద్ధి నొసఁగుచందమున నేనును ప్రియాదర్శనము చేయఁగోరుచున్న రామునికి సీతాదేవి నెత్తుకొనిపోయి సమర్పించెదను." అని యిట్లు మారుతి మనసునఁ గలవరపాటు నొందినవాఁడై, కొంతతడవు చింతించి రామలక్ష్మణులకును, సీతాదేవికిని, రుద్రేంద్రయమవాయుదేవతలకును, సూర్యచంద్రాదిదేవతల కందఱకును, సుగ్రీవునికిని మ్రొక్కి, ధైర్యమువూని యచ్చటినుండి లేచి, మనసుచే నశోకవనమును బొందినట్లే తలఁచి, యావలికార్యముంగూర్చి యిట్లు చింతించెను.

"ఈ యశోకవనమెన్న రానిది, సకలవిధములైన సంస్కారములతో నొప్పారుచున్నది, రాక్షసులచే నిండినది, కాననములచేఁ జుట్టఁబడినదియుగా నుండఁగలదు. రావణునిచే నియమింపఁబడిన రాక్షసులు పెక్కండ్రక్కడిచెట్లకుఁ గాపలియుందురు. అందఱియందునుండునట్టి దృష్టిగోచరుఁడుగాని వాయుదేవుఁడుగూడ నచ్చట మిక్కిలి గట్టిగా వీవఁడు. రామునికొఱకును (సీతాన్వేషణముకొఱకును) రావణునికొఱకును (రావణుని కగపడకుండుటకొఱకును) నేను నాదేహమును సంకోచపఱచితిని. ఈసీతాన్వేషణరూపకార్యమున దేవతలును, ఋషులును నాపని కానుకూల్యము గావింపఁగలరు. తనంతఁ బుట్టినవాఁడును, త్రికాలజ్ఞుఁడునునైన బ్రహ్మయు, అగ్ని, వాయువు, వజ్రాయుధధారియగు దేవేంద్రుఁడును, పాశముదాల్చినవాఁడగు వరుణుఁడును, సూర్యచంద్రులును, మహాత్ములగు నశ్వినీదేవతలును, ఏడ్వురుమరుత్తులును, శంకరుఁడును, సకలభూతములును, సకలభూతేశుఁడును, మఱియు నాకంటికిఁ గనఁబడకయుండు దేవతలును నాకార్యమునకు సిద్ధినొసఁగుదురుగాక! ఉన్నతమైన ముక్కును, తెల్లని దంతములును

గలదియు ఒచ్చెము లేనిదియు, తెల్లనిచిఱునవ్వుతోఁగూడినదియు, పద్మ పత్రములఁబోలు మోముగలదియు, నిర్మలుఁడైన శరత్కాలచంద్రునితో సమానమయినదియునైన యా రాముని దేవియొక్క మోము నెప్పుడు చూడఁగలను? నీచుఁడును, పాపాత్ముఁడును, చేయరానికట్టి పనులు చేయువాఁడును, మహాభయంకరవేషముఁదాల్చిన వాఁడునైన రావణుఁడు బలాత్కారముతోఁ దెచ్చిన జాలిదలఁపఁదగిన యా రాముని దేవి నాకిప్పుడెట్లు కంటికగపడఁగల? దని యివ్విధమున హనుమంతుఁడు దేవతానమస్కారముచేసి సీతాదర్శనముం గూర్చి విచారపడినవాఁడాయెను.

## 14-వ సర్గము

హనుమంతుఁ డశోకవనమునకుఁ బోవుట

ఆంజనేయుఁడు ముహూర్తకాలము పూర్వోక్తప్రకారముగాఁ జింతించి, యా యశోకవనమును మనసుచేఁ బొంది, యా రావణుని యంతఃపురము విడిచి వచ్చి యా యశోకవనప్రాకారమును బొందెను. అంతట నామారుతి యావనప్రాకారమునొంది, మేన గగ్గురుపాటొందినవాఁడై, వసంతర్త్వారంభమునఁ బూఁచినవిరులతో నిండియున్న మద్ది, అశోక, సంపంగి, విరిగి, నాగకేసరము, మామిడి మొదలగు చెట్లను, శివప్రియములైన వృక్షవిశేషములను, కపిముఖములను వృక్షములను జూచెను.

అంత నాహనుమంతుఁడు మామిడితోఁపులచే జక్కఁగా నావరింపఁబడినదియు, పెక్కుతీఁగెలతోఁగూడినదియునైన వృక్షముల ప్రాంతమునకు నల్లెత్రాటినుండి విడువఁబడిన బాణమువలె మహావేగముతో దుమికెను. ఆహనుమంతుఁడు పక్షులనాదములతో నిండినదియు, వెండిబంగారుమయములైన చెట్లచే నంతట నిండినదియు, చిత్రవిచిత్రములగు మృగపక్షిసంఘములతోఁ గూడినదియు, వింతగొల్పెడు వనములు గలదియునై నందున నుదయించుచున్న సూర్యునిమాడ్కిఁ దేజరిల్లునదియునైన యావనమునెల్లఁ జూచెను. మృగపక్షులచే నిండి జనులకు సంతోషప్రదమైయున్న వసంతకాలమునఁ బుష్పఫలములచే నిండిన పెక్కువగలచెట్లచేఁ గప్పఁబడినదియు. కోయిలలను, తుమ్మె

దలును, నెమళ్లను మదించినవై చేయునాదములచేఁ దానును శబ్దించు నట్లుండునదియు, పెక్కుపక్షులగుంపుల కునికిపట్టయినదియునైన యా యశోకవనమునందు నామారుతి యుత్తమకాంతయగు పతివ్రత యైన రామునిదేవిని వెదకుచు, హాయిగా నిద్రించుచున్న పక్షులను లేపెను.

ఆపక్షు లెల్ల లేచి యెగురునప్పుడు విదిల్చిన వానిఱెక్కల తాఁకుళ్లకుఁ జెట్టులు గదలినవై పలువగలైన పువ్వులవానలను గురి పించినవి. ఆపుష్పములన్నియు నాహనుమంతునిఁ గ్రమ్ముటచేత నాహను మంతుఁ డశోకవనమధ్యమున నుండు పువ్వుల కొండవలెఁ గనఁబడెను. ఆవనమున నలుదెసలకుఁ బరుగెత్తుచున్న యాహనుమంతునిఁ జూచి, సకలభూతములు నతఁడు వసంతుఁడేమో యని తలఁచిరి. చెట్లనుండి రాలిన పలుతెగల పువ్వులచే నిండిన యావనభూమి భూషణములను దాల్చిన జవరాలిచందమునఁ బ్రకాశించెను.

హనుమంతుఁ డొకవృక్షమునుండి మఱియొకవృక్షమునకు దుముకునప్పుడు, ఆకులు, పువ్వులు, పండ్లు మొదలగునవి రాలుటచేతఁ బైభాగములం దేవియులేని వృక్షములు, జూదమునఁ దమబట్టలను సొమ్ములను బందెమువెట్టియోడిన జూదరులమాడ్కిఁ గాంతిలేక యుండి నవి. వడిగలవాఁడయిన హనుమంతుఁడు గదలించిన పుష్పశాలులగు గొప్పవృక్షములనుండు పువ్వులు, పండ్లు, ఆకులును వడిగారాలెను. ఆయశోకవనంబునందలి వృక్షములు పుష్పఫలపర్ణములు రాలిపోవుట చేతను, పక్షులెగిరిపోవుటచేతను బోదెలు మాత్రము గలిగియుండుట చేతను ప్రకంపనకంపితములో యన్నట్లు తోఁచినవి.

హనుమంతుఁడు తోఁకతోను, చేతులతోను, కాళ్లతోను ద్రొక్కుటచే విఱిగిన చెట్లుగల యాయశోకవనము సురతావసానమున వీడినకొప్పును, మాసినమైపూఁతయుఁ గలిగి, ప్రియుఁడు చుంబనము చేయుటచే దంతమువలెఁ దెల్లనైన దంతములును నధరోష్ఠమును గల దియు, భర్తయొనర్చిన నఖక్షతదంతక్షతములు గలదియునైన జవ్వని చందమున విరాజిల్లుచుండె. వర్షర్తువునందు దక్షిణపుగాలి మేఘ జాలములను జెదరఁగొట్టునట్లు, హనుమంతుఁడు గొప్పతీఁగలజొంపము లను జెదరఁగొట్టెను.

కపివీరుఁడగు హనుమంతుఁ డంతటఁదిరుగుచు వెండి, బంగారు, రత్నములకాలయములై యచ్చెరువొదవించు నేలలను, మంచినీటితోఁ గూడినవియు, పలుతెఱఁగులరూపులతోఁ గట్టినవియు, విలువగల రతనాలమెట్లతోఁగూడినవియునైన నడబావులను, ముత్యములను పవడములను బోలినయిసుకగలవియు, స్ఫటికమణివలెఁ దెల్లనైన మధ్యభూములు గలవియు, గట్టులందు మొలచిన పసిఁడివన్నెగల వింతగొల్పు చెట్లతోఁ బ్రకాశించునవియు, చక్కఁగాఁ బుష్పించిన పద్మోత్పలములు గలవియు, జక్కవలు, నీరుకోళ్ళు, రాయంచలు, బెగ్గురుపక్షులు కూయుకూఁతలతో నిండినవియు, పెక్కుమ్రాఁకులతోఁగూడినవియు, అమృతతుల్యమగు నీటితోఁగూడినవియు, తీఁగెల జొంపములును, కల్పవృక్షములపుష్పములును నిండినవియు, పెక్కుతెఱఁగులపొదలచేఁ జక్కఁగాఁ గప్పఁబడినవియు, నడుమనడుమ గన్నెరుచెట్లతో నిండినవియునైన నిడివికాలువలను జూచినవాఁడయ్యెను.

అనంతర మా హనుమంతుఁడు వార్షికమేఘముఁబోలునది, గొప్పకొనలుగలది, చిన్న బండలచేతను, తిప్పలచేతను, వృక్షములచేతను నంతట శోభిల్లునది, పెక్కుగుహలుగలదియునై రమ్యమై యుండు నొకపర్వతమును గాంచెను.

ఆపర్వతమునుండి జాఱి, నీటిలోపలికి వాలియుండు చెట్లకొమ్మలచే వెనుకకు మఱలింపఁబడి, తేటనీటితోఁ బ్రవహించుటచే, భర్తతోఁ జెలిలాట మాడునపుడు కారణవిశేషముచే భర్తపైనలిగి చివుక్కున లేచి పోవుచుఁ దనబంధువులు "పోవలదు. భర్తపైఁగోపముపడరా" దని కోపము నిమ్మళింపఁజేసి యడ్డగింపఁగా, కోపముతగ్గి కలఁకదేఱినదై మగనిమీఁది మక్కువతో మఱలివచ్చుచుండుమగువచందమున వెలయుచున్న నదిని, దానిచేరువఁ బక్షిసంఘములతో విరాజిల్లుచున్న తామర కొలఁకులును, చల్లనినీటితోఁ గూడినదియుఁ, రత్నములుచెక్కిన మెట్లు గలదియు, ముత్తెముల యిసుకచే శోభిల్లునదియు, పలుతెఱఁగులైన పక్షులగుంపులతోఁ గూడినదియు, వివిధమృగ సంఘములచే నాశ్చర్యకరమైనదియు, చిత్రకాననములు గలదియు, విశ్వకర్మ కట్టిన కడుగొప్ప మేడలతోను, కృత్రిమవనములతోను నన్నిప్రదేశములందు నలంకరింపఁ

జేయఁబడినదియునైన కృత్రిమమగు నడబావియు నాహనుమంతి ర గొప్ప లు గనఁబడెను.

ఆయశోకవనమునఁ బుష్పఫలశోభితము లైయున్న చెట్ల మొదట నిర్మింపఁబడియున్న బంగారపుమెట్లతోఁగూడి, పాన్పులు, దిండ్లు, తివాసీలు, పీటలు మొదలగునవి గలిగియున్న తిన్నెలతోఁగూడి బహుళ లతాపుంజపత్రములచేఁ గప్పఁబడి దట్టమైయున్న బంగారపువన్నెగల యొక శింశుపావృక్షమును, దానికి సమీపమున నున్న భూప్రదేశములను, వాఁగులను, సెలయేళ్లను, సువర్ణవికారము లౌటంజేసి యగ్నిహోత్రునిమాడ్కిఁ దేజరిల్లునట్టి తక్కినవృక్షములను జూచెను. సూర్యుఁడు మేరుపర్వతసాన్నిధ్యముచే బంగారపువన్నెగలవాఁడైన యట్లు, శూరుఁడగు హనుమంతుఁడును ఆవృక్షములకాంతిచేఁ బసిఁడివన్నె గలవాఁడయినట్లు తలఁచెను.

నూఱులకొలఁది చిఱుగజ్జెలనాదముగలిగి పసిఁడివన్నెగల చెట్ల గుంపులచే వెలయుచు, తిన్ననిగాలివీవనలతోఁ గూడియున్న యాశింశుపావృక్షదర్శనముచే విస్మయాక్రాంతచిత్తుఁడై, హనుమంతుఁడు చక్కని లేఁత చిగుళ్లతోఁగూడినదియు, ఆకులు దట్టముగనున్నదియు నైన యాశింశుపావృక్షము నెక్కిన వాఁడై, "రామునిదర్శనమునందుఁ దమితో నందందుఁ దోఁచినట్లెల్లఁ దిరుగుచు శోకపీడితురాలై యున్న సీతాదేవి నిచ్చటఁ జూచెదను. ఈ రమ్యమైన యశోకవన మాదురాత్మునిది. ఇది నిక్కము. దీనియందనేకములైన సంపెంగిచెట్లు, చందనవృక్షములు, పొగడచెట్లు ప్రకాశమానములై యున్నవి. ఈ తామరగుంటయుఁ బెక్కుపక్షులతోఁగూడి మనస్సున కింపొదవుచున్నది. రామునకుఁ బ్రియపత్నియైన సీత వనవిహారమున కుతూహలముగలది గనుకఁ దప్పక యిచ్చటికి రాఁగలదు. అట్లు కాదేని, పూజ్యురాలగు సీతాదేవి రామునివిరహతాపముచేఁ జిక్కినదై, యిచ్చటికి వచ్చినఁ దనతాపము తగ్గఁగలదనునెన్నికతో నీవనమునకు వచ్చియుండవచ్చును. లేదా, రామునికిఁ బ్రియురాలగు యకావనమధ్యస్థురాలయిన జానకి వనచరుల యందును, వనవిహారమునందును బ్రేమగలదిగావున వనవిహారము నిమిత్తమయినను వచ్చియుండవచ్చును. లేదా, సంధ్యోపాసనమునందుఁ గోరికగలదిగావున సంధ్యాకాలమున సంధ్యనుపాసించునిమిత్తమైనను

వచ్చియుండవచ్చును. ఈరమ్యమైన యశోకవనము రాజపుత్రియగు రామునిపత్నికి సమ్మతమైనది. చంద్రనిభాననయగు నారామునిదేవి ప్రాణములతో నుండునేని, యీరమ్యజలోపేతమైన నదికి రాఁగలదు" అని యిట్లు తలంచినవాఁడై, సీతాదేవిఁజూడఁగోరి చక్కఁగాఁ బుష్పించి, యాకులచే దట్టమైయున్న యాశింశుపావృక్షమున డాఁగి యావనంబు నంతయుఁ జూచినవాఁడాయెను.

## 15-వ సర్గము

### హనుమంతుఁడు సీతాదేవిం గాంచుట

ఆహనుమంతుఁడు శింశుపా వృక్షముయొక్క దట్టమైన యాకుల సందునఁ గూర్చున్నవాఁడై, సీతాదేవిని వెదకునిమిత్తమయి నానా దిక్కులఁ జూడ్కిఁ జొనిచ్చుచుఁ గ్రిందనేలపైఁజూచుచు నా యశోక వనము లెల్లఁ బాఱఁజూచెను. అయ్యశోకవనము సంతానము లనెడి యీవులమ్రాకులతీఁగెలతోను, మఱియనేకవృక్షములతోను గూడి శోభిల్లుచు, మేలిమిగంధరసపుఁజిలకరింతగలిగి, యంతటఁ బూఁహారములచేతఁ గైసేయఁబడి, నందనవనముతో సాటియై, మృగపక్షుల కునికిపట్టయి, మేడలచేతను, బవంతులచేతను గ్రిక్కిఱిసినదై, కోయిలలకూఁతలతో నిండి, బంగారంపుఁగలువలు తామర పువ్వులుగలిగిన నడబావులెక్కువశోభను గలిగించుచుండ, పెక్కుపీటలును రత్నకంబళ్లును వెలుఁగుచుండ, పెక్కునేలమాళిగలు సొంపొదవుచుండ, సర్వర్తువులకు సంబంధించిన పువ్వులతో నిండినవై పండ్లతోఁగూడియున్న వృక్షములుల్లముల కుల్లాసము పుట్టించుచుండ, అశోకవృక్షములు చక్కగా విరిసినవై కాంతిగలవై యుండుటచే నుదయించుచుండు సూర్యుని కాంతిని బురుడించుచుండ, ముక్కుతొఱ్ఱలందుఁ జిక్కుకొన్న పువ్వులచే నొప్పుమీఱిన పలువన్నెలుగల పక్షు లొక్కుమ్మడిగా గుంపులుగుంపులుగాఁ గూలుటంజేసి చెట్లకొమ్మలందలి యాకులెల్ల జలజలరాలగొట్టుచున్నవో యని యూహా గలిగించుచుండ, అడుగుమొదలుకొని పుష్పములచే నిండి, యా పువ్వులబరువులకు వంగి, పుడమిని దాఁకుచున్నవో యన్నట్టులుండు నశోకవనములు మొదలగు వృక్షములతోను, చక్కఁగాఁ బూఁచిన కొండగోఁగు, మోదుగుపువ్వులతోనుగూడి యా-

ప్రదేశమును బ్రకాశింపఁ జేయుచుండె. అయ్యశోకవనమునందు గొప్ప మొదళ్లుగల సురపొన్నలు, ఏడాకులయరఁటులు, సంపెగలు, వేగిసలు మున్నగువృక్షములు చక్కఁగాఁ బుష్పించినవై ప్రకాశించుచుండినవి. అయ్యశోకవనమునఁ గొన్ని యశోకవృక్షములు బంగారుతో సాటియైన వన్నెగలవియు, మఱికొన్ని నిప్పుమంటలంబోలునవియు, వేఱుకొన్ని నల్లనికాటుకం బురుడించునవియునై యొప్పుచుండెను.

మఱియుఁ బెక్కుచిన్ని తోటలతోఁగూడినదై, యబ్బురము గలిగించుచు, దేవేంద్రునినందనవనమును, కుబేరునిచైత్రరథమును తోటను మించినదో యన్నట్లు ప్రకాశించునదియు, సొబగుమీఱినదియు, కాంతితోఁగూడి మిగుల రమ్యమైనదియు, పువ్వులనెడి రిక్కలగుంపులచేఁ దేజరిల్లు రెండవయాకాశమో యనఁదగినదియు, పువ్వులనెడి వివిధములయిన రతనములకుప్పలచే నొప్పారు నైదవసముద్రమో యనఁదగినదియు,ఋతువులన్నింటియందుఁ బూఁచెడి పువ్వులచేఁ జెలంగుచు మదవ్గంధముగల పెక్కువృక్షముల కునికిపట్టయినదియు, పలువగలఁ గూయుచుండు మృగపక్షుల నినాదముల మూలమున వినువారిచెవుల కింపు పుట్టించునదియు, పెక్కుసువాసనల గుబాళించునదియు, మనసున కుల్లాసము పుట్టించునదియు, నెత్తావుల కునికిపట్టగు పర్వతశ్రేష్ఠమైన రెండవ గంధమాదనపర్వతమో యనఁబరగినదియునైన యా యశోకవనమును హనుమంతుఁడు అత్యాదరముతో మాటిమాటికిఁ జూచెను.

అయ్యశోకవనమున నా వానరపుంగవుఁడు వేయిస్తంభముల మీఁదఁ గట్టఁబడినదియు, కైలాసపర్వతముమాడ్కిఁ దెల్లనైనదియు, పవడములతోఁజేయఁబడిన మెట్లతోఁగూడినదియు, అపరంజితోఁగట్టిన తిన్నెలుగలదియు, కన్నులను జూఱఁగొనుచున్నదో యన్నట్లును, జిగిచే మెఱయుచున్నదో యన్నట్లును, మిక్కిలియెత్తయినందున నింగి నొఱయుచున్నదో యన్నట్లునుండునదియు, నిర్మలమైనదియు, బుద్ధాలయము:మాడ్కి నొప్పునదియునైన చేరువనున్న మేడను జూచెను.

అచ్చట హనుమంతుఁడు మాసినమసివలువ గట్టినదియు, రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడినదియు, ఒక్కప్రొద్దులుండుటచేఁ జిక్కినది, తెంపులేనిది, మాటిమాటికి మగనిం దలఁచికొని నిట్టూర్పువిడుచునది, శుక్లపక్షపాడ్యమియందలి లేఁత చందురుని నిర్మలమైన రేకవలెనుండునది,

'యిది యారూపముగ నుండవచ్చు'నని నిదానించి యానవాలు పట్టఁ దగిన రూపముతోఁగూడినదియయ్యును చక్కఁదనము గలదిగాయునందునఁ బొగగుమిచేఁ గ్రమ్మఁబడిన నున్నదియు, యగ్నిజ్వాలకైవడి చినిఁగిన పచ్చనియొంటిబట్ట కట్టినదియు, మురికితోఁగూడి తొడవులుదాల్పక యుండుటంజేసి, పద్మములులేని పద్మాకరముమాడ్కి వెలుఁగనిదియు, పరపురుషదర్శనాదులయెడ లజ్జపడునదియు, విచారముచేఁ గడువగతోఁ గూడినదియు, మిక్కిలి వాడుపాటినదియు, జాలి చూపఁదగినదియు, నంగారకునిచేఁ బీడితయైన రోహిణికైవడి సంతసముదక్కినదియు, మగనిఁదలఁచి కండ్లనిండఁ గన్నీరునించునదియు, ఆహారములేమిచేఁ గడుఁజిక్కినదియు, మనోదుఃఖముతోఁగూడి, యెల్లప్పుడు భర్తను గూర్చినచింతయే ప్రధానముగాఁగలదియు, తనప్రియబంధువులను జూడక రాక్షసాంగనలను జూచుచు నుండుటంజేసి, తనగుంపునుబాసి వేపులగుమిచేఁ జుట్టఁబడిన యాఁడుజింకవలెఁ గాంతిదక్కినదియు, నల్లత్రాచువలె నల్లనిదై, కటిపురోభాగమునఁ బడునదైన యొంటి జడతోఁ గూడినదాటచేత శరత్కాలమున నల్లనైయున్న వనపంక్తితోఁగూడిన పుడమివలెనుండునదియు, సుఖము లనుభవింపఁ దగినదియయ్యు దుఃఖముచేఁ గడు వగచునదియు, వ్యసనములెట్టివో యెఱుఁగనిదైనను వ్యసనము లనుభవించునదియునునైన సీతాదేవిని గాంచెను.

పున్నమచంద్రునిఁ బోలుమోమును, చక్కని కనుబొమ్మలును, చక్కని గుండ్రని స్తనములును, నల్లని కురులును, దొండపండువలె నెఱ్ఱనైన పెదవియు, నున్నని మేనును, సన్నని నడుమును, చక్కఁగ నూనిన యడుగులును, తామరరేకులంబోలు కన్నులుంగలదియును, దేహకాంతిచేత దిక్కులను ప్రకాశింపఁజేయునదియును, మరునిపత్ని యగు రతీదేవివలె నందకత్తెయు, నిండువెన్నెలమాడ్కి సర్వజనముచేఁ గోరఁదగినదియు, దీక్షవట్టిన తాపసకాంతవలెఁ బుడమిమీఁదఁ గూర్చుండునదియు, నాగాంగనవలె నిట్టూర్పు విడుచునదియు, భయపడుస్వభావముగలదియు, దుఃఖపరంపరలు విడువకవచ్చుచుండుటచేఁ బొగగుమితోఁ గూడిన నిప్పుమంటకైవడిఁ బ్రకాశము లేకుండునదియు, సందేహాస్పదమైన యర్థముగల ప్రసిద్ధములగు మన్వాది స్మృతివాక్యములం బోలినదియు, క్షీణదశయందుండుకలిమిం బోలినదియు, లేని

యపకీర్తివచ్చుటచే నడఁగిపోయిన కీర్తివలెను, ఫలాభావముచేఁ గొఱ వడిన శ్రద్ధవలెను, కార్యానుకూలతనొందని యాశవలెను, విఘ్నము లచే నిండిన కార్యసిద్ధినివలెను, కపటముతో నిండిన బుద్ధివలెను సొంపు దఱిగి యుండునదియు, రామునిఁబొందుట కుపాయము దొఱకమిచే నొచ్చినదియు, రావణునిచేతఁజిక్కి చిక్కినదియు, నల్లనైన వంకర రెప్పవెండ్రుకలు గలదియు, కన్నీళ్లతో నిండినదియు, తేటదనములేని మోముతోఁ గూడినదియు, మాటిమాటికి నిట్టూర్పు విడుచునదియు, మురికి పట్టినదియు, తెంపులేనిదియు, భూషణములు దాల్పఁదగిన దయ్యును భూషణములను దాల్పనిదియు, కాఱు మబ్బులచేఁ గ్రమ్మఁ బడిన చుక్కలఱేనిడాలుపగిది వెలుఁగు లేనిదియు, ఆవృత్తిలేకపోవు టచే మఱచిన విద్యను బోలినదియు, శబ్దార్థజ్ఞానము లేమిచేఁ జెప్పఁదలఁ చిన యర్థముంగాక, చెప్పఁదలఁపని వేఱొక్క యర్థము నొసఁగునట్టి మాటవలె నొప్పుదప్పియుండునదియు, నిర్దుష్టురాలును నైన యాసీతను హనుమంతుఁడు చూచి, మొదట నామె సీత యగునో కాదో యని సందేహించి, "ఈవిడ కామరూపుఁడగు నారావణుఁ డెత్తికొని పోవు నపు డెట్టిదిగా నుండెనో, యిప్పుడును నట్టిదిగానే యున్నది. కావున నీమె సీతాదేవిగా నుండవచ్చు" నని తలఁచెను.

మఱియు రాముఁడు సీతాదేవియంగములం దేయే భూషణము లుండునని చెప్పెనో, ఆ భూషణముల నన్నింటిని సీత భర్తృవియోగ ముచే నొలిచి చెట్టుకొమ్మలకుఁ దగిలించి యుండఁగా, హనుమంతుఁడు వానినిఁ జూచినవాఁడై తన మనమున నివ్విధమున నాలోచింపఁ దొడఁ గెను: "రాముఁడు తనపత్నియగుసీత యేయే భూషణములఁ దాల్చి యుండునని చెప్పెనో, అవియెల్ల నిచ్చటఁ గనఁబడుచున్నవి. ఈ చక్కని కమ్మలును, చక్కఁగాఁ గట్టఁబడిన గూబబావిలీలును, రత్నములు చెక్కిన పగడములు గ్రుచ్చిన చేతికడియములును—సీత బహుకాలము దాల్చి యుండినందున నల్లనై యున్న యీ భూషణము లన్నియు నారాముఁడు చెప్పినవియే. సీతాదేవి రావణునిచేఁ దేఁబడునప్పుడు ఋశ్యమూక పర్వతమున నేయేతొడవులను మూటగట్టి క్రిందవైచెనో, ఆ భూష ణము లిచ్చటఁ గానరావు. ఆమె యచ్చట వేనిని క్రిందవేయలేదో, అవి యివియే. దీనికి సందియము లేదు. అచ్చట ఋశ్యమూక పర్వతమున

జాఱిపడిన పసిండి పట్టువంటి కాంతిగల యీమేలిమి పసుపుపట్టుకోకయు, అప్పుడు వానరులుచూచిన చెట్టుకొనయందుఁ జిక్కికొన్న యుత్తరీయమును, నేలమీఁద మ్రోఁతతోఁ బడిన గొప్పవైన చక్కనిభూషణములును ఈసీతాదేవి పడవేసినవియే. ఈయుత్తరీయము బహుదినములుగాఁ గట్టఁబడిన దగుటవలన మిక్కిలి నలిగియున్నను, ఇది ఋశ్యమూకమునఁ బడవేసిన యుత్తరీయమువంటి రంగుగలదై, దానివలెఁ గాంతి గలదిగా నున్నది. రామునిపట్టంపుదేవియగు సీత పసిఁడివన్నెగల మేనితోఁగూడినది. కావుననే ఈ పతివ్రతయగు సీతను బోఁగొట్టుకొనియు, రాముఁడు మనసున నీమెమీఁది తగులు విడువకున్నాఁడు. రాముఁడు దయ, క్రూరతలేమి, దుఃఖము, కామము నను నాలుగు కారణములచేనే స్త్రీనిమిత్తము పరితపించుచున్నాఁడో, ఆస్త్రీ యీమెయే. ఆనాలుగు కారణము లెవ్వియనిన, ఆపదలందు స్త్రీలను రక్షింపవలసియుండఁగా, అట్లు చేయజాలనయితినే యనుజాలియు, ఆశ్రితయైన స్త్రీని గాపాడనైతినిగదా యనునాశ్రితసంరక్షకస్వభావమును, తనకర్ధశరీరముగానున్న పత్ని యగపడక పోయెఁ గదా యను దుఃఖమును, తనకుపభోగయోగ్యురాలుగా నున్న ప్రియకాంత కనఁబడకపోయెనే యనిన విరహవేదనయు. ఈనాలుగు కారణములచే రాముఁడు వెతలఁబడునట్టి కాంత యీమెయె. ఈమె యంగప్రత్యంగము లెంత చక్కనివో, యా రాముని యంగప్రత్యంగములు నంతచక్కనివిగా నున్నవి. ఆరాముని రూపం బెట్టిదో, ఈసీతయొక్క రూపము నట్టిద. ఈసీత మనసా రాముని యందును, ఆరాముని మన సీతయందును నాఁటియున్నవి. కాఁబట్టియె రాముఁ డీ సీతమీఁది మోహముచే ముహూర్తకాలమైనను జీవించి యున్నాఁడు. రాముఁ డితరస్త్రీలకంటె విలక్షణురాలైన యీసీతను బాసి వియోగవ్యసనముచే నశింపక ప్రాణములతో నున్నాఁడుగావునఁ జేయ నలవికాని పని సేసినవాఁడు" అని యివ్విధమున ముఱికిబట్టఁ గట్టుకొని యుపవాసములచేఁ జిక్కి రామునిఁగూర్చిన వ్యసనమే ముఖ్యముగాఁ గలదిగానున్న సీతాదేవిని జూచి సంతసించినవాఁడై, ఈసీత మఱలఁ బొందుటకుఁదగిన పతివ్రతాధర్మమునం దుండుటచే రాముఁ డదృష్టవంతుఁడే యని మనమునఁ దలఁచినవాఁడయ్యెను.

## 16-వ సర్గము

హనుమంతుడు సీతనుగూర్చి వగచుట

ప్రతాపవంతుడగు వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు కొనియాడదగు సీతను, గుణములచే నొప్పినట్టి రామునిఁ గొనియాడి మరల జింతను జెందెను. కొంతసేపు ధ్యానించి, కన్నులనిండ నీరు గ్రమ్ముటచే చూపు చెదురుచుండఁగా, సీతనుగూర్చి యాక్రిందితెఱఁగునఁ బలవించెను:—

"గురుజనవిధేయుఁడయిన లక్ష్మణుఁడును, జగద్రక్షకుఁడయిన రాముఁడును మిక్కిలి జాగ్రత్తతోఁ జూచుకొనుచున్నను సమస్త జన పూజ్యురాలయిన సీతాదేవికే కడగండ్లు వచ్చినప్పుడు, మఱియితరుల సంగతి యేమనవచ్చును? గ్రహచారము దప్పించుకొన నేరికిని వశము గాదు. ఈసీతయు రామునియొక్కయు, రాముఁడు మాయామృగమును వెంబడించిపోయినను, ఇతఁడు మారీచుఁడుగాని మృగముగాదని నిశ్చయించియుండిన లక్ష్మణునియొక్కయుఁ బరాక్రమం బిట్టిదని యెఱిఁగినది గనుక వర్షర్తువునందలి గంగానదివలెఁ గించిత్తైనను గలఁగకున్నది. నడకయందును, ఈడునందును, స్వభావమునందును, కులమునందును, సాముద్రిక శాస్త్రలక్షణములందును సీతకు రాముఁడును, రామునకు సీతయుఁ దగినవారు."

అనియిట్లు హనుమంతుఁడు లక్ష్మీదేవియుంబోలె లోకమున నొప్పినదై యున్న బంగారువన్నెగల యాసీతంగూర్చి తలఁచి, రాముని మనమునకుఁ దెచ్చికొని తనలోఁ దా నిట్లనుకొనెను:

ఈసీతాదేవినిమిత్తమై రాముఁడు కడుబలిమికాఁడగు వాలిని, పరాక్రమమున రావణునిఁబోలిన కబంధుని సంహరించెను. మఱియు దేవేంద్రుఁడు శంబరాసురుని వధించినచందమున, రాముఁడు దండకారణ్యమున భీమవిక్రముఁడగు విరాధుని సంహరించెను. మఱియు నితఁ డగ్నిజ్వాలలమాడ్కి నుండు కఱుకుటమ్ములనేసి జనస్థానమున నుండునట్టి పదునాలుగువేలమంది రాక్షసులను సంహరించెను. కీర్తిమంతుఁడైన యారాముఁడు గొప్పబలిమిగలవారగు ఖరదూషణత్రిశిరసులను నుగ్గుసేసెను. ఈసీతాదేవినిమిత్తమే రాముఁడు జనస్థాన

పాత్రమయిన వాలి పాలించుచుండిన వానరరాజ్యమును సుగ్రీవుని కొసఁగెను. విజితేంద్రియుల దగు ఈసీతనిమిత్తమై నేనును పదిమగఁడగు సముద్రుని దాఁటితిని; ఈపట్టణమును వెదకితిని. ఈసీతనిమిత్తమై రాముఁ డీనాలుగు సముద్రములచేఁ జుట్టఁబడిన యీపుడమిని దల క్రిందుగాఁ బొరలించును. పుడమియన నేల? జగత్తునంతయుఁ బొరలింపఁగలఁడని నేను దలఁచెదను. రామునికి త్రైలోక్యాధిపత్యము గొప్పదా, సీత గొప్పదా యని విచారించిన, రామునికి ముల్లోకముల యేలుబడియు సీతయొక్క కలాంశమునకుఁ బోలదు.

ఈమె ధర్మాత్ముఁడును, మహాత్ముఁడునైన మిథిలరాజగు జనక మహారాజునకుఁ గూఁతురు. అయోనిజ. భర్తకు శుశ్రూష యొనర్చుట యందే యాసక్తిగలది. చేను దున్నునప్పుడు పుడమిని వెకలించు కొని నాగేటిచాలునందుఁబుట్టినది. తామరపువ్వులపుప్పొడివంటిచేని దుమ్ముచే నిండినది. ఈసీతాదేవి పరాక్రమశాలియు, సత్స్వభావుఁ డును, యుద్ధములందు శత్రువులకు వెఱచి వెనుకకు మఱలని వాఁడును నైన దశరథమహారాజునకు వాసికెక్కిన పెద్దకోడలు. పితృవాక్య పరిపాలనాది ధర్మముల నెఱిఁగిన వాఁడును, నెనరు గలవాఁడును, కీర్తిమంతుఁడునునైన రామునికిఁ బ్రియురాలగు భార్య. ఇప్పుడీ విడ యీరాక్షసకాంతలవశమునఁ జిక్కియున్నది. పసిఁడి వన్నె మేనుగలదియు, విడువక చిఱునవ్వుతో మాటాడునదియునైన ఏ సీతాదేవి భర్తయందలిప్రీతిచే బలాత్కరింపఁబడినదై, సకలభోగము లను బరిత్యజించి కష్టములను సరకుచేయక నిర్జనమయిన వనమునకు వచ్చి, పండ్లుదుంపలుతిని తనజీవితముఁ గాపాడుకొనుచు, భర్తృశు శ్రూషయందు శ్రద్ధగలదై, వనమునందున్నను నగరమునందున్నట్లె యెక్కువప్రీతిని బొందుచుండినదో, యాసీతాదేవి యిడుమలఁ బడదగి నదికానిదైనను నిప్పు డీరాక్షసులు పెట్టెడి యీబాధనోర్చుచున్నది. రావణునిచే నిట్లు హింసపడియుఁ దననడవడిని విడువకుండు నీసీతను, చలిపందిటిని దప్పిగొన్నవాఁడు వెదకుచువచ్చి కనుఁ గొనునట్లు రాముఁడుఁ జూడవల్లయు. రాజ్యముగోల్పోయిన రాజు మఱలఁ దన రాజ్యమును బొందినప్పు డానందము నొందునట్లే, రాముఁడును, ఈ సీతను బడయుటచేఁ దప్పక సంతసము నొందును. ఈసీత, కామసుఖములఁ

బాసియు, బంధుజనములను బాసియున్నను, మఱల నారామునితోడి కూడిక గలుగఁగలదని కోరినదై తనప్రాణముల నుంచుకొనియున్నది.

ఈసీత యేకాంతచిత్తయై వేఱొండు విషయమును మనమునఁ దలఁపదు, రాక్షసస్త్రీలను చూడదు. ఈవనమునందలి పుష్పఫలభరితములగు వృక్షములను జూడక యారామునే తనమనమునఁ జూచుచున్నది. మగువకు మగండనువాఁడు భూషణమునకంటె నుత్తమైన భూషణము. కావున భూషణములఁదాల్ప యోగ్యురాలైనను, ఈసీత యాభూషణములలో నుత్తమభూషణమగు రామునిఁ బాసి యెంతయు శోభిల్లకున్నది. రాముఁడీ సీతను బాసి తనప్రాణములఁ దాల్చియు, వెతలచే, గుందకయు నున్నాఁడనుట చూడ నారాముఁడు చేయనలవి కాని పని చేసినవాఁ డనవలయును. నల్లనికొనవెండ్రుకలును, తమ్మి తేకులంబోలు కన్నులునుగలిగి సుఖముల ననుభవింపఁ దగినదయ్యు రాక్షసాంగనలనడుమ దుఃఖముతో నుండునదియైన యీసీతాదేవిని జూడఁగా, మృగప్రాయుడఁనైన నాకే మనమున వెత పుట్టినది. భూమిదేవివలె నోర్పుగలదియు, పద్మపత్రములంబోలు కన్నులుగలదియునైనయేసీతాదేవి మున్ను రామలక్ష్మణులకాపుదలలో నుండినదో, అట్టియీసీతాదేవి యిప్పుడు వికృతంపుఁజూడ్కుగల రాక్షసస్త్రీల కాఁపుదలయం దొక్కచెట్టుమొదటఁగూర్చుండి వగచుచున్నది. మంచుచేఁ బాడైన తామర తీఁగచందంబున ముందున్న శోభను విడిచినదియు, వెతలపరంపరయందుఁ జిక్కి కడువగచునదియునైన జనకరాజుగారాబుపట్టి యగుసీత, తన భర్తనెడఁబాసిన పెంటి జక్కవపిట్టవోలె నోటఁజెప్పను మనసునఁ దలంపను రాని చెడ్డదశను బొందియున్నది! అక్కటా! ఎంతకష్టము సంభవించెను! పుష్పభారములచే ముందుకువంగిన కొనలతోఁగూడిన యీయశోకవృక్షములు తామశోకములయ్యును విరహబాధచేఁ గుందునట్టి సీతాదేవి కెక్కువశోకమునే కలిగించుచున్నవి. మఱియు వెక్కువేల కిరణములతోఁ బుట్టినవాఁడును సూర్యునికంటెఁ జల్లనికిరణములు గలవాఁడునైనను చంద్రుఁడుదయించుచు విరహిణియగు సీతకు శోకమునే గలిగించుచున్నాఁడు.

బలమును వడియునుగలవాఁడగు వానరేంద్రుఁ డివ్విధమునఁ జింతించి, యీవిడ సీతయేయని బుద్ధియందు నిశ్చయించుకొన్నవాఁడై యావలికార్యము చేయుటకయి యావృక్షమునందే కూర్చుండెను.

## 17-వ సర్గము

హనుమంతుఁడు సీతను జూచుట

హనుమంతుఁ డట్లు శింశుపావృక్షమున నుండఁగా, తెల్లకలువలగుమింబోలు కాంతిగలవాఁడును, నిర్మలుఁడునునైన చంద్రుఁడు, హంసము తెల్లనియుదకమును బొందునట్లు నిర్మలమైన యాకాశము నపరభాగమును బొందెను. అట్లు చంద్రుఁ డుదయించి, తననిర్మలకాంతిని బర్వఁజేసి, యాహనుమంతునికి రాక్షసస్త్రీలను, సీతను జూపఁ దోడ్పడు వాఁడునుంబోలె వెలుఁగుచు, చల్లని కిరణములచే నాహనుమంతునికి సంతసము గలిగించెను.

అప్పుడు హనుమంతుఁడు పున్నమచందురునిఁబోలు మోముగలదియైనను, ఎక్కువబరువుచే నీట మునిఁగిన యోడయుంబోలె వ్యసనపరంపరలలో మునిఁగియున్న యాసీతాదేవిని జూడఁగోరినవాఁడై, తల యెత్తి మున్ముందుగా నాసీతాదేవిచేరువ నున్న భీకరంపుఁ జూపులుగల రాక్షసాంగనలను జూచెను.

వారలలో, ఒంటికంటిది, ఒంటిచెవిది, చెవులేతలముసుఁగుగాఁ గలది, చెవులులేనిది, గూటమువంటి చెవులుగలది, ఎగుముక్కుకలది, సన్నని పొడవు మెడగలది, పెద్దతలగలది, పలుచని కేశములు గలది, కేశములు లేనిది, కంబళివంటి వెండ్రుకలుకలది, వ్రేలుఁజెవులును, నొసలునుగలది, వ్రేలుబొజ్జయుఁ బాలిండ్లునుగలది, వ్రేలుఁబెదవిగలది, గడ్డమునందుఁ బెదవిగలది, వ్రేలు మోమును పిక్కలునుగలది, కుఱుచది, పొడవుది, గూనిది, లావు పిక్కలుగలది, పొట్టిది, నునుపుగాని యొడలుగలది, వంకరమోము గలది, పచ్చకన్నులది, రోఁతపడఁదగిన మోముగలదియునుండిరి. మఱియు, రోఁతపడఁదగినవారు, పచ్చనిడాలు గలవారు, నల్లనివారు, కోపపడువారు, జగడమే కూడుగాఁ గలవారు, నల్లయినుపయీటెలు, గొప్ప ముమ్మొనవాలులు, కూటములు, రోఁకళ్లు దాల్చినవారు, పంది, జింక, పులి, ఎనుము, గొఱ్ఱె, నక్కయనుమృగముల

మోరలవంటి మోరలుగలవారు, ఏనుఁగులయు, ఒంటెలయు, గుఱ్ఱములయుఁ బాదంబులంబోలు పాదములుగలవారు, శరీరము లోపలికిఁ గ్రుంగిన తలగలవారు, ఒంటిచేతివారు, ఒంటికాలివారు, గాడిదె చెవులవారు, గుఱ్ఱపుఁజెవులవారు, పసరపుఁ జెవులవారు, ఏనుఁగుఁజెవులవారు, కోఁతిచెవులవారు, ముక్కిఁడులు, నిడుపుముక్కులవారు, అడ్డముక్కులవారు, చప్పిడిముక్కులవారు, ఏనుఁగుతొండమువంటి ముక్కులు గలవారు, నెత్తిని ముక్కులు గలవారు, ఏనుఁగుకాలివంటి కాళ్లవారు, పెద్దడుగులవారు, ఆవుపాదమువంటి పాదములవారు, కాళ్లయందు జుట్టుగలవారు, పెద్దతలయు నిడుపు మెడయుఁ గలవారు, గొప్పపాలిండ్లును పెద్దబొజ్జయుఁగలవారు, గొప్పవాయియు, మిడిగ్రుడ్లును గలవారు, నిడివిగోళ్లును నాలుకయు గలవారు, గొఱ్ఱెతలవారు, ఏనుఁగుతలవారు, ఆవుతలవారు, పందితలవారు, గుఱ్ఱపుతలవారు, ఒంటెతలవారు, గాడిదెతలవారు, చూపరకు వెఱపుగలిగించువారు, గయ్యాళులు, జగడాలమారులు, వెఱపించువారు, బూడిదెరంగు వెండ్రుకలుగలవారు, వెగటు మోరలవారు, అనయము మద్యపానమునందును మాంసభక్షణమునందును ప్రేమగలవారు, మాంసరక్తముల నొడలికిఁ బూసికొనువారు, రక్త మాంసము లాహారముగాఁ గోరువారు నుండిరి. చూచినమాత్రముననే మేనికి గగుర్పాటొదవించు నా వికృతరూపలగు రాక్షసకాంతలందఱును ఆ సీతాదేవి గూర్చున్న లావుబోదెగల శింశుపావృక్షము చుట్టును కూర్చుండిరి.

సీతాదర్శనజన్యమైన కాంతి విశేషముగలవాఁడగు హనుమంతుఁడట్టి రాక్షసకాంతలను జూచినపదంపడి యాచెట్టుక్రిందనే కూర్చుండియున్న పతివ్రతయగు జనకమహారాజుకూఁతురైన సీతను జూచెను. అప్పు డాసీతాదేవి మోమున వన్నెతొఱఁగియు, వెతలనడికియు, ముఱికిచేఁ జిక్కుపడ్డశిరోజములు గలిగియు నుండుటచే, పుణ్యము నశింపఁగాఁ గాంతిఁబాసి పుడమింగూలిన నక్షత్రమువలె నుండునదియు, పాతివ్రత్యమహిమతో వెలయునదియు, మగనిఁజూచుటకు నోచుకొనని దియు, మేలిమి భూషణములఁ దీసివేసినదియు, మగనిమీఁది మక్కువయే సొమ్ముగాఁగలదియు, రాక్షసపతియగు రావణునిచే నడ్డగింపఁబడి తనబంధువులనుండి దూరముగాఁ బాపఁబడియుండుటవలన, సింహముచే నడ్డ

గింపఁబడి తనగుంపునుండి యెడఁబాపఁబడి దిగులొందియున్న పెంటి యేనుఁగువలెను, వర్షాకాలాంతమున శరత్కాల మేఘములచేఁ గ్రమ్మఁబడిన చంద్రరేఖంబోలెను, నలుఁగులు మొదలగునవి లేమిచేత రూపుమాసి, తంతులులేని వీణంబోలెనుండునదియు, మగనివశమున నుండఁదగినదియు, రాక్షసకాంతల వశముననుండ నిష్టములేదియు, అశోక (శోకములేని) వనముననుండియు, శోకసాగరమునఁ బూర్తిగా మునిఁగినదియు, మున్ను పేర్కొనఁబడిన రాక్షసకాంతలచేఁ జుట్టు గావలి కాచఁబడుటచేతఁ గ్రూరగ్రహముచే ముట్టడింపఁబడిన రోహిణింబోలి నదియు, సొమ్ములు లేమిచేఁ బువ్వులులేనితీఁగకైవడి నందము తగ్గినది యునైయుండెను.

మఱియు నాసీతాదేవి యొడలంతయు దుమ్ముచేనిండియు, సౌందర్యముగలిగియునుండుటచే నడుసునఁబ్రుంగిన తామరతూఁడువలెను వెలుఁగుచును వెలుఁగకయు, మాసిన నలిఁగినబట్టను గట్టుకొని మోమునఁ గళలేనిదైనను, భర్తయొక్క పరాక్రమము దలఁచుకొని తన కెప్పటికైన మేలుగలుగఁగలదని యెంచి ధైర్యముపూని, తనపాతివ్రత్యముం గాపాడుకొనుచు, జింకపిల్లవంటి నల్లనికన్నులతోఁగూడి బెదరిన లేడివలె నలువైపులఁజూచుచుఁ దన కడగండ్లను దలఁచుకొన్నప్పుడా వనమునందలి చెట్లచిగుళ్లు వాడిపోవునట్లుగ వేఁడినిట్టూర్పులు విడుచుచు, శోకరాశియో, మీఁదికిలేచిన దుఃఖపుటలయో, ఓర్పుయొక్క యవతారమో యనఁబరగి, చక్కఁగాఁదీరిన యంగములు గలదౌటచే నాభరణములు లేకున్నను బ్రకాశించుచుండెను. అట్టి యామది రేక్షణయగు సీతను మారుతి కాంచి యాపరాని యానందమునొంది, యానందబాష్పములు విడిచి, రామలక్ష్మణుల యనుగ్రహమునఁజేసియే కాదా తాను సీతను జూడఁగలిగినదియని యా రామలక్ష్మణులను మనస్సునమ్రొక్కి, సీతాదర్శనముచేఁ బులకితగాత్రుఁడై రాక్షసులకుఁ గనఁబడకుండుటకై దేహమును ముడుచుకొని యాశింశుపావృక్షపుఁ గొమ్మల మఱువున డాఁగియుండెను.

## 18-వ సర్గము

రావణాసురుఁడు సీతను జూడవచ్చుట

హనుమంతుఁడట్లు వనపాదపముల సింగారమును గాంచుచు, సీతను వెదఁకుచునుండగా, మూఁడుజాములు గడచి యొక్కజాము ప్రొద్దుమాత్రముండెను. అయ్యపరరాత్రమున నాఱంగములతోడ వేదములను జదివినవారును, మేటిజన్నము లొనరించినవారునునైన బ్రహ్మరాక్షసులు చేయువేదఘోషము లాహనుమంతుని చెవులకు సోఁకుచుండెను.

అప్పుడు రావణునినగరునందలి చెవులకింపుగలుగు మంగళ వాద్య ఘోషములచే నిడుదచేతులు నెక్కువబలిమియు నెక్కువమగఁటిమి యుంగల యా రావణుఁడు నిద్ర లేచి, బట్ట జాఱిపోవుచుండ, పూవుల సరములు తావులు తప్పియుండ నాసీతయందెక్కువ తగులుగలవాఁడై, మదనునిబాధంజిక్కి, మదముమీఱఁగా, నాకామబాధను లోపల నణఁచుకోఁజాలనివాఁడై, యన్నితోడవులుదొడిగి, దివ్యకాంతిచేఁ దేజరిల్లుచు నానావిధపుష్పఫలములుగలిగిన పెక్కుచెట్లచేఁ జెన్నారి, తామర కొలఁకులకునికియై, నానాపుష్పశోభితమై, తీరనిమదముగల పక్షులతోఁ గూడి యెక్కువవింతయై యుండునదియు, చూడనింపయిన పెక్కు తోఁడేళ్లతో వెలసి, పెక్కుమృగపక్షులచేనిండి, చెట్లనుండి రాలిన పండ్లచే సందులేనిదై యుండు నశోకవనముఁగూర్చి తెఱలి యిరువైపు లందలి తోటల రామణీయకముఁ జూచుచు నావనమునకు వచ్చిచేరెను.

దేవేంద్రుని దేవగంధర్వస్త్రీలు వెంబడించులాగున, నూఱ్వురు స్త్రీలు మాత్రమే యారావణుని వెంబడించి వచ్చిరి. వారిలోఁ గొందఱు పసిఁడిదీపపుసెమ్మెలను మోయుచు వచ్చిరి. మఱికొందఱు వింజామరములను, మఱికొందఱు విసనకఱ్ఱలను గైకొనివచ్చిరి. కొందఱు పసిఁడిగిండ్లతో నుదకముఁబట్టికొని ముందుగానడచిరి. కొందఱు బొకులను, ఆసనమునుగైకొని, యారావణునివెంబడి నడచిరి. ఒకానొకజాణ యగు రాక్షసకాంత రత్నఖచితమయిన మద్యపూరితపాత్రను కుడిచేతఁ బట్టికొని వచ్చెను. రాయంచవలెను పున్నమచందురునిగైవడిని వెలయుచున్న కాడగల తెల్లనిగొడుగును మఱొక్కతె పట్టుకొని రావణుని

వెంబడిఁబోయెను. నిద్రచేతను, కైపుచేతను తూలుచుండ నొప్పెడి రావణుని యుత్తమకాంతలు హారములు, బాజీబందులు తమ తావులు తప్పియుండ, మేనిగంధపుఁబూఁత పూర్తిగా మాసియుండ, కొప్పులు వీడియుండ, మోములందుఁ జెమ్మటలు గాఱుచుండ, మేనఁదాల్చిన పుష్ప హారములు చెమ్మటకుఁదడిసియు, శిరోజములందలి పుష్పహారములు చిక్కు పడియుండఁగా నిద్రచేతను మదముచేతను ముందుకువెనుకకుఁబడుచు రావణునిమీఁది గారవముచేఁ గొందఱును, మోహముచేఁగొందఱును, అశోకవనమునకుఁ బోవుచున్న రాక్షసేంద్రుఁడయిన రావణుని వెంబడించిరి.

ఆరాక్షసస్త్రీలకుఁ బెనిమిటియగు మహాబలుఁడగు రావణుఁడు మరునివలలోఁజిక్కి, మూఢుఁడగుటచేఁ బతివ్రతయగు సీతయందు మోహముగలవాఁడై తిన్నగా నడచుచు వచ్చెను.

వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు రావణునితోఁగూడవచ్చెడి రాక్షసకాంతల యొడ్డాణములందలి చిఱుగజ్జెలమ్రోఁతలను, కాలి యందెలమ్రోఁతలను వినెను. ఆవెంబడి రాక్షసకాంతలు సువాసనగల తైలములందుఁ దడిపిన పెక్కు దివ్విటీలు కొనివచ్చుచుండఁగాఁ జక్కఁగాఁ గానవచ్చుచున్నవాఁడును మోహమదగర్వములతోఁగూడిన వాఁడును నిడివిగలవియు వంకరలునైన యెఱ్ఱనినేత్రములు గల వాఁడును, విల్లుచేతఁబట్టని ప్రత్యక్ష మన్మథుఁడనఁదగినవాఁడును, మజ్జిగయొక్కయు, ధారోష్ణముయొక్కయు నురుగులకాంతినిబోలు తెల్లనికాంతిగలదియు, తావునుండి తొలఁగి, భుజకీర్తులందుఁ దగులు కొన్నదియు, నిర్మలమైనదియునైన మేలిమిపైబట్ట నొయ్యారముతో నీడ్చుకొనుచు దాపునకు వచ్చిన రావణుని హనుమంతుఁడు చెట్లయాకుల జొంపముల దాఁగినవాఁడై చక్కఁగాఁ జూచెను. కపిశ్రేష్ఠుఁ డట్లు రావణునిఁజూచినపిదప నాతనివెంబడి వచ్చెడి రూపయౌవనములచే శోభిల్లెడి యాతని యుత్తమపత్నులను జూచెను. అట్లు హనుమంతుఁడు వారిని జూచుచుండఁగా గర్వముచే నిక్కఁ బొడుచుకొన్న చెవులతోఁ గూడినవాఁడు, మద్యపానముచే మత్తుఁడును, వింతతొడవులఁదాల్చినఁ వాఁడు, మహాబలుఁడునగు రావణుఁడు నక్షత్రములచేఁ జుట్టఁబడిన

చంద్రునిమాడ్కిఁ బ్రకాశించు జవరాండ్రతోఁగూడి, మృగపక్షుల కూఁతలతో నిండిన యావిహారవనమును బ్రవేశించెను.

ఎక్కువ వెలుఁగుగలవాఁడగు హనుమంతుఁడు విశిష్టతేజము గలవాఁడైన రావణుంజూచి, "యీగొప్పచేతులవాఁడు రావణుఁడు గాఁబోలు" నని తలఁచి, యాతని యన్ని చెయువులుచక్కఁగాఁ జూడఁ గోరి, తాను ముందున్న కొమ్మకుఁ గ్రిందికొమ్మకు దిగెను. హను మంతుఁడు శత్రువులకోర్వరాని మగఁటిమిగలవాఁడయ్యు నతని వెలుఁగు నకు నడఁగినవాఁడై యాకులసందున డాఁగి యతనికంటఁబడకుండెను. రావణుఁడన్నను నల్లని కొనవెండ్రుకలును, గొప్పపిఱుఁదులు, కదిసిన స్తనములును, నల్లనిక్రీ గన్నులుంగలది యగు సీతాదేవిం జూడఁగోరి, యాదేవికడకు సమీపించెను.

## 19-వ సర్గము

### రావణుఁడు సీతను చూచుట

ఆ రావణుఁడు వచ్చినయుత్తరక్షణముననే పతివ్రతయగు విజేవి కన్నులదైన యాసీతాదేవి రూపయావనములతోఁగూడిన యారాక్ష సాధిపుఁడైన రావణుని దవ్వునఁ జూచినవెంటనే బొజ్జను రెండు తొడల తోను, స్తనములను రెండుచేతులతోను మూసికొని, పెనుగాలియందలి యరఁటిచెట్టువలె వణఁకుచు, కన్నులనుండి కన్నీరుఁగార్చుచు నేడ్చుచుఁ గూర్చుండియుండెను.

అప్పుడు రావణుఁడన్నను రాక్షసకాంతలవశమున నుండు నదియు, దుఃఖములచే నొచ్చినదై, సముద్రమునమునిఁగిన యోడ మాడ్కి నుండునదియు, పైకప్పులేని బయలునందుఁ గూర్చుండునదియు, పాతివ్రత్యమతము నవలంబించినదియు నరకఁబడి క్రిందఁబడిన చెట్టు కొమ్మను బోలినదియు, ముఱికితోఁ గూడినదయ్యుఁ జూపరకు వింతను గొల్పు దేహముగలదియు కైసేతకుఁ దగినదియయ్యుఁ గైసేత లేనిదియు, అడుసంటిన తామరతూఁడుమాడ్కిఁ బ్రకాశించియుఁ బ్రకాశింప కయు నుండునదియు, నాత్మవేత్తయు రాజశ్రేష్ఠుఁడునగు రామునిచేరు వకు సంకల్పములనెడిగుఱ్ఱములు పూన్చిన మనస్సనెడి రథమువిూఁదఁ గూర్చుండి పోవుచున్నదానింబోలెఁ జూపట్టునదియు, ఎండుచుండునట్టి

దియు, రామునిఁగూర్చి ధ్యానించుచు, రామునివియోగదుఃఖమున మునిఁగి యొంటరిగా నేడ్చుచుండునట్టిదియు, దుఃఖమునకుఁ దుదగానకుండునదియు, రామునే తలంచునదియు, మణిమంత్రౌషధములచేఁ గట్టివేయఁబడిన యాఁడుపామువలె నిటటుపొఱలుచుండునదియు, ధూమకేతు వనుదుష్టగ్రహముచేఁ జొందఱపెట్టఁబడిన రోహిణీదేవివలె రాక్షసకాంతలచే బాధింపఁబడునదియు, గౌరవము, మర్యాద, మంచినడవడి, ఆచారము, ధర్మగుణముగలిగిన గొప్పకులమునఁ దాను బుట్టినను, మున్ను చెప్పినగుణములు లేనిచెడుకులమునఁ బెండ్లాడి, యాకులమునఁ బుట్టినదానిపగిది శోభాహీనురాలై యుండునదియు, లేని యపవాదము వచ్చుటచే నశించిన కీర్తింబోలియు, ఆవృత్తి లేకపోవుటచే మఱచిన విద్యకైవడియు, నశించిన గొప్పకీర్తివలెను, ఆదరణచేయఁబడని శ్రద్ధమాడ్కియు, అల్ప పూజాద్రవ్యములు గల పూజచొప్పునను, సిద్ధినొందనియాశవలెను, తగ్గిన ధనాదాయమువలెను, చెల్లింపఁబడని యుత్తరువువలెను, ఉత్పాతకాలమున మండునట్టి దిక్కువలెను, దోఁచుకొనిపోఁబడిన పూజార్థమగు వస్తువువలెను, మంచుచేఁ బాడుచేయఁబడిన తమ్మికొలనికైవడియు, మొనగాండ్రు లేని దండువలెను, చీఁకటిచేఁ గానరానికాంతి చందమునను, నీరింకిన యేటిపగిదియు, పరిశుద్ధులుగానివారిచేఁ దాఁకఁబడిన యజ్ఞవేదికరీతియు, చల్లారిన యగ్నిజ్వాలవలెను, రాహువుచే మ్రింగఁబడిన చంద్రబింబముతోఁగూడిన పున్నమనాటిరాత్రివలెను, కమలపత్రములు కోయఁబడి, పక్షులు చెదరగొట్టబడి, ఏనుఁగుల తొండములచేఁ గలియఁబెట్టఁబడి యాకులమైయున్న తామరకొలనివలె నుండునదియు, పెనిమిటియెడఁబాటువలనివెతచే గుంది, యెండుపాఱిన మోముగల దాటచేతఁ గట్టు తెగిపోవుటచే నీరెల్లఁబాఱిపోవఁగా నెండిన యేటివలెనున్నదియు, ఎక్కువ పోషణ లేనిదగుటచేఁ గృష్ణపక్షరాత్రివలెఁ బ్రకాశింపనిదియు, సున్నితమై చక్కఁగాఁ దీరినయంగములతోఁ గూడినదియు, రత్నఖచితమయిన రాజగృహమున నుండఁదగినదియు, అప్పుడెయెత్తి యెండలో వేయఁబడఁగా నెండకువాడిపోవుచున్న తామరతూఁడుమాడ్కి నుండునదియు, అడవియందు విచ్చలవిడిగాఁ దమగుంపుతోఁగూడఁ దిరుగునప్పుడు పట్టుకొని కట్టివేయఁబడి మిక్కిలి దిగులుపడి ఘీంకారము చేయుచున్నట్టి స్త్రీజాతి యేనుఁగుకైవడి వేఁడి

నిట్టూర్పులు విడుచునదియు, నిడివియైన యొంటిజడఁ దాల్చినను, ప్రయత్నములేకయ స్వాభావికముగాఁ బ్రకాశించుచుండునదియు, వర్షర్తువు తీఱి నల్లని వనపంక్తితోఁ గూడిన భూమివలె సొంపులేనిదియు, ఆహారములేమిచేతను, భర్తను ధ్యానించుటచేతను, భర్తవియోగశోకముచేతను, రాక్షసస్త్రీవలని బాధల భీతి చేతను మిక్కిలి చిక్కినదియు, దైన్యము, కృశత్వమును నొందినదియు, ప్రాణధారణకు మాత్రముపయుక్తమైన యన్నముఁ దినునదియు, తపస్సే ధనముగా నెంచినదియు, రామునిమూలమున రావణుని కెప్పు డవమానము సంభవించునా యని దేవునిఁగూర్చి దోసిలియొగ్గి మనస్సునఁ దలపోయుచుండునదియు, దన కేమివచ్చునోయని అన్నివైపులఁ జూచుచుఁ గన్నీరు గార్చుచుండునదియు, చక్కనైన తెప్పలతోఁ గూడినవి, యెఱ్ఱనివి, నిడివివి, తెల్లనివి యునైన కన్నులుగలదియు, రామునే తలపోయుచుండునదియునైన యాసీతాదేవిని రావణుఁడు తన్ను వలచునట్లుచేయ మొదలిడెను.

## 20-వ సర్గము

### రావణుఁడు సీతను బ్రతిమాలుట

ఆ రావణుఁడు పతివ్రతయు, భర్తనెడఁబాసియుండుటచే సంతసము లేనిదియు, వ్యసనంపుముఖముతో నుండునదియు, దీనురాలునగు సీతంగూర్చి సాభిప్రాయములైన యింపుమాటలచేఁ దనయభిప్రాయమును దెలిపెను.

ఏనుఁగుతొండముంబోలు తొడలుగలదానా! నన్నుఁజూచి, స్తనములను, కడుపునుమూసి, నీదేహమును భీతివలననోయన్నట్లు నాకుఁ జూపక లోపలికి ముడుచుకొనఁ గోరుచున్నావు. ఓ విశాలాక్షీ! నీపై మరులుగొని యున్నాను. ఓసీ ప్రియురాలా! నన్ను గారవింపుము. సుగుణము లన్నిటితో నిండినదానా! సకల లోకములకు మనోహరురాలా! యిచ్చట నీకు వెఱపు పుట్టించుమనుజులుగాని కామరూపులగు రాక్షసులుగాని లేరు. ఓసీతా! నేను రాక్షసుఁడనయినను, నావలనను భీతి నీకు వలదు. ఓసి పిఱికిదానా! పరస్త్రీలను హింసించి తెచ్చుటకాని, వారితోఁగలియుటగాని రాక్షసులకు ధర్మమే. దాని కేసందియమును లేదు. ఇది యిట్లున్నను, ఓమిథిలాధిపుని కూఁతురా! నాయెడ మోహము

గలుగునంతవఱకు నిన్నుఁదాఁకదు. నీశరీరమునఁ గామము యథేచ్ఛగాఁ జూచ్చునుగాక !

ఓ చెలీ! ఓ దేవీ! నీకిచ్చట భయము వలదు. నాయెడ విశ్వాస ముంచుము. వాస్తవమైన ప్రేమను నాయెడఁ జేయుము. ఇత్తెఱఁగున నెప్పుడు వ్యసనముఁ దగిలియుండకుము. ఓ సీతా! ఒంటిజడయు, నేలఁబరుండుటయు, చింతించుటయు, నల్లనిబట్టయు, నిష్కారణముగా నొక్కప్రొద్దులుండుటయు నీకుఁదగినవికావు.

ఓ మైథిలీ నీవు, నన్నువలచి, విచిత్రములగు పుష్పమాలికలును, చందనములు, అగరువులు, నానావిధములగు బట్టలు, దివ్యభూషణములు, గొప్ప విలువగల పానీయద్రవ్యములు, పాన్పులు, ఆసనములు, నృత్తగీతవాద్యములును అనుభవింపుము. ఓ చక్కనిరూపముగలదానా! నీవు స్త్రీలలో నుత్తమురాలవు. నీ విట్లు వ్యసనపరురాలవై యుండవలదు. సొమ్ములు పెట్టుకొనుము. నన్నుఁబొందినపిదప నీవెట్లు తగనిదానవగుదువు. నీ కిప్పుడు వచ్చియున్న మనోహరమైన ప్రాయము మీఱిపోవుచున్నది. కడచినయౌవనము వడిగాఁబాఱు నదీప్రవాహముమాడ్కి మఱల రానేరదు, ప్రసిద్ధుఁడైన సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు లోకోత్తరసౌందర్యశాలినివైన నిన్నుసృజించి, యంతటితో సృష్టిని జాలించెనని తలఁచెదను. ఓసీ చక్కనిదానా! నీతో సాటియగు రూపలావణ్యములు గలకాంత ముల్లోకములలోను గానరాదు.

ఓ వైదేహీ! చక్కఁదనమును, వయసును గలదానవగు నిన్నుఁ జూచినపిదప నెవ్వఁడు చూచి చూడక పోవును? సాక్షాత్తుగా సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడయినను నిన్ను పేక్షించి పోఁజాలఁడు. చంద్రునిఁ బోలు మోముగలదానా! నీయొక్క యేయే యంగమును జూచుచున్నానో, ఓ గొప్పపిఱుఁదులదానా! యాయా యంగమున నాదృష్టి కట్టుపడుచున్నది.

ఓ మైథిలీ! నీవు నాకు భార్యవగుము. ఈ వెఱ్ఱిపట్టుదలనువిడువుము. అచ్చటచ్చటినుండి తేఁబడిన పెక్కురు చక్కనియువతివలలో నీవు పట్టపుదేవివి గమ్ము. నేను శత్రువులను సంహరించి, యనేకలోకముల నుండి యేయే మంచివస్తువులను దెచ్చితినో, ఓ పిఱికిదానా! భయపడకుము. ఆమంచి వస్తువులును, నారాజ్యమును, నేనును నీయధీనులము.

ఓ సొగసుదానా! నీ నిమిత్తమై సకల పట్టణములతో నిండిన భూమి యంతయు గెల్చి నీ తండ్రికొసఁగెదను. ఈ లోకమున నాతో సాటిగా యుద్ధముసేయఁగలవాఁడు మఱొక్కఁడు లేఁడు. ఇదిగో సమరమున సాటిలేని నాకడుగొప్పమగటిమిఁ జూడుము. నేను దేవతలతో యుద్ధములు చేయునప్పుడు వారి టెక్కెములను విఱిచితిని. నాపగతురు సురలుగాని యసురలుగాని నాయెదుట నిలిచి యుద్ధముసేయఁజాలరు. నీవు నామీఁద మోహముగలదానవై, నిగనిగ మెఱయుచుండు నీ భూషణములను దాల్పుము. నీవు చక్కఁగా నలంకరించుకొందువేని, నేనును ప్రేమతో నిన్ను బాగుగాఁ జూతును.

ఓ చక్కనిమొగముగలదానా! నాయెడఁ గరుణించి, యలంకారముచేసికొని, యథేష్టముగాఁ గోరిన భోగము లనుభవింపుము. ఓ పిఱికిదానా! మద్యము త్రాగుము. నాతోఁ గ్రీడసల్పుము. నీయిచ్చ చొప్పున వలయువారికి భూమియిమ్ము, ధన మిమ్ము. నాయందుఁ బ్రేమ యుంచి నన్నుఁగోరుము. నీకేది కావలసినను ధైర్యముతో నాజ్ఞాపింపుము. నాయనుగ్రహమువలన నీవు వేడుకతో నుండుచు, నీచుట్టముల నందఱను సంతోషపెట్టుము. ఓ మంగళాంగీ! నా కలిమిని, నా సౌందర్యమును, నాకీర్తిని జూడుము.

ఓ భాగ్యశాలినీ! రాముఁడన్ననో నారబట్టలు గట్టుకొన్నవాఁడు, అతనితో నీకేమిపనియున్నది? రాముఁడు జయములేనివాఁడు. రాజ్యలక్ష్మిని బోఁగొట్టుకొని యడవులయందల్లాడుచున్నాఁడు. వ్రతము పూని, నేలమీఁదఁ బరుండుచుఁ గాలము గడుపుచున్నాఁడు. ఇప్పటికి బ్రతికియున్నాఁడో లేఁడోయని నేను సంశయించెదను. ఓ వైదేహీ! రాముఁడొక్కవేళ జీవించియున్నను, క్రిందిభాగమున కొంగలసంచారముగల నల్లమబ్బులచేఁ గ్రమ్మఁబడిన వెన్నెలనుబోలె నా యధీనతయందున్న నిన్ను రాముఁడు చూడనైనను జాలఁడు. హిరణ్యకశిపుఁ డింద్రునిచేత నున్న కీర్తిని బొందఁజాలనట్లు, నీవు నాచేతనుండి తప్పించుకొని పాఱిపోయితివైనను రామునిఁ బొందఁజాలవు.

చక్కనిచిఱునవ్వుగలదానా! తెల్లనిపల్వరుసగలదానా! సొగసుకన్నులదానా! వన్నెలాడీ! గరుఁడుడు పాము నెత్తికొనిపోవునట్లు, ఓ భీరూ! నామనమును! నీవు చూఱఁగొనుచున్నావు. నీవు మాసిన

దువ్వలువ గట్టికొని, యన్నములేక చిక్కి, యలంకారములు దాల్పక యున్నను, నిన్నుఁ జూచినపిదప నాభార్యలపై మరులు గొనుటయే లేదు. ఓ జానకీ! నాయంతఃపురమున రూపలావణ్యాదిసుగుణగణో పేతలగు పెక్కండ్రు కాంత లున్నారు. నీవు వారికెల్ల రాణివై యుండుము. ఓ నల్లనిముంగురులు గలదానా! నీవు నన్నుఁగోరుదువేని, నాయంతిపురమునఁగల లోకోత్తర సౌందర్యముగల స్త్రీలందఱును అప్సరలందఱు లక్ష్మీదేవినింబోలె నిన్నుఁగొల్చుచుందురు, ఓ సొగసుకను బొమ్మలదానా! కుబేరునికడ నెన్ని రత్నములు, నెన్ని నిధులు నున్నవో, ఆరత్నములను, ఆనిధులను, ఆతనిలోకమును నీవే యథేష్టముగా అను భవింపుము. ఓ దేవీ! రాముఁడు తపస్సునఁగాని, బలమునఁగాని, ఒక పరాక్రమమునఁ గాని నాకు సాటియగువాఁడు కాఁడు. మఱియు, ధనము, తేజస్సు, కీర్తి వీనియందుఁగాని నాకు సాటియగువాఁడు కాఁడు; కావున ఓ వయ్యారీ! మద్యము ద్రాగుము; ఈవనమునఁ దిరుగుము. రతిక్రీడలం దేలుము. కావలసిన భోగము లనుభవింపుము. నీకుఁ గావలయు ధన మొసఁగెదను. భూమి యొసఁగెదను. నీవు నన్నేలుము. నీవు నాయెడఁ బ్రేమతోనుందువేని నీచుట్టములందఱు నీకలిమిఁజూచి నీయెడఁ బ్రేమగలిగియుందురు. ఓ భీరూ! సువర్ణమణిహారములను దాల్చినదానవై, పుష్పించిన దట్టములైన చెట్లతోఁ గూడిన వనము లందుఁ దుమ్మెదల ఝుంకారములను వినుచు, సముద్రతీరములందు నాతోడ విహరించుచుండుము.” అని రావణుఁడు సీతను సామదానో పాయములచే స్వాధీనపఱచుకొనఁ జూచినవాఁడయ్యెను.

## 21-వ సర్గము

### సీత రావణునిపలుకులకుఁ దృణముతోఁ బ్రత్యుత్తర మొసఁగుట

రామవియోగవ్యసనముచేఁ గృశించినదియు, మోమునఁ గాంతి లేక వెలవెలపాఱుచుండునదియు, కరుణింపఁ దగినదియు నైన గొప్ప పిఱుదులు గలదగు సీతాదేవి యా రావణునిరూపు చూచి గడగడ వణఁకుచు, చేయునది లేక గొల్లున నేడ్చుచుఁ దాను పతివ్రత గనుక భర్తనే ధ్యానించుచు, నాభయంకరుఁడైన రావణుని యట్టి కర్ణకఠో రపు మాటలు విని, మొదటఁ గొంతసేపు చింతించి, యాథధ

మునితోఁ బ్రత్యక్షముగా మాటలాడుట పతివ్రతకు ధర్మము గాదు కావున గడ్డిపోచ యొక్కటి నడుమఁ ద్రుంచివైచి, "ఓరీ రావణా! నీవును, నీకలిమియు, నీపరాక్రమాదులును తృణప్రాయము" లను నట్టి యభిప్రాయముఁ దెలుపుచుఁ జెలునవ్వు నవ్వుచు నిట్లనియెను:

"ఓరీ రావణా! నీమనసును నావలననుండి మఱలింపుము. నీ ప్రియురాండ్రయందే మనసు పెట్టుము. పాపాత్ముఁడు మోక్షమును గోరుట యనర్హమగునట్లు నీవు నన్నుఁగోరుట యనర్హము. నేను గొప్ప కులమునఁ బుట్టినదానను, గొప్పకులమును జొచ్చినదానను. ఒకనికి లొంగినదానను (పతివ్రతను). అట్టి నేను లోకనింద్యమయిన యీ కార్యముఁ జేయను" అని చెప్పి పతివ్రతయగు సీతాదేవి యతనినిఁ దిరస్కరించి మఱల నతనితో నిట్లనెను:

ఓరీ! నే నొరునియాలను; పతివ్రతను; గావున నీ కుపయోగ పడుదాననుగాను. సాధువులధర్మమును జక్కఁగాఁ బరిశీలింపుము; సాధువులు చేయు వ్రతమును జేయుము. ఓరీ రేద్రిమ్మతీఁడా! నీభార్య లను గాపాడుకొనవలయు నని నీకెట్లు తలంపుండునో, అట్లే యొరుల కును తమభార్యలను గాపాడుకొనవలయు నను తలంపుండునుగదా! అందఱు నీవంటివారే యని తలఁచికొని స్వభార్యలందే రమింపుము. తనభార్యలందుఁ దృప్తి నొందనివాఁడును, చపలుఁడును, ఇంద్రియముల నిలుకడ లేనివాఁడును, మోసమునందు నేర్పుగలవాఁడును నైన యధ మునికి మగనాండ్రు ఆయుస్సుక్షయము మొదలగు నవమానములఁ గలిగింతురు. ఇచ్చట నీకు బుద్ధి సెప్పు పెద్ద లెవ్వరును లేరా? దుర్బుద్ధు లగువారి చెడు బోధలను విని, వారియిచ్చచొప్పునఁ బోవుచు, రాక్షస వినాశంబుఁ గోరినవాఁడవై పండితులు చెప్పిన హితవాక్యములను విన వైతివేమో. కావుననే నీ కిప్పు డిట్టి పెడకట్టెబుద్ధి పుట్టినది. బుద్ధిహీనుఁ డయి, న్యాయ్యములైన కార్యములఁ జేయని రాజును దమయేలి కనుగాఁ బడసి, సంపదతో నిండినవైనను పురములును, రాజ్యములును నశించిపోవును. అట్లే యీ లంకాపురము సకల రత్నధనధాన్యాది సంపదలతోఁ గూడినదయ్యు, నిన్నొడయనిఁగాఁ బడసినదిగాన నిఁక వేగిరమే పాడైపోవును. ఓరీ రావణా! తనకార్యములవలననే తాను జేటు దెచ్చికొని, ముందాలోచన లేక యవస్థపడుచుండు పాపకర్ముఁడ

వైన నీవు నశించిన నప్పుడు జనులందఱు "స్వకర్మమువలననే దురాత్ముఁడు మ్రగ్గె" నని సంతోషింతురు. పాపాత్ముఁడవైన నీచే నందఱు వంచితులై, "దైవవశముననే క్రూరుఁడైన యీ రాక్షసాధిపునికిఁ గష్టము వచ్చె" నని, పాపపునేతలు గల నిన్నుఁ జూచి చెప్పుకొందురు.

ఓరీ రావణా! నీవు సొమ్ములిచ్చెదనని, ధనమునిచ్చెదనని, రాజ్యమునిచ్చెదనని చెప్పితివి. నీ వంతిపురపుటతివలకెల్ల రాణితనము నొసఁగినను, ధనమొసఁగినను, నేను వాని కాశించి నీకు లొంగుదానను గాను. ఓ రావణా! సూర్యుని నతనివెలుఁగెడఁబాయకయుండునట్లు, నే నారఘువంశోద్భవుఁడైన రాము నెడఁబాసి యుండను. బ్రహ్మాదులచేఁ దమతమలోకముసిద్ధికై ప్రార్థింపఁబడుచుండు ప్రసిద్ధుఁడైన రాఘవుని కుడిభుజము దిండుగాఁ బెట్టికొని నిద్రించినదాననైన నేనిప్పుడు మఱొక్క భుజము నెట్లు దిండుగాఁబెట్టికొని నిద్రింతును. వేదవ్రతములొనర్చి స్నాతుఁడయినవాఁడు, బుద్ధిమంతుఁడు, ఆత్మజ్ఞానవంతుఁడునైన విప్రునికే సాంగవేద విద్య తగినదగునట్లు, నేను భూపతియగు నారామునికే తగిన భార్యను. ఓ రావణా! నీకు మేలగును. వనమున వయసున నున్నయాఁడేనుఁగును గజేంద్రునితోఁ జేర్చునట్లు, రాఘవు నిచ్చటికిఁ బిలుచుకొనివచ్చి నన్నారాఘవునితోఁ జేర్చుము.

ఓ రావణా! నీవు లంకాపురమున నుండఁగోరితివేని, ఆ రామునితోఁ జెలిమిచేసికొనుట యుక్తము. అట్లుకాక, "ఆరాముని వేఁడుకొను దీనదశ మనకేల" యని దీమసముతోనుంటివేని, పురుషశ్రేష్ఠుఁడయిన యారాముఁడు నిన్నుఘోరయుద్ధమునం దెగటార్పఁగలఁడు. ఓ రావణా! నీ విప్పుడు, "నేను వేఁడుకొంటినేని నన్ను మన్నించునా యారాముఁడు" అని సందియపడవలదు. ఆతఁడు ధర్మముల నెఱిఁగినవాఁడు. శరణుచొచ్చినవారియందుఁ బ్రేమగలిగి వారిని గాపాడువాఁడు. కావున నీకుఁ బ్రాణములమీఁద నాశ గలదేని, యతనితోఁ జెలిమిచేసికొనుము. శరణాగతవత్సలుఁడై యారామనృపాలునికడకేగి, "యోమహాత్మా! నేను తెలియక యీ పనిచేసితిని. నాతప్పు మన్నింపుము" అని క్షమాపణ యడుగుకొనుము. నేనును నీతప్పు మన్నింప వేఁడెదను. నీవు మనస్సునందలి కల్మషముఁ బాసి, నన్నుఁ గొనిపోయి యారాముని కప్పగింపుము.

రావణా ! నీవిట్లు నన్ను రఘూత్తమున కర్పించితివేని, నీకు మేలు గలుగును. అట్లుగాక నీ వేవిధమునఁ జేసినను నీకు వధము దప్పదు. ఇంద్రుఁడైనను నిన్ను విడుచు. యముఁడైనను నిన్ను విడుచు. లోకోత్తరుఁడైన రాఘవుఁ డలిగెనేని నిన్ను విడువఁడు. ఇంద్రుఁడు ప్రయోగించిన వజ్రాయుధధ్వనినింబోలె నారాముని వింటినారియొక్క గొప్పనాదమును నీవు వినఁగలవు. చక్కని గణుపులుగలవి, కంకపత్రములు గట్టినవియునగు రామలక్ష్మణులపేరులుగల బాణములు విష జ్వాలల గ్రక్కెడు పాములమాడ్కి జ్వలించుకొనలుగలవై, యీ లంకా పురమునందలి రాక్షసుల నందఱను బూర్ణముగాఁ బరిమార్చుచుఁ గొంత యైనను తావులేక నిండి నిబిడీకృతమై యుండునట్లు చేయఁగలవు. ఓ రావణా! గరుడుఁడు సర్పములను వేగముతోఁ దన్ను కొనిపోవునట్లు, బలవంతుఁడగు రాముఁడును రాక్షసేంద్రులను వేగముతో నెత్తికొని పోవఁగలఁడు. రాముఁడు శత్రువుల నణఁగఁ ద్రొక్కువాఁడు. వామనా వతారుఁడగు విష్ణువు రాక్షసచక్రవర్తియగు బలిని యాచించి మూఁడడుగులచేతనే వానిరాజ్యలక్ష్మిని లాగికొన్నచందమున, శ్రీరాముఁడును నిన్నుఁ బరిమార్చి నన్నుఁ గొంపోవఁగలఁడు.

రావణా ! జనస్థానమందలి పదునాలుగువేవురు రాక్షసులు మడిసి, యాజనస్థానము పాడైపోవఁగా, నీవు యుద్ధము చేయ శక్తిలేనివాఁడవై యీ చేయరాని దొంగపనిని జేసితివి. ఓరీ యధముఁడా! నరసింహములగు నారామలక్ష్మణులను మాయామృగముచే వంచించి వనము విడిచిపోవునట్లొనర్చి, వారు లేనప్పుడు వనములోపలఁజొచ్చి, నన్నుఁ గొనివచ్చితివి. రావణా! వేఁపి పులులయెదుట నుండఁ జాలనట్లు రామ లక్ష్మణులను బొడఁగాంచి నీవుండఁజాలవు. నా ప్రాణేశ్వరుఁడు రాముఁడు లక్ష్మణునితోఁ గూడవచ్చి, సూర్యుఁడు స్వల్పోదకము తనకిరణములచేఁ బీల్చునట్లు, నీ ప్రాణములను దనబాణములచేఁ దీయఁగలఁడు. వృత్రాసురుని యొంటిచేయి దేవేంద్రుని రెండుచేతులతోఁ బోరాడఁజాలక యోడినట్లు, దొంగతనమున నన్నుఁ దెచ్చిన నీ వొక్కరుఁడవు శూరులైన రామలక్ష్మణులతోఁ బోరితివేని, నీకు జయముగలుగుట సిద్ధము గాదు. కాలహతమైన గొప్పవృక్షము పిడుగునుండి తప్పించుకొనఁజాలనట్లు, నీవు పైలోకములకుఁ బోయినను, పాతాళమునకుఁ బోయినను

దశరథపుత్త్రుఁడయిన రాముని బారినుండి తప్పించుకొనఁజాలవు. ఇది నిస్సంశయము" అని సీతాదేవి రావణునిఁ బరుషవాక్యంబు లాడిన దాయెను.

## 22-వ సర్గము

**రావణుఁడు సీతకు బదులు సెప్పుట**

రాక్షసరాజగు రావణుఁడు సీతయాడిన పరుసనిమాటలువిని, చూడఁ దగినది యగు సీతనుగూర్చి యప్రియవాక్యములతో నిట్లనియె:

"ఒకఁడు స్త్రీల నెంతెంతగా బతిమాలుచున్నాఁడో అంతంతగా స్త్రీలకు వాఁడు లోకువయగుచున్నాఁడు. ఎంతెంతప్రియముగా మాటాడుచున్నాఁడో, అంతంతగాఁ దిరస్కృతుఁడగుచున్నాఁడు. నేర్పరియగు సారథి త్రోవతొలఁగి పరువిడుచున్న గుఱ్ఱముల నాఁపునట్లు నీయందుఁ బుట్టినకామము నాకోపము నాఁపుచున్నది. మనుజు లెవ్వరియందాఁప రాని కామము నుంచెదరో, వారట్టివారియందు జాలియు, ప్రేమయుఁ గలిగియుందురు. వధమునకుఁ దగినదానవును, భంగపఱుపఁదగినదానవు, కపటమునివేషముఁదాల్చిన రామునియం దాసక్తవునయిన నిన్ను నేనిప్పుడు చంపియే యుండవలసినది. అయినను నీయందు నాకున్న మోహామువలననే నేను నిన్నుఁ జంపక విడిచితిని. మైథిలీ ! నీవే యే పరుసనిమాటలు పలికితివో, ఆయా మాటలలో నొక్కొక్క దానికిని నిన్నుఁ జంపి యుండవలసినది. అయినను, నీయెడఁగల మోహాముచే నిన్నేమియుఁ జేయలేక యుంటిని."

ఇట్లు రాక్షసాధిపుఁడగు రావణుఁడు సీతతోఁ జెప్పి కోపాటోపముతోఁ గూడుకొన్నవాఁడై, మఱల నిట్లు పలికెను.

"ఓ చక్కని మైచాయగలదానా ! నీకిదివఱలో నొసఁగిన గడువులో నిఁక రెండు నెలలు మిగిలియున్నవి. ఈ రెండునెలలలోపలఁ జక్కఁగా యోచించికొని యావల నాశయనము నెక్కుము. అట్లు రెండు నెలలు గడచినపిదపఁ గూడ నీవిట్లు నన్ను భర్తనుగాఁ గోరకుందువేని, నిన్ను సద్దికూటికై వంటయింటఁ జంపివైచెదరు.

రాక్షసేంద్రునిచే నివ్విధమున బెదరింపఁబడుచుండు జానకిని జూచి, దేవగంధర్వకన్యకలు వికారపుఁజూడ్కి గలవారలై కడు

దుఃఖించిరి. వారిలోఁ గొందఱోడు గఱచియు, కొందఱు మోములు చిట్లించియుఁ, గొందఱు గ్రుడ్లుత్రిప్పియు నా సీతాదేవి నూఱడించిరి.

వారట్లూఱటచేయఁగా, సీత కొంతదిటవు పూని, రాక్షసాధిపుఁడయిన రావణుంగూర్చి, తనకితవును, పాతివ్రత్యబలగర్వముతోఁ గూడి నదియునైన మాటల నిట్లనెను:

"ఓరీ రావణా! నీకు హితము గోరువాఁడేని, జననింద్యమైన పరస్త్రీ హరణరూపమగు చేటునుండి నివారించువాఁడేని యొక్కఁడును లేఁడుకాఁబోలును! దేవేంద్రునకు శచీదేవివలె ధర్మాత్ముఁడగు రామునికి దేవినైన నన్ను నీచుఁడవైన నీవు గోరితివికాని ముల్లోకములలోపల మఱొక్కఁడు నన్ను మనసున నైనఁ దలఁచునే? ఓరాక్షసాధమా! మహాప్రతాపుఁ డయిన రామునియొక్క పట్టంపుదేవేరినైనఁ నన్నెట్టి క్రూరపుమాటలు మాటాడితివో, ఆమాటల కలిగినవాఁడై రాముఁడు నీపైకి వచ్చెనేని, నీవెచ్చటికిఁ బోయి తప్పించుకొందువు?

ఒకవనమున మదించిన యేనుఁగును, పిఱికిస్వభావముగల కుందేలును గూడి పోరిన నెట్లుండునో, రాక్షసాధమా! నీవును రాముఁడును బోరుట యట్లుండును. ఓరీ నీచుఁడా! శ్రీరాముండు మదపుటేనుఁగుఁ బోలినవాఁడు. నీవు మనుష్యునిఁ జూచిన మాత్రమునఁ బరుగెత్తు సభ్యావముగల కుందేటివంటివాఁడవు. ఓరీ! దండకారణ్యమున రామునియెదుటఁ బడక, మాయామృగమునెపమున వారిని వనము నుండి వెడలఁజేసి, యెవ్వరు లేనిసమయమున దొంగవలె నన్నెత్తికొని పాఱివచ్చినదిగాక, యిచ్చట నీ వారిలో నాత్మస్తుతి చేసికొనుటకు లజ్జ పడకున్నావు! అప్పుడు నీ వారాఘవునికంటఁ బడవైతివి. అప్పు డీ డంబమువస తెలిసియుండును. ఓరీ దురాత్ముఁడా! నలుపు తెలుపు గలిసి నవి, విరూపములునునైన నీమిడిగ్రుడ్లు నన్ను వలపుతోఁ జూచునప్పు డేల క్రిందఁబడకున్నవి? ధర్మాత్ముండయిన యారాఘవునిభార్యను, దశరథమహారాజునకుఁ గోడలనునైన నన్నీ విధమున దురాలాపములాడెడి నీనాలుక యేల తునిఁగి క్రిందఁబడకున్నది?

ఓపదితలలవాఁడా! భస్మముచేయఁదగినవాఁడా! నేను నాపాతివ్రత్యబలముచేతనే నిన్ను బూదిచేసియుందును. అయినను, నాభర్త యుత్తరువు లేమిచేతను, పాతివ్రత్యరూపమైన తపస్సును గాపాడుకొ

వలయును గనుకను నిన్నిప్పుడు బూదిచేయక మన్నించితిని. బుద్ధిమంతుఁడగు రాముని కి దేవినైన నన్ను దండకారణ్యమునుండి యపహరించి తేఁబ నీకు వీలుకాదు. నన్ను నీవపహరించుటయను కార్యమును నీ వినాశమునకై భగవంతుఁడే యేర్పఱచినవాఁడు. దీని కేసందియమును లేదు. ఓ రావణా! నీవు శూరుఁడవు. కుబేరునకుఁ దమ్ముఁడవు. చతురంగ బలముతోఁ గూడినవాఁడవు. ఇట్టి సహాయబలముగలవాఁడ వయ్యు, నీవు మాయామృగవ్యాజముచే రాఘవుని వేఱొక్కచోటికిఁ గొని పోయి, యాతనిదేవినైన నన్నేల దొంగిలించి తెచ్చితివి! నిన్ను విధి యీడ్చుచున్నది గావున నీ కిట్టి విపరీతబుద్ధి పుట్టినది.

అని సీతాదేవి పలుకఁగా, రావణుఁ డామెపలుకులు విని క్రూరములైన తన మిడిగ్రుడ్లుత్రిప్పి తదేకదృష్టితో నాదేవిం జూచెను.

ఆ రావణుఁడు నల్లని మేఘమువంటి శరీరకాంతిగలవాఁడును, గొప్ప మూఁపురములు గలవాఁడును, సింగమువంటి సత్త్వయు, నడకయుఁ గలవాఁడును, కాంతిమంతుఁడును, మండుచున్న కొనవాలుకయు, కన్నులుంగలవాఁడును, కోపవశమున శిరస్సునందలి కిరీటముకొన కదలుటచేఁ బొడవయినవానియట్లు తోఁచువాఁడును, నానావిధములైన పుష్పహారములను దాల్చి సుగంధము పూసికొన్నవాఁడును, ఎఱ్ఱని పూలదండలును ఎఱ్ఱని బట్టలు గట్టినవాఁడును, అపరంజితోఁ జేయఁబడిన భుజకీర్తులను దాల్చినవాఁడును, మొలను నల్లనైన పట్టుదట్టి దిట్టముగాఁ గట్టినవాఁడగుటంజేసి, యమృతముఁ జిలుకునిమిత్తమై వాసుకి యనుసర్పముచేఁజుట్టఁబడిన మందరపర్వతమువాడ్కి నుండువాడునునై యుండెను. మఱియుఁ బర్వతముంబోలు రావణుఁడు బలిసిన లావు బుజములు గలవాఁడగుటచేత నిరువైపుల రెండుశిఖరములతోఁ గూడిన మందరశైలము మాడ్కియు, బాలసూర్యునిపగిదిఁ దేజరిల్లు నంటు జోళ్లు గలవాఁడగుటచే నెఱ్ఱని చిగుళ్లును బూవులును గలిగిన రెండ శోకవృక్షములతో నొప్పిన పర్వతముకైవడిని వెలుఁగుచుఁ గల్ప వృక్షముంబోలి, మూర్తిమంతుఁ డయిన వసంతుఁడో యనునట్లున్న వాఁడై, వల్లకాటియందలి యాలయంబుఁ బోలినవాఁడై, సకలభూషణములఁ దాల్చియు భీకరుఁడై, కోపముచే గన్ను లెఱ్ఱనచేసి, యాసీతాదేవి నుఱిమిచూచి, పాముమాడ్కి బుసకొట్టుచు, "ఓసీ! సూర్యుఁడు

ప్రాతఃకాలమున నుదయకాలమందలి చీఁకటిని రూపుమాపునట్లు నిన్నిప్పుడే నలిపివేసెదను చూడుము" అని సీతాదేవినిఁజూచి న్యాయముఁ దప్పినదియు, ఉపయోగము లేనిదియునైన మాటను జెప్పెను.

శత్రువుల నేడ్పించునట్టివాఁడగు రావణుఁడిట్లుఁగున సీతను బెదరించి, యాసీతచుట్టు నున్నట్టి భయంకరాకారలైన ఒంటికంటిది, ఒంటిచెవిది, చెవులతో ముసుఁగువేసికొనునది, ఆవుచెవులది, ఏనుఁగు చెవులది ప్రేలాడు చెవులది, చెవులులేనిది, ఏనుఁగడుగులది, గుఱ్ఱపుకాళ్లది, ఆవుకాళ్లది, అడుగులందుఁజుట్టుగలది, మఱియొక యొంటికంటిది, ఒంటి కాలిది, బరువుకాలిది, మొండిది (కాళ్లులేనిది), కడునిడుపుమెడయుఁ బెద్ద తలయుఁగలది, లావుబొజ్జయు బలిసిన కుచంబులును గలది, వెడల్పుమోమును గన్నులునుగలది, నిడివినాలుకది, నాలుకలేనిది ముక్కుడిది, సింగపు మోరది, ఆవుమోముది, పందిమోముది మొదలగు రక్కసులఁ జూచి, "యోకాంతలారా! మీరందఱు గూడుకొని, ఈ సీతమనస్సున కిష్టములైన పనులు చేసియు, ఇష్టములుగాని పనులుచేసియు, మంచిమాటలచే బుజ్జగించియు, సొమ్ములిచ్చెదమనిచెప్పియు, రామునియెడ విరోధముఁ బుట్టించియు, కడపటఁ గొట్టియుఁ దిట్టియు, నీసీత నాకు లోఁగునట్లు చేయవలయును" అని వారి కానతిచ్చి, కామక్రోధములచే నొడలు దెలియనివాఁడై సీతాదేవిని బెదరించెను.

అంతట ధాన్యమాలినియను నొకరాక్షసి వేగిరమేవచ్చి, యా పదితలలవానిని గట్టిగాఁగౌఁగిలించికొని "మహారాజా! నాతోడ రమింపుము, నీవు రాక్షసేశుఁడవు. ఇది కాంతిలేనిది. పిఱికిది. మానిసి జాతియందుఁ బుట్టినది. దీనితో నీవు రమించిన, నీకేమిసుఖము గలుగును? మహారాజా! నీబాహుబలార్జితములైన దివ్యభోగముల ననుభవింప నిది నోఁచుకొనలేదు. బ్రహ్మదేవుఁడు దీని కా సుఖముల నొసఁగఁడయ్యె. కామములేనిదానిని గామించువాని శరీరమునకు మంటలు పుట్టును. తనపై వలపుగొన్న దానితోఁ గ్రీడించువాని కెక్కువ యానందము గలుగును" అని యావలి కీడ్చెను.

ఇవ్విధమున ధాన్యమాలిని రావణాసురుని చెయిపట్టి లాగఁగా, మేఘశ్యామలుఁడయిన రాక్షసేశ్వరుఁడగు రావణుఁ డట్టహాసము

చేయుచుఁ జివుక్కున వెనుకకుఁ దిరిగి, వెలుఁగుచున్న వేఁడివెలుఁగు వెలుఁగుంబోలు వెలుఁగుగల తనమందిరమునకుఁ బయనమాయెను. ఆరావణునితో వచ్చియున్న దేవగంధర్వకన్యలును, నాగకన్యలును ఆరావణునితోడ మఱలి యారావణుని గృహశ్రేష్ఠమునఁ బ్రవేశించిరి. రావణుఁడును పతివ్రతాధర్మమున నిలిచినదియును, ధైర్యము గలదియు, రావణునియొక్క యాకారమునుజూచియు, మాటలు వినియుఁ గడువణఁకునదియు నైన యాసీతాదేవిని మున్నుచెప్పిన తెఱఁగున బెదరించి, కామముచే నొడలుమఱచినవాఁడై, దేదీప్యమానమైయున్న తననగరు సొచ్చినవాఁడాయెను.

## 23-వ సర్గము

### రాక్షసస్త్రీలు సీతాదేవిని బెదరించుట

శత్రువుల నేడ్పించువాఁడయిన రావణుఁ డిత్తెఱఁగున సీతాదేవితోఁబలికి, రాక్షసస్త్రీలతో నాదేవి వశమగునట్లు చేయుమని యానతిచ్చి, తనపత్నియగు ధాన్యమాలిని లాగుటచే మఱలి తనయంతఃపుర భవనము చొఱఁగా, చూపఱకు దడపుట్టించునట్టి రాక్షసకాంతలందఱు సీతాదేవికడకుఁ బరువిడివచ్చి సీతచుట్టును గూర్చుండి, యెక్కువ కోపముతోఁ గూడినవారలై, కడుఁబరుసనిమాటలతో నాసీతాదేవి నెత్తిపొడువ నారంభించి, "ఓసీతా! పులస్త్యమహామునివంశమునఁ బుట్టినవాఁడును, పరమోత్తముఁడును, గొప్పమొనకాఁడును, పదితలలుగలవాఁడునైన రావణునికి భార్యయగుట నేల గొప్పగానెంచవు" అని యనిరి.

అంతట నేకజటయను నొకరాక్షసాంగన కోపముచే నెఱ్ఱనైన కన్నులుగలదై, పిడికిటి కడఁగునంత సన్ననినడుముగలదగు సీతాదేవిని బిలిచి, "యోసీతా! నామాటవినుము. ఆఱుగురు ప్రజాపతులలో నాలవ ప్రజాపతి బ్రహ్మమానసపుత్రుఁడు. అతఁడు పులస్త్యుఁడని ప్రఖ్యాతినొందినవాఁడు. ఆతనికి మానసపుత్రుఁడొకఁడు పుట్టెను. అతఁడు గొప్పవెలుఁగుగలవాఁడు; మహర్షి; విశ్రవసుఁడని పేరువడసినవాఁడు; బ్రహ్మదేవునితో సాటియగు కాంతిగలవాఁడు. ఓ విఱివికన్నులదానా! శత్రురావణుఁడగు రావణుఁ డా విశ్రవసునితనయుఁడు;



రాక్షసస్త్రీలు సీతాదేవిని బెదరించుట. సు—90

రాక్షసులకు లేఁడు. అట్టి యా రావణేశునికి నీవు భార్యయగుటకుఁ దగినదానవు. ఓ చక్కనైన యన్నియంగములు గలదానా! నామాట యేలయంగీకరింపకున్నావు?" యని యడిగెను. ఆమాటలకు సీత బదులు చెప్పకుండెను.

అంత పిల్లికన్నులం బోలుకన్నులుగలదగు హరిజటయనురాక్షసి కోపముచేఁ గన్నులు గిరగిర త్రిప్పి, "ఓసీ సీతా! ముప్పదిమూడుకోట్ల దేవతలతోఁ గూడనెత్తివచ్చిన దేవేంద్రునిగెల్చినట్టి శూరుఁడగు రావణాసురునికి నీవు భార్యవగుటకుఁ దగినదానవు" అని చెప్పెను. దానికిని సీత బదులుచెప్పక మౌనముతో నుండెను.

అంతటఁ బ్రఘసయను నొకరాక్షసాంగన యప్పుడు సీతాదేవిని బెదరింపుచు "ఓ సీతా! మగఁటిమిచే మదించినవాఁడును, మొనగాఁడును, యుద్ధములందు శత్రులకు వెఱచి మఱలనివాఁడును, చేవకాఁడును, మగఁటిమిగలవాఁడునునైన రావణునికిఁ బెండ్లామవగుట నీకుఁ జేఁదే? మహాబలుఁడగు రావణుఁడు కాంతలలోపల నిష్టురాలును, గౌరవముతోఁ జూడఁబడునదియునైన తనపట్టపు దేవియగు మందోదరిం బాసియు, నానావిధరత్నములతో।నలంకృతమును, వేయిమందిస్త్రీలతోఁ గూడినదియునైన యంతఃపురమును విడిచి నిన్నుఁ బొందుచున్నాఁడే. నీవేల యతనికి భార్యవగుటకు సమ్మతింపవు"? అని యడిగెను. ఆ మాటలకుఁ గూడ సీత బదులు సెప్పక ముందువలెనే యూఱకుండెను.

అంతట వికట యను మఱియొక రాక్షసి, "ఓసీతా! తొల్లి యుద్ధరంగమున ననేక పర్యాయములు దేవగంధర్వదానవులను గెల్చిన రావణుఁ డిప్పుడు నీచేరువకు వచ్చియున్నాఁడు. ఓ యధమురాలా! అన్నిటఁ గొఱఁతలేని యమ్మహాత్ముఁడయిన రాక్షసేంద్రుఁడగు రావణునికి భార్యవగుట కేల యపేక్షింపవు?" అని యా సీతాదేవితో ననెను. దానికిని సీత మాఱు పలుకకుండెను.

అటుతర్వాత దుర్ముఖియను పేరుగల మఱియొక రక్కసి సీతం గూర్చి, "ఓ నిడివి క్రీఁగన్నులుగలదానా! ఏరావణునికి వెఱచి సూర్యుఁ డెండగాయఁడో, గాలిదేవుఁడు వీవఁడో, యా రావణునిచేరువ నేల యుండవు? మఱియుఁ గల్పవృక్షము లెవ్వనికి వెఱచి పూవులవానఁ గురిపించినవో, ఓచక్కని కనుబొమలదానా! పర్వతములును మేఘము

లును గోరినప్పుడు జలమునొసఁగినవో యట్టి రాజాధిరాజాయిన రాక్షసాధిపుఁడగు రావణునికి భార్యవగుటకు నీవేల యిష్టపడవు? నేను నీకుఁ జెప్పినమంచిని చక్కఁగా గ్రహింపుము. చిఱునవ్వుమోముగలదానా! నామాటను వినుము. లేనిచో నీకు మరణము నిక్కము” అని చెప్పెను.

## 24-వ సర్గము

### రాక్షసులు సీతను బెదరించుట

వికృతంపు మోరలుగలవారును, మోమోటము లేనివారునైన యారాక్షసకాంతలందఱు సీతాదేవిచుట్టు నిలుచుండి యాసీతంగూర్చి చెవుల కింపుగాని మాటలతో నిట్లనిరి:

సర్వభూతమనోహరురాలవయిన యోసీతా! మేటిపాన్పుతోఁ గూడిన యంతఃపురమున నీ వుండనియ్యకొనకున్నావదేల? నీవు మనుష్యస్త్రీవిగనుక మానుషుఁడైన రామునికి భార్యయగుటను గొప్పగా నెంచుచున్నావు. రాముని యొద్దనుండి నీమనసును మఱలింపుము. నీ వెన్నటికిని రామునికిఁ బత్నివి గానేరవు.ముల్లోకములకలిమి ననుభవించు వాఁడును, రాక్షసులకుఁ బ్రభువునైన రావణుని భర్తనుగాఁబొంది, సుఖములకుఁ గొఱఁతలేకుండ విహరింపుము. ఓచక్కనిదానా! నీవు మానిసివి గనుక రాజ్యము గోల్పోయి, పట్టాభిషేక కార్యసిద్ధినొందక, పందయై యడవికి వచ్చినట్టి మానిసియైన రామునే కోరుచున్నావు. నీకుఁ గొంచెమైనఁ దెలివి లేదే” అని.

పద్మపత్రములంబోలు కన్నులుగలదైన సీతాదేవి యారాక్షసులాడినమాటలు విని, కన్నులనుండి నీరు గార్చుచు నివ్విధంబునఁ బలికెను:

“ఓ కాంతలారా! మీరందఱు గలిసి పలికినమాట లోకవిరుద్ధముగ నున్నది. మఱియు మీమాట నామనస్సునకుఁ బాపకరముగాఁ దోఁచుచున్నది. మనుష్యజాతియందుఁ బుట్టినకాంత రాక్షసజాతియందుఁ బుట్టినవానికిఁ బెండ్లామగుట తగదు. మీరందఱు గలిసి నన్ను ముక్కలు ముక్కలుగా నఱికి నమలుఁడు. అది సమ్మతమే. మీమాటను నేను వినను. నేను మీమాటప్రకారము చేయను. ఎవఁడు నా నాథుఁడో, అతఁడు పేదగాని, రాజ్యహీనుఁడుగాని అతఁడే నాకు గురువు

సువర్చల సూర్యునియందును, భాగ్యశాలిని యగు శచీదేవి దేవేంద్రుని యందును, అరుంధతి వసిష్ఠుని యందును, రోహిణి చంద్రునియందును, లోపాముద్ర యగస్త్యునియందును, సుకన్య చ్యవనునియందును, సావిత్రి సత్యవంతునియందును, శ్రీమతి కపిలునియందును, మదయంతి సౌదాసునియందును, కేశిని సగరునియందును, భీమరాజుకూతురగు దమయంతి నలునియందును మిక్కిలి యనురాగముగలవారలై యున్నట్లు, నేనును ఎల్లప్పు డిక్ష్వాకువంశపురాజులలో శ్రేష్ఠుఁడయిన రామునియందే నిత్యము ప్రేమగలిగియుండుదానను” అని సీతాదేవి యారాక్షసకాంతలతోఁ జెప్పెను.

రావణునిచేఁ బురికొల్పఁబడిన రాక్షసస్త్రీలు సీతమాట విని యెక్కువ యాగ్రహముగలవారై, పరుసనిమాటలతో నాసీతను బెదరింపఁ దొడఁగిరి: అప్పుడు హనుమంతుఁడు శింశుపావృక్షమున దాఁగినవాఁడై, కిమకమ యనక, సీతాదేవి నారాక్షసకాంతలు బెదరించు మాటలను వినుచుండెను. అప్పుడు రాక్షసాంగనలు కడుఁగనలినవారలై, భయముచే వణఁకుచుండు నాసీతాదేవి నన్నివైపుల ముట్టడించి, మెఱయుచుండెడి ప్రేలాడుపెదవులను గొఱుకుచు, గొడ్డళ్లను చేతఁ బట్టికొని, “యిది రాక్షస రాజగు రావణుని భర్తనుగాఁ బొందుటకుఁ దగినదికాదు” అని యనేకవిధముల నాసీతను బెదరించిరి. చక్కనిమోముగల యాసీత భీకరలయిన రాక్షసకాంత లట్లు బెదరించుచుండఁగా, తనంతటఁ బుట్టుచుండు కన్నీటిని దుడుచుకొనుచు శోకసాగరమున మునిఁగినదై, శింశుపావృక్షముకడకుఁ జేరి నిలుచుండెను. అప్పుడు రాక్షసకాంతలును సీతను నలువైపులఁ జుట్టుకొని, విన్నదనము మోమునఁ దోఁప, రామవియోగవ్యసనముచేఁ జిక్కినదై, నల్లనిబట్టకట్టికొనియుండు నాసీతను పలుతెఱఁగుల బెదరింప నారంభించిరి.

కోపముచే నెఱ్ఱనైన యాకారముగలదియు, వికృతరూపురాలును, లావుపొట్టగలదియు, చూపఱకు వెఱపుపుట్టించునదియునైన వినత యను నొకరాక్షసకాంత “ఓసీతా! నీ వింతపర్యంతము భర్తయందుఁ జూపిన స్నేహము చాలును. అన్నిసంగతులందును నెక్కువకుఁబోవుట వ్యసనమునకుఁ గారణమే యగును. నీయెడ నేను మిక్కిలి సంతసించితిని. లోకమున మనుజు లాచరింపవలసినపనిని జేసితివి.

మైథిలీ, నీమేలు కోరి నేను జెప్పెడిమాటను సైతము గొంచెము వినుము. దేవేంద్రునివంటి రూపవిక్రమములుగలవాఁడును, నేర్పు కాఁడును, దానశీలుఁడును, అందఱిచేఁ జూడఁదగినవాఁడును, రాక్షసుల కందఱకు నధిపతియునైన రావణుని భర్తనుగా వరింపుము. మానుష జాతియందుఁ బుట్టినవాఁడగు పిఱికియయిన రాముని విడిచి, ఓవైదేహీ! మేలిమిమైపూఁతపూసికొన్నదానవై, చక్కని సొమ్ములుదొడిగినదానవై, రావణునిఁ జేరుము. ఇదిమొదలు సకలలోకములకెల్ల రాణివగుము. ఓసుందరాంగీ! స్వాహా యగ్నికిని శచి దేవేంద్రునకుం బోలె నీవును ఆరావణునికిఁ బ్రీతిగావించుదానవుగా నుండుము. నిరాయుష్కుఁడును, పిఱికియునైన యారామునితో నీకేమి కావలసినది యున్నది? ఓసీతా! నీవు నామాటప్రకారము చేయవేని, నిన్నిప్పుడే మేమందఱము గూడి తిందుము” అని సీతతోఁ జెప్పెను.

అటుతర్వాత వ్రేలుకుచములు గలదగు వికటయను మఱొక్క రాక్షసి కోపముతో సీతాదేవినిఁ బొడుచుదానివలె పిడికిలి పైకెత్తి పట్టి బొప్పుచు, ఓ బుద్ధిలేనిదానా! ఇష్టములుగాని పలుకు లెన్నియైన నీవు చెప్పినను, వానినన్నింటిని నీపై దయవలనను, నీసౌకుమార్యము వలనను నోర్చియుంటిమి. సమయానురూపముగాఁ జెప్పిన మాహిత వాక్యమును వినకున్నావు! ఇతరులకుఁ బొందశక్యముగాని సముద్రము యొక్క యీవలిగట్టును బొందితివి. భీకరమయిన రావణునియంతి పురమునకుఁ దేఁబడితివి. రావణాసురునిగృహమున నుంపఁబడి, మాచేఁ గాపాడఁబడుచుండు నిన్నుఁ గొనిపోవుటకు సాక్షాత్తుగా దేవేంద్రుఁ డైనను జాలఁడు. నీకు మేలగు నామాట వినుము. నీవు కన్నీరుపెట్టు కొనవద్దు. పనికిమాలిన యీవ్యసనము మానుము. ప్రేమను ఆనంద మును బొందుము. ఎడతెగని దీనతను విడువుము. ఓసీతా! రాక్ష సేంద్రునితో యథేష్టముగా విహరింపుము. ఓసీ పిఱికిదానా! స్త్రీలకు యౌవనము తిరముగానిదని నీకుఁదెలియునుగదా! నీప్రాయము గడచునంతలోపల సుఖము నొందుము. కైపుచే నెఱ్ఱనైన కన్నులు గలదానా! రాక్షసరాజుతోఁగూడి, మనోహరములగు ఉద్యానవనము లందును పర్వతములందును విహరింపుము. ఓసీ చక్కనిదానా! నీవశ మున నేడువేలమంది పనికత్తె లుందురు. రాక్షసులకెల్ల భర్తయైన

రావణుని భర్తనుగాఁ గోరుము. ఓ మైథిలీ! నామాటప్రకారము నీవు చేయవేని, నీగుండెను జీల్చి తిందును" అని సీతను బెదరించెను.

అంతటఁ జండోదరియను నొక్కరాక్షసి కోపముచే నొడలు దెలియనిదై, గొప్పమొనవాలుం ద్రిప్పుచు, తనతోడి రక్కసులనుజూచి, "ఓ యమ్మలారా! లేడివలె నదరుకన్నులు గలదియు, వెఱపుచేఁ గడు వణఁకుచున్న స్తనములు గలదియునైన యీసీతను మనచేఁడు తెచ్చి నప్పుడే, దీనిగుండెలును, ప్లీహమును, ఉత్పీడమును, నాడులతోఁ గూడిన గుండెకాయను, ప్రేగులను, తలను దినవలె నని నాకు కోరిక పుట్టినవి. ఇప్పుడు వానిని దిందమని యెంచెదను" అని చెప్పెను.

అటుతర్వాతఁ బ్రఘసయను నొకరాక్షసి, తనతోడి రాక్షస కాంతలనుజూచి, "చెలులారా! యేల తామసించెదరు. ఈక్రూరు రాలిమెడను నులిమి వేయుఁడు. పిమ్మట రాజుతో ఆమానుషస్త్రీ మృత యయ్యె నని తెలుపుఁడు. దానికి రావణుఁడు "మీరు తినుఁ" డని చెప్పునుగాని, మనల నేమియు ననఁడు. దీనికేమియు సందేహము లేదు" అని చెప్పెను.

అంత అజాముఖియను మఱియొకరాక్షసి "యక్కలారా! దీనిని జంపి సమములయిన మాంసపుతునుకలను జేయుఁడు. పిమ్మట మనమందఱము పంచుకొందము. వివాదమాడుట నాకు సమ్మతముగాదు. మద్యమును, నానావిధములగు పచ్చళ్లను వేగిరముగాఁ దెండు" అని చెప్పెను.

అంతట శూర్పణఖయను రాక్షసి తనచెలులంజూచి "యోయమ్మ లారా! అజాముఖి సెప్పినదే యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. సకల శ్రమలఁ బోఁగొట్టునట్టి మద్యమును దెండు. ఈసీతమాంసమును దిని, నికుంభిలయను శక్తిముందఱ నృత్యము సేయుదము" అని చెప్పెను.

ఘోరరూపలగు రాక్షసస్త్రీ లిత్తెఱంగున బెదరింపఁగా, సీత ధైర్యమువిడిచి కంట నీరు గార్చెను.

## 25-వ సర్గము

### సీత చింతించుట

ఆక్రూరలగు రాక్షసస్త్రీలు మిగులఁ గర్ణకఠోరము లయిన మాటలతో నాసీతాదేవిని బెదరింపఁగా, జానకి ఘలవించి, వారట్లు

పలుకుచున్నను పతివ్రతాధర్మము నడపుటయందు విడువని పట్టుదల గలదిగావునఁ గడగడవడఁకుచున్నను, కన్నులు నీటితో నిండగా దగ్గుత్తికతో వారిని జూచి నిట్లనెను.

"ఓ రక్కసులారా! రాక్షసజాతియందుఁ బుట్టినవానికి మానవజాతియందుఁ బుట్టినది భార్య యగుట పొసఁగదు. మీరందఱు నన్ను నమిలివేయుఁడు. సమ్మతమే కాని మీ మాటచొప్పున నే నెన్నఁటికిని చేయను" అని సీత రాక్షసకాంతలతోఁ జెప్పెను.

అప్సరసంబోలునట్టి సీత యారావణునిచే బెదరింపఁబడి, రాముని యెడఁబాటువలని వ్యసనముచే దుఃఖించుచు, రాక్షసుల మధ్యమున నుండి సుఖము లేనిదై యుండెను.

మఱియు నాసీతాదేవి తనదేహమును జొచ్చుదానివలెఁ గడు నడఁకువతోఁ గూడినదై, వనమునఁ దనగుంపునుండి తప్పించుకొని తోడేళ్లనడుమఁ జిక్కి యల్లాడుచుండు నాఁడుజింకవలెఁ గడు వణఁకెను.

మనసు విఱిగినదైన యాసీతాదేవి పుష్పించిన యశోకవృక్షము యొక్క గొప్పకొమ్మ నొక్కదానిని బట్టికొని దుఃఖముతో రామునిఁ దలఁచి చింతించుచుండెను.

ఆసీత యాప్రకారము కన్నీరువిడిచి, యాకన్నీటిచేఁ దనవిఱివి గలకుచములను దడపుచు, రామునింగూర్చి వ్యసనపడుచు, దుఃఖమున కంతము గానదయ్యెను.

ఆసీత రాక్షసభీతిచే వణఁకుచు, పెనుగాలివీచునప్పు డరఁటి మ్రాను గ్రిందఁబడినట్లు క్రిందఁబడినదై, రాక్షసులభయముచే వణఁకుచు మోమునఁ గళదప్పినదయ్యెను.

అట్లు వణఁకుచుండు సీతాదేవియొక్క నిడుపు వెడల్పునుం గల దగు జడ గదలుచుఁ బ్రాఁకుచున్న పామువాడ్కిఁ గనఁబడెను.

ఆసీత వెతలఁ గుందినదై, శోకముచే మనమున నేమియుఁ దెలియనిదై, నిట్టూర్పు విడుచుచుఁ గన్నీరువిడిచి "అక్కటా! రామా! హాలక్ష్మణా! హా! యత్తగారా కౌసల్యా! హాసుమిత్రా!" యని విలపించెను.

"స్త్రీకిఁగాని, పురుషునికిఁగాని మృత్యువు అకాలమున రాదు" అని పెద్దలు చెప్పుకొనుట వాస్తవము. కావుననే క్రూరలైన రాక్షస స్త్రీలచే నిక్కడ నిత్తెఱఁగునఁ బీడితనై, రాముని దలచి దుఃఖము నొందినదాననై, క్షణమైనను జీవించియున్నాను. ఈ నేను పాపాత్మురాలను, నిర్భాగ్యురాలను, సముద్రమునడుమ గాలిచేఁ గొట్టఁబడిన పడవ నీట మునిఁగిపోవునట్లు, నశించెను. ప్రసిద్ధుఁడైన నా పెనిమిటిని గాంచక, రాక్షసులవశమునఁ జిక్కినదాననై, నీటిచేఁ గోయఁబడిన గట్టువలెఁ జింతతోడఁగూడి కృశించుచున్నాను. కమలపత్రనేత్రుఁడును, సింహమువలె గంభీరముగా నడచువాఁడును, నెనరుగలవాఁడును, ప్రియవాక్యములు చెప్పువాఁడునైన నానాథుని భాగ్యవంతులగువారు దర్శింతురుగాని, నిర్భాగ్యురాలైన నాబోటి కామహాత్మునిదర్శనమబ్బునే. ఎల్లవిధముల ధీరుఁడైన రాము నెడఁబాసియున్న నాజీవితము విషము గ్రోలినదాని జీవితమువలె దుర్లభమగును. నేను జన్మాంతరమున నెట్టి పాపము గావించితినో, దానికి ఫలముగా నే నీ జన్మమునఁ గడునోర్వరాని క్రూరదుఃఖమును బొందుచున్నాను. ఈ యపారశోకముతో నుండఁజాలను. గనుకఁ బ్రాణములఁ దొఱఁగఁ గోరెదను. ఈరాక్షస స్త్రీలనడుమ నుండువఱకు నా కారాముని దర్శనమబ్బదు. "ఛీ! యీ మానిసిజన్మమేల! ఛీ! ఈ పరవశమైన శరీరమేల! ఈపరవశమైన శరీరమును స్వేచ్ఛప్రకారము విడుచుటకు వీలుగాదుగదా" అని సీత తనలోఁ దానిట్లు చింతించిన దాయెను.

## 26-వ సర్గము

### సీత చింతించుట

జనకరాజపుత్రి కన్నులనిండ నీరుగ్రమ్మియుండ నివ్విధమున ననుకొన్నదై, అలసట తీరుటకై పుడమిని బొఱలింపఁబడిన గుఱ్ఱపుఁబిల్లవలెను, వెఱ్ఱిదానికైవడియు, మత్తుగొనిన దానికైవడియు, భ్రమచెందిన దానికైవడియు దుఃఖముచేఁ బొఱలుచుఁ దల వంచుకొని యిత్తెఱఁగునఁ బలవింపఁదొడఁగెను.

"నానాథుఁ డేమఱియుండఁగా, రావణుఁడు కామరూపముతో వచ్చి నన్ను మోసపుచ్చి, మొఱ్ఱోయని యఱచుచుండఁగా, బలా

త్కారముగాఁ దెచ్చి, యీ రాక్షసకాంతలవశము చేసెను. వీరు నన్నన రాని మాటలు చెప్పి పలుతెఱఁగుల బెదరించిరి. వీరిమాటలవలన నామనస్సు భ్రుండయియున్నది. ఈవిధమునఁ గడగండ్లనుభవించుచుఁ బ్రాణములతో నుండుటకు నాకు సమ్మతి లేక యున్నది. మహారథుఁ డయిన రాముని బాసి, యీరక్కసులనడుమ నుండవలసినచో, ద్రవ్యము లక్కఱలేదు. ఈనాహృదయమింత వెతనొందినను బగుల కుండుట చూడఁగా, నిది యుక్కుతోఁ జేయఁబడినదిగానైనను, జరా మరణములు లేనిదిగానైన నుండును గాఁబోలును! కష్టజీవినైన నే నట్టి ప్రాణనాథునిఁ బాసి ముహూర్తమైనను బ్రాణమును గాపాడుచున్నానే. ఇట్టి చెడ్డదానను, నీచురాలనునైన నేను బ్రతికియున్నానే. ఛీ! ఛీ! యీనాబ్రదుకేల? నాలుగు సముద్రములవఱకుండు భూమికి నాథుఁ డును, నాతో నెయ్యపుఁబలుకులు పలుకువాఁడునైన యాప్రియు నెడఁ బాసినపిమ్మట నా కీప్రాణములందేని, సౌఖ్యములందేని పరామరిక యేల? వీరు నన్నుఁ జీల్పనీ, తిననీ, నాకేమి? నేనేమో ప్రాణములఁ బాసెదను. ప్రియునిఁ బాసి, నేను చాలకాలము బ్రతికియుండఁజాలను. ఈరేద్రిష్టఁజేఁడగు రావణుని నాయెడమకాలితో నైనను దాఁకను. అనఁగా నిఁక నితనిం గోరుట యనునది కలలోని మాటయె.

రావణుఁడు నాతిరస్కారమునుగాని, తన్నుఁగాని, తనకుల మహిమమునుగాని యెఱుఁగకున్నాఁడు. కావుననే యితఁడు క్రూరుఁడై, నన్నుఁ గోరుచున్నాఁడు. ఓకాంతలారా! మీరు నన్నుఁ గోసినను, చీల్చి నను, గాల్చినను, నిప్పులో మంట పెట్టినను, నేను రావణునిఁ గోరను. మీరేల యూరక నోరు నొచ్చునట్లుగా మొత్తుకొనెదరు?

రాముఁడు దోషవంతులందు గుణమును గనిపెట్టువాఁడు. కీర్తి మంతుఁడు. నెనరుగలవాఁడు. ఎంతమాత్ర ముపకారముచేసినవారి యందును దయఁ జూపువాఁడు. పరోపకారమే ముఖ్యముగాఁ గల వాఁడు. ఇట్టి యారాముఁడును నా కారాని కాలమునకు దయమాలిన వాఁడయ్యెఁ గాఁబోలును. అట్లు కాకున్న, జనస్థానమునఁ బదునాలుగు వేవురు రక్కసుల నొక్కబాణముతోఁ దెగఁగొట్టిన యారాఘవుఁడు నన్నేల విచారింపరాఁడు?

మగటిమిలేని యీరావణుండు నన్నిచ్చట నిరోధించి యున్నాఁడు. నానాథుఁ డీరావణు నని మొనయందుఁ బోరిగొనఁ జాలినవాఁడు; దండకారణ్యమున రాక్షసశ్రేష్ఠుఁడయిన విరాధునితోఁ బోరి యతనిం బరిమార్చినవాఁడు. అట్టి శూరుఁడయిన నాప్రియుఁడేల నన్నుఁ గనుఁగొనరాఁడు? "నానాథుఁడగు రాఘవుఁడు సమర్థుఁడుగానే యుండని. ఈ లంకాపురము సముద్రమధ్యమున నున్నదిగావున దీనిం జొచ్చుట వీలుకాదు" అని యందమనిన, రాఘవుని బాణము గమనము నడ్డగించునట్టిదేదియును లేనే లేదు. మఱియేల శూరుఁడైన రాఘవుఁడు నన్నుఁ దోడ్కొనిపోకుండవచ్చుననిన, నన్ను రాక్షసుఁ డపహరించెనుగాన నన్నెల్లక యున్నాఁడేమో? లేక లక్ష్మణుని యన్నయగు నానాథునికి నేనిచ్చట నుండు సంగతి తెలియదేమో? అట్లు తెలిసియుండిన పక్షమునఁ బ్రతాపవంతుఁడు గావున శత్రువులొనర్చు నవమానము నోర్చియుండునా? నన్ను రాజణుఁ డెత్తుకొనిపోయెనని యారామభూవిభుని కెవ్వఁడు తెలియఁజేయును? ఆగృధ్రరాజగు జటాయువు తెల్పఁడా యనిన, ఈ పాపాత్ముఁడయిన రావణుం డతనిని యుద్ధరంగమునఁ గూల్చెను.

ఆ జటాయువు తాను ముసలివాఁడయినను నన్నుఁ గాపాడఁగోరి, యారావణునితో ద్వంద్వయుద్ధముచేసి, కడుగొప్పపనిని జేసెను. రఘువంశోద్భవుఁడయిన మన్నాథునికి నేనీరాక్షసపురియందున్న సంగతి తెలిసెనేని, ఇప్పుడే యతఁడీ లోకమున రాక్షసుల పేరే లేకుండఁజేయును, లంకాపురమును ధ్వంసముచేయును; మహాసముద్రము నింకింపఁజేయును; రావణుని పేరుప్రతిష్ఠలను బడఁగొట్టును. అట్లు మన్నాథుఁ డీలంకాపురమునందలి రాక్షసులను నుఱుమఁగా వారికాంతలందఱు ఇంటింటను నేనిప్పుడెట్లు విలపించుచున్నానో, అట్లు విలపింపఁగలరు. ఇది నిక్కము. రాముఁడు లక్ష్మణసమేతుఁడై వచ్చి లంకాపురమెల్ల వెదకి వెదకి రక్కసులను నాశము సేయఁగలఁడు. అతనికంటఁ బడినశత్రువు తప్పించికొనిపోఁజాలఁడు, క్షణకాలమైనను జీవించియుండఁడు.

ఈలంకాపురమునందలి తెరువులందు వెగమె వల్లకాటిచిచ్చుపొగ గ్రమ్ముకొనఁగలదు; గ్రద్దలెల్లయెడల నిండికొనఁగలవు. త్వరలోనే యీలంకాపురము వల్లకాటితో సాటికాఁగలదు. త్వరలోనే నాకోరిక నెఱవేఱఁగలదు. ఈదురాచారము మీకందఱకుఁ జేటు

కాలము వాటిల్లెడునని తెల్పుచున్నది. ఈలంకాపురమునఁ గలుగు దుశ్శకునములఁ దలఁప నీపురమునకు త్వరలోనే కళమాసి పోఁగలదని తోఁచెడి. పాపాత్ముఁడయిన రాక్షసాధముఁడగు రావణుఁడు మృతినొంది నచో నీశత్రుసాధ్యముకాని లంకాపురము పెనిమిటినిఁ బోఁగొట్టు కొన్న జవ్వనికైవడిఁ గాంతిచెడినది కాఁగలదు. ఈలంకాపురి భర్తను బోఁగొట్టుకొని, రాక్షసాంగనలతోఁగూడి పెనిమిటిం బోఁగొట్టుకొని, యలంకారములేనిదై యున్న యంగనవలెఁ బుణ్యోత్సవములు లేనిదై యుండఁగలదు.

ఈరాక్షస స్త్రీలందఱు తమమగలం బోఁగొట్టుకొని వెతలఁగుందిన వారలై యింటింటను జేయు రోదనధ్వనులను నేను వేగిరమే వినఁగలను.

కోపముచే ఎఱ్ఱనిక్రీఁగన్నుగల యా శూరుఁడగు రాముఁడు నన్ను రావణునింట నున్నదాననుగా నెఱుఁగునేని, ఆతత్క్షణమేవచ్చి యామన్నాయకుఁ డేయుబాణముల కీలంకాపురము భస్మమై, రాక్షస వీరులందఱు చచ్చుటచేఁ జీఁకటితోఁగూడినదై, కాంతిఁ బాసినదై యుండఁగలదు.

అట్లయినచో నీకు దిగులేలయనిన, క్రూరుఁడును, నీచుఁడునునైన యీరావణుఁడు పెట్టినగడువు ముగింపునకు వచ్చినది. ఈరాక్షసులు పాపముచేయువారు. వీరికిది చేయరానిపని యనియు, ఇది చేయఁదగిన పనియనియు లేదు. వీరియన్యాయము వలన నిప్పుడ నావధరూపమైన గొప్పయుపద్రవము సంభవింపఁగలదు. రక్తాంతనేత్రుఁడయిన ప్రియ దర్శనుని రామునిఁబాసి, కడువగతో నేనేమిచేయఁగలను? ఎవ్వఁడైన నాకు విసమునొసఁగువాఁ డిచ్చట నుండెనేని, ఆయమునిఁ జూడఁగలను. పతిని బాసి నేనిచ్చట నుండను. లక్ష్మణుఁడును అతనియన్న రాముఁ డును నన్నిచ్చటఁ బ్రాణములతోనున్నదానిఁగా నెఱుఁగకున్నారేమో? వారికి నేనిచ్చట నున్న సంగతి దెలిసిన, వారు నాకై వెదకకుండు రనుట లేదు.

శూరుఁడైన లక్ష్మణాగ్రజుఁడగు రామభూపాలుఁడు నావియోగ శోకముచే భూతలమున దేహము విడిచి, యిటనుండి దేవలోకము నకుఁ బోయియుండును. ఆదేవలోకమునఁ గమలనేత్రుఁడైన నానాథుని దర్శనము చేసికొను దేవ గంధర్వ సిద్ధ మహామునులందఱు భాగ్య

వంతులని తలంచెదను. ఆతనితో నుండు భాగ్యము నాకు లేక పోయెం గదా. నేనెంత భాగ్యహీనురాలను. జ్ఞానియు, ధర్మసంపాదనమునందుఁ గోరికగలవాఁడును, రాజర్షియున్నైన యా పరమాత్మస్వరూపుఁడగు రాఘవునికి భార్యనైన నాతో నేమి యుపయోగము ? నరులకుఁ గనఁబడువారిమీఁదనే ప్రేమయుండునుగాని యెదుటలేనివారిమీఁదఁ బ్రేమ యుండదు. అయినను, ఇది కృతఘ్నులగువారిధర్మము. అంతియకాని, ఆరామభూవిభునికి నాపై నెన్నఁటికిని ఆశ లేకపోవదు. ఇట్లారాముఁడు నన్నుఁ దలఁపకుండుట నాజన్మాంతరపాపఫలమో లేక నాదురదృష్టమో యయి యుండవలెను. లేనిచో, లోకోత్తరుండయిన యారామునిఁ బాసి యిట్లు దుఃఖముల ననుభవింపవలసిన గతి నా కేల కలుగును? మంచి నడవడిగలవాఁడు, శూరుఁడు, శత్రుసంహారి, మహాత్ముఁడు నయిన రామునిఁ బాసి జీవించియుండుటకంటె ప్రాణములువిడుచుట మేలు.

అట్లు కాకపోయిన, నరోత్తములగు నాయన్నదమ్ము లిరువురు శస్త్రములు విడిచి కందమూలఫలములను దినుచు నడవులఁ దిరుగుచు నున్నారు గాఁబోలు! అటుకాదేని, చెడుతలంపుగల రాక్షసాధిపుఁడగు రావణుఁడు శూరులయిన యా సోదరులను మోసముతోఁ జంపెనేమో!

కావున నే నిప్పు డన్ని తెఱఁగులఁ బ్రాణములఁ దొఱఁగుదు ననిన, ఇంత దుఃఖమున నున్నను నాకు మృత్యువు రాకయున్నది. ఇష్టవస్తువనిన దుఃఖము గలుగదు. అనిష్టవస్తువనిన నెక్కువభయము గలుగును. ఆరెండు నెవ్వరికి లేవో యట్టిమహాత్ములకు నేఁ జేయెత్తి మ్రొక్కెదను. మానులును, పాపకార్యములను విసర్జించినవారును, జితేంద్రియులును, మహాతపోమహిమగలవారునై సుఖదుఃఖములందు రెంటియందును సమానులైయున్న మునులు ధన్యులు. ఆత్మజ్ఞానము గలవాఁడును, ప్రియముపలుకఁదగినవాఁడునైన యారామునిఁబాసి, పాపాత్ముఁడైన రావణునిచేతఁ జిక్కి ప్రాణములతో నుండఁజాలను" అని సీత యారాక్షసకాంతలతోఁ జెప్పిన దాయెను.

## 27-వ సర్గము

### త్రిజట తనస్వప్నవృత్తాంతము చెప్పుట

సీత యిట్లు పలుకఁగా, కడునాగ్రహము నొందినవారలైన, ఘోరరూపలగు రాక్షసస్త్రీలు కొందఱాసంగతి రావణునకుఁ దెలుప

మిక్కిలిత్వరగా మఱికొంద ఱాసీతను జుట్టుకొని, యనర్థమే ఫల
ముగాఁ గలిగిన యొకటే యభిప్రాయముగల యొకమాటను మఱలఁ
దలఁచికొని, "ఓ చెడ్డదానా! క్రూరచింతన గలదానా! పాపపు నడత
గలదానా! యిప్పుడే మేమందఱము కూడి నీమాంసమును సంతస
ముతోఁ దినివేయుదుము" అని యామెతోఁ బలికిరి.

నీచలగు రాక్షసాంగన లందఱు నివ్విధమున సీతాదేవిని బెద
రించుట చూచి, యచ్చటఁ బరుండి నిద్రించుచుండిన త్రిజటయను వృద్ధ
రాక్షసి యారాక్షసస్త్రీలతో నిట్లనియె:

"ఓ నీచలారా! మీరు నన్నుఁ దినుఁడు. జనకమహారాజునకు
ననుఁగుఁగూఁతురును, దశరథమహారాజునకుఁ గోడలునైన యాసీతా
దేవిని దినకుఁడు. నేనిప్పు డొక కలగంటిని. సకల రాక్షసులకు వినాశ
మును, ఈ సీతమగనికి మేలును దెలుపుచున్నది. తలఁచినమాత్రమున
నాకల మేనికి గగుర్పాటును, మనసునకు భీతిని గలిగించుచున్నది"

ఇట్లు త్రిజట పలుకఁగ, రాక్షసకాంత లత్యుగ్రకోపముగల
వారలై, యందఱును వెఱపుతోఁగూడి యాత్రిజటంగూర్చి "ఓసీ!
నీవు రాత్రి యెట్టి కల గంటివి? చెప్పుము" అని యడుగఁగా, రాక్షసుల
నోటినుండి వచ్చినమాటను విని, యామె రాత్రిఁ దాఁ గన్న కలయొక్క
వాస్తవము నెఱిఁగింపఁ దొడఁగెను:

"దంతముతోఁ జేయఁబడినదియు, ఆకాశమునఁ బోవునదియు,
వేయి రాయంచలు గట్టినదియు నైన విమానము నెక్కినవాఁడై,
రాముఁడు తెల్లనిదువ్వలువఁదాల్చి లక్ష్మణసమేతుఁడై వచ్చినట్లును,
జానకి తెల్లనివస్త్రముగట్టినదై, సముద్రపరివేష్టితమైయున్న తెల్లకొండ
నెక్కి, యచ్చటనే సూర్యునితో వెలుఁగు చేరినట్లు రామునితోఁ జేరి
నట్లును నేను కలగంటిని. మఱియు రాముఁడు నాలుగుదంతములుగల
పర్వతముంబోలు గొప్పయేనుఁగు నెక్కి లక్ష్మణునితోఁగూడఁ దిరుగు
చుండఁగా నేను జూచితిని. తర్వాత నరశ్రేష్ఠులగు రామలక్ష్మణులు
తమదీప్తిచే వెలుఁగుచుఁ దెల్లని పుట్టంబులు గట్టినవారలై తెల్లనిపూవుల
దండలను శిరసునఁ దాల్చి సీత నెదుర్కొని వచ్చినట్లు చూచితిని. తరు
వాత నాపర్వతము కొనయందు రాముఁడు గూర్చున్న యేనుఁ గాకసం
బున నుండఁగా, సీత దానిమీఁద నెక్కినట్లుగాఁ గంటిని. పిదపఁ గమలల

లోచనయగు సీత పెనిమిటితోడమీఁద నుండి యెగిరి, సూర్యచంద్రులను జేతితోఁ దుడుచుచున్నట్లు, అటుపిమ్మట నా విఱివికన్నులదగు సీతయు, ఆయిద్దఱు రాజపుత్రులును నెక్కిన మహాగజము లంకాపురము పైభాగమున నున్నట్లును, తర్వాత రాముఁడెనిమిది తెల్లనియెద్దులుగట్టిన రథము మీఁదఁగూర్చుండి యిచ్చటనుండి తఱలినట్లును, తరువాత మగఁటిమిగల పురుషోత్తముఁడగు రాముఁడు తమ్ముఁడగు లక్ష్మణునితోను, సీతతోను సూర్యునిమాడ్కిఁ దేజరిల్లు దివ్యపుష్పకవిమానమెక్కి యుత్తర దిశకుఁ బోయినట్లును కలగంటిని. స్వర్గమును బాపాత్ము లెట్లు లోఁబఱచుకొనఁజాలరో, అట్లు గొప్పశూరుఁడగు రాముని సురాసురులు గాని, రాక్షసులుగాని, తక్కినవారెవరుగాని జయింపఁజాలరు. అట్లు సీతారామలక్ష్మణులంగూర్చి కలగంటిని.

ఇఁక రావణుఁడు నూనెలో మునిఁగి, యెఱ్ఱనిబట్టగట్టికొని, గన్నేరుపూలదండనుదాల్చి, మద్యముద్రావి, మదించి, నేలఁ బొఱలు నట్లును, మఱియొకతూరి, బోడియై నల్లనిబట్టను గట్టుకొని యొకస్త్రీచే నీడ్వఁబడి పుష్పకవిమానమునుండి యిప్పుడె క్రిందఁబడినట్లును, మఱియు నింద్రియస్వాస్థ్యము లేనివాఁడై, నవ్వుచుఁ జిందులుద్రొక్కుచు ఖరములు పూన్చినరథమునఁ గూర్చుండి దక్కినంపుదెసంగూర్చి పోయి నట్లును, మఱియు నాగర్దభముమీఁదనుండి భయముచేఁ దలక్రిందుగాఁ బడినట్లును, మఱల నారావణుఁడు వెంటనే లేచి, తత్తరపాటుతో దిగులొంది, గర్వ ముడిగి, వెఱ్ఱివానికైవడి బట్టవిచ్చివేసి, చెడ్డమాటలను విస్తారముగా మాటాడుచు నోర్వరానంత దుర్గంధముతోఁగూడి, నరకమునుబోలి, మలములనెడి యడుసుతో నిండియున్న చీఁకటిం జొచ్చి, యచ్చట మునిఁగినట్లును, అప్పుడె యెఱ్ఱనిబట్టగట్టి దేహమంతయు బురద పూసికొనిన యొకనల్లని జవరాలు ఆరావణునిమెడలోఁ జెయి వేసికొని, దక్షిణదిశ కీడ్చుచున్నట్లును స్వప్నముగంటిని. ఇవ్విధముననే కుంభకర్ణుఁడును, రావణునికొడుకులందఱును నూనెలో మునిఁగినట్లుగాఁ గలలోఁ జూచితిని. రావణుఁడు పందిమీఁదను, ఇంద్రజిత్తు శింశుమారము మీఁదను, కుంభకర్ణుఁ డొంటెమీఁదను నెక్కి దక్షిణదిశకుఁ బోవుచుండఁ గంటిని.

వారిలో విభీషణుఁడుమాత్రము తెల్లనిబట్టలుగట్టి, తెల్లని పూవులుదాల్చి, తెల్లని గంధమలఁదికొని, తెల్లనిగొడుకు పట్టుకొని, శంఖములు పూరింపఁబడుచుండ, దుందుభివాద్యములమ్రోఁతలు చెల రేఁగుచుండ, నట్టువకాండ్రు నాట్యములు సలుప, పాటకులు పాటలు పాడఁ, బర్వతముఁబోలినదై, ఉఱుమువంటిబృంహితముగలదై, నాలుగు దంతములు గలిగియున్న గజేంద్రము నెక్కి నలుగురు మంత్రులతో యాకాశమునఁ దిరుగుచుండినట్లు, అతనితోఁగూడ నెఱ్ఱనిపూలదండలు దాల్చి, యెఱ్ఱని బట్టలుగట్టుకొన్న కొందఱు రాక్షసులు మత్తులయి యాడుచుఁ బాడుచుఁ బోవుచున్నట్లును స్వప్నమునఁ జూచితిని.

ఈరమ్యమైన లంకాపురము గోపురతోరణములు విఱిగి గుఱ్ఱములు ఏనుగులు, తేరులతోఁగూడ సముద్రమునఁ బడఁగాఁ జూచితిని. రావణపాలితమైన యీలంకాపురమును రామునిదూతయైన బలవంతుఁడగు నొక్కవానరుఁడు కాల్చివేసినట్లు స్వప్నముగంటిని. అట్లు కాలి బూదిచే నెగుడుదిగుడైయున్న యాలంకాపురమునందు రాక్షస స్త్రీలందఱు తైలముద్రాగి, చిందులుద్రొక్కుచుఁ గేకలిడుచు నవ్వుచుఁ బ్రవేశించిరి. కుంభకర్ణుఁడు మొదలగు మనరాక్షసవీరులందఱు కావి బట్టలఁ గట్టుకొని, పేడగుంటలోఁ బడినట్లు కలగంటిని.

ఓరాక్షసకాంతలారా ! దూరముగా వెళ్లుఁడు. లేనిచో మీరు నశింతురు. రాఘవుఁడు వేగమె సీతను బొందఁలఁడు. ఆ రాముఁ డత్యుగ్రకోపుఁడు. ఆతఁ డలిగెనేని, సర్వరాక్షససమేతముగా నీలంకా పురమును ధ్వంసముచేయఁగలఁడు. సీత రాఘవునకుఁ బ్రియురాలు. ఆతనిమన్నన వడసినది. వనవాసమునిమిత్తము భర్తను వెంబడించివచ్చినది. ఆమెను మీ రదలించినను బెదరించినను రాముఁడు మన్నించు వాఁడు గాఁడు. కాఁబట్టి మీకఠినవాక్యములు చాలింపుఁడు. మంచితనము నవలంబించి మంచిమాటలనాడుఁడు. సీతను మనతప్పిదముల మన్నింపవేఁడుదము. ఇదే నాకు మంచిదిగాఁ దోఁచెడి.

దుఃఖపీడితయైన యే సీతవిషయమై యిట్టికలగంటినో, యా సీత సకలదుఃఖములనుండి తొలఁగినదై యెక్కువసౌఖ్యము లనుభవింపఁ గలదు. రాక్షసులకు రామునివలన భయంకరమైన యాపద సంభవించినది. మీ రొక్కవేళ నామెను మొదట ధిక్కరించియున్నను

యాచింపుఁడు. పెక్కుమాటలేల? ఆమిథిలాధిపునిపుత్రికయగు సీతఁ వేఁడుకొన్న. నామె ప్రసన్నురాలగును. రాక్షసాంగనలారా! మీ సీతాదేవిని మహాభయముడిపి కాపాడుట మంచిది. నాస్వప్న వృత్తాంతః కాక యీసీతయంగములతీరు చూడనందేమియు వైపరీత్యము గా రాదు. ఒక్కకాంతి వికలమయియుండుటమాత్రము కానవచ్చుచున్న కావుననే దుఃఖముల ననుభవింపఁదగనిదియు దివ్యభోగము లనుభవిం దగినదియునైన యీ దేవి కీ దుఃఖము సంప్రాప్తమాయెనని తెలుః చున్నది. మఱియు నేను వైదేహికిఁ గార్యసిద్ధిని, రావణవినాశమున రాఘవవిజయమును సమీపించినదని తలఁచెదను. ఈమెకుఁగలుగు గొ మేలు నాలకింప నెన్నియో కారణములు గన్పట్టుచున్నవి. తామరరే మాడ్కి విరివికన్నులదగు నీజాణయైన సీత యొక్క యెడమకన్నద చున్నది. ఈమె యెడమబుజ మున్నట్టులుండి పులకితమయి యద చున్నది. ఏనుఁగుతొండముంబోలు నీసీతయొక్క యెడమతొడ నిష్టా రణముగా నదురుచు రాముఁడెదుట నిలిచియున్నట్లు దెలుపుచున్న పక్షియుఁ గొమ్మయందలి గూటిలోఁ బ్రవేశించి, మాటిమాటికి మే శుభము గలుగఁ గలదని చెప్పుచు, ఎక్కువశుభకరమగు వా రాఁగలదని తెల్పుచు ముదముతో మాటిమాటికి సీతాదేవిని బ్రే చేయుచున్నదో యన్నట్టులున్నది" అని త్రిజట తనస్వప్నవృత్తాంతమ రాక్షసస్త్రీలతోఁ జెప్పినదాయెను.

## 28-వ సర్గము

### సీత చింతించుట

ఆ పిఱికిదియైన సీత రాక్షసస్త్రీలనడుమ నుండి, రావణుని గడుఁ గఠినంపుమాటలచే రోయఁబడినదై, వనమధ్యమున సింగముచే జిక్కినయేనుఁగుగున్న మాడ్కి వణఁకినదై, వీరరామము సంభవి నప్పుడు పోషణచేయలేని తల్లిదండ్రులచే నిర్జనమయిన యరణ్యమ మున విడిచిపెట్టఁబడిన పసిబాలికవలె నీక్రింది తెఱఁగునఁ బలవించెను.

లోకమున, వేళ్ళరానిది చావురాదని పెద్దలందరు. ఆహా ( నిక్కము! అటుకాకున్నచో, పాపాత్మురాలైన నేనిట్లు ఈరాక్షస్త్రీ చెప్పెడి బెదరింపుమాటలను వినుచు నీపాడుబ్రదుకు బ్రదికియుంద

వజ్రాయుధపుదెబ్బ దగిలియుఁ బగులని పర్వతశిఖరము మాడ్కి, నాహృదయము సుఖములేని దయ్యును, పెన్వగలతో నిండినదయ్యును బ్రద్దలుగాక యున్నది గాన నిది యుక్కుతోఁ జేయఁబడినదని యెంచెదను. ఆత్మహత్య దోషముగదా యనిన, నాకిప్పు డాత్మహననముచే దోషము పొసఁగదు. ఈచూడనింపుగొలుపని రావణుఁడు నన్నెట్లయినను వధింపఁ బోవుచున్నాఁడు. ఈపాపాత్ముని చేతఁ జిక్కి దుర్మరణము నొందుటకంటె నాత్మహత్య చేసికొనుటయే మేలని తోఁచెడి. అట్టి దుర్మరణ మొందనేల? ఆరావణుని కనుకూలురాలనై యుండఁగూడదా యనిన, ద్విజుఁడు ద్విజుఁడుగానివానికి మంత్రము నుపదేశింపని తెఱఁగున, నే నీ పాపాత్మునికి నామనసు నొప్పగింపఁజాలను.

లోకనాథుఁడయిన యారాముఁడు రాకమునుపే యీయధముఁడయిన రావణుఁడు, శస్త్రవైద్యుఁడు గర్భమునఁ బెడదారింబడిన శిశువు నంగములను ముక్కలుముక్కలుగాఁ గోయునట్లు నాయంగములను కఱకుఁగత్తులతోఁ గోయఁగలఁడు. బహుదినములుగా దుఃఖసాగరమున మునిఁగియున్నాను. ఈపాపాత్ముఁడయిన రావణుఁడు నాకు రెండునెలల గడు వొసఁగెను. ఆరెండునెలలును ముగియఁగలవు. ఒకదొంగ రాత్రి రాజునింటఁదూఱి దొంగలింపఁబోఁగా, అప్పుడు రాజభటులు వానిని బట్టుకొని రాజునకుఁదెల్పిన, అప్పు డారాజు ఆదొంగకు సూర్యోదయమగుడు శిరశ్ఛేదము చేయ నాజ్ఞాపించిన నాతఁ డెట్లు మనస్సున దిగులు చెందునో, అట్లు నేనును ఓర్వరాని దిగులుపొంది యున్నాను. అక్కటా! నాకెంతకష్టము సంభవించెను! హా! రామా! హా! లక్ష్మణా! హా! సుమిత్రా! హా!! రామునితల్లి! హానాతల్లి! తుపాను వీచునప్పుడు సముద్రమధ్యమునందలి నావ మునుఁగుకైవడి నిర్భాగ్యురాలనై నే నిదిగో మృతినొందుచున్నాను.

పిడుగుపాటుచే వనముననుండు రెండుసింగములును రెండు వృషభములును మృతినొందునట్లు, బలవంతులగు ఆరాంజేంద్రపుత్రులిరువురును నానిమిత్తమై మృగరూపముదాల్చిన యాజంతువుచే మృతి నొందిరి. అప్పు డాదైవము మృగరూపముదాల్చినదై నిర్భాగ్యురాలనైన నన్ను వంచించినది. కావుననే నేను మూఢురాలనై నామగనిని, నామగనితమ్ముని బాసితిని.

అని కొంతతడవు చింతించి, సీత తనమనోవల్లభుని ధ్యానించి యతని నెదుటఁ జూచినట్లు భావించి యిట్లనెను: "ఓరామా! సత్యము దప్పనివాఁడా! నిడుదచేతులవాఁడా! నిండుచందురునిఁబోలు మోము గలవాఁడా! నీవు లోకముల కన్నింటికి మేలుచేయువాఁడవును; లోకములకెల్లఁ జెలికాఁడవును. అట్లుండియు, ఈరాక్షసులు నన్నువధింపఁ బూని యుండుట నేల యెఱుఁగకున్నావు? మానవులలో నెనరులేని వారికిఁ జేసిన యుపకారము వ్యర్థమగునట్లు, భర్తయే దైవమని నమ్మి యుండుటయు, ఈఓర్పును, నేలఁబరుండుటయు, స్వధర్మము నొనర్చుట యందలి పట్టుదలయు, నాపాతివ్రత్యము సర్వము వమ్మయ్యెను. నేను నిన్నుఁబాసి చిక్కినదాననై మోమునఁ గళదప్పినదాన నగుచు నిన్నుఁ గలియుటయం దాస వదలి నిన్నుఁ జూడనైతిని. కావున నేను నోచిన నోములును, నాపాతివ్రత్యమును విఫలమయ్యెను. ఓనాథా! నీవు నియమముతోఁ దండ్రియానతిని నియమముతో జెల్లించి, యడవినుండి మఱలి, తండ్రియాజ్ఞ పూర్తిచేయుటచేఁ గృతార్థుఁడవై, నావినాశముచే మఱలఁ బెక్కండ్రు విఱివికన్నుల జవరాండ్రను గూడి, ఓరామా! సుఖముతో నుండఁగలవు. నే నన్ననో, నీయందు వలపుగొన్న దానను గావున నీయెడనే బహుకాలమునుండి మనస్సు పెట్టినదాననై, ఉపవాసవ్రతాదులనెల్ల వ్యర్థపఱచికొని, యిదిగో ప్రాణముల వదలఁ బోవుచున్నాను. ఛీ! యీబ్రదుకు నాకేల? ఇంతటి నిర్భాగ్యురాలనై నేను జీవించియుండుటకంటె మృతినొందుట మేలు. కావున విషము మ్రింగియో, పదునుఁగత్తితోఁ గొంతుకోసికొనియో ప్రాణములు వదలెద ననిన, ఈరాక్షసునియింట నాకు విషము దెచ్చియిచ్చువాఁడు గాని, పదునుఁగత్తి నిచ్చువాఁడు గాని కనఁబడలేదు.

ఇట్లు సీతాదేవి పలువిధముల విలపించి, మనస్సున నా రఘుపుంగవునే తలఁచుచు, గడగడ వణఁకుచు నెండుపాఱినమోముతోఁ గూడినదై పుష్పించియుండు నాయశోకవృక్షము చేరువకుఁ బోయెను. అట్లు దుఃఖముచే మలమలమాడుచున్న యా సుకుమారసర్వాంగియగు సీతాదేవి పలుతెఱఁగుల విలపించి యేమియు దోఁపకమిచే జడను దీసికొని, "నే నీ జడను గొంతున కురివేసికొని, యమునిపాదముల కడకుఁ బోయిచేరెదను" అని చెప్పి యాశింశుపావృక్షశాఖ నొక్క-

దానిని బట్టుకొని యురివేసికొనఁబోయెను. అట్లు ఆశుభాంగియగు సీతాదేవి రాముని, లక్ష్మణుని, తనకులమును జింతించి, "తాను సద్వంశ మునఁ బుట్టి, గొప్పవంశమును జొచ్చి శూరుఁడగు రామునిఁ బెండ్లాడి, విధేయుఁడయిన మఱఁదిని గలదానసుగా నుండియు, నా కీరితి నురివేసి కొని చావవలసి వచ్చెఁగడా" యని వగచుచుండఁగా, శుభసూచక ములును, ధైర్యసంపాదకములును, లోకోత్తరములును, ముందు ఫలితముల నొసఁగుటచేఁ గనఁబడినవియునైన శకునములు గలిగెను.

## 29-వ సర్గము

### సీతాదేవికి శుభశకునము లగుట

దుఃఖస్వరూపురాలయినదియు, రాముని యెడఁబాటునం దెట్లుండ వలయునో, అట్లుండుటచేఁ బొగడ్తగాంచినదియు, హర్షములేనిదియు, దీనహృదయముతో నుండునదియు, మంగళకరురాలును నైన యా సీతా దేవిని గల్మిగలవానిని బరిజనులుపొందునట్లు క్రిందఁజెప్పఁబడిన శుభ శకునములు పొడకట్టినవి. వంకర కనురెప్పవెండ్రుకలవరుసలతోఁ గూడినదియు, నడుమగ్రుడ్డు నల్లగను, చుట్టును విశాలముగను శుభ్రము గను నుండునదియు, కొనలందు నెఱ్ఱనిదియునైన యాచిగురుఁబోఁడి యొక్క యెడమకన్ను చేఁపచేఁ గదలింపఁబడి చుట్టు నెఱ్ఱనైన కమలము వలె నదరెను. మఱియుఁ జక్కఁగాఁ గుదిరినదియు, బలిసినదియు, గుండ్రనిదియు, మేలిమి నల్ల యగురుచందనపుఁబూత పూసికొనుటకుఁ దగినదియు, పురుషోత్తముఁడయిన తనప్రియునికి బహుకాలము దిండుగా నుపయోగపడినదియునైన యాసీతాదేవియొక్క యెడమభుజము వేగిర ముగా నదరెను. ఇంతియకాక, ఆసీతాదేవియొక్క చక్కఁగాఁ గదిసిన యిరుతొడలలోను నేనుఁగుతొండముం బోలినదియు, బలిసి నదియు, సొగసయినదియునైన యెడమతొడ మిగుల నదరినదై రాముఁడు ముందు నిలఁబడి యున్నాఁడని తెలిపెను. నిర్మలనేత్ర ములును, నున్ననికొనలుగల దంతములును, చక్కనిమేనునుం గలదగు ఆసీతాదేవి నిలఁబడియుండఁగా, పసిఁడివన్నె గలదియు, కొంచెము దుమ్ము తగులుటచే మాసినదియునైన బట్ట జాఱెను.

గాలికిని ఎండకును వాడినదియు, మిక్కిలి సన్నగిల్లినదియునైన వి త్తనము వానగుఱియుటచేఁ దృప్తినొందునట్లు, సీతాదేవియు నీ మొదలగు పూర్వశుభసిద్ధిం దెలుపు శుభశకునములచే నాథునిరాక త్వరలో కలుగఁగలదని బోధింపఁబడినదివోలె మిక్కిలి తృప్తి నొందెను. మఱియు నాసీతాదేవియొక్క దొండపండువంటి క్రింది పెదవియుఁ జక్కని కంటిఱెప్ప వెంట్రుకలతోఁగూడిన వంకరఱెప్పయుఁ బ్రకా శించెను. వరుసలుదీఱిన తెల్లనిదంతములుగలముఖము రాహువు నోటినుండి విడువఁబడినచంద్రునివలెఁ బ్రకాశించెను. అంత సీతాదేవి చింతనుబాసి, కునికిపాటులేనిదై, తాపము నిమ్మళింపఁగా సంతసముచే వికసించిన మనస్సుగలదియయి, వెన్నెలతోఁ గూడిన శుక్లపక్షమునాటి రాత్రివలె సంతోషభరితమైనమోముతోఁ గూడి ప్రకాశించుచుండెను.

## 30-వ సర్గము

### హనుమంతుఁడు సీతాదేవినిగూర్చి చింతించుట

పరాక్రమశాలియగు హనుమంతుఁడును సీతాదేవి చెప్పిన మాటలను, త్రిజట స్వప్నవృత్తాంతమును, రాక్షసకాంతలబెదిరింపులను యావత్తును విపులముగా విన్నవాఁడై నందనవనదేవతఁబోలు నాసీతా దేవిని జూచినవాఁడై పలుతెఱఁగుల యోచింపఁదొడఁగెను.

పెక్కువేలవానరులు అన్నిదిక్కులయందును ఏసీతాదేవిని వెదకుచున్నారో, యాసీతాదేవిని నే నిచ్చటఁ గాంచితిని. నేను మాఱువేషము దాల్చి, చాల యోచనతోఁగూడినవాఁడనై, శత్రుబల మును బరికించుచు నేరికిఁ దెలియకుండ రాక్షసుల కలిమితారతమ్య మును, ఈలంకాపురమును, ఈరాక్షసరాజగు రావణునిప్రభావమును గాంచితిని. ఎన్నరాని మహిమగలవాఁడును, జంతువులన్నిటియందు దయగలవాఁడును నైన యారామునికిఁ బట్టంపుదేవియుఁ బతిదర్శనము గోరునదియునగు నీసీతనోదార్చుట న్యాయ్యము. ముందు దుఃఖముల నెఱుఁగనిదియు, ప్రకృతము దుఃఖములచే నొచ్చినదియు, అప్పటికిని దుఃఖమునకు తుగింపుగాననిదియు, నిండుచంద్రునిఁబోలు మోముగల దియునైన యీసీతాదేవి నిదిగో యోదార్చెదను. దుఃఖముచే స్మృతి దప్పియున్న యీ దేవిని నేనోదార్పక వచ్చినట్లే మఱలిపోతినేని,

నాపోక వ్యర్థమగును. నే నచ్చటికిఁ బోఁగా నిచ్చట నీ పతివ్రతయగు రాజపుత్త్రి రక్షణము గానక ప్రాణములఁ దొఱఁగును. అచ్చటికిఁ బోయినను రామునికి సంగతి చెప్పక యుండఁగూడదా యనిన, నిడుద చేతులవాఁడును, నిండుచందురునిఁ బోలు మోముగలవాఁడును నైన రాముఁడును సీతాదర్శనమునం దాత్త్రముగలవాఁడై యున్నాఁడు గావున నాతని కీ సీతాదేవి వృత్తాంతము చెప్పకయుండుట యుక్తము గాదు. కావున నిప్పు డీదేవితో మాటాడవలయును. ఇప్పుడు మాటాడుదు ననిన, ఈ నిశాచరకాంతలసమక్షమున మాటాడుట యుక్తము గాదు. ఈపని యెట్లు చేయఁదగును? నే నిప్పుడు చిక్కులఁ దగులు కొంటిని. నేనీమిగులురాత్త్రిలోపల నెట్టకేలకు నీ సీతాదేవి నోదార్ప నేని, ఈసీతాదేవి జీవితము విడువఁగలదు. దీని కేమియు సందేహము లేదు.

నేను మఱలి రామునికడ కేగినప్పుడు రాముఁడు "సీత నాకేమి వృత్తాంతము చెప్పి పంపెను?" అని యడిగెనేని నే నీ సీతాదేవితో మాటాడకపోయి యారాముని కేమని బదులు చెప్పఁగలను? సీతాదేవి వలన వృత్తాంతమును గొనిపోవక నే నిచ్చటనుండి త్వరగాఁ బోయినను, "నీ వూరక యేల వచ్చితి"వని యారాముఁ డలిగి క్రూరదృష్టితోఁజూచి నన్ను బాధిచేయును. అట్లుగాక రామునిసాహ్యమునకై నారాజగు సుగ్రీవుని యుద్ధప్రయత్నముతోఁ బిలుచుకొనివత్తుననిన, నంతవఱకు సీతాదేవి జీవించియుండదు గనుక, సుగ్రీవుఁడు ససైన్యుఁడై వచ్చుట వ్యర్థమగును. కావున నెట్లో యొకతెఱఁగున రాక్షసు లేమఱియుండు నప్పుడు సందు చేసికొని, యిచ్చటనే యుండి వెతలపాలయియున్న యీ సీతాదేవిని మెల్లగా నూఱడింతుననిన, నేనో చినమేనివాఁడను. మీఁదుమిక్కిలి కోఁతిని. నే నిప్పుడు సలక్షణమయిన మానుషభాష తోనే మాటాడెదను. నేను ద్విజన్మునిమాడ్కి సంస్కృతభాషతో నా దేవితో మాటాడితినేని, సీతాదేవి నన్నును రావణునిఁగాఁ దలఁచి నాతో మాట్లాడ భయంపడును. అంతియకాక వానరుఁడనైన నేనెట్లు సంస్కృతభాష మాటాడఁగలను? కావున నే నామెతో నర్థముగల మనుష్యవాక్కున మాటాడి యామె నోదార్పవలయునేకాని వేఱువిధముగా నాపతివ్రతను సమాధానపఱుప వీలుగాదు. ఆమెకు వాడుక

పడిన మానుషభాషతోనే మాటాడుటయుఁ గడు నసాధ్యముగా నున్నది. ఈజానకి నావానరరూపమును, నేను మనుష్యవార్తలతో మాటాడుటను జూచి సందేహపడి మొదటనే రాక్షసులవలన భయపడి యున్నది గనుక నన్నుఁ జూచి భయము నొందును. అంత విజేవికన్నుల దగు పతివ్రతయైన యాసీతాదేవి 'రావణుఁడే వానరరూపమెత్తి వచ్చి నాఁడు' అని తలఁచి భయపడి కేకలిడును. సీత యఱవఁగానే రాక్షస కాంత లందఱు ఆయుధముల నన్నిఁటి నెత్తుకొని యమునివలె భీకరలై మీఁదికి వత్తురు. అట్లావికృతంపుమోరలుగల రాక్షస స్త్రీలందఱు నన్నుఁజుట్టుకొని తమబలిమియెల్లను జూపి నన్ను వధించుటకును, పట్టు కొనుటకును బ్రయత్నము చేయుదురు. అప్పుడు గొప్పవృక్షముల కొమ్మలు, తెమ్మలు, బోదెలు పట్టుకొని పరుగెత్తుచుండు నన్నుఁ జూచి రాక్షసకాంతలు వెఱచి యీతఁ డెవఁడో యసాధ్యుఁడుగా నున్నాఁ డని సందియపడుదురు. వనమునఁ దిరుగు నాయొక్క గొప్పమేనిని జూచి, వికృతపుమోములుగల రాక్షసకాంత లందఱు వెఱపుచే నదరి పడి రావణునినగరున సేవకులగు రాక్షసుల కీసంగతిఁ దెలిపి, వారిని సాయమునకుఁ బిలుతురు. వారును శూలములు, కత్తులు, పెక్కుడిద ములు చేతఁ బట్టినవారై, యీపోరులో బీతు గిలిగించుచు నాపైకి వత్తురు. వారు నన్ను నలువైపులఁ జుట్టుకొన్నప్పు డారక్కసులను బరి మార్చి యీ మహాసముద్రము దాఁటి పోఁజాలను. వడిగల రక్కసు లనేకు లెగిరి నన్నుఁ బట్టుకొననైనఁ బట్టుకొందురు. అట్లు వారు నన్నుఁ బట్టుకొందురేని, ఈ సీతాదేవికి రామునివార్త దెలియఁబోదు. రాక్షసులు హింసయం దెక్కువ యపేక్షగలవారు గావున నీజానకిని వధింప నైనను వధింతురు. అట్లు ఈసీతయే వధింపఁబడునేని, రామసుగ్రీవుల యీకార్యము చెడిపోవును.

దారితెలియనిదియు, రాక్షసులచేఁ గాపాడఁబడునదియు, సముద్రముచేఁ జుట్టఁబడినదియు, రహస్యమైనదియు నైన యీలంకాపుర మున నీ సీతాదేవియున్నది. రాక్షసులు పోరునందు నన్నుఁ బట్టు కొన్నను, లేక పరిమార్చినను, కార్యసాధనమున రామునికి మఱొక్కనిని సహాయునిఁ గానను. నన్ను రాక్షసులు చంపిరేని, నాకుఁ బిమ్మట నూఱుయోజనముల నిడివిగల యీసముద్రము దాఁటగల మొనగాని

నెంతయాలోచించినను గనుఁగొనలేకున్నాను. ఈ రాక్షసుల నందఱిని నేను జంపఁగలిగినఁ గలుగుదునుగాని, యీగొప్పకడలియావలిగట్టు నొందఁజాలను. యుద్ధమున జయాపజయములు నిక్కములుగావు. ఇప్పు డూరక పోవుటకును దోఁపలేదు. సీతను బలుకరించుటకును దోఁపలేదు. వివేకియగువాఁ డెవ్వఁడు సందిగ్ధమైన కార్యమును నిర్భయముగాఁ జేయఁగలఁడు ?

సీతాదేవితో మాటలాడకుండిన నామె ప్రాణత్యాగము సేసి కొనును. మాటాడిన నిప్పుడు చెప్పిన యీగొప్పచేటు వాటిల్లును. సూర్యుఁ డుదయింపఁ జీఁకటి చెదరిపోవునట్లు, అయినపనులుగూడ నవివేకియగుదూత దేశకాలముల నెఱుఁగక పోవుటచేఁ జెడిపోవు చున్నవి. ఈపని చేయవచ్చునా చేయఁగూడదా యని రాజు మంత్రులతో యోచించి నిశ్చయించిన బుద్ధియు, వివేకముమాలిన దూతమూలమున శోభింపకున్నది. దూతలు తాము పండితులని తలఁచినవారలై కార్య ములఁ జెడఁగొట్టుదురు. కావునఁ బనియెట్లు చెడకుండును? ఎట్లునాకుఁ దెలివిలేని తనము రాకయుండును? నాసముద్రలంఘనశ్రమ మెట్లు వృథ కాకయుండును ? ఈసీతాదేవి నన్నుఁ జూచి వెఱవక యెట్లు నాపలుకుల వినును ?" అని యిట్లు ప్రశస్తమైన బుద్ధిగల హనుమంతుఁ డాలో చించె. "సచ్చరిత్రుఁడగు స్వబంధువైన రామునిఁ గీర్తించెదను. ఈ విడయుఁ దనబంధువార్త వినుటచే వెఱవకయుండును. అప్పుడు ప్రియ వాక్యములు పలుకుచు ధైర్యవంతుఁడైన యిక్ష్వాకుకులతిలకునియొక్క మంచినడవడులఁ దెలుపుమేటిమాటల నన్నిటిని వినిపించెదను. ఎట్లు నన్ను నమ్మునో, యాప్రకారము మాటాడెదను" అని మహానుభావుఁ డైన హనుమంతుఁడు లోకనాయకుఁడయిన రామునియొక్క దేవిని జూచుచుఁ జెట్టుకొమ్మనడుమ నున్నవాఁడై, సత్యప్రియమైన మాట చెప్పెను.

## 31-వ సర్గము

### హనుమంతుఁడు రామునిచరితము గీర్తించుట

వానరవీరుఁడయిన హనుమంతుఁ డివ్విధమునఁ బలుతెఱఁగుల యోచించి, చేయఁదగిన పనిని నిర్ణయించుకొన్నవాఁడయి, సమీపము

నందుఁ జేరి సీతాదేవినిమిత్తమయి యింపుమాటలను బలికినవాఁడయ్యెను.

చతురంగబలము గలవాఁడయిన దశరథుఁ డను రాజొక్కఁడు మంచినడవడి గలవాఁడును, ప్రసిద్ధిచెందినవాఁడునునై యుండెను. అతఁడు రాజర్షులలోపల శ్రేష్ఠుఁడు; తపస్సుచే ఋషులతో సమానుఁడు; చక్రవర్తులవంశమునఁ బుట్టినవాఁడు; బలమున నింద్రునిఁబోలినవాఁడు; భూతదయగలవాఁడు ; గొప్పబుద్ధియు, నెనరును, తిరమగు మగటిమియుఁగలవాఁడు ; ఇక్ష్వాకువంశపు రాజులలో ముఖ్యుఁడు ; వన్నెగలవాఁడు ; కలిమిని బెంపొందించువాఁడు ; రాజచిహ్నములతోఁ గూడినవాఁడు ; విస్తారసంపదగలవాఁడు ; రాజులలోపల నుత్తముఁడు; భూమండలమునందలి యన్నివైపులందును బేరువడసినవాఁడు; ఆశ్రితులకు సుఖమొసఁగుచు, దానును సుఖము లనుభవించువాఁడు.

ఆతనికి రాముఁ డని ప్రఖ్యాతిఁజెందిన పెద్దకొడుకొకఁడు గలఁడు. అతఁడు చందురునిఁబోలు మోముగలఁవాఁడు ; విశేషముల నెఱిఁగినవాఁడు; విలుకాండ్రందఱిలో నుత్తముఁడు ; స్వధర్మమును గాపాడువాఁడు ; స్వబంధువులఁ గాపాడువాఁడు ; ప్రాణులనెల్లరఁ గాపాడువాఁడు; ధర్మమును గాపాడువాఁడు; శత్రువులను దహించువాఁడు. ముదుసలియగునతనితండ్రి యొక్క విషయమునఁ బ్రతిజ్ఞ యొనర్చి, దానిం దప్పఁజాలక, యారాముని, అతని భార్యతోను, అతనితమ్మునితోను నడవికిఁ బంపెను. ఆరాముఁడు కాఱడవియందు వేటనిమిత్తము తిరుగుచుఁ గామరూపులగు పెక్కండ్రు శూరరాక్షసులను జంపెను. జనస్థానమందలి పదునాలుగువేలమంది రాక్షసులను, వారినాయకులగు ఖరదూషణులను రాముఁడు సంహరించిన వార్తవిని, రావణుఁ డలిగి, మాయామృగముచే రాముని వంచించి యారాముని దేవియైన సీత నపహరించెను.

ఆరాముఁడు నిర్దుష్టురాలగు నాసీతాదేవిని వెదకుచు, సుగ్రీవుఁ డను వానరునితోఁ జెలిమి చేసికొనెను. అంతటఁ బగతురపురములను గెల్చునట్టి బలవంతుఁడగు రాముఁడు సుగ్రీవునియన్నయగు వాలి యనువానిని జంపి, సుగ్రీవునికిఁ వానరరాజ్యమొసఁగెను. సుగ్రీవుని పనుపుచేఁ గోరినరూపము దాల్పఁగల పెక్కండ్ర వానరులు ఆదేవి నన్ని

దెసలయందు వెదకుచున్నారు. నేనును సంపాతిమాటనుబట్టి యీ విశాలవి కన్నులదగు సీతాదేవినిమిత్తమై నూఱుయోజనముల దవ్వుగల సముద్రమును వేగముతో దాఁటితిని. రాఘవుఁడు తనపత్నియయిన యీసీత యెట్టిశరీరము, ఎట్టివన్నె, ఎట్టిడాలును గలిగినదని చెప్పెనో, అట్టి రూపవర్ణాదులుగల యీసీతను నేనిచ్చటఁ గాంచితిని" అని చెప్పి వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు మాటలు చాలించెను.

అంతట వంకరలైన శిరోజములకొనలును, నల్లని ముంగురులును గలదైన యాపికిలికిదగు సీతాదేవి శిరోజములచేఁ గప్పఁబడియున్న తన మోము పైకెత్తి శింశుపావృక్షమును జూచెను. మఱియు నామె హనుమంతునిపలుకులు విని, దిక్కులను విదిక్కులను జూచి, రామునిఁ దదేకాగ్రచిత్తముతో ధ్యానించి, రామవార్తాశ్రవణముచే బరమానందము నొందెను. అటుతర్వాత నామె యిరుప్రక్కలందును, క్రిందను బైననుజూచి, ఊహింపరాని తెలివిగలవాఁడయి, ఉదయపర్వతశిఖరమున నున్న సూర్యసారథియైన యరుణునింబోలినవాఁడును, వాయుపుత్త్రుఁడును, సుగ్రీవునిమంత్రియునైన హనుమంతునిఁ జూచిన దాయెను.

## 32-వ సర్గము

### సీత హనుమంతునిఁ జూచి విచారపడుట

అటుతర్వాత సీతాదేవి, తెల్లనివలువగట్టినవాఁడును, మెఱుగుఁ బోలెఁ బచ్చనివాఁడును, వినయయుక్తముగా నింపుమాటలు మాటాడువాఁడును, వికసించిన యశోకపుష్పములగుంపువలె వెలుఁగు వాఁడును, పుటమువేసిన బంగారపుడాలుగల కన్నులుగలవాఁడునై యాశింశుపావృక్షపుఁగొమ్మనడుమ డాఁగియున్న యవ్వానరునింజూచి, మనసునఁ గలవరపడినదై, పరమాశ్చర్యము నొంది, "ఆహా! యీవానరుని రూపము భీకరమును, జూడ నలవికానిదియునై యున్నది?" యని తెలిసికొని మఱల మూర్ఛనొందెను. తర్వాతఁ గొంతసేపటికిఁ దెప్పిఱిల్లి, "పెద్దగొంతెత్తి యేడ్చిన నీరాక్షసు లిదియేమని యడుగుదురు" అని వారికి వెఱచి "హా రామా" యనియు, "హా లక్ష్మణా" యనియుఁ బలుతెఱఁగులఁ దిన్ననిగొంతుతో రాక్షసులకు వినరాకుండునట్లు విల

పించెను. ఆసీతాదేవి యట్లు విలపించి,వినయముతోడఁ గూర్చుండియున్న వానరపుంగవునిఁజూచి, "ఇది కల" అని తలఁచెను.

ఆసీత యట్లు విచారపడి, గొప్పవంకరమోముగలవాఁడును, వానరేంద్రుఁడగు సుగ్రీవునియాజ్ఞాకరుఁడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడునునైన వాయునందనుండగు హనుమంతునిఁ జూచినంతటనే నిక్కలి సంజ్ఞ దప్పి, ప్రాణములేనిదానివలెఁ గ్రిందఁబడి, మఱలఁ జాలసేపటికి సంజ్ఞవొంది "నేనిప్పుడు స్వప్నమున వికృతరూపముగల వానరునిఁ జూచితిని. ఇది శాస్త్రనిషిద్ధము, రామలక్ష్మణులకును, నాతండ్రియగు జనకమహారాజునకును మేలగును గాక!" అని యనుకొని, మఱల "ఇది కలయుఁ గాదు. నిండుచందురునిఁ బోలు మోముగల నాప్రియునిఁ బాసి శోకదుఃఖపీడితురాలనైయున్న నాకు సుఖమును, నిద్రయు లేవు. ఏను రామరామ యని యెల్లప్పుడు మనస్సున ధ్యానించుచు, నాతని నామమునే యుచ్చరించుచు, నాతని కనురూపమైన కథను వినుచు, నాకథలోని సంగతులనే చూచుచున్నాను. ఏలయన ఆనాథునివియోగమువలన మదనపీడితురాలనై, అతనియందే నాతలంపెల్లనుంచి, యతనినే ధ్యానించుచు నతనినే చూచుచున్నాను. అతని కథనే వినుచున్నాను. ఇది సంకల్పముగా నుండవచ్చునని యాలోచించి, మనమున నట్లెయుండునని యూహించుచున్నానుగాని మఱల "ఇది మనోరథముగాదు. దానికి రూపములేదు. ఈవానరుఁడు చక్కఁగాఁ దెలియు రూపముతోఁ గూడినవాఁడై నన్నుఁ గూర్చి పలుకుచున్నాఁడు. ఇది యేదిగానైన నుండనిమ్ము. గురువునకును, దేవేంద్రునకును బ్రహ్మాగ్నులకును నమస్కరించెదను. ఈవానరుఁడు నాతోఁ జెప్పిన దేదో, అది నిక్కమగునుగాని, వేఱువిధముగాఁ గాకపోవుఁగాక!" అని సీత తనలోఁ దాను జింతించిన దాయెను.

## 33-వ సర్గము

### హనుమంతుఁడు సీతాదేవి నడుగుట

పవడపుకాంతివంటి కాంతిగల మోముగలవాఁడును, అడఁకువఁ దెలుపువేషము దాల్చినవాఁడును, సీతనుజూచి దీనతనొందినవాఁడునైన యాహనుమంతుఁడు శింశుపావృక్షాగ్రమునుండి దిగి మ్రొక్కి, దోఝ

నకుఁ జేరి, దోసిలి యొగ్గి నెత్తి నిడుకొని, యా సీతాదేవింగూర్చి యింపుమాటలతో నిట్లనియెను:

"ఓ తమ్మితేకులవంటి కన్నులుగలదానా! మాసినపట్టుచీరగట్టిన దానా! ఓపతివ్రత వగుదానా! నీవెవతెవు? ఏల చెట్టుకొమ్మను బట్టుకొని నిలుచుకొని యున్నావు. తామరపువ్వులరేకులనుండి నీరు దొఱఁగునట్లు నీనేత్రములనుండి యేల కన్నీరుగాఱుచున్నది? ఓశుభకరురాలా! ముద్దుమోముగలదానా! నీవు దేవకాంతవో? అసురవనితవో? నాగభామినివో? యక్షాంగనవో? కిన్నరులచామవో? గుండ్రనిపిఱుఁదులును ముద్దుమోమునుగలదానా! చూడఁగా నీవు దేవాంగనవుగాఁ గనఁబడుచున్నావు. రుద్రులకు సంబంధించినదానవో? మరుత్తులకుఁ జేరినదానవో? అష్టవసువుల యతివవో? లేక, చంద్రునిఁబాసి దివము నుండి క్రిందఁబడిన యన్ని సుగుణములుగలదగు రిక్కలలో రాణియైన రోహిణివో తెలియఁ బలుకుము. ఓ కల్యాణీ! నీ వెవతెవు? ఓ సొగసు కన్నులదానా! నీవెవతెవు? నల్లనికంటిదానా! మోహముననో, కోపముననో భర్తయగు వసిష్ఠమునీంద్రుని కలుక గలిగించి వచ్చిన యరుంధతివిగాదు గదా? ఓ నెన్నడుము గలదానా! నీవెవనికిఁ దల్లివి? నీతండ్రి యెవఁడు? నీతోఁబుట్టువు ఎవఁడు? నీమగఁ డెవ్వఁడు? ఈలోకముఁబాసి పరలోకమునకుఁ బోయిన యెవ్వనినిఁ గూర్చి చింతించుచున్నావు. రోదనమును బట్టియు, నిట్టూర్పును బట్టియు, భూమిమీఁద నిల్చియుండుటఁ బట్టియు, రాజచిహ్నములు దెలియవచ్చుటంబట్టియు నీవు దేవాంగనవుకావని తలంచెదను. నీయొంటిచిన్నెలు పరికింపఁగా, నీవొక్కతేనికి దేవేరివై యుందువని యెంచెదను. నీ వొక్కవేళ రావణుఁడు బలవంతముగాఁ బట్టితెచ్చిన సీతవుగా నుందువేని నే నడిగెదఁ జెప్పుము. నీమెత్తనిదనమును, నీయమానుషసౌందర్యమును, నీమునివేషమును జూడ, నీవు తప్పక రామునిదేవివే యని యెంచెదను."

ఆసీతాదేవి రామునిచరితము వినుటచే సంతసము నందినదై చెట్టుపైఁ గూర్చుండియున్న హనుమంతునితో నిట్లనియె: "నేను రాజశ్రేష్ఠుఁడును, జ్ఞానవంతుఁడును, పగతురదండుఁ గాల్చువాఁడునైన దశరథమహారాజుపాలునికిఁ గోడలను, మహావివేకియగు విదేహదేశాధి

పుడయిన జనకమహారాజునకుఁ గూఁతురను. నన్ను సీతయందురు. బుద్ధి మంతుఁడగు రామునికి భార్యను. ఏను నానాథుని గృహమునఁ బండ్రెం డేండ్లు మానుషభోగము లనుభవించుచు నన్నికోర్కులతో నిండిన దాననై యుంటిని. అప్పుటఁ బదుమూడవయేట దశరథమహారాజు తన కులగురువగు వసిష్ఠునితో నాలోచించి, నానాథునికిఁ బట్టాభిషేకము చేయఁదలఁచెను. ఆపట్టాభిషేకప్రయత్నము జరుగుచుండఁగా, ఆతని కడఁగొట్టు భార్యయగు కైకేయి భర్తనుజూచి, "ఓనాథా రామునికిఁ బట్టాభిషేకము నీవు చేయుదువేని, నేను బ్రతికియున్నంతవఱకు నన్నముఁ గుడువను; నీరుద్రావను. ఇకనేఁ బ్రాణములతోనుండను. ఓరాజశ్రేష్ఠా! నీవు నాకు మున్నొసఁగినవరముల నిక్కము సేయఁగోరుదేని రాము నడ వికిఁ బంపుము" అని యడిగెను. సత్యసంధుఁడయిన యారాజు కైకే యీదేవికొసఁగిన వరములను జ్ఞప్తికిఁదెచ్చికొని, యాకఠినురాలగు కైకేయియొక్క మాటనువిని యట్లే మూర్ఛనొందెను. అంతట ముదు సలియగు నాదశరథనృపాలుఁడు వాగ్దత్తమునకుఁ గట్టువడినవాఁడై, విలపించుచుఁ గీర్తిమంతుఁడయిన తనపెద్దకొడుకగు నానాథునిరాజ్యము వేఁడెను. అంతఁ గాంతిగలవాఁడగు నాప్రియుఁడు రాజ్యపట్టమునకంటెఁ బితృవాక్యపరిపాలనము ముఖ్యమని మనఃపూర్వకముగా నంగీకరించిన వాఁడయ్యెను. కదలని మగఁటిమి గల యారాముఁడు కోరినది యొసఁ గునుగాని, యిచ్చినది గైకొనఁడు. తన బ్రదుకునిమిత్తమైన నిసుమంత చేఁదుమాటనైనఁ బలుకఁడు. గొప్పపేరువడసిన యారాముఁడు మేలిమి పుట్టములను విడిచి రాజ్యమునుగూర్చి తలంపక తల్లికి నప్పగించెను. నేను నాపెనిమిటిని బాసి స్వర్గమున నైన నుండఁగోరను గనుక, నేనును నానాథునికంటె ముందుగా వనములకుఁ దఱలితిని. చెలికాండ్ర కానంద దాయకుఁడయిన మహానుభావుఁడగు లక్ష్మణుఁడు తనయన్నతోఁగూడ రాఁగోరి, నారబట్టలఁ దాల్చి యన్నకంటె ముందుగాఁ బయనమాయెను. మేము ముగ్గురమును నాయకుఁడయిన దశరథునియానతిని గారవించి, కఠిననియమములు పూని ముందు చూడఁబడనిదియగుటచే చూపునకు వెఱపు పుట్టించునదియగు దండకారణ్యముఁ జొచ్చితిమి. ఎక్కువ వెలుఁగుగల యారాముఁడు మాతోడ నాదండకారణ్యమున నుండఁగా దురాత్ముఁడయిన రావణుఁడు నన్ను దొంగిలించి తెచ్చెను. నా కిక

రెండునెలలవఱకుఁ బ్రాణములతో నుండుటకు సమ్మతి యొసఁగెను. ఆ రెండునెలలకుఁదరువాత నేను ప్రాణముల విడుతు" నని సీత హనుమంతునితోఁ దనవృత్తాంతము చెప్పిన దాయెను.

## 34-వ సర్గము

### హనుమంతుఁడు సీతతో సంభాషించుట

వానరులగుంపుకాఁపరియగు హనుమంతుఁడు సీతాదేవియొక్క మాటలను విని, తీరని వ్యసనముఁ బొందియున్న యాసీతాదేవితో నిట్లనియె :

"ఓదేవీ, నేను రామునిపనుపునఁ నీకడకు దూతనుగా వచ్చితిని. ఓవైదేహీ! రాముఁడు కుశలముతో నున్నవాఁడు. బ్రహ్మాస్త్రమును, వేదములను, వేదాంగములను దెలిసినవాఁడును, వేదవిదులలో నుత్తముఁడునైన దశరథపుత్త్రుఁడగు నారాముఁడు నీనేమ మరయు మనెను. ఎక్కువ పరాక్రమము గలవాఁడును, నీమగనికిఁ గూర్చు తమ్ముఁడునైన లక్ష్మణుఁడు చింతలఁ దల్లడిల్లినవాఁడై శిరముతో నీకు మ్రొక్కెను"అని.

ఆసీతాదేవి రాజశ్రేష్ఠులయిన యారామలక్ష్మణుల వార్తను విన్నదై, ముదమున మేనఁ బులకలెత్తఁగా నాహనుమంతునిఁ జూచి, "నూఱేండ్లకైనను బ్రాణములతో నున్నవాని కానందము గలుగును" అను సామెత నిక్కమనియె తోఁచుచున్నది అని చెప్పెను.

ఆవచ్చిన హనుమంతునియం దారాముని దేవికి వింతయైన ప్రీతి గలిగెను. అంత వారిరువు రొండొరులను నమ్మి మాటాడ మొదలిడిరి. అంతట నావానరనాథుఁడు ఆసీతాదేవియొక్క మాటను విని వెతలఁ గుందియున్న యాసీతాదేవికడ కేతెంచెను.

ఆ చక్కనియంగములుగల సీతయు హనుమంతుఁ డెంతెంతదగ్గఱకు వచ్చుచున్నాఁడో యంతంతగా నతనింగూర్చి సంశయపడినదై, "ఇతనితో నేనిప్పుడు మాటాడినదియు ననుచితముగా నున్నది. ఛీ! యేల యింతవెట్టిపని చేసితిని. ఆదురాత్ముఁడగు రావణుఁడే నన్ను మోసపుచ్చుటకై మాఱువేషము దాల్చి వచ్చెనేమో!" అని తనలోఁ దాను దలఁచినదై, యా యశోకవృక్షముయొక్క కొమ్మను వదలిపెట్టి యా చెట్టుక్రింద నేలమీఁదఁ గూర్చుండెను.

నిడుదచేతులవాఁడగు హనుమంతుఁడు వెలుపుచేఁ దత్తరపడి, వెతలచే నొచ్చియున్న యాజానకికి మ్రొక్కెను. ఆపున్నమచందురునిఁ బోలు మోముగలదియు, మధురమయిన కంఠధ్వనిగలదియునైన యా సీతయు హనుమంతుఁడు దాపునకు వచ్చుకొలఁది భయపడినదై, మఱలఁ దలయెత్తి యాహనుమంతునివైపు చూడకుండెను. అట్లు కొంతసేపుండి యాదేవి నిట్టూర్పు నిగిడించి యిట్లనియె:

"ఓరీ! నీవు మాఱు [illegible] దాల్చిన మాయలమారియగు రావణుఁడవే? నీవిట్లు మాయఁ [illegible] నాకు మఱల సంతాపముగలిగించుట యుక్తముగాదు. [illegible] మెత్తఁగల యోరీ నిశాచరా! నేనసలే వెతలఁగుందుచున్నాను. మ[illegible]యు నన్నేల వెతలలో ముంచెదవు? ఇధి నీకు శ్రేయస్కరముగాదు. ఒకవేళ నేఁదలచినదియట్లుకాక యుండవచ్చును. ఏలయన, నీదర్శనమాత్రముననే నాకెక్కువ సంతసము పుట్టినది. ఓరీ! నీవు రామునిదూతవుగా వచ్చియుంటివేని, నీకు మేలగునుగాక. వానరశ్రేష్ఠా! నిన్నడిగెదను. రామునికథ నాకుఁ బ్రియమయినది. నాకుఁబ్రియుఁడైన రామునియొక్కగుణములను వర్ణింపుము. తిన్ననివాఁడా! ఏటిప్రవాహము నురవడి యేటిగట్టును హరించునట్లు, నీవు నామనస్సును హరించుచున్నావు. ఓహో యిది కలయో! ఏమి యీ స్వప్నానందము! నన్నీరావణుఁడు తెచ్చి చాలదినములాయె. నేఁడు స్వప్నమున రాఘవుఁ డంపిన దూతను గాంచితినిగదా. నేనీరాఘవునిదూతను స్వప్నమందుఁ జూచినట్లె, యా శూరులగు రామలక్ష్మణులను జూతునేని, నే నిట్లు వగలలోఁ జిక్కనుగదా. ఆస్వప్నము గూడ నాయెడ నసూయగలిగియున్నది. ఆ! నేను పొరపడితిని. ఇది స్వప్నముగాదని తలఁచెదను. స్వప్నమున వానరదర్శన మశుభప్రదమని పెద్దలు వక్కాణింతురు. ఇప్పుడు నాకు వానరదర్శనముచే మేలు గలుగుచున్నది. ఇదిస్వప్నమే యైనచో నాకు మేలుగలుగునా? ఇది స్వప్నము గాదు. ఇది చిత్తభ్రమయో! ఉపవాసాదు లుండుటచేఁ గలిగిన వాతాదిదోషముల కలఁకపాటుచేఁ బుట్టిన వాయువికారరూపమైన భ్రమయో! విరహిజనసామాన్యమునకుఁ గల యొక యవస్థాభేదమో! లేక యెండమావులలో ఎంచిచూచిన నిది యున్మాదము గాదు. ఉన్మాదమువంటిదగు చిత్తవిభ్రమమును గాదు. నేను ప్రజ్ఞగలదాననుగా

నున్నదానను. ఈతఁడు వానరుఁడని నేను చక్కని తెలివితోఁ జెప్పు చున్నాను." అని యిట్లు సీతాదేవి పలుతెఱఁగుల నాలోచించి, మోహాదుల బలిమిలేమిని, రావణునిబలిమిని నిశ్చయించికొని, రాక్షసులకుఁ గామ రూపమెత్తుట సహజముగనుక నతఁడు రావణుఁడనియే నిర్ణయించు కొని, యాతనితో మాటలాడకయుండెను.

మారుత నందనుండగు హనుమంతుఁడు సీతతలంపును దెలిసి కొన్నవాఁడై యాసీతాదేవికిఁ జెవుల కింపులైనమాటలచే నామెను సంతోషపఱుపఁగోరి, "ఓదేవీ! ఆరాముఁడు సూర్యునివలె వెలుఁగుగల వాఁడు, చంద్రునివలె లోకమునకు మనోహరుఁడు, కుబేరునిమాడ్కి లోకముల కన్నిటికి రాజు, గొప్పపేరువడసినవిష్ణువుమాడ్కిఁ బరాక్రమ శాలి, బృహస్పతి చందమున సత్యప్రియములైన పలుకులు పలుకువాఁడు, శరీరముదాల్చిన మన్మథునిమాడ్కి రూపలావణ్యకాంతులు గలవాఁడు, సమయము వచ్చినప్పుడు కోపపడువాఁడు, తత్ఫలముగ శత్రులను బరిమార్చువాఁడు, లోకోత్తరుఁడు, మహారథుఁడునైనవాఁడు. సకల జనము లారాముని చేతి నీడయందు నిలఁబడియున్నవి. అట్టిరాముని మాయామృగము నెపమున వెలుపలికిఁ బోవున ట్లొనర్చి నిర్జనవనము నుండి యేరావణుఁడు నిన్నుఁ దెచ్చెనో, ఆరావణుఁడు దానికై యను భవింపఁబోవు ఫలము నీవు వేగిరమె చూడఁగలవు. ఓదేవీ! యేరాముఁడు యుద్ధమున రోషముచే బాణములఁ బ్రయోగించి రావణుని వధింపఁ బోవుచున్నాఁడో ఆరాముఁడే నన్నుఁ బంపఁగా, నేను నీకడ కేతెంచితిని. ఆరాముఁడు నీయెడఁబాటువలనివెతలచేఁ గుందినవాఁడై నీతో క్షేమము చెప్పుమనెను. సుమిత్రకు సంతసమొసఁగఁజేయువాఁడును, గొప్ప తేజస్సు గలవాఁడునునైన లక్ష్మణుఁడును నీకు మ్రొక్కి నీతో క్షేమము చెప్పు మనెను. వానరశ్రేష్ఠులకెల్ల రాజును, రామునికిఁ జెలికాఁడునైన సుగ్రీ వుఁడును నీకుశలమడిగెను. ఓదేవీ, రాముఁడు లక్ష్మణసుగ్రీవులను గూర్చుకొని యెల్లప్పుడు నిన్ను స్మరించుచుండును. ఓవైదేహీ! నీవు రాక్షసులవశమునఁ జిక్కియు, దైవానుగ్రహమునం జేసి జీవించి యున్నావు. వేగిరమె బలవంతులగు రామలక్ష్మణులును వానరరాజగు సుగ్రీవుఁడును ఇక్కడికి రాఁగలరు. నేను సుగ్రీవునిమంత్రిని. హను మంతుఁ డను పేరుగల వానరుఁడను. ఈమహాసముద్రమునుదాఁటి

లంకాపురములోపలఁ జొచ్చి, దురాత్ముఁడయిన రావణునినెత్తిని కాలు పెట్టి, మగటిమి పూని, నిన్నుఁ జూడ నేతెంచితిని. ఓదేవీ! నీవెట్లు నన్నుఁగూర్చి తలఁచెదవో, నేనట్టివాఁడను గాను. ఈకుశంక మాని, నామాట నమ్ముము" అని సీతాదేవిని నమ్మఁబలికెను.

## 35-వ సర్గము

### హనుమంతుఁడు రామునిగుణంబుల వర్ణించుట

వైదేహి హనుమంతునివలన నారామునివృత్తమును విని, "ఓ వానరా! నీకు ఆరామునితోఁ గూడిక యెక్కడఁ గలిగెను? లక్ష్మణుని నీ వెట్లెఱుఁగుదువు? వానరులకును నరులకును నెట్లు స్నేహము సమకూరెను ? రామలక్ష్మణులరూపచిహ్నము లెట్టివి ? ఆరామలక్ష్మణుల యంగములపొందిక యెట్టిది? వారిచేతులు దొడలును నెట్టివి? చెప్పుము. వారిచిహ్నములను నాకుఁ దెల్పితివేని, నాకు వ్యసనము కొంత తగ్గును" అని యింపుగులుకు పలుకులతో నడిగెను.

వాయుసూనుఁడగు హనుమంతుఁడు సీతాదేవియడిగినమాట విని, "ఓ కమలపత్రాక్షీ! యాహా, నీవు నీభర్తయొక్కయు, లక్ష్మణుని యొక్కయు చిహ్నముల నెఱిఁగినదానవుగానున్నను, నన్నడుగుచున్నావుగదా. అయినను, గొఱంత లేదు. ఆ రామలక్ష్మణులచిన్నెలను నేను చూచినంతవఱకు నెఱిఁగించెదను వినుము.

ఓజానకీ! రాముఁడు తమ్మిఱేకులంబోలు కన్నులుగలవాఁడు. సకలజంతువులకు మనోహరుఁడు. రూపము, దాక్షిణ్యమునుగలవాఁడు. తేజమున మార్తాండుని, ఓర్పునఁ బుడమిని, బుద్ధిని బృహస్పతిని, కీర్తిని నింద్రునిఁ బోలువాఁడు. సకలజనములను, దనచుట్టాలనుబోలెఁ బోషించువాఁడు. స్వధర్మమును, స్వవృత్తమును గాపాడువాఁడు. శత్రువులను సంహరించువాఁడు. బ్రాహ్మణాదులగు నాలుగువర్ణముల వారిని గాపాడువాఁడు. లోకవాడుకలను చేయువాఁడు, చేయించువాఁడు, కాంతిగలవాఁడు. సజ్జనసంపూజితుఁడు. ఋతుకాలములందుమాత్రము పత్నినిగవయుటచే బ్రహ్మచర్యవ్రతము నడచుకొనువాఁడు. సజ్జనులకు మేలొడఁగూర్పఁ దలఁచువాఁడు. సకలకర్మముల నడపురీతి నెఱిఁగినవాఁడు. రాజనీతి

యందు నేర్పరి. బ్రాహ్మణులను గొల్చువాఁడు. శాస్త్రముల నధ్యయనము చేసినవాఁడు. సత్స్వభావము గలవాఁడు. పెద్దలయెడ నడఁకువ గనఁబఱచువాఁడు. యజుర్వేదముఁ జదివినవాఁడు. వేదాంగములందును, ధనుర్వేదమునందును, తక్కిన వేదములందును నేర్పుగలవాఁడు. వేదార్థముల నెఱిఁగినవారిచే బహుమర్యాద చేయఁబడువాఁడు. విఱివి మూఁపురములును, నిడుపుచేతులును, శంఖమువంటి మెడయు, నెమ్మొమును, చక్కఁగాఁ గనఁబడని మూఁపుసంధులయెముకలును, కడునెఱ్ఱని నేత్రములును గలవాఁడని లోకప్రసిద్ధి నొందినవాఁడు. దుందుభి వాద్యపు మ్రోఁతంబోలు కంఠస్వరమును, నున్ననిమేనిడాలును, ఎక్కువ కాంతియుగలవాఁడు. పొడవును గుఱుచయుఁగాక సమముగా నుండువాఁడు. శ్యామలవర్ణుఁడు, గట్టివైన ఱొమ్ము, మణికట్టు, పిడికిలియుఁ గలవాఁడు. కనుబొమలు, చేతులు, వృషణములుగలవాఁడు. సమమయిన వెండ్రుకలకొనలు, బీజములు, పిక్కలుగలవాఁడు. ఉన్నతములయిన బొడ్డు, పొట్ట, ఱొమ్ము గలవాఁడు. నెఱ్ఱనైన కంటితుదలు, గోళ్లు, అఱగాళ్లు గలవాఁడు. నిద్దములైన కాలిరేఖలు, శిరోజములు, లింగముగలవాఁడు ; నాభి, కంఠస్వరము, స్వభావము లోఁతయినవాఁడు. బొజ్జమీఁద మూఁడుముడతలుగలవాఁడు. అవనతములయిన స్తనములు, చనుమొనలు, కాలిరేఖలు గలవాఁడు. కుఱుచైనమెడ, మేహనము, పిఱుఁదు, పిక్కలుగలవాఁడు. సమము, గుండ్రము, ఛత్త్రాకారము అను మూఁడు లక్షణములతోఁ గూడిన శిరస్సుగలవాఁడు. నాలుగువేదములయధ్యయనమును దెల్పు బొట్టనవ్రేలియందలి నాలుగురేఖలును, నొసటను కాళ్లయందును చేతులందును నాలుగేసిరేఖలునుగలవాఁడు. తొంబదియాఱంగుళముల పొడవుగల చేతులుగలవాఁడు. సమములయిన చేతులు, మోఁకాళ్లు, తొడలు, పిక్కలుగలవాఁడు. రెండు కనుబొమ్మలు, రెండు ముక్కు తొఱ్ఱలు, రెండుకన్నులు, రెండుచెవులు, రెండుపెదవులు, రెండు చనుమొనలు, రెండు మోఁచేతులు, రెండు మణికట్లు, రెండు మోఁకాళ్లు, రెండు బీజములు, రెండు పిఱుఁదులు, రెండు చేతులు, రెండు పాదములు, రెండు పిక్కలు అను నీపదునాలుగు జంటల యవయవములును సమముగా నుండువాఁడు. నాలుగుదంష్ట్రలను పండ్లుగలవాఁడు. సింహ

వ్యాఘ్రగజవృషభముల నడకంబోలు నడకగలవాఁడు. దొండపండు వలె నెఱ్ఱనైన కండపట్టిన పెదవులును, ఉబ్బిన బలిసిన నిండిన చెంపలును, నిడుపువి ఎత్తువి సొగసువియు నైన ముక్కుపుటములును గలవాఁడు. స్నిగ్ధములయినమాటలు, ముఖము, గోళ్లు, రోమములు, చర్మముగల వాఁడు. నిడివియైన వెన్నెముక, శరీరము, కాలుసేతులవ్రేళ్లు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, శిశ్నము నను నెనిమిదంగములు గలవాఁడు. పద్మమువంటి యాకారముగలవగు మోము, కన్నులు, వాయి, నాలుక, పెదవులు, దౌడలు, స్తనములు, గోళ్లు, చేతులు, పాదములు అను పది యంగములు గలవాఁడు. గొప్పవైనతల, నొసలు, చెవులు, మోము, మెడ, ఱొమ్ము, గుండెకాయ, కడుపు, కాలుసేతులు, వీఁపు అను పది యంగములుగలవాఁడు. ప్రసిద్ధికెక్కిన కీర్తి, తేజము, పేరునుంగల వాఁడు. నిష్కళంకములైన మాతాపితృవంశములు కలవాఁడు. ప్రక్కలు, కుక్షి, ఱొమ్ము, ముక్కుపుటములు, మూఁపులు, నొసలు అను నా ఉన్నతాంగములు గలవాఁడు. సన్ననైన వ్రేళ్లగణుపులు, శిరోజ ములు, రోమములు, గోళ్లు, చర్మము, మగగుఱి, మీసములు, దృష్టి, బుద్ధియునను తొమ్మి దవయవములుగలవాఁడు. ధర్మ అర్థ కామములను వరుసగా పూర్వాహ్ణమునను, అపరాహ్ణమునను, రాత్రులయందును సేవించువాఁడు. సత్యవాక్యపరిపాలనమునందుఁ బట్టుదలగలవాఁడు. కాంతిమంతుఁడు. ధనసంపాదనమునందును, ధనము వెచ్చించుటయందు ను శ్రద్ధగలవాఁడు. యుక్తదేశ కాలములవిభాగము నెఱిఁగినవాఁడు. సర్వజనుల కింపుగా మాటాడువాఁడు. ఆరామునికి సవతితల్లికొడుకగు లక్ష్మణుఁడును శత్రువులకు లొంగనివాఁడు; ప్రేమరూపగుణములందు నారామునే పోలినవాఁడు.

ఆనరోత్తము లిద్దఱు నిన్నుఁగనుఁగొనఁ గుతూహలముగలవారై, పుడమినెల్ల వెదకుచు, అన్న తఱుమఁగొట్టగా నతనికి వెఱచి, పరుగెత్తివచ్చి పెక్కువృక్షములతో నిండియున్న ఋశ్యమూకపర్వతమునందు దాఁగి యున్న సుగ్రీవుఁడనెడివానరుని, ఆతనిమంత్రులమగు మమ్మునుఁజూచెను. అన్నచే రాజ్యమునుండి తఱుమఁబడి ఋశ్యమూకమున నున్న సత్యసంధుఁ డగు వానరరాజయిన సుగ్రీవునికి మంత్రులమైన మేము పరిచర్య చేయు చుంటిమి. అంత నారబట్టలఁగట్టినవారును, మేటివిండ్లను దాల్చినవారునైన

యారాజపుత్త్రులగు రామలక్ష్మణు లిద్దఱును ఋశ్యమూకపర్వతము యొక్క మనోహరప్రాంతమునకు వచ్చిరి. వానరరాజగు సుగ్రీవుఁడును విండ్లు దాల్చిన యాపురుషశ్రేష్ఠులం జూచి, వారు వాలిచేఁ బంపఁబడిన బంటులేమో యని వెఱచినవాఁడై, యాపర్వతంపుఁగొనకు నెగిరి, యచ్చటనుండినవాఁడై, వార లెవ్వరో కనుఁగొనిరమ్మని నన్నే వారి కడకుఁ బంపెను. నేనును సుగ్రీవునియానతిని గొని, రూపలావణ్యము లతోఁగూడిన యారాజపుత్త్రులకడకుఁ బోయి దోసిలి గట్టికొని నిలిచి, వారివాస్తవ స్థితిని గనుఁగొని, వారికి మాయెడఁ గల ప్రేమ వెల్లి విరియ, నాపురుషోత్తముల రాజపుత్త్రుల నిరువురిని నా మూఁపుమీఁద నెక్కించికొని, మాయేలికకడకుఁ దెచ్చివిడిచి, వానరేంద్రుఁ డయిన మా రాజగు సుగ్రీవునికి వారివాస్తవస్థితి నెల్ల నెఱింగించితిని. అంత వారొండొరులు గలిసి కొంతతడవు ముచ్చటలాడఁగా వారికి మేరలేని పరస్పరవిశ్వాసము గలిగెను.

ఒండొరులమీఁదఁ బ్రేమగల యా వానరేంద్రనరేంద్రులు ముందు నడచిన వృత్తాంతముఁ దెల్పుకొని యొండొరులను నమ్మిన వారైరి. అంత లక్ష్మణుని యన్నయగు రాముఁడు, ఎక్కువ పరాక్రమముగల తనయన్నచేఁ దనయాలిని లాగికొని తఱుమఁబడి పర్వతమున దుఃఖపడుచున్న సుగ్రీవుని "చెలికాఁడా! నీవు చింతపడవలదు. నేను నీశోకము మాన్పెదను" అని యూరడించెను. ఆయద్భుతమైన మగఁటిమిగల రామునికి నీవియోగముచేఁ గలిగియుండు వ్యసనమును లక్ష్మణుఁడు సుగ్రీవుని కెఱిఁగించెను. వానరరాజగు ఆ సుగ్రీవుఁడును లక్ష్మణుఁడు తెలిపినసంగతిని విని పర్వమునందు రాహువుచే మ్రింగఁబడిన సూర్యునిమాడ్కిఁ గడు వెలవెలపోయెను. అప్పుడే రావణుండు నిన్నెత్తుకొని పోవునపుడు, నీదేహమున వెలుఁగుచుండిన సొమ్ములను ఒలిచి, నీవు పైటకొంగునఁగట్టి క్రిందవైచిన సొమ్ములమూటను వానరులు సంతసముతోఁ దెచ్చిచూపిరిగాని, నీ వే దిక్కునకుఁ బోయిన్నది యెఱుఁగరైరి. ఆకాశమునుండి పడునప్పుడు మ్రోగుచుండిన యాసొమ్ములను రాముని కిమ్మని సుగ్రీవుఁ డీయఁగా, నే నాసొమ్ములమూటను దెచ్చి శోకముచేఁ దెలివిదప్పియున్న యా రామునిముందట నర్పించితిని. దేవతలమాడ్కి వెలుఁగునట్టి యారాముఁడు చూడఁదగియుండు నాసొమ్ము

లను తనతొడమీఁద నుంచుకొని పలుతెఱఁగుల విలపించెను. ఆ సొమ్ము లను జూచిచూచి పలుమాఱు వెలవెలపోయి దుఃఖించెను. ఆ తొడవు లా రామునకు శోకాగ్నిని మఱింత హెచ్చఁజేసెను. అంతట దశరథ సూనుఁడు తాను గడుధైర్యవంతుఁడయ్యు నీవియోగశోకముఁ దాళఁ జాలక మూర్ఛిల్లెను. అప్పుడు నేనును బలువిధముల నోదార్చి మాటి మాటికి లేవనెత్తి కూర్చుండఁబెట్టితిని. అంత రాఘవుండు లక్ష్మణసమే తుఁడై యాభూషణములను బలుమాఱు తాను జూచి, మాటిమాటికి మా కందఱకుఁ జూపించి, పలుతెఱఁగుల విలపించి, యా తొడవులను గడపట సుగ్రీవునిచేత నుంచెను.

అగ్నిపర్వతము సదా మండుచున్న గొప్పమంటచేత నెఱియు నట్లు, ఓ దేవీ! రాఘవుఁడును నీదర్శనాభావముచే దుఃఖాగ్నియందు మలమల మాడుచున్నాఁడు. దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయము లనెడు మూఁడగ్ను లగ్నిహోత్ర గృహమును దహింపఁజేయునట్లు, నీనిమిత్తమైన జాగరమును, శోకమును, చింతయు రామునిఁ దహింపఁ జేయుచున్నవి. గొప్ప భూకంపముచే గొప్పకొండ యూఁగులాడు నట్లు, నీ దర్శనముచే రాఘవుఁడు ధైర్యంబేది వణఁకుచున్నాఁడు. ఓ రాజపుత్రీ! యిక్ష్వాకునందనుఁ డెన్నియో యొప్పినకానలను, సెల యేళ్లను, ఏళ్లను దిరిగినను, నిన్నుఁ జూడక మది సంతసముఁ బాసి యున్నాఁడు. ఓ జానకీ! ఆ పురుషోత్తముఁడు వేగమె వచ్చి రావణుని మిత్రబంధు పరివారసహితముగా వధించి నిన్నుఁ బొందఁగలఁడు. నీవు విచారము మానుము.

అంతట రాముఁడు వాలిని జంపునట్లును, సుగ్రీవుఁడు నిన్ను వెదకి యిచ్చునట్లును వారిద్దఱుఁగలిసి యేర్పాటుచేసికొనిరి. వెంటనే వానరరాజగు సుగ్రీవుఁ డా రాజపుత్రులను దోడ్కొని చని వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. ఆ యుద్ధమునఁ రాఘవుఁడు సుగ్రీవునికి బాస టయైయుండి వాలిని సంహరించి సుగ్రీవుని వానరరాజ్యమునఁ బట్టాభి షిక్తుం జేసెను. ఓ దేవీ! రామసుగ్రీవుల కిద్దఱ కివ్విధమునఁ జెలిమి గలిగెను. నేను హనుమంతుఁడను. వారు పంపఁగా నిచ్చటికి వచ్చిన దూత నని యెఱుఁగుము,

సుగ్రీవుఁడు రాజ్యమును బొంది, బలవంతులైన వానరశ్రేష్ఠుల నందఱను బిలిపించి, నిన్ను వెదకుటకై యన్నిదెసలకుఁ బంపెను. పర్వతోత్తమములఁ బోలిన వానరవీరులు పరాక్రమశాలియగు వానరేంద్రునియానతి గొన్నవారై భూమండలమున నన్నివైపులకుఁ దఱలిరి. ఆవానరవీరులును, మేమును భూమియెల్ల నీనిమిత్తమై తిరుగుచున్నాము. కాంతిమంతుఁడును, బలవంతుఁడునునైన యంగదుఁడను పేరుగల వాలినందనుఁడు వానరసేనలో నేను మొదలుగాఁగల మూఁడవపాలుసేనను గైకొని దక్షిణదిశకుఁ బయనమాయెను. మేము వింధ్యపర్వతము సొచ్చి పర్వతదుర్గములందును, నెలయేళ్లయొడ్డులందును నిన్ను వెదకుచు నొక గుహ చొచ్చితిమి. అచ్చట దారితెలియమిచే మేము దుఃఖాక్రాంతులమై పెక్కురేయింబగళ్లు గడపితిమి. మాకు వానరరా జొక్క నెలగడువొసఁగెను. ఆగడువులోపల మేము రానియెడల, మాకు మరణము దండనముగా విధింపఁబడియుండెను. మేమందఱమును కార్యము కాకపోవుటచేతను, గడువు మీఱిపోవుటచేతను, వానరేంద్రునివలని వెఱపుచేతను బ్రాణముల విడువ నిశ్చయించితిమి. అప్పు డంగదుఁడు ప్రాయోపవేశముచేసిన నేను మొదలగువానరవీరుల నందఱిని జూచి, శోకసాగరమునఁ బూర్ణముగా మునిఁగినవాఁడై "నీవేల కనఁబడకపోవలెను? రాముఁడు వాలి నేల చంపవలెను? సుగ్రీవుఁడు పంపఁగా వచ్చిన మన కాసీత యేల కనఁబడకపోవలెను? మనమెల్లరు ప్రాయోపవేశమేల చేయవలెను? జటాయువు బ్రతికియుండిన నాతఁడే రామునికి సీతాదేవివృత్తాంతము చెప్పియుండునే. ఆతఁ డేల చావవలెను?" అని విచారపడెను.

అప్పుడు మే మందఱము రాజునుత్తరువు మీఱుటచే నిరాశులమై ప్రాణముల విడువ సిద్ధముగా నుండఁగా, వీర్యవంతుఁడును, గొప్పవాఁడునైన యొకపక్షీంద్రుఁడు పనియున్నవాఁడువోలె నచ్చటికేతెంచెను. అతఁడు జటాయువునకుఁ దోఁబుట్టువు. సంపాతియనుపేరుగలవాఁడు. ఆతఁ డంగదునిమాటవలనఁ దనతమ్ముఁడు మృతినొందినవార్త విన్నవాఁడై, "ఓ వానరోత్తములారా! మాతమ్ముని నెవ్వఁ డెచ్చటఁ జంపెను? నాకుఁ జెప్పవలయు" నని యడిగెను. అంగదుఁడును "జటాయువు నీనిమిత్తమై జనస్థానమున రావణునితోఁ బోరుచేయుట,

ఆపోరున క్రూరకర్ముఁడగు రావణాసురుఁడు నిన్నుఁ జంపుట మొదలగు సంగతులను దెలిపెను. అంతట సంపాతి జటాయువువధమును విని దుఃఖించినవాఁడై, ఓ దేవీ! నిన్ను రావణునింట నున్న దానిఁగాఁ దెల్పెను.

నీదర్శనమునం దాసక్తిగలవారలైన యంగదుఁడు మొదలగు వానరవీరు లందఱును సంపాతిచెప్పిన సంతోషదాయకమైన వార్తను విని, వేగిరమే ప్రాయోపవేశము విడిచిలేచి, వింధ్యపర్వతమునుండి బయలుదేరి దక్షిణమహాసముద్రముయొక్క యీవలిగట్టుచేరి, మొదట హర్షసంతోషములఁ బొందిరిగాని యావల "దీనినెట్లు దాఁటి యాలంకాపురిం జేరఁగల" మని సముద్రము దాఁటుటకు వెఱచి విచారగ్రస్తులైరి.

అప్పుడు నేను వానరసైన్యము సముద్రము దాఁట వెఱచి యుండుటనుజూచి, యోర్వరాని భయమును విడిచిపెట్టి నూఱు యోజనములదవ్వు గల సముద్రమును దాఁటి, రాక్షసులచే నిండి యున్న లంకాపురిని రాత్రి ప్రవేశించితిని. రావణునిఁ జూచితిని. దుఃఖార్ణవమున మునిఁగియున్న నిన్నును జూచితిని. ఓ పతివ్రతా! నడచినది నడచినట్లు నీకంతయు నెఱిఁగించితిని. నేను రామునికడనుండి వచ్చినదూతను. రాముఁడు నన్నుఁ బంపఁగా నిన్ను వెదకుటకై యిచ్చటికి వచ్చితిని. నేను సుగ్రీవునిమంత్రిని వాయుపుత్త్రుఁడను. నాయందు సందియము వదలి నాతో మాటాడుము.

కకుత్థ్సవంశతిలకుండును, విలుకాండ్రందఱి లోపల నుత్తముఁడును నైన నీనాథుఁడును, గురుపూజ చేయువాఁడును, చక్కనిరాజచిహ్నములు గలవాఁడునైన లక్ష్మణుఁడును సేమముగా నున్నారు. ఓ దేవీ! పరాక్రమశాలియైన నీప్రియునికి మేలొడఁగూరుటయం దాసక్తిగలవాఁడనై, సుగ్రీవుని యానతిఁబట్టి నేనొక్కఁడను మాత్రమే యిచ్చటికి వచ్చితిని. నేను కామరూపం బెత్తి నీపోవిడి వెదకుచు నొంటరిగా దక్షిణదిశను వెదకి సముద్రము దాఁటి వచ్చితిని. నీనాశము నిశ్చయించి విచారపడుచున్న నాతోఁ గూడవచ్చిన వానరవీరులను సంతోషపెట్టెదను. అదృష్టవశమున నా సముద్రతరణశ్రమము వ్యర్థము గానిదయ్యె. అంతియకాక, నీదర్శనమువలనఁ గలిగిన ఖ్యాతిని నైతము

పొందెదను. ఓ వైదేహీ! రఘుపుంగవుఁడు వేగమె వచ్చి రాక్షసాధిపుని రావణుని సమూలముగా వధించి నిన్నుఁ బొందఁగలఁడు.

వైదేహీ! మాల్యవంత మను పర్వతవరం బొండు గలదు. నాతండ్రియగు కేసరియనువానరుఁ డప్పర్వతవరమునుండి గోకర్ణమునకుఁ బోవుచుండఁగా నచ్చట నుండు దేవర్షులు పురికొల్పఁగా, పవిత్రమయిన వారుణతీర్థమున శంబసాదనుఁడను నసురుని సంహరించెను. నాతండ్రియగు కేసరునిపత్ని యందు వాయుదేవుని బీజమువలనఁ బుట్టినవాఁడను. స్వకార్యముచేతనే హనుమంతుఁడని ప్రఖ్యాతి చెందినవాఁడను. ఓ దేవీ! నీకు నమ్మికపుట్టునిమిత్తమై భర్తయొక్క గుణములను వర్ణించి చెప్పితిని. ఓ పతివ్రతా! రాఘవుఁడు నిన్ను వేగిరమే యిచ్చటినుండి తోడ్కొనిపోఁగలఁడు."

అని హనుమంతుఁడు యుక్తములైన యానవాలులతోఁగూడఁ జెప్పఁగా, శోకముచేఁ గృశించియున్న రామునిపత్ని యతనిని రాముని దూతనుగా నెఱిఁగి, యాహనుమంతునివాక్యశ్రవణముచే నెక్కువ యానందము నొందినదై, "నేటి కింతమాట వింటిని గదా" యని వంకరతెప్పవెండ్రుకలుగల నేత్రములనుండి యానందబాష్పములను గార్చినదాయెను. మఱియు చుట్టునెఱ్ఱగను, నడుమఁ దెల్లగ నుండునట్టి నిడివి కన్నులుకలదగు ఆసీతాదేవియొక్క మోము రాహువుచే విడువఁ బడిన రిక్కలరాయనిమాడ్కి వెలిఁగెను. అప్పుడా దేవి యతఁడు హనుమంతుఁ డనువానరుఁడే కాని, తానంతకుమున్ను తలఁచినచొప్పున కామరూపుఁడయిన రావణుఁడు గాఁడని తలఁచినదాయెను.

తర్వాత హనుమంతుఁ డింపుచూపుగలదగు సీతనుగూర్చి, "ఓ మైథిలీ! యీ సంగతియెల్ల నీకు విస్తరించిచెప్పితిని. ఇకనైన నమ్ముము. ఇఁక నేనేమి చేయుదును? నీ కేమి చేయవలెనని తోఁచుచున్నది? నేను మఱలిపోయెదను. ఓ మిథిలాధిపునికూఁతురా! మహర్షులప్రేరణవలన నాతండ్రియగుకేసరి శంబసాదనుం డను రాక్షసునిఁ జంపినతర్వాత, నాతనిపత్నియందు వాయుదేవునికి జన్మించినవాఁడను. సామర్థ్యమున నాతనినే పోలినవాఁడను" అని సీతాదేవితోఁ జెప్పెను.

## 36-వ సర్గము

హనుమంతుఁడు సీతాదేవి కంగుళీయకము నొసఁగుట

ఎక్కువ పరాక్రమము గలవాఁడగు వాయునందనుఁడయిన హనుమంతుఁ డింకను సీతాదేవికి నమ్మకము గలిగింపఁ గోరినవాఁడై "ఓ పాతివ్రత్యమహిమగలదానా! యేను వానరుఁడను. వివేకియగు రామునికి దూతను. ఓదేవీ! రామునిముద్దుటుంగర మిదిగో చూడుము. నీకు నమ్మిక పుట్టుటకై యాధీరుఁడగు రామభూవిభుఁ డొసఁగఁగా, నేను దీని నీకుఁ జూపఁ దెచ్చితిని. దీనిని జూచినపిదపనైనను నన్ను నమ్ముము దీనిమూలమున నీవ్యసనము దొలఁగెనుగదా" అని సీతతో వనెను.

ఆసీతాదేవియుఁ బెనిమిటియొక్క ముద్దుటుంగరమును జేతఁ దీసికొని తదేకదృష్టితో నవలోకించి, సాక్షాత్తుగాఁ దనభర్త వచ్చినట్లు తలఁచి సంతసించెను. అప్పుడు తామ్రశుక్లాయతనేత్రమైన యామె ముఖము రాహువునోటినుండి వెలువడిన చంద్రబింబముమాడ్కి వెలిఁగెను. అంతట సిగ్గుగలదియు, ముగుదయునునైన సీతాదేవి పెనిమిటి వృత్తాంతము దెలియుటచే మిక్కిలి యుప్పొంగినదయి, హనుమంతు నాదరించి యతనితో నిట్లనియె.

ఓ వానరశ్రేష్ఠుఁడా! నీవు శూరుఁడవు. నీవు సకలకార్యనిర్వాహ సమర్థుఁడవు. అన్నియు నెఱిఁగినవాఁడవు. కావుననే మొనగాఁడని పేరొందిన నీవొక్కఁడవు మాత్రమే నూఱుయోజనములదవ్వు గల యీకడలిని గోపాదతుల్యముగా దాఁటి, యీఘోరరాక్షసులయునికి పట్టగు లంకాపురము చొచ్చితివి. ఓ వానరపుంగవా! నీకు సముద్రముఁ జూచిన భీతియు, రావణునిఁ జూచినఁ దత్తరపాటును లేకుండెను గావున నీవు సామాన్యవానరుఁడవు గావని తోఁచెడి. వానరశ్రేష్ఠా! సర్వజనుల మనోభావముల నెఱుఁగఁగల ప్రసిద్ధుఁడయిన రాముఁడు నిన్నుఁ బంపెను గనుక నేను నీతోడ సంభాషించెదను. శత్రువులకు లొంగనివాఁడగు రాముఁ డొక్కనిగుణమును బరిశీలింపక, ముఖ్యముగా వానిపరాక్రమము నెఱుఁగక నాకడకు దూతనుగాఁ బంపియుండఁడు.

ధర్మమునడుపువాఁడును, ప్రతిజ్ఞతప్పనివాఁడునైన రాముఁడును, నెక్కువ మగటిమిగలవాఁడును, సుమిత్రకు సంతోషమొసఁగఁ జేయు

వాఁడునైన లక్ష్మణుఁడును దైవానుగ్రహమువలన క్షేమముతో నున్నారుగదా! కకుత్థ్సవంశోద్భవుఁడైన రాముఁడు క్షేమముతోనుండు నేని, అతఁడలిఁగినచో ప్రలయకాలమునఁ బైకిలేచిన యగ్నిహోత్రుని మాడ్కి సముద్రములచేఁ జుట్టఁబడియున్న భూమండలమును గాల్చి వేయును గదా! వారిద్ద ఱేమో సురలనైనను తిరస్కరింపఁగలవారే. అయినను, నాదుఃఖములు తీరుకాలము రాలేదుకాఁబోలు. రాముఁడు నావియోగవ్యసనముచేఁ గృశింపకున్నాడుగదా? వెతలఁగుందకున్నాడు గదా! నన్నుఁ గనుఁగొనుటకై చేయవలసిన పనులుచేయుచున్నాఁడు గదా! దైన్యమొందకున్నాఁడుగదా! డెందమునందుఁ గలవరపడి కార్యము లందుఁ దప్పిపోవఁడుగదా! రాజపుత్త్రుఁడు పౌరుషకార్యములను జేయు చున్నాఁడుగదా ? పరంతపుఁడైన రాముఁడు జయాకాంక్షతో మిత్త్రు లందు సామదానములనెడి యిరుతెఱఁగులగు నుపాయములను, శత్త్రువు లందు దానభేదదండములనెడి త్రివిధోపాయములను బ్రయోగించు చున్నవాఁడే ? ఈతఁడు చెలికాండ్రను సంపాదించుచున్నాఁడే? చెలికాండ్రీతనిచెలిమిఁ గోరుచుందురే? ఈతఁడు పనులయందుఁ దనమిత్త్రులను ముందుగాఁ బిలుచుచున్నాఁడే? చెలికాండ్రీతనిని తమపనులందు ముందుగాఁ బిలుచుకొనిపోవుదురే? రాఘవుఁడు దేవతలఁ బ్రార్థించుచు, వారి యనుగ్రహమును గోరుచుండునే? ఆతని కార్యములకు దైవ మనుకూలమై యున్నదే? ఓవానరాధిపా! దేశాంత రమున నుండుటఁబట్టి, నాపై రాఘవుఁడు ప్రేమలేనివాఁడుగా నుండఁడు గదా! నన్నేమైన నాప్రియుఁ డీదుఃఖమునుండి విడిపింపఁబోవనున్నాఁడే? ఎల్లప్పుడు సుఖములను బొందఁదగినవాఁడును, దుఃఖము లనుభవింపఁ దగనివాఁడునైన నానాథుఁడు మీఱిన వ్యసనము నొందియుఁ గృశించి పోవఁడుగదా? కౌసల్యాసుమిత్త్రల యొక్కయు, భరతునియొక్కయు క్షేమవృత్తాంత మప్పుడప్పుడు తెలియుచున్నదిగదా? గారవింపఁదగిన రాఘవుఁడు నన్నుఁగూర్చిన శోకముతో వెతలఁ బడుచుండునుగదా ? రాముఁడు నాతలంపుతో నేయుండి వేఱొకతెను గోరఁడుగా? నన్నే విధముననైన నీ దుఃఖాబ్ధినుండి దరిజేర్చునుగదా? సోదరులందుఁ బ్రేమ గల భరతుఁడు నానిమిత్తమై భయంకరమయిన యక్షౌహిణీబలమును మంత్త్రులయధికారమున నుంచి పంపునుగదా ? వానరుల కధిపుఁడును,

కాంతిగలవాఁడునైన సుగ్రీవుఁడు నన్ను విడిపించుకొని పోవు నిమిత్తమై దంతములు నఖములు నాయుధములుగానుపయోగించెడి శూరులయిన వానరులఁ దోడ్కొనివచ్చునా? శూరుఁడును, సుమిత్ర కానందప్రదుఁడును, శస్త్రాస్త్రవేదియు నైనలక్ష్మణుఁ డిచ్చటికి వచ్చి రాక్షసులను బాణ పరంపరలతో రూపుమాపఁగలవాఁడుగదా? లక్ష్మణాదులు స్వల్పకాలము ననే దగదగ వెలుఁగు భీకరాస్త్రములు ప్రయోగించి రావణుని బంధు మిత్రపరివారముతోడ సంహరింపఁబడుటను చూడఁగలనుగదా? బంగారు వన్నెగలదియు, తామరపువ్వుంబోలు నెత్తావిగుబాళించునదియునైన యారాముని ముద్దుమోము నావియోగదుఃఖముచే నెట్టనై, నీరులేక యెండఁ గెండిన కమలమువలె వాడుపాఱకున్నదిగదా? ధర్మమునకు లోపము వాటిల్లఁగూడదనుతలంపుచే రాజ్యము విడిచినప్పుడును నన్నుఁ గాలినడకతో నడపించుకొని వచ్చినప్పుడును, తగ్గనిధైర్యమును నానాథుఁడు విడువకయున్నాఁడుగదా? ఓదూతా! రాముని కిప్పుడు స్నేహ విషయమున నాకంటెఁ దల్లిగాని, తండ్రిగాని హెచ్చుగాదు. తుదకు సమమును గాదు. నాప్రియుఁడు నన్నుఁగొనిపోవుప్రయత్నము చేయు చున్నాఁడా యను సంగతి తెలియువఱకుఁ బ్రాణముతో నుండఁగోరు చున్నాను” అని సీతాదేవి యింపుగులుకు గొప్ప యర్థముగల మాట లను జెప్పి, యావానరేంద్రునివలన రామునిఁగూర్చిన శ్రావ్యవాక్యము మును వినఁగోరినదై తనవాక్యములను జాలించినదాయెను.

పగతురచే నోర్వరాని మగటిమిగల వాయుపునందనుఁడు సీతా దేవి యడిగిన మాటలను విని, చేయెత్తి మ్రొక్కుచు బదులు సెప్పెను: “ఓ కమలనేత్రీ! రామునికి నీ విచ్చటనుండు సంగతి తెలియదు. కాఁ బట్టియె ఇంద్రుఁడు శచీదేవినింబోలె రాముఁడు నిన్నును దోడ్కొని పోవకున్నాఁడు. నేను నీ వృత్తాంతమును గొనిపోయి చెప్పినవెంటనే వానరబలగము తోడ్కొని వేగిరమె రాఁగలఁడు. రాముఁడు బాణ ములఁ బెక్కింటిని బ్రయోగించి దాఁటనలవికాని సముద్రమును బంధించి యావల సముద్రమునుదాఁటివచ్చి లంకాపురిలోని రాక్షసులను నిర్మూ లముచేయఁగలఁడు. ఆ రాముఁడు వచ్చునప్పుడు మృత్యుదేవత యడ్డు పడినను, దేవాసురు లాటంకపెట్టినను, వారి నందఱిని పిలుకుమార్పఁ గలఁడు. ఓ దేవీ! రాఘవుఁడు నీవియోగవ్యసనమున మునిఁగిన

వాఁడై సింహముచేఁ బీడింపఁబడిన యేనుఁగుమాడ్కిఁ గడుఁబరితపిం చుచు, సౌఖ్యములేకయున్నాఁడు. ఓ దేవీ! చక్కని కన్నులును, దొండపండువంటి పెదవియు, సొగసుకుండలములను గలదై, యిప్పుడే యుదయించిన నిండుచందురునింబోలియుండు నారామునిమోమును నీవు తప్పకచూతువని నేను వాసముచేయు మలయ, వింధ్య, మేరు, మందర, దర్దుర, కందమూలఫలముల సాక్షిగాఁ జెప్పెదను. నామాట నిక్కమని నమ్ముము. ఓ వైదేహీ! నాకపృష్ఠమునందు దేవేంద్రుఁడునుం బోలె, ప్రస్రవణపర్వతమునఁ గూర్చుండిన యారాఘవుని నీవు వేగిరము చూడఁగలవు: ఓ దేవీ! రాఘవుఁడు నంజుడు దినఁడు. మద్యము త్రాగఁడు. మఱియేమియనిన, ఆరణ్యకవిధియందుఁ జెప్పినచొప్పున దాను దెచ్చిన కందమూలఫలముల నైదుభాగములుచేసి, యందు నాలుగుభాగములను దేవ, పితృ, అతిథి, భూతముల కొసఁగి, మిగి లిన యైదవభాగమును తాను ప్రతిదినమునను గుడుచుచుండును. మఱియు నారాఘవుఁడు నీయందు మనస్సు దవిలియుండుటచేతఁ దన యొంటిమీఁద వాలిన యీఁగలనేని, దోమలనేని, తక్కిన పురుగుల నేని, దనదేహముమీఁదఁ బ్రాఁకుపాములనేని తోలనే తోలఁడు. ఆ రాఘవుఁడు కామపరవశుఁడయి, యెల్లప్పుడు నిన్నే తలఁచుచు, ఎల్ల ప్పుడు నిన్నుఁగూర్చి వగచుచు వేఱొక్కసంగతి నావంతయయినను దలఁపఁడు. పురుషోత్తముఁడైన యారామున కెల్లప్పుడు నిద్దురపట్టుటయే లేదు. అట్లొక్కవేళఁ గొంచెము కన్నులుమూసినను, ఉలికిపడ్డట్టు లేచుచు "హా! సీతా!" యని యింపుమాటను బలుకుచుండును. మనోహరమగు నొక్కపువ్వునేని, పండునేని, లేక మఱేవస్తువునేనిఁ జూచినయెడ, "ఓసీ ప్రియురాలా!" యని నిట్టూర్పులు విడుచుచు, నీతో మాటాడినట్లు మాటాడును. ఓ దేవీ! మహాధీరుఁడయిన రాజ పుత్త్రుఁడగు రాముఁడు నిశ్చలనియమము గలవాఁడై నిన్నుఁ గూర్చియే పరితపించుచు, నిన్నుఁగూర్చియే కలవరించుచు, నిన్నుఁ బడయుటకై ప్రయత్నము లొనరించుచున్నవాఁడు.

అని యిట్లు హనుమంతుఁడు రామునిగుణశ్లాఘ చేయుట విని యెక్కువ సంతసించినదై, దుఃఖానుభవమున రామునిఁ బోలినదై, శర త్కాలమువచ్చి రాకయుండునప్పుడు మేఘములనడుమ నప్పుడప్పుడు

మఱుగుపడుచుఁ బ్రకటముగను అప్రకటముగను నుండు చంద్రబింబముతోఁ గూడిన రాత్రివలె నుండినదాయెను.

## 37-వ సర్గము

### హనుమంతుఁడు సీతాదేవికి స్వస్వరూపము చూపుట

నిండుచంద్రునిఁబోలు మొగముగల సీతాదేవి యాహనుమంతుని పలుకులువిని, ధర్మార్థముల ననుసరించి యాహనుమంతునితో నిట్లనియె :

ఓ వానరా! నీ విప్పుడుచెప్పినమాటలు విషముగలిపిన యమృతముగా నున్నవి. రాముఁడు నన్నుఁ బాసినపిదప మఱియొక్కతెయందు డెంద ముంచకున్నాఁడనుటచే నాకానందమును, ఎల్లప్పుడు నా వియోగ దుఃఖమే పరమార్థముగా నెంచియున్నాఁడనుటచే నాకు వ్యసనమును గలిగినవి. దైవము బలవత్తరము. దైవము నిండుసుఖమునకుఁగాని, భీకరమయిన యాపదకుఁగాని పురుషునిఁ ద్రాటఁ గట్టినచందమున నీడ్చికొనిపోవును. వానరోత్తమా! విధి యెవరికిని దప్పించుకొన శక్యము గాదు. మాకు విధి చాలమిచేతనేకదా యిప్పుడు రామలక్ష్మణులును నేనును ఈవిధముగా వెతలలోఁ జిక్కియున్నాము చూడుము. మానవుఁడు సముద్రమునఁ బయనము చేయుచు, నావపగిలినయెడ, నీటఁబడి యీఁదుచుఁ గడునలసటతో గట్టు చేరుచందమున, రాఘవుఁడు శోక సాగరమున నీది యెన్నఁటికి దరి చేరఁగలఁడో! రాముఁడు రాక్షసులను సంహరించి, రావణునిఁ బిలుకుమార్చి, లంకాపురము మొదలంట ధ్వంసముచేసి, యెన్నడు నన్నుఁ జూడనున్నాఁడో! ఓ వానరపుంగవా! యీసంవత్సరము ముగియువఱకే నేను జీవించియుందును. ఇప్పుడు పదియవనెల గడవవచ్చినది. ఇఁక రెండునెలలు మిగిలియున్నవి. ఈ రెండు నెలలే రావణుఁడు గడువొసఁగెను. ఈలోపలనే రామునిఁ ద్వరపడునట్లు నీవు చెప్పవలసినది. రావణునికడఁగొట్టు తమ్ముఁడగు విభీషణుఁడు నన్ను మఱల రాముని కర్పింపమని యెన్నియో తెఱంగుల వేఁడెను. కాలపాశమును బొందిన యా రావణుని మృత్యుదేవత సంగరమున వెదకుచున్నది గావున నతఁడా విభీషణునిమాటలను జెడ చెవిని బెట్టినవాఁడు.

విభీషణుని పెద్దకూఁతురు నల యను నామె తనతల్లి పంపఁగా నాకడకువచ్చి యీసంగతి నాకుఁ దెలిపెను. వానరశ్రేష్ఠా! నామగండు త్వరలోనే నాకడకు రాఁగలఁడు. ఏలయన, నామనస్సును బరిశుద్ధముగా నున్నది. ఆరామునియం దుత్సాహము, మగతనము, దిట్టతనము, మెత్తని తనము, కృతజ్ఞత, శత్రువులను లోఁబఱచుకొనుట, తేజస్సు మొదలగు గొప్పగుణము లున్నయవి. జనస్థానమునఁ దమ్మునితోడ్పాటు సైతము లేక పదునాలుగువేలమంది రక్కసులను జంపినట్టి యారాముని కేపగ తుఁడు వెఱవకుండును? ఆపురుషోత్తముని వ్యసనములందుఁ బెట్టి కద లించుట కెవనికిని వీలుగాదు. శచీదేవి యింద్రుని ప్రభావము నెఱిఁగిన చందమున, నేనును ఆరఘువంశవీరుని ప్రభావము నెఱిఁగినదానను. ఓవానరా! రాముఁడనెడి సూర్యుఁడు తనబాణసమూహమనెడి కిరణ ములను బ్రసరింపఁజేసి, శత్రువులయిన రాక్షసులనెడి యుదకము నింకింపఁ జేయఁగలఁడు.

అని పలుకునదియు, రామునినిమిత్తమయిన వ్యసనమునఁదవిలి చిక్కినదియు, కన్నులనిండఁ గన్నీరు పెట్టుకొన్నదియునైన యాసీతా దేవిని గూర్చి హనుమంతుఁడిట్లనియె:

"ఓదేవీ! నీవు లంకాపురమున నున్నావన్న వృత్తాంతమును జెప్పిన వెంటనే, రాముఁడు వానరభల్లూకబలముతోఁ గూడిన గొప్ప సేనను తోడ్కొని వేగిరముగా రాఁగలఁడు. కాదంటివేని, ఓసుందరవదనా! నిన్నిప్పుడే యీదుఃఖమునుండి తొలఁగించెదను. ఓపుణ్యవతీ! నీవిప్పుడు నావీఁపుమీఁద నెక్కుము. నిన్ను వీఁపుమీఁద నెక్కించుకొని సముద్ర మును దాఁటెదను. ఈలంకాపురమును రావణసమేతముగా నక్లే గడ్డ తోడఁ బెళ్లగించికొనిపోవుటకు నాకు శక్తి గలదు. అగ్నిహోత్రుఁడు దనయందు వేల్చిన హవిర్భాగమును దేవేంద్రున కర్పించినట్లు, నేనును నిన్నుఁ బ్రస్రవణపర్వతము మీఁద నున్న రాఘవునికి గొనఁగొదను. దైత్యవధమునఁ బూనికగలిగియున్న విష్ణువునుబోలె రావణసంహారము నకై పూనికిగలిగియున్న వాఁడును, నీదర్శనమునం దుమ్మలికముతో నుండు వాఁడును, ఆశ్రమమున నుండువాఁడును, బలవంతుఁడునునై, నాగరాజ ముమీఁద నెక్కిన దేవేంద్రుని బోలినవాఁడయిన రాముని లక్ష్మణ సమేతముగా నీవిపుడే చూడఁగలవు. ఓదేవీ! నావీఁపుమీఁద నెక్కుము.

ఓసుందరీ! ఉపేక్షసేయకుము. రోహిణి చంద్రునితోఁ జేరినట్లు నీవును రామునితోడికూడికను గోరుము. సూర్యచంద్రులతో మాటాడుదాని వలె నావీఁపుమీఁద నెక్కి మహాసముద్రమును, ఆకాశమును దాఁటుము. ఓచక్కని యంగములు గలదానా! నిన్ను వీఁపుమీఁద నెక్కించుకొని యిచ్చటనుండి నేను పయనమైపోవునపుడు నా పరుగు నందుకొనుటకు లంకాపురనివాసులగు రాక్షసులలో నెవ్వరును జాలిన వారు కారు. ఓజానకీ! నే నిచ్చటికెట్లు సముద్రము దాఁటి వచ్చితినో, అట్లె నిన్నెత్తికొని యావలివైపునకు దాఁటిపోయెదను. చూడుము నా ప్రభావము!

అని హనుమంతుఁడు చెప్పిన వింతమాట విని, సీతాదేవియు సంతోషముచే మేనఁ బులకలెత్తఁగా, హనుమంతు నుద్దేశించి, "హనుమంతుఁడా! నీవింతదవ్వు నన్నెట్లు మోఁచికొని పోవఁగలవు? వానరోత్తమా! అదేకదా కోతిచేష్టయనునది. వానరేశ్వరా! నీదేహము కడుఁజిన్నది. నీవెట్లు నన్నామనుజేంద్రునికడకుఁ గొంపోవఁగలవు?" అని చెప్పెను.

కాంతిమంతుఁడగు మారుతనందనుఁ డయిన హనుమంతుఁడు సీతాదేవి మాటలను విని, తన్నామె క్రొత్తగాఁజేసిన యవమాన మని తలఁచినవాఁడై, "యీ నీలలోచనయగు వైదేహికి నాబలిమిగాని, మహిమగాని తెలియనట్లున్నది. కాని యిప్పుడు నాయథారూపము చూపెదను" అని తనలోఁ దాననుకొని, యాసీతాదేవికిఁ దనరూపము చూపి నమ్మకముగలిగింపఁ గోరినవాఁడై యాచెట్టుమీఁదినుండి క్రిందికి దుమికి, మేరుమందర పర్వతములతో సాటిగాఁ బెరిగి యగ్నిహోత్రుని మాడ్కి వెలుఁగుచు నెఱ్ఱనిమోమును, వజ్రాయుధమువంటి కోఱలును, గోళ్లును బొడసూపఁ జూపరకు వెఱపు పుట్టించువాఁడై, యాసీతాదేవి ముందట నిలిచి, "యోదేవీ! ప్రాకారతోరణ గోపురాదులతోడఁ గూడిన యీలంకాపురము దీనియేలికతోఁ గూడఁ మోఁచికొనిపోవ నాకు శక్తిగలదు. కావున మనస్సును దృఢపఱచుకొని, కుశంకలు మాని, నావీఁపుమీఁద నెక్కివచ్చి, యీ రామలక్ష్మణులవ్యసనముఁ దీర్పుము" అని సీతతోఁ జెప్పెను.

తామర రేకులమాడ్కి వెడల్పు కన్నులుగలదగు సీతాదేవియు భీమునింబోలు మారుతుని యౌరసపుత్త్రుఁడగు హనుమంతునితో వెండియు నిట్లనియె: "ఓ వానరవీరుఁడా! నీయొక్క శౌర్యబలమును, వాయువుగతివంటి గతిని, అగ్నిహోత్త్రునివెలుగువంటి వింతవెలుఁగును నే నెఱిఁగియే యున్నాను. వానర శ్రేష్ఠుఁడా! నీవు తప్ప మఱెవ్వఁడు సామాన్యుఁ డీ యపారమైన సముద్రమును దాఁటి, యీ లంకాపురికి రాఁగలఁడు? సముద్రమును దాఁటుటకు నన్నెత్తికొనిపోవుటకును నీకు శక్తిగలదు. అది నిక్కమే. మహాత్ముని కార్యసిద్ధి విషయమై యాలోచన యవశ్యముగాఁ జేయవలసినదియేకదా! కోఁతులమేటీ! నేను నీతోడ వచ్చుట యుక్తముగాదు. నీవు వాయువువేగముతోఁ బోవువాఁడవు. ఆ వేగమునకు నేను భ్రమసి మూర్ఛపోదును. ఆకాశమున నీవు వేగముతోఁ బోవునప్పుడు, నే నాకాశమునఁ బైకిఁబోవం బోవ వెఱచి నీ వీఁపుమీఁదినుండి సముద్రమునఁ బడినను బడుదును. అట్లు తిములు, మొసళ్లు, చేఁపలు నిండిన సముద్రమునఁబడి, ప్రాణముఁ బాసితినేని, ఆ సముద్రమునందలి జంతువులకు మంచియాహార మయ్యెదను. ఓ శత్త్రుసంహారకా! నీవు నన్నుఁ గాపాడుచుఁ గొనిపోవలయుఁగదా. అట్లు కాపాడఁదగిన నన్నుఁ గొనిపోవునప్పుడు నీ ప్రాణమునకే విపత్తు సంభవింపవచ్చును గావున నేను నీతోడ రాను. నీవు నన్ను గొనిపోవుట చూచి, దురాత్ముఁడయిన రావణుఁడు నిన్నును నన్నును బట్టుకొనిరమ్మని యానతియ్యఁగా, భీకరవిక్రమముగల రాక్షసులు నిన్ను వెంబడింతురు. వారు పెక్కు మొనవాలులు, గుదియలు చేతఁబట్టి యాకాశమున నిన్నుఁ జుట్టుకొన్నప్పుడు, ఓ శూరుఁడా! రక్షింపఁదగిన నన్నొకదానిని వీఁపు మీఁదఁ బెట్టుకొని వారితో నెట్లు యుద్ధము చేయఁగలవు? అట్లు వారితోఁ బోరుటకుఁ బోయిన నే నెక్కడఁ గ్రిందఁబడుదునో యని నీవు సంశయపడవలసియుండును. ఆకాశమున నిన్ను ముట్టడించురాక్షసులందఱు ఆయుధములు గలవారు. నీవో నిరాయుధుఁడవు. నీవు నిరాయుధుఁడవై, సాయుధులైన యారాక్షసులతోఁ బోరాడను, నన్నుఁ గాపాడను నెట్లు చాలుదువు? వానర శ్రేష్ఠా! క్రూరపుఁబనులుచేయు నా రక్కసులతో నీవు యుద్ధముచేయునప్పుడు, నేను భీతిల్లి, నీ వీఁపు మీఁదనుండి క్రిందఁబడుదును. వానరోత్తమా! శత్త్రువులకు భీతిని

గలిగించువారును, బలశాలులును, గొప్పవారునైనందున, వారందఱు గలిసి యుద్ధమున నిన్నెట్టకేలకు జయింపనైనను జయింతురు. అట్లు వారు జయింపలేకున్నను, నీవు వారితో యుద్ధముచేయుచు నిలఁబడినప్పుడు, నీ పృష్ఠభాగమునుండి జాఱిపడిన నన్నా క్రూరరాక్షసులు గొంపోవనైనను పోవుదురు. లేదా, నీచేతినుండి నన్నూడిసి తీసికొని పోవనైనను పోవుదురు. వధింపనైనను వధింతురు. వారిని నేనోడింపనా యనియందువేమో, అయినను యుద్ధమున గెలుపోటములు తిరములు గావు. అట్లు నేను క్రిందఁబడననియు, నీవే గెలుతుననియు నెంచుకొన్నను, రాక్షసులబెదరింపులకు దిగులుపడి నేనే మృతినొందవచ్చును. అట్లయ్యెనేని, నీ ప్రయత్నము వ్యర్థమగును. పోనీ నేను సముద్రమునఁ బడను; మృతినొందను. నీవె యెల్లరాక్షసులను గెల్వఁజాలుదువుగాక! అట్లయిన రాముఁడు రాక్షససంహారము చేసినాఁడనిన కీర్తి యాతనికి రాదుగదా! ఆ సంగతి యటుండనిమ్ము. రాక్షసులందఱు చేరి నన్నుఁగొనిపోయి, వానరులుగాని, రామలక్ష్మణులుగాని కనుఁగొనని తావున దాఁచవచ్చును. అంత నానిమిత్తమై చేసిన నీ ప్రయత్నమెల్ల విఫలమైపోవును. మహాత్ముఁడగు రాముఁడు నీతోఁగూడ నిచ్చటికి వచ్చుటలో నెక్కువయుపయోగముగలదు. ఓ మహాబాహువా! నీయొక్కయు, ధీరుఁడగు రామునియొక్కయు, ఆతనితమ్ములయొక్కయు, నీయేలికయగు సుగ్రీవునియొక్కయు, ఇందఱియొక్క జీవితములు నా జీవితాధీనములై యున్నవి. ఆ రామలక్ష్మణులు నానిమిత్తమయిన వంతలలోఁబడి చిక్కి తాము ను ఋక్షవానరసమేతముగాఁ బ్రాణములఁ దొఱఁగుదురు. ఓ వానరులమేటీ! భర్తయందలి భక్తినే మునుకొని నా పెనిమిటిశరీరమును దప్ప వేఱొక్కనిశరీరమునుదాఁకను. రావణుఁడు నన్నుఁ దెచ్చునప్పుడు వానిదేహసంస్పర్శముగాలేదా యనిన, అప్పుడు నేనేమిచేయ నసమర్థురాలనై, నాథునిఁబాసి, చెయువులు దక్కియుంటిని గనుక నేనప్పుడు రావణుని దేహముఁ దాఁకవలసివచ్చెను. రాముఁడిచ్చటి కేగుదెంచి రావణుని బంధుజనసమేతముగా సంహరించి నన్నుఁ గొనిపోవుట యతని కుచితకార్యము. నే నారణశూరుఁడగు రాముని పరాక్రమముఁ గూర్చి వినియున్నాను, చూచియున్నాను. దేవగంధర్వ పన్నగరాక్షసులలోపల నారామునితో సమానులు లేరు. యుద్ధరంగ

మునఁ జిత్రవర్ణంపువిల్లు దాల్చినవాఁడు, బలశాలి, దేవేంద్రుని బోలు విక్రమశాలియునై, గాలిచే రేఁపఁబడిన యగ్నిహోత్రునిమాడ్కి నా రామునిఁ దమ్మునితోఁగూడ నెవ్వఁడు చూచి ధైర్యముతో యుద్ధమును జేయఁగలఁడు ? శత్రువులను మర్దించువాఁడును, మదించిన దిగ్గజముం బోలువాఁడును, ప్రళయకాలసూర్యునిమాడ్కి వెలుఁగువాఁడును, బాణములనెడి కిరణములు గలవాఁడునునైన రాముఁడు లక్ష్మణసమేతముగా వచ్చి యుద్ధరంగమున నిలిచినప్పు డెవ్వఁ డెదిరింపఁగలఁడు. కావున, వానరశ్రేష్ఠా! రాముని లక్ష్మణునితోను, సుగ్రీవాదివానరవీరులతోను నిచ్చటికి శీఘ్రముగాఁ దోడ్కొనివచ్చి, రామవియోగవ్యసనముచేఁ జిక్కియున్న నామనసునకు సంతోషముఁ గలిగింపుము" అని సీత యాహనుమంతునితోఁ జెప్పెను.

## 39-వ సర్గము

### సీతాదేవి హనుమంతుని కావవా లిచ్చుట

అంత మాటలలోఁ జమత్కారియైన వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు సీతాదేవి చెప్పినమాటలను విని యామాటలకు మనసున నుప్పొంగినవాఁడై యా సీతాదేవింగూర్చి యిట్లనెను.

"చక్కనిచూపుగల యోదేవీ! నీవు మాటాడినమాట మిక్కిలి యుక్తముగను, స్త్రీస్వభావమునకును, పతివ్రతలనడవడికిని మిక్కిలి తగియున్నది. ఓదేవీ! నావీఁపుమీఁద నెక్కియైనను నూఱుయోజనములదవ్వుగల సముద్రమును దాఁటుట స్త్రీలకుఁ గష్టమేకదా. చక్కని నడతతోఁ గూడినదానవగు ఓ జానకీ! రామునిఁదప్ప మఱియొక్కపురుషునిఁ దాఁకనని యే రెండవకారణము చెప్పితివో, ఆ మాట మహాధీరుఁడయిన యారాముని ధర్మపత్నివైన నీకుఁ దగియున్నది. దేవీ! నీవు తప్ప మఱెవ్వతె యిట్టిమాటను జెప్పఁగలదు ? ఓ దేవీ! నాయెదుట నీ పురివేసికొనఁ బోయినసంగతియు, రావణుని నీవు దిరస్కరించిన మాటలును, నీవు నాకుఁ జెప్పినమాటలు నేవిగలవో, అవియెల్లను విస్తరముగా రామునికి నే నెఱిఁగించెదను. ఓదేవీ! పెక్కుపాయముల చేతను, రామునియిష్టముఁ జేయఁగోరికచేతను, ప్రేమరసార్ద్రమైన మనసుచేత నీమాటను బలికితిని. లంక ప్రవేశింప నలవికానిదియు, సము

ద్రము దాట నలవికానిదియు నగుటవలనను నేను సమర్థుడ నగుటవల నను నే నిట్లు పలికితిని. ఇప్పుడే రాఘవునితోఁ జేర్పఁగోరెదనని రాము నందలి భక్తిస్నేహములంబట్టి పలికితినిగాని, వేఱొకకారణముంబట్టి కాదు. ఓ నిర్దోషురాలా! నీవు నాతోడ వచ్చుట కిష్టపడవేని, రాముఁ డెఱుఁగఁగల యొకయానవా లిమ్ము"

అని యిట్లు హనుమంతుఁ డడుగఁగా, దేవపుత్రికంబోలు సీతా దేవి రహస్యవృత్తాంతము చెప్పవలసివచ్చెనని కన్నీటిచే నక్షరములు తడఁబడుచుండ, మెల్లగా నతనితో నిట్లనియెను.

ఓ వానరేంద్రుఁడా! నేను ముందు చిత్రకూటపర్వతప్రాంత మున నీశాన్యమూలయందుఁ బెక్కు పుష్పఫలములచే నిండిన సిద్ధా శ్రమమునం దుండఁగా, ఈ చెప్పఁబోవు మేటి యానవాలు జరిగెను. దీనిని నామాటగా నా ప్రియుని కెఱిఁగింపుము :

"ఓ నాథా! పలుతెఱంగులపువ్వుల నెత్తావిచే గుబాళించునట్టి యా చిత్రకూటాద్రిలోని యుపవనములందు విహరించి, జోఱుచెమ్మట గాఱుటచేఁ దడిసినదాననై, నీతోడమీఁదఁ గూర్చుంటిని. అప్పుడు మాంసాశగల యొక కాకి నా స్తనములనడుమ ముక్కుతో గీఱెను. అప్పు డాకాకిమీఁద మంటిపెళ్ల యొకటి విసరివైచి దానిని తోలితిని. ఆబలిభుక్కు మాంసముఁగోరినదై యదఱినన్ను గీఱుచు నచ్చటనే డాగియుండెనుగాని, యావలికిఁ బోవదయ్యె. తర్వాతఁ గొంతసేపటికి మఱల నా కాకి నాచీర నూడఁదీయఁ బోయెను. నేను కాకిని దోలుటకై మొలనూలిని లాగిపట్టి, కాకి నుఱిమిచూచి, దాని వెంబడించి తఱుమఁ బోయి యుండునప్పుడు నీవు నన్నుఁజూచితివి. నీవు నన్నుఁ బరిహాసము చేసితివి. అప్పుడు నే నా కాకిమీఁదఁ గోపముతోనుండఁగా, నీ పరి హాసముచే సిగ్గుపడినదాననై నీతొడమీఁద వచ్చి కూర్చుంటిని. అప్పుడు నీవు నాకోపము నిమ్మళింపఁజేసి నన్ను బుజ్జగించితివి. అప్పు డాకాకి మఱల నన్నుగీఱెను. దానిరంపు పడలేక, కోపముతో దానిని తోలఁ బోయితిని. దానినిఁ దోలఁజాలక కండ్లనుండి కన్నీరుగార్చుచుండఁగా, నీవు నాకన్నీటిని దుడిచి, నాకుఁ గోప మా వాయసమువలననే వచ్చి నదియని యెఱిఁగితివి" యని నామాటగా చెప్పుము. ఓ హను మంతుఁడా! తర్వాత నేను బడలికచే నాథునితొడమీఁదఁ దలయుంచు

కొని చాలసేపు నిద్రించితిని. నేను నిద్రలేచినతర్వాత భరతాగ్రజుఁడు నాతొడమీఁదఁబరుండి నిద్రించెను. అప్పుడా వాయసము మఱల నచ్చటికి వచ్చి, నాథునితొడమీఁద నిద్రించి యప్పుడ లేచి కూర్చుండిన నన్ను మఱల స్తనములనడుమ గీఱెను. అది యవ్విధముగాఁ జలము పట్టి పలుమాఱు గీఱుటచే నా స్తనములనుండి రక్తముగాఱ నారంభించి, యారామునిపైఁబడఁగా, నతనియొడలెల్లఁ దడిసెను. నేనా బలిభోజనునిబారి కోర్వఁజాలక నానాథుఁడు సుఖనిద్ర చెందియున్నను లేపితిని. ఆ నానాథుఁడు నిద్రలేచి, స్తనములనడుమ నవ్విధమున గీఱఁబడియున్న నన్నుఁ జూచి, నాగుఁబామువలె బుసకొట్టుచు నిట్లనియెను.

"ఓ యేనుఁగుతొండముంబోలు తొడలుగలదానా! నీ స్తనమధ్యము నెవ్వఁడు గోళ్లతో గీఱెను? ఎవఁ డలిఁగిన యైదుతలల పాముతోఁ గ్రీడించుచున్నాఁడు.?" అనుచు, నెత్తుటఁ దడిసిన వాడి గోళ్లతోఁ గూడినదై నాయెదుటనేయున్న వాయసమునుఁ జూచి, తాను తెలివిగలవాఁడగుటచే "అతఁడు దేవేంద్రునిపుత్త్రుఁడు కాకాసురుఁడనువాఁడనియు, భూమికి వచ్చియున్నాఁడనియు, వేగమున వాయువుంబోలినవాఁ" డనియు నెఱిఁగినవాఁడయి, కోపముచేఁ దనగ్రుడ్లను గిరగిరఁద్రిప్పుచు నావాయసముమీఁదఁ గ్రౌర్యముఁబూని, తనయాసనము నుండి యొకదర్భనుద్రుంచి, దానియందు బ్రహ్మాస్త్రము నభిమంత్రించి, యావాయసముపైఁ బ్రయోగించెను. ఆదర్భ ప్రలయకాలాగ్నివలె మంటలచే వెలుఁగుచు నాకాశమునఁ బరుగిడుచుండు నావాయసమును వెంబడించెను. ఆకాకాసురుఁడు బ్రహ్మాస్త్రముచే వెంబడింపఁబడి పలుతెఱఁగులఁ బోవుచు శరణుగోరినవాఁడై యన్నిలోకములందును దిరిగెను. తండ్రిని శరణుచొచ్చెను. అతఁడు నాకు శక్తి చాలదని చెప్పెను. పిమ్మట దేవతల నందఱను శరణుచొచ్చెను. వారును మావలనఁగాదని చెప్పిరి. పిదప మహర్షులను శరణుచొచ్చెను. వారును, మేము నిన్ను రాముని యస్త్రమునుండి రక్షింపఁజాలమనిరి. ఇట్లు కాకాసురుఁడు ముల్లోకము లందుఁ దిరిగి యెచ్చటను శరణుగానక భూమియందుఁ బడి యారామునే శరణుజొచ్చి, "ఓ దయాళూ! నీవే కాపాడవలె" నని వేఁడెను. మిక్కిలి దిగులుపడి విచారమునొంది తన్నె శరణుచొచ్చిన యట్టి కాకాసురునిఁజూచి, రాముఁడు జాలినొంది చంపఁదగినయతనిని మన్నింపఁ

గోరినవాఁడయి "ఓ కాకాసురుఁడా! ప్రయోగింపఁబడిన బ్రహ్మాస్త్ర మూరక మఱలించుట యెరికిని వశముగాదు. కావున నీకుడికంటిని దాని కడ్డముగా నుంచుము. ఆ యస్త్రము నీ నేత్రమును మాత్రము గైకొని నీ ప్రాణములను వదలిపెట్టును" అని చెప్పెను. కాకాసురుఁ డట్లు తననేత్రమును దాని కడ్డముగా నుంచెను. ఆ బ్రహ్మాస్త్రము కాకాసురుని కుడికంటినిమాత్రము గైకొనిపోయెను. ఇట్లు కాకా సురుఁడు తనకుడికంటి నొసఁగి, ప్రాణములఁ దప్పించుకొన్నవాఁడై, రామునకును, దశరథనృపాలునికిని నమస్కరించి, శూరుఁడయిన రామునియానతిఁ బడసి తనయథాస్థానమునకుఁ బోయిచేరెను. ఓ హను మంతుఁడా! ఈ కథను వినిపించి నామాటలనుగా మఱికొన్నింటిని జెప్పుము. "ఓ పుడమితేఁడా! నీవు మునుపు నానిమిత్తమయి సామాన్యమైన కాకిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించినవాఁడవు. ఇప్పుడు నిన్నువంచించి నన్నుఁ దెచ్చిన యీ క్రూరరాక్షసు నేల యేమియుఁ జేయకున్నావు? ఓ పురుషోత్తమా! నీవు కడునుత్సాహము పూని నాయెడఁ గృపచేయుము. నాథా! నిన్ను నాథునిగాఁ బడసి యున్నను, ఇప్పుడు నాథుఁడులేనిదానికైవడి నెంచఁబడుచున్నాను. ఓరామా! ఒరులదుఃఖముల మాన్పుటయె ప్రధానగుణమని నీవలననే నే నింతకు ముందు వింటిని. ఓ నాథా! నీవు ఎక్కువశౌర్యము, ఉత్సాహము, బలమునుగలవాఁడవనియు, సాగరముమాడ్కి లోఁత యినవాఁడవనియు, ఇంద్రునివలెఁ బరాక్రమశాలివనియు, సముద్ర పర్యంత ముండు పుడమి కేలికవనియు నే నెఱుఁగుదును. అయినను, ఏలయూరకున్నావు?" అని నేనడిగినట్లుగాఁ జెప్పుము.

ఓ వానరేంద్రా! రాఘవుఁ డస్త్రజ్ఞులలో మేటియయియుండియు, ఆడినమాటతప్పనివాఁడై యుండియు, బలిమిగలవాఁడయి యుండియు, ఈ రాక్షసులమీఁది కేల బాణములఁ బ్రయోగింపకున్నాఁడు? యుద్ధ రంగమున రాముని బాణవేగము నడ్డగింప దేవతలును, గంధర్వులును, అసురులును జాలరు. దేవతలును జాలరు. అట్టిశూరుఁడైన యారాము నికి నాపైఁ బ్రేమగలదేని, ఏల కఱకుటమ్ములతో నీరాక్షసులనందఱిని నుగ్గునేయఁడు? పోనీ రాఘవుఁడు రాకున్న, బలవంతుఁడును, శత్రు సంహారియునైన లక్ష్మణుఁడైనను తనయన్నయనుమతిని గైకొని యేల

నన్నుఁ గాపాడరాఁడు. వాయ్వగ్నులతో పాటియగు తేజస్సుగల వారలగు ఆపురుషశ్రేష్ఠు లిద్దఱును గూడిరేని, దేవతలు సైతము వారి నెదిరింపఁజాలరు. అట్టిబలశాలురైన యారామలక్ష్మణు లేల నన్నుపేక్ష సేయుచున్నారు ! వా రంతటి శూరులైయుండియు నట్లుపేక్షచేయుట చూడఁగా, నేదో గొప్పపాపము చేసితిననియు, దానికి ఫలముగా నిప్పు డిట్లు వెతల ననుభవించుచున్నాననియుఁ దనుకొందును. ఇందుకు సందియము లేదు"

అని జానకి కన్నులనుండి కన్నీళ్లు విడుచుచుఁ జెప్పినమాటలను విని, ఎక్కువ వెలుఁగుగల హనుమంతుఁ డామె కిట్లనియె:

ఓ దేవీ! నేను ప్రమాణముచేసిచెప్పెదను. రాముఁడు నీవియోగ వ్యసనముచేఁ దనశరీరరక్షణవిషయమునఁగాని, నీ వున్న దేశము వెదకు విషయమునఁగాని యపేక్షపెట్టకున్నాఁడు. రాముఁడట్లు వ్యసనములలోఁ దగిలియుండుట చూచి లక్ష్మణుఁడును సదా వగలపాలయియున్నాఁడు. ఎట్టకేలకు నిన్నుఁ గనుఁగొంటిని. ఇది విచారపడుటకుఁ దరుణముగాదు. ఓ పతివ్రతా ! నీ విమ్ముహూర్తముననే దుఃఖములకంతయు గాంచఁ గలవు. ఓ దేవీ! ఎక్కువబలిమిగలవారును, పురుషసింహులునైన రాచ కొమరులగు రామలక్ష్మణు లిరువురును నిన్నుఁజూచుటయందుఁ గోరిక గలవారై యున్నారు. నేను పోయి చెప్పఁగానే వారువెంటనే వచ్చి యీలంకాపురమును గాల్చి బూది చేయుదురు. ఓ విశాలనేత్రా! రాఘవుఁడు యుద్ధరంగమున ద్రోహియైన రావణుని బంధుసమేతముగా సంహరించి, నిన్నుఁ దనపురమునకుఁ దోడ్కొనిపోవఁగలడు. రాముని కేమి చెప్పవలెనో, బలవంతుఁడగు లక్ష్మణుని కేమిచెప్పవలెనో, పరాక్రమ శాలియగు సుగ్రీవునికి నేమి చెప్పవలెనో, తక్కిన వానరుల కందఱకు నేమేమి చెప్పవలెనో, ఆసంగతులెల్ల నాకుఁ జెప్పుము."

అని హనుమంతుఁ డడుగఁగా, దేవకన్యకంబోలు సీతాదేవి వెతనొందుచు నా హనుమంతునితో నిట్లనియెను:

"లోకనాయకుఁడయిన యేసుతుని ధీరురాలగు కౌసల్య కనెనో, ఆ నానాథుని వానిమిత్తమై క్షేమమడుగుము; శిరముతో మ్రొక్కుము. ఎవఁడు సోదరవాత్సల్యముచే సుందరాంగనలను, పుష్పమాల్యాదులను, సర్వవిధములైన యుత్తమవస్తువులను, విశాలమైన భూమండల

మున నితరులకు లభ్యముగాని యైశ్వర్యమును, ఉత్తమసుఖములను విడిచి, తల్లిదండ్రులయనుమతి వడసి, యన్న యడవికి వచ్చునప్పు డాతనిని వెంబడించివచ్చెనో, ఎవనిచే సుమిత్రాదేవి సుపుత్రునిఁ గన్నది యయ్యెనో, సింహామువలె గొప్పమూఁపును, నిడుదచేతులును, చక్కని మనసును, ఇంపుగులుకుచూపునుం గలవాఁడైన యెవఁడు నన్నుఁ దల్లి వలెను, రాముని దండ్రివలెను భావించియుండువాఁడో, ఆ శూరుఁ డైన లక్ష్మణునికి రావణుఁడు నన్నపహరించినది తెలియదు. లేకున్న నతఁడూరకయుండియుండునా? ఆ లక్ష్మణుఁడు పెద్దలకు శుశ్రూషచేయు వాఁడు; సౌందర్యవంతుఁడు; అన్నిపనులుచేయఁగలవాఁడు; మితముగా మాటాడువాఁడు; నా మామకుఁ బ్రియనందనుఁడు; సుగుణములచే నత నికి సాటివచ్చువాఁడు; నాకును, నానాథునికిని సదా మిక్కిలి యిష్టుఁడు; ఏదైన నొక్కపని చెప్పిన నాకార్యభారము నంతయుఁ దానే వహించువాఁడు. రాముఁ డీ లక్ష్మణునిఁ జూచినయెడ నెన్నఁడో గతించిన తండ్రిని సైతము తలపెట్టఁడు. మఱియు లక్ష్మణుఁ డెల్లప్పుడు మెత్తనివాఁడు; వంచనలేనివాఁడు; నేర్పరి; రామునికి నెచ్చెలి. అట్టి యాలక్ష్మణునితో నా క్షేమమును దెలుపవలసినది. ఓవానరోత్తమా! నీ మాట విని, నాప్రియుఁడు రాముఁడును, లక్ష్మణుఁడును వచ్చి నాదుఃఖముఁ బాఁపునట్లు చేయవలసినది. ఓహరిశ్రేష్ఠుఁడా! నేనిఁక నొకనెలమాత్రమే ప్రాణముతో నుందును. ఒకనెల కావల ప్రాణము లతో నుండను. ఇది సత్యము. పాపాత్ముఁడగు రావణుఁడు వంచనతోఁ దెచ్చి నిర్బంధించియున్న నన్నుఁ బాతాళమునుండి కౌశికిని దెచ్చినట్లు లంకాపురినుండి కొనిపోయి కాపాడవలసినదని నామాటగా రాఘ వునితోఁ జెప్పవలసినది" అని చెప్పి, తాను చీరకొంగునఁ గట్టియున్న శ్రేష్ఠమైన యాశిరోరత్నమును దీసి, "దీనిని రామునిచేతి కిమ్ము" అని యాహనుమంతునిచేత నిచ్చెను.

ఆశూరుఁడగు హనుమంతుఁడు తనచేయి యాచూడామణి రంధ్రమునందు దూఱమిచేఁ గొనవ్రేలికి గ్రుచ్చుకొన్నవాఁడై, సీతా దేవికిఁ బ్రవర చెప్పి, ప్రదక్షిణపూర్వకముగా నమస్కరించి, యా సీతా దేవిప్రక్కన వినయముతోడ నిలఁబడెను. మఱియు హనుమంతుఁడు సీతాదర్శనముచేఁ గలిగిన సంతసముతోఁగూడినవాఁడై, రాముని

మనస్సునఁ దలఁచుకొని, జానకి యొసఁగిన మణి నెత్తుకొని, గాలిచేఁ బైకెగురఁ గొట్టఁబడి మబ్బుల క్రిందఁబడిన పర్వతముకైవడి మనమునఁ గుదురుబాటు గాంచినవాఁడై ప్రయాణమునకు సిద్ధపడినవాఁడయ్యెను.

## 39-వ సర్గము

### హనుమంతుఁడు సీతను వీడ్కొనుట

అంతట సీతాదేవి చూడామణిని హనుమంతునిచేతి కిచ్చి, "వానరశ్రేష్ఠుఁడా! యిది రామునికిఁ జక్కఁగాఁ దెలిసిన యానవాలు. ఈమణి నా పెండ్లియప్పుడు నాతల్లిచే దశరథమహారాజుసన్నిధిని నాతండ్రియైన జనకమహారాజుచేతినుండి కైకొని నాతల్లిచేత నాకు శిరోభూషణముగా నొసఁగఁబడినదిగనుక, దీనిని చూచినమాత్రమున వీరుఁడైన రాముఁడు నాతల్లిని, నాతండ్రిని, దశరథనృపాలుని జ్ఞప్తికిఁ దెచ్చుకొనఁగలఁడు. వానరశ్రేష్ఠా! నీవు మిక్కిలి యుత్సాహము గలవాఁడవు కావున, ఈ పని నీవలననే కావలయును. ఓ హనుమంతుఁడా! నీవు ప్రయత్నము పూని నాదుఃఖముఁ బోకార్పుము. నీవు పట్టుదల గలిగి చక్కఁగాఁ బ్రయత్నము చేయుదువేని, నాదుఃఖ ముప శమించును" అని హనుమంతునితోఁ జెప్పెను.

పగతురకు వెఱపుగలిగించు మగఁటిమిగల యావాయునందనుఁ డట్లెయని ప్రతిజ్ఞసేసి, జానకిని శిరంబుతో మ్రొక్కి పయనముగాఁగా, సీతాదేవి కన్నీటిచే డగ్గుత్తికతో "ఓ హనుమంతుఁడా! రామలక్ష్మణులకును, సుగ్రీవునికిని, అతనిమంత్రులకును, పెద్దలగు వానరులందఱకిని నానియమమురీతిని, నా క్షేమమును జెప్పుము. గొప్పబాహువులుగలవాఁడైన యారాఘవుఁడు నన్నెట్లీదుఃఖసాగరమునుండి దరి చేర్చునో, అట్టులు నీ వారామునితోఁ జెప్పి పనియగునట్లు చేయవలయును. ఓయీ! కీర్తిమంతుఁడగు రాముఁడు నన్ను బ్రదికియుండగనే కొనిపోయి యాదరించునట్లు నీవుచెప్పి, యా మాటచెప్పిన వానిపుణ్యమునఁబొమ్ము. సదా యుత్సాహవంతుఁడవగు నీమాటలను విన్నమాత్రముననే యా రామునిపరాక్రమమెట్లు నన్నుఁ బడయుటకై హెచ్చునో, నీవు నావృత్తాంతముఁ జెప్పఁగానే యెట్లాతఁడు తన పరాక్రమముఁ జూపఁ బ్రయత్నించునో, అట్లు నీవు చెప్పవలసినది" నాసందేశముగల మాట

లను వీరుఁడగురాముఁడు నీవలన విని ఉచితమయిన పరాక్రమకార్య మునకయి యత్నింపఁగలఁడు" అని మారుతితో ననెను.

హనుమంతుఁడు సీతాదేవిపలుకులు విని, దోసిలియొగ్గి నెత్తి నిడికొని, "దేవీ! రాముఁడు భల్లూకవానరవీరులతోఁగూడి యిచ్చటికి వచ్చి, యుద్ధరంగమున శత్రువుల నందఱను బరిమార్చి నీశోకమును బోఁగొట్టఁగలఁడు. మానవులలోఁగాని సురాసురులలోఁగాని, రాముఁడు బాణము లేయునప్పు డెదుట నిల్చి వానినిఁ బడఁగొట్ట శక్తిగలవాఁడు ముల్లోకములందును లేఁడు. ఓ దేవీ! ముఖ్యముగా నీనిమిత్తమై సూర్యునైనను, ఇంద్రునైనను, వివస్వంతునిపుత్త్రుఁడయిన యముని నైనను రాముఁడు యుద్ధరంగమున నెదిరింపఁజాలును. ఓ జానకీ! నీనిమిత్తమే రాముఁడు చతుస్సముద్రపర్యంతము వ్యాపించియుండు పుడమిని బాలింపఁగోరుచున్నాఁడు" నీనిమిత్తముగనే రాముఁడు జయమునొందఁ గలఁడు. అని సీతకు బదులు చెప్పెను.

అంతటసీతాదేవియు హనుమంతుఁడుచెప్పిన నిక్కపుమాట విని, దానిని గారవించి, ప్రయాణమయిన యా హనుమంతునిఁ జూచి, నెయ్యము మీఱ భర్తమీఁది యనురాగముఁ దెల్పుమాటను జెప్పఁ గడఁగి, "ఓ శత్రువుల నణఁగఁద్రొక్కువాఁడా! నీకిష్టమయ్యెనేని, యొకదిన మిచ్చటఁ జెట్లమఱుఁగుననుండి మార్గాయాసము దీర్చుకొనుము. రేపు బయలుదేఱి పోదువు. అదృష్టహీనురాలైన నాసన్నిధిని నీవుండుటచేత నాయొక్క యీ యపారశోకము కొంత తగ్గును. వానరశ్రేష్ఠా! నీవు పోయి రామునిఁ దోడ్కొని మఱలి వచ్చునంతలో నా జీవిత ముండుట సందియము. వానరా! నీచూడకపోవుటవలనఁ గలుగు చింత దహించుదానివలెఁ గనఁబడుచు, దుఃఖములలో మునిఁగి యున్న నన్ను మఱింతశోకమున ముంచఁగలదు. వీరుఁడవగు వానరేంద్రా! వానరసేనలుగాని, ఆ రాజశ్రేష్ఠులిద్దఱుగాని యెట్లీదాఁట రాని మహాసముద్రమును దాఁటఁగలుగుదురు? ఏలయన, ఈమహా సముద్రమును దాఁటుటకు నీకైనను, గరుత్మంతునికైనను, వాయు దేవునికైనను శక్తిగలదు కాని యొరులకట్టి శక్తి గలదే? కావున వా రెట్లు సముద్రమును దాఁటగలరని వారివిషయమున నాకు గొప్ప సంది యము గలుగుచున్నది. ఓ వానరశ్రేష్ఠా! నీవు కార్యజ్ఞుఁడవు గావున

నిట్టి దురూహమగు కార్యసాధనవిషయమున నీ వేమి యుక్తి చెప్పె దవు ? నేనుండలేదా? నేను నిన్ను మోచికొనిపోయెదనందు వేమో ? అది వాస్తవమె! నీవొక్కడవుమాత్ర మీ కార్యమును సాధింప శక్తుఁడవే. అయిన, దానివలనికీర్తి నీకుఁ గదా కలుగును. కావున రాముఁడు గొప్ప సేనలతో వచ్చి సమరమున రావణునిఁ బరిమార్చి జయశాలియయి స్వపురమునకుఁ బోవునేని అది నాకుఁ గీర్తికరమగును. ఓ వానరపుంగవా! శత్రుసేనలఁ బరిమార్చెడునట్టి యాకాకుత్స్థుఁడీ లంకాపురమును గళకుటమ్ములతోఁ గప్పి నన్నుఁ గొనిపోయె నేని, అది యారామునిమగఁటిమికిఁ దగిన దగును. అని యందు మొనగాఁడును, మహాధీరుఁడునయిన యా రామునిపరాక్రమము సార్థకమగునట్లు నీవు మాటలఁ జెప్పవలయును” అని యనెను.

అని సీతాదేవి యర్థము పొసఁగునట్లును, ఒకదాని కొకటి పొందిక గలిగియుండు నట్లును, సకారణముగాను జెప్పినమాటను విని, మారుతి యా దేవితోఁ గడపటిమాటయొక్కటి యిట్లనియె.

“ఓ దేవీ! వానరసేనలకుఁ బ్రభువును, వానరశ్రేష్ఠుఁడును, బల శాలియునైన సుగ్రీవుఁడు నిన్ను రామునితోఁ జేర్పఁ దలపెట్టి యున్నాఁడు. ఓవైదేహీ! రాక్షససంహారియైన యా వానరరాజు వాన రులగుంపుతోఁ గూడి యిచ్చటికి రాఁగలఁడు. ఓ దేవీ! మగటిమిగల వారును, సత్తువగలవారును, బలిమిగలవారును, మనస్సంకల్పముంబోలు గమనముగలవారును నైన పెక్కువానరవీరులు సుగ్రీవునియాజ్ఞ యం దున్నారు. వారు స్వర్గమర్త్యపాతాళములం దెక్కడికైనను బోవఁ గలరు. వారు పనులం దదైర్యము నొందరు. వారు పలుమా ఱాకా సంబునఁ బఱతెంచి, చతుస్సముద్రపరివేష్టితమై యున్నవనపర్వతము లతోఁ గూడిన భూమండలమును జుట్టివచ్చియున్నారు. ఓదేవీ! సుగ్రీవునికడ నాకంటె హెచ్చినవారును, నాతో సమానులును నున్నారే కాని, నాకంటెఁ దక్కువ వాఁ డొక్కఁడును లేఁడు. నేనే యిక్కడికి వచ్చినప్పుడు, నాకంటె మహాబలవంతులైన వారిసంగతి చెప్పవలయునే ? ప్రాయికముగా దూతకృత్యములకుఁ దక్కువవారి నంపుదురుగాని గొప్పవారి నంపరుగదా! ఓ దేవీ! విచారము వలదు; శోకము మానుము. ఆ వానరపుంగవులొక్కఱొగురున నిచటికి రాఁ

గలరు. చంద్రసూర్యులమాడ్కిఁ దేజరిల్లువారును, ఎక్కువ బలిమిగల వారునైన పురుషశ్రేష్ఠులగు ఆ రామలక్ష్మణు లిద్దఱు నావీఁపుమీఁద నెక్కి నీదగ్గఱకు రాఁగలరు. పురుషశ్రేష్ఠులగు ఆ రామలక్ష్మణు లిద్ద ఱును గూడివచ్చి లంకాపురమునందలి రాక్షసులను బాణప్రయోగము చేసి సంహరింపఁగలరు. ఓ చక్కని నడుముగలదానా! రఘునందనుఁడగు రాముఁడు రావణునిఁ బరిజనముతోఁడఁ దెగటార్చి, నిన్నుఁ గైకొని తన పురమునకుఁ బోఁగలఁడు. ఓ దేవీ! యూఱడిల్లుము. నీకు మేలయ్యెడు. సమయము నిరీక్షించుచుండుము. వేగిరమేమండుచున్న యగ్నిహోత్రుని వలె వచ్చెడు నా రామునిఁ జూడఁగలవు. ఈ రాక్షసేంద్రుఁడు పుత్ర బంధుమంత్రిపరిజనములతోఁగూడ సమరమున మడిసిన తోడనే, రోహిణి చంద్రునితోఁ జేరినట్లు, నీవు రామునితోఁ జేరఁగలవు. దేవీ! మైథిలీ! నీవు వేగిరమే దుఃఖమునకుతుద గాంచఁగలవు. రాముఁడు త్వరలో వచ్చి రావణునిఁ జంపఁగా నీవు చూడఁగలవు."

వాయునందనుఁడగు హనుమంతుఁ డిట్లెఱుఁగున వైదేహి నోదార్చి, పయనముచేయ మదిఁ దలఁచి, వెండియు సీతాదేవి నుద్దేశించి, "దేవీ! శత్రుసంహారియు, సమర్థుఁడునునైన రాముఁడును, లక్ష్మణుఁడును విండ్లు దాల్చి లంకాపురద్వారమునకుఁ జేరువకు వచ్చిరని నీవు సత్వర ముగ వినఁగలవు. గోళ్లు కోఱలు నాయుధములుగా నుపయోగించు వారును, సింహవ్యాఘ్రములవిక్రమముఁ బోలు విక్రమముగలవారును, మదపుటేనుఁగుల డీకొనువారునునైన శూరులగు వానరు లిచ్చట గుంపు గూడి యుండుటను జూడఁగలవు. ఓ పూజ్యురాలా! పర్వతములను మేఘములను బురుడించు వానరవీరు లీమలయ పర్వతలంకాపురములం దనేకముగాఁ గిలకిలారవములు సేయఁగా నీవు చూడఁగలవు. ఓ దేవీ! ఆ రాముఁడును వాఁడిమైన మారునితూఁపులచే నాయపట్టున గాఢ నేయఁబడి, సింహముచే నలఁపఁబడిన యేనుఁగుకైవడి నింపు దక్కి యున్నాఁడు. ఓ దేవీ! దుఃఖింపకుము. నీమనసునందలి వ్యసనము మానుము. శచీదేవి దేవేంద్రునితోఁ గలిసినచందమున, నీవును మగ నితోఁ గూడఁగలవు. రామునికంటె మించినవాఁడుగాని, లక్ష్మణునితో సమానుఁడుగాని మఱెవ్వఁ డున్నాఁడు? వా రిరువురు అగ్నివాయువు లతో సమానులు. అట్టివారు నీకుఁదోడైయున్నారు. ఓ దేవీ! రాక్షసుల

గుంపున కాటపట్టయి కడుభీకరమైయున్న యీలంకాపురమున నీ వింకఁ గొన్నినాళ్లే యుందువు. నీమగఁడు వేగమే రాఁగలఁడు. నేనిచ్చటినుండి బయలుదేరి రామునికడకుఁ బోవువఱకు నోర్చియుండుము. నామాట విన్నమాత్రముననే రాముఁడు పయనమై రాఁగలఁడు” అని సీతాదేవి నూరడించినవాఁడయ్యెను.

## 40-వ సర్గము

### హనుమంతుడు ప్రయాణమగుట

కడుదిట్టయగు వాయునందనునిపలుకులు విని, దేవకన్యకంబోలు సీతాదేవి, మఱల హనుమంతు నుద్దేశించి, “సగము మొలిచిన పైరుతోఁ గూడిన చేను వానగురియుటచే నవనవలాడునట్లు, ఓవానరా! ఇంపు మాటలు పలుకుచుండు నిన్నుఁ జూచి నేను కడుమోదమందుచున్నాను. ఆపురుషోత్తముని వెతలచేఁ జిక్కిన యీయంగములతోనైనను దాఁకఁ గలుగునట్లుగా నాయందు దయసేయుము. వానరగణసార్వభౌమా! కాకాసురునిపైఁ దృణమున బ్రహ్మాస్త్ర మభిమంత్రించి ప్రయోగించిన యానవా లొసఁగుము. అంతియకాక, నేనొక్కనాఁడు రాఘవుని చేరువ నుండఁగా నాబొట్టు కరిగిపోయెను. అప్పుడు తాను నామోమున మణిశిలతోఁ దిలకము దీర్చెను. ఓ హనుమంతుఁడా! నాప్రియు నావిషయమును జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్మనుము. ఓ హనుమంతుఁడా! పరాక్రమమున నింద్రవరుణులఁబోలినవాఁడయ్యు నారాముఁడు నేను రాక్షసులనడుమ నుండుట కెట్లు సమ్మతించియున్నాఁడో? “ఓ రాఘవా! సముద్రమునఁబుట్టిన యీదివ్యమైన శిరోరత్నమును బదిలముగాఁ గాపాడి, నిన్నుఁబాసియుండు వేళలందు దీనిని నీకు మాఱుగాఁ జూచుచుంటిని. అట్టి నీటఁబుట్టిన యీదివ్యరత్నమును నీకడకుఁ బంపితిని. నే నింక నిట్టివంతలందుఁ జిక్కి జీవముతో నుండఁజాలను. ఈయోర్వరాని వ్యసనములను, మర్మభేదకములైన ఈరాక్షసకాంతల రోత మాటలను నీనిమిత్తమై యోర్చియున్నాను. ఓ శత్రుసంహారకా! నే నింక నెలదినములుమాత్రము ప్రాణముతో నుందును. ఈ ఒకనెల కావల నిమిషమైనను బ్రాణముతో నుండఁజాలను. ఈరాక్షసేంద్రుఁడు కటికివాఁడు. వీనికి నాయందు సౌమ్యదృష్టి లేదు. నీవో కాలవిలం

బము చేయుచున్నావు. నే నిఁక క్షణమయిన జీవింపఁజాలను అని నా మాటగా నారామునితోఁ జెప్పుము" అని తనకు మేలుగావించుమాట చెప్పెను.

అంతట గొప్ప వెలుఁగుగలవాఁడగు వాయునందనుఁడయిన హనుమంతుఁడు వైదేహి కన్నీరువిడుచుచు దీనముగాఁజెప్పిన మాటను విని, "ఓ వైదేహీ! సత్యముగాఁ జెప్పెదను. రాముఁడు నీయెడఁబాటువలన దేహసౌఖ్యమం దాశలేనివాఁడై, యెల్లప్పుడు వగలఁ బొగులుచుండును. రాముఁడు దుఃఖములలో మునిఁగియుండుటచే లక్ష్మణుఁడు తానును మనోవేదనలఁ జెందుచుండును. ఎట్టకేలకు నిన్నుఁ గనుగొంటిని. ఇది వ్యసనపడుటకుఁ దరుణము గాదు. ఓభామినీ! యీనిముసముననే దుఃఖములకంతమును గాంచఁగలవు. శత్రుసంహారులగు ఆ పురుషశ్రేష్ఠులైన రాజపుత్రు లిద్దఱును నిన్నుఁ గాంచుటయం దుత్సాహముగలిగి యున్నారు. కావున నామాట విన్నతోడనే వారు బయలుదేరివచ్చి యీలంకాపురము బూదిసేయఁగలరు. ఓవిశాలనేత్రీ! ఓనిర్దోషురాలా! రామ లక్ష్మణు లిద్దఱు బవరమున రావణుని బంధుసమేతముగాఁ దెగటార్చి నిన్నుఁ దనపురమునకుఁ గొనిపోవఁగలరు. ఓనిర్దోషురాలా! రాముఁ డెఱుఁగఁ గలదియు, నెయ్యముగలిగించునదియునైన మఱియొక యానవా లొసఁగుము" అని సీతాదేవి నడిగెను.

"ఓ వానరోత్తమా! నేను ముందే యుత్తమమగు నానవాలొసఁగితిని. రాముఁ డీ చూడామణిని జూచినంతటనే, నీమాటల నమ్మగలఁడు" అని సీతాదేవి హనుమంతునితోఁ జెప్పఁగా, వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు మణిశ్రేష్ఠమైన యా శిరోరత్నమును గైకొని సీతాదేవికి సాష్టాంగప్రణామము లాచరించి పయనమాయెను.

అప్పుడు సీతాదేవి కడువేగముతో నెగురఁ బ్రయత్నము చేయుచు, దేహము పెంచుచున్న యాహనుమంతునిఁ జూచి, కన్నీళ్లు మోమునఁ గ్రమ్ముచుండ, కన్నీటిచే డగ్గుత్తిక పుట్టుచుండ, మాటలు తడఁబడుచుండ, హనుమంతు నుద్దేశించి, "ఓహనుమంతుఁడా! సింగము లంబోలు నన్నదమ్ములగు రామలక్ష్మణులకును, సుగ్రీవునికిని, వాని మంత్రులకును నా క్షేమవృత్తాంతమ్ముఁ జెప్పుము. ఆరాముఁడు న న్నీశోకసాగరమునుండి దరిఁజేర్పువిధమున నీ వారామునికిఁ జెప్పవలసినది. ఓహను

మంతుఁడా! నీవు రాముని కడఁ జేరి యోర్వరాని నావగ పెంపును, రక్కసులు బెదరించురీతిని బాగుగఁ జెప్పవలసినది. నీకు మార్గమున మేలు గలుగుఁగాక!" యని సీత దీవించెను. అంత హనుమంతుఁడు సీతచెప్పిన సంగతులు దెలిసికొన్నవాఁడై, వచ్చినపని నెఱవేర్చుకొన్నవాఁడగుటం జేసి మనమున సుప్పొంగుచు, కార్యము కొంత మిగిలియున్నదానినిగాఁ దలఁచి, యాకొఱవపని చూచుటకై యుత్తరదిశవైపు పోవ మనసునఁ దలఁచెను.

## 41-వ సర్గము

### హనుమంతుఁ డశోకవనము పాడుచేయుట

ఆ హనుమంతుఁడు సీతాదేవిచే మేలుమాటలచే గారవింపఁబడినవాఁడై మఱలి యాప్రదేశమునుండి వెడలివచ్చి యివ్విధమునఁ జింతింపఁ దొడఁగెను. "నేనిచ్చటికి రెండు పనులనిమిత్తము వచ్చితిని. అందొక్కటి సీతాదేవిని గాంచుట. మఱియొకటి శత్రువులబలిమి మెందలగువాని నెఱుఁగుట. ఆరెంటిలో ముఖ్యమయిన గొప్పకార్యమగు సీతయొక్క దర్శనమయినది. ఇఁక శత్రుబలము నెఱుఁగుట యనెడి కొంచెపాటి కార్యము మిగిలియున్నది. ఇచ్చట రాక్షసేంద్రునిబలము తెలిఁగు నెఱుఁగుకార్యమున సామదానభేదోపాయములు దప్పఁ గడపటిదగు నాలవయుపాయ మిచ్చుట యుక్తముగాఁ గనఁబడుచున్నది. రక్కసుల యందు సామము (బ్రతిమాలుట) అక్కఱకు రాదు. ఈ రాక్షసులు ధనికులు గనుక దానోపాయమునకు వీరు లొంగరు. వీరు బలగర్వితులు గనుక భేదోపాయముచే వీరిని సాధించుట కడుదుర్లభము. కావున వీరియందు బలిమి చూపుటయే యుక్త మని నాకుఁ దోఁచుచున్నది. రావణబలపరిజ్ఞాన రూపమైన యీకార్యమునఁ బరాక్రమము చూపుట కంటె మేలగు వేఱొక యుపాయ మున్నట్లు తోఁపలేదు. నేను యుద్ధమున రాక్షసవీరులఁ గొందఱిని వధించితినేని, అప్పుడైనను వీ రెట్టకేలకు మెత్తఁబాటు నొందుదురు. అయినను "వచ్చినపని సీతాన్వేషణగదా! అది యైనపిదప నిక్కడఁ జేయవలసినపని లేదే" యనిన, ఆనతిచ్చిన పని చేసిన తర్వాత, ఆకార్యమునకు భంగము లేకుండఁ బెక్కు కార్యములను జేయువాఁ డెట్టిపనినైనను జేయఁగలఁడు. మఱియు నొకకారణము

స్వల్పకార్యమునకైనను సాధకము గానేరదు. కర్తవ్యమగు కార్యమును బెక్కు తెఱఁగుల సాధింప నెఱిఁగినవాఁ డర్థసాధనమునఁ జాలినవాఁడగును. నే నిచ్చటనే నిర్ణయముచేసికొని, ఆత్మబలశత్రుబలతారతమ్యము నెఱిఁగినవాఁడనై, యావల వానరేంద్రునిపురమునకుఁ బోవుదునేని, అప్పుడు రాజు నుత్తరువు చెల్లించినవాఁడ నగుదును. ఇప్పుడు నాకు రాక్షసులతో నెవ్విధమునఁ బోరు సులభముగా వచ్చునో, అట్టిపని నొనరింపవలయును. అట్లు యుద్ధము జరిగినపుడే రావణుఁడు తనవారిబలమును నాబలమును బరిశీలింపఁగలఁడు. అట్లు పరిశీలించినవాఁడై, యా రావణుఁడు మంత్రివర్గసైన్యములతోడ యుద్ధరంగమునకు వచ్చునేని, అప్పుడా రావణునిమనసున నుండెడి యభిప్రాయమును, అతనిబలమును దెలిసికొని యచ్చటినుండి వెడలి పోయెదను. నందనవనముం బోలినదియు, కన్నుల కింపయినదియు, మనోహరమైనదియు, పెక్కుచెట్లును తీఁగెలును గలదియునైన యీ క్రూరుని దగు నుపవనమును శాఖుచిచ్చెండుటడవినిం గాల్చినట్లు ధ్వంసముచేసెదను. ఈ వనమును నేను బాడుచేయఁగా, రావణుని కాగ్రహము రాఁగలదు. అంతట నతఁడు రథగజతురగపదాతులతోను సకలాయుధములతోను గూడిన గొప్పసేనను నాపైకిఁ బంపఁగలఁడు. అప్పుడు గొప్ప పోరు జరుగఁగలదు. ఆపోరునం దొరులచే నోర్వరాని పరాక్రమముగల నేను భీకరబలులగు రాక్షసులతో యుద్ధముసేసి, రావణుఁడు పంపిన యాసేన నెల్లఁ దెగటార్చి, సుఖముగాఁ గిష్కింధాపురికిఁ బోయి సేరెదను.

అని తలఁచి, భీమపరాక్రముండగు హనుమంతుఁడు వాయువు వలెఁ జెలరేఁగినవాఁడై, తనతొడల గొప్పబల్మిచే నావనమునందలి చెట్లను బడఁద్రోయ నారంభించి, మదించిన పెక్కు పక్షులకూఁతలతోఁ గూడినదియుఁ నానావిధములయిన వృక్షములతోను తీఁగెలతోను నిండినదియునగు ఆవనంబునందలి చెట్ల నన్నింటిని విఱిచెను. హనుమంతుఁ డావనమునందలి చెట్లను విఱుచుటచేతను, తామరకొలఁకుల రేవులం బడఁగొట్టుటచేతను, పర్వతశిఖరములను నుగ్గుచేయుటచేతను, ఆవనముచూడ నింపుగాక యుండెను. ఆవనమునందలి పక్షు లెల్ల బెదరి కూఁత లిడెను. ఎల్లని చిగుళ్లు హనుమంతుఁడు గోసిపాఱ

వేయుటచే నెండకు వాడిపోయెను. కావున వనము కాఱుచిచ్చుచేఁ గాల్పఁబడినయట్లు వాఁడినచెట్లును తీఁగెలునుగలదై సొంపుదక్కి యుండెను. తీఁగె లాధారవృక్షములనుండి తొలఁగినవై నాథునిఁ బాసిన యాఁడువాండ్రవలె నల్లలాడుచుండెను. ఆహనుమంతుఁడు తీఁగెలయిండ్లను, చిత్రంపుటిండ్లను నాశముచేయఁగా, మహాసర్పములను, వ్యాఘ్రాదిక్రూరమృగములను బడఁగొట్టఁగా, ఱాతియిండ్లను, సామాన్య గృహములను ఇడియఁగొట్టఁగా, ఆ గొప్పయుపవనము రూపుసెడిన దాయెను. రావణునియంతఃపురస్త్రీలకు భోగములపెంపుమూలమున రక్షకమయిన యా ప్రమదావనమునందలి యశోకవృక్షముల గుంపుతో నిండిన వనప్రదేశము హనుమంతుఁడు పాడుచేయఁగా విచారపడఁదగిన తీఁగెల జొంపములతోఁ గూడినదాయెను. ఆ హనుమంతుఁడు బలిశాలి యగు రావణుని మనస్సున కప్రియము గలిగించి, తానొక్కఁడె మహా బలవంతులు పెక్కండ్రతో యుద్ధముచేయఁ గోరినవాఁడై శౌర్య లక్ష్మిచే వెలుఁగుచు నా యశోకవనబహిర్ద్వారమునఁ జేరినవాఁడయ్యెను.

## 42-వ సర్గము

### రావణుఁడు హనుమంతునిమీఁదికి రాక్షసులను బంపుట

అంతటఁ బక్షులకూఁతలకు, చెట్లు విఱుగుటవలనయ్యెడు పెళ పెళ ధ్వనులకును లంకాపురమునందలి జనులంద ఱులికిపడి తత్తరపాటు నొందిరి. ఆవనములందున్న మృగపక్షులు భీతిల్లి కూఁతలిడుచు నలుదెసలకుఁ బాఱినవి. మఱియు రాక్షసులకుఁ గ్రూరములయిన దుశ్శకునములు గలిగెను. చెట్లు విఱుగునప్పటి పెళపెళలకు నిద్రా భంగము గలుగుటచే వికృతపుమోములుగల రాక్షసస్త్రీలు మేల్కొని, విఱువఁబడియుండు ఆవనమును, వీర్యవంతుఁడైన గొప్పవానరునిఁ జూచిరి. ఎక్కువసత్త్వమయు బలిమియుఁగలవాఁడును, నిడుదచేతుల వాఁడునైన యావానరోత్తముఁ డా రాక్షసకాంతలను జూచి, వారికి వెఱపుగలిగించు కడుగొప్ప యాకారమును దాల్చెను.

అంతట నారాక్షసకాంతలు పర్వతముమాడ్కి నెత్తయినవాఁడును, దీర్ఘకాయుండు, బలవంతుఁడునునైన వానరునిఁజూచి, జానకి నుద్దేశించి "ఓ సీతా! ఈతఁడెవ్వఁడు? ఎవనికుమారుఁడు? ఎచ్చటినుండి యొందు

ు త్తమై యిచ్చటికి వచ్చినాఁడు ? నీవేల యితనితో నింతసేపు మాట
ాడుచుంటివి ? నల్లని కడకన్నులుగలదానా, యీతఁడు నీతో నేమి
ుచ్చట లాడెను? ఓవిశాలాక్షీ! యిది యెల్ల మా కెఱిఁగింపుము.
సుందరీ ! నీకు భయమువలదు." అని సీతాదేవి నడుగఁగా, సర్వాంగ
ుందరి యైన పతివ్రతయగు సీతాదేవి "రాక్షసాంగనలారా, భీమ
ాక్షసుల మాయల నెఱుఁగ నెవరికి శక్తి గలదు? ఈతఁ డెవ్వఁడో,
మిచేయఁగలఁడో, అది మీరే యెఱుఁగుఁడు. పాముసకే పాము
ాళ్లు తెలియునుగాని యొరులకుఁ దెలియదు. ఇది నిక్కము. నేనును
నిం జూచి వెఱచితిని. ఇతఁ డెవ్వఁడో నాకును దెలియదు. వానర
ూపముఁ దాల్చి వచ్చిన రాక్షసుఁడేమో యని తలఁచెదను" అని
ప్రత్యుత్తర మొసఁగెను.

సీతాదేవిచెప్పిన పలుకులువిని కొందఱు రక్కసకాంతలు మూల
ూలలకుఁ బరుగెత్తిరి. కొందఱు నిల్చిననిలువున నిలఁబడిరి. కొందఱు
ావణుని కీ వృత్తాంతముఁ దెలుపఁబోయిరి. అట్లు కొందఱు వికృత
ూపలగు రాక్షసకాంతలు రావణునిసన్నిధానమున విరూపుఁడయిన
భయంకరుఁడగు వానరునిం గూర్చి చెప్పఁబూని "ఓమహారాజా!" వెఱ
ుంచు రూపముగల యొక వానరుఁ డశోకవనమునడుమ సీతతోడ
ముచ్చటలాడి నిలిచియున్నాఁడు. వానిశౌర్యము మితి మీఱియున్నది.
మే మాజింకకన్నులదగు సీతాదేవిని ఆవానరుంగూర్చి యెన్నివిధముల
నడిగినను, అతఁ డితఁడని చెప్పకున్నది. అతఁ డింద్రునిదూతయో,
కుబేరునిదూతయో, సీతాదేవిని వెదకునిమిత్తమై రామునిచేఁ బంపఁ
బడిన దూతయో, మే మెఱుఁగము. నానావిధమృగగణములతో
నిండిన తమ ప్రమదావనము నాతఁడు పాడుసేసెను. ఆ వనమున నతఁడు
పాడు చేయని తా వొక్కటి లేదు. అయినను ఆ సీతాదేవి గూర్చుండి
యున్న వృక్షప్రదేశము మాత్ర మాతఁ డేమి చేయలేదు. ఆ ప్రదేశ
మును బాడు సేయకుండినది యా సీతాదేవి రక్షణముకొఱకో, లేక
బడలికనో మాకుఁ దెలియదు. అతఁడు బడలికచే నా ప్రదేశము వదలి
నాఁడనుట యుక్తముగాఁ దోఁపలేదు. అంత వనము పాడుచేసిన
యాతఁ డా సీతాదేవియున్న ప్రదేశముమాత్రము విడువ నేల? సీతా
దేవి యే వృక్షము క్రిందఁ గూర్చుండి యున్నదో, మెత్తనిచిగుళ్లను

బువ్వులునుగల ఆ గొప్ప శింశుపావృక్షమును మాత్రము విఱువలేదు. ఆ వానరుఁడు సీతాదేవితో మాటాడెను. ప్రమదావనమెల్లఁ బాడు సేసెనుగావున నుగ్రుఁడా, యవ్వానరుని కుగ్రదండనము నీవు విధింపుము. రాక్షసులగుంపు నేలువాఁడా, నీవు మనసునఁగోరిన తనదైన యా సీతతో బ్రతుకఁ గోరువాఁ డెవ్వఁడు మాటాడును?" అని రావణునితోఁ జెప్పిరి.

రాక్షసస్త్రీలమాటలను విని మహాకాంతిగల రాక్షసరాజగు రావణుఁ డాజ్యాహుతిం బ్రజ్వరిల్లు నగ్నిహోత్రునిమాడ్కి మండిపడి, కన్నులు గిరగిరఁ ద్రిప్పుచు వెలుఁగుచున్న దీపములనుండి జ్వాలలతోఁ గూడిన చమురుబొట్లకైవడిఁ గన్నులనుండి కన్నీటిబొట్లు గార్చుచు, శౌర్యమునఁ దనకు సాటివచ్చువారును, శూరులునైన కింకరులను పేరుగల రాక్షసుల నాతని వధింపుఁడని యానతిచ్చెను.

గొప్ప పొట్టలును కోఱలును గలవారును, భయంకరరూపులును మహాబలులును యుద్ధమునం దెక్కువ యపేక్ష గలవారునునగు నెనుబదివేలమంది కింకరులును కూటముద్గరము లను నాయుధములను దాల్చినవారై, హనుమంతునిఁబట్టుకొనఁ గోరి వేగిరమే వచ్చిరి. ఆ కింకరులట్లు మహావేగముతో వచ్చి, అశోకవనద్వారదేశమున ధైర్యవంతుఁడై నిల్చియున్న వానరవీరునిఁ జూచి, మిడుత లగ్నిహోత్రుని మీఁదఁ బడునట్లు ఆ హనుమంతునిమీఁదఁ బడిరి. ఆ కింకరులు విచిత్రములగు గదలను, పసిఁడి పొన్నులు దగిలించినగుదియలను, సూర్యునిఁ బోలె ధగధగ వెలుఁగు శరములను, గుదియలను, అడ్డకత్తులను, శూలములను, చిల్లకోలలను, ఈఁటెలను, తోమరములనుగైకొని యా హనుమంతునిఁ జుట్టుకొని, యాయుధములతోఁ గొట్టుచు ముందు నిలిచిరి.

కాంతిగలవాఁడును, ప్రతాపశాలియు, పర్వతసదృశుఁడునైన హనుమంతుఁడును తోఁకను నేలమీఁదఁ గొట్టి దేహమును బెంచి, లంకాపుర మదలునట్లు కడు ధీరముగా భుజ మప్పళించెను. మాఱుమ్రోఁత వినఁజేయు ఆ నాయప్పళింత విన్నమాత్రమున నాశసమునఁ బోవుచున్న పక్షులు క్రిందఁ బడినవి.

అప్పుడు హనుమంతుఁడు "ఎక్కువ బలశాలురగు రాముఁడును, లక్ష్మణుఁడును అందఱికంటె మించినవారైయున్నారు. వాలివధముచేసి

రాముని చేఁ గాపాడఁబడిన మారాజగు సుగ్రీవుఁడును సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు. నే నెట్టికార్యమైనను చులకనగాఁ జేయఁగలకోసలరాజగు రామునియొక్క దూతను. నేను హనుమంతుఁ డను పేరివాఁడను; శత్రు సేనలఁ బరిమార్చువాఁడను; వాయుపుత్త్రుఁడను. వేయిమంది రావణులతో సైతము యుద్ధమున కాలతోఁ గొట్టుచుఁ జెట్లతో మోదుచుఁ బోరాడుదు. నే నీ లంకాపురమును బాడుసేసి, సీతాదేవికి మ్రొక్కి, యామెకడ నుత్తరువుఁగైకొని, పనినెఱవేర్చుకొన్నవాఁడనై రాక్షసు లందఱు చూచుచుండఁగా బయలువెడలి పోయెదను” అని యార్భాటము సేసెను.

అంత హనుమానుని యాగంభీరనాదముచే కింకరనామకులగు రాక్షసులందఱు మిక్కిలి యులికిపడినవారై, సంధ్యాకాలమేఘము మాడ్కిఁ బెచ్చు పెరిగి యున్న యాహనుమంతుని వీక్షించి, రాజాజ్ఞయైనందున నిర్భయులై నానావిధములైన యాయుధములను జేతఁ బట్టి యాతని ముట్టడింపఁగా, నాహనుమంతుఁ డొక్క యెగురున ద్వారమున నుండు నినుపగుదియకడకుఁ బోయి, గరుడుఁడు మినమినలాడు పామును ముక్కునఁగఱచుకొన్నచందమున నాగుదియ నెత్తుకొన్నవాఁడై, యాకాశమున నిలిచి దానిని గిరగిర ద్రిప్పి యాకింకరులనెడి రాక్షస వీరుల నందఱఁ బరిమార్చి, యుద్ధముఁగోరినవాఁడై మఱల ద్వారదేశముపై నుండెను. ఆకింక రులలోఁ గొందఱు భయంకరుఁడైన హనుమంతునిచేతినుండి తప్పించుకొని రావణునికడకేగి, “మహారాజా! కింకరు లందఱు వీరుఁడైన యాహనుమంతునిచేత మడిసిరి” యని విన్నవించిరి. అంత రావణుఁడు కింకరబలమంతయు హనుమంతునిచే మడియుట విని, కన్ను లెఱ్ఱచేసి పరాక్రమమున సాటిలేనివాఁ డగుటచేత యుద్ధమునఁ బగతురకు గెల్వనలవికాని ప్రహస్తకుమారుని హనుమంతునిఁ బట్టి తెమ్మని పంపెను.

## 43-వ సర్గము

### హనుమంతుఁడు చైత్యపాలురను నష్టసేయుట

అంతట హనుమంతుఁడు కింకరు లనెడి రాక్షసులను సంహరించి, “నేను ప్రమదావనము పాడుచేసితి. రాక్షసులకులదేవాలయమగుప

మగు నగరును పాడు సేయనైతిని. కావున నిప్పు డాభయంకరమగు నగరును నిల్లి ధ్వంసముచేసెదను” అని తలఁచినవాఁడై తనబలిమిఁ జూపుచు మేరుపర్వతశిఖరముమాడ్కి నున్నతమైన కులదేవతాలయ రూప మగునగరు కొన నెక్కెను. అట్లు హనుమంతుఁడు పర్వతము బోలు నగరుపై నెక్కి, యుదయించిన సూర్యునివలె వెలుఁగుచు, గట్టిదగు చైత్యప్రాసాదముం గదలించి, శౌర్యలక్ష్మిచేఁ బ్రజ్వరిల్లుచుఁ బారియాత్రపర్వతసదృశుఁడై, దేహమును బెంచుచు, లంకాపురమున నిండునట్లును, ఆకాశమునఁ బాఱు పక్షులు క్రిందఁబడునట్లును చైత్యపాలకులు మూర్ఛిల్లునట్లును కర్ణకఠోరముగా నుండునట్లును గట్టిగాబుజ మప్పళించెను. అట్లు అప్పళించి “అస్త్రవేత్తయగు రాముఁడును, మహాబలుండగు లక్ష్మణుఁడును, రామునిచే వాలిసంహారరూపసాహాయ్యము చేసి కాపాడఁబడిన సుగ్రీవుఁడును సర్వోత్కృష్టులైయున్నవారు. నేను విచిత్రశక్తిగల కోసలదేశాధీశ్వరుఁడగు రామునిదూతను. వాయుపుత్త్రుం డనుపేరివాఁడను. శత్రుసేనలఁ జక్కాడువాఁడను. నేను ఱాలతోను, చెట్లతోను శత్రువులను గొట్టునప్పుడు వేవురు రావణులైనను నాతో సమముగా యుద్ధము చేయనేరరు. నే నీ లంకాపురమును ధ్వంసముచేసి, జానకీదేవిని బ్రణమిల్లి, పనిఁజూచుకొన్నవాఁడనై యందఱు రాక్షసులు చూచుచుండఁగా మాపురమునకుఁ బోయిచేరెదను” అని చైత్యపాలురతోఁ బలికి, రక్కసు లంద ఱులికిపడునట్లు గొప్పధ్వనిని జేసెను.

గొప్పమేనులు గలవారగు చైత్యరక్షకులు నూఱువురు ప్రాస తోమర ఖడ్గపరశ్వధాదులగు పెక్కుటడిదములను గైకొని, యాహనుమంతునిఁ జుట్టుకొని, విచిత్రములయిన గదలతోను బంగారుపొన్నులు వేసిన గుదియలతోను సూర్యునిమాడ్కిఁ దేజరిల్లు బాణములతోను ఆహనుమంతునిఁ గొట్టిరి. ఆ హనుమంతుని చుట్టు నిల్చియున్న యా రాక్షసగణము గంగానదియందలి కడువెడల్పయిన నీటిసుడివలెఁ జూపర కగపడెను.

ఆరాక్షసులబాణములపోటున కా హనుమంతుఁ డలిగినవాఁడై యెత్తు శిఖరముగల ప్రాసాదముయొక్క కనకమయ స్తంభము నొక్కటి పెల్లగించి, దానిని గిరగిరద్రిప్పి మఱియొక్క స్తంభముమీఁదఁ

గొట్టఁగా నా స్తంభము లొండొంటి నొఱసికొనుటచే నచ్చట నిప్పుపుట్టి యానగరంతయు నంటుకొని మండ నారంభించెను. అంతట వానరపుంగవుఁడగు హనుమంతుఁడు ప్రాసాదము మండుటఁ జూచి, ఇంద్రుఁడు వజ్రాయుధముతో నసురులను బొలియించున ట్లాప్రాసాదరక్షకులను నూఱ్వురను జంపి, యాకాశమున నుండి శౌర్యలక్ష్మిచే వెలుఁగుచు, ఆరాక్షసుల నుద్దేశించి "ఓరాక్షసులారా! నావంటిబలశాలురగు వానర వీరులు పెక్కువేవురు మాఱేఁడగు సుగ్రీవునివశమున నున్నవారు. వారు మేమును సీతాదేవినిమిత్తమై భూమండల మెల్లఁ దిరుగుచున్నారము. మాలోఁ గొందఱు పదేనుఁగులబలమును, మఱికొందఱు నూఱేనుఁగుల బలంబును, వేఱుకొందఱు వేయియేనుఁగుల బలమును, మఱికొంద ఱోఘబలమును, తక్కిన కొందఱు వాయుబలమును, వేఱొకకొంద ఱెన్నరాని బలమునుగలవా రయియున్నారు. దంతనఖాయుధులగు ఈ పెక్కుకోట్ల వానరులతోఁ గూడినవాఁడై, మీకందఱకు సంహర్తయైన సుగ్రీవుఁడు రానున్నాఁడు. అతఁడు వచ్చెనేని, ఈలంకాపుర ముండదు; మీరుండరు; రావణుఁ డుండఁడు. ఓరాక్షసులారా! మీకందఱకుఁ జేటునకే యా మహాధీరుఁడయిన యిక్ష్వాకు వంశస్థుఁడయిన రామునితోఁ బగ పూనితిరి. ఇది మీకు మేలునకుఁ గాదు" అని దిట్టతనముతోఁ బలికెను.

## 44-వ సర్గము

**హనుమంతుఁడు ప్రహస్తసుతునిఁ జంపుట**

రావణుఁ డానతియ్యఁగా యుద్ధరంగమున గెల్వ నలవికాని వాఁడగు, గొప్పకోఱలుగల ప్రహస్తపుత్రుఁడగు జంబుమాలియను వాఁడు ఎఱ్ఱనిబట్టగట్టి యెఱ్ఱనిపూవులదండలఁ దాల్చినవాఁడై, కన్నులు గిరగిర ద్రిప్పుచుఁ బగతురకు వెఱపు పుట్టించుచు, వజ్రాయుధముఁ బోలు గొప్పవింటిని, వడిగాఁబోఁగల బాణములను గైకొని, వింటి నారిని వేగముతో మీటఁగా, ఆవింటినారిమ్రోఁత దిక్కులందును, విదిక్కులందును, ఆకసమునందును నిండెను.

ఉత్సాహవంతుఁడైన హనుమంతుఁడు ఖరములుపూన్చిన రథమునఁ గూర్చుండివచ్చిన యాజంబుమాలిని జూచి యుప్పొంగి కిలకిల

ధ్వనిని జేసెను. అంతట నిడుదచేతులవాఁడగు జంబుమాలి అశోకవన ద్వార స్తంభములమీఁది దూలముపైఁ గూర్చుండియున్న వానరశ్రేష్ఠుఁడైన హనుమంతునిఁ గఱకుటమ్ములచేఁ బెక్కుతావులందు మోదెను. అర్ధచంద్ర బాణముతోఁ ముఖమునను, చెవులుగల యొక బాణముతోఁ దలమీఁదను, పది కఱకుటమ్ములచేఁ జేతులందును మోదెను. ఆ ప్రహస్తునిచే మోదఁబడి రక్తము గ్రమ్మిన యాహనుమంతునిముఖము చుట్టు నెఱ్ఱనై శరత్కాలమున సూర్యరశ్మి గ్రమ్మఁగా వికసించిన యెఱ్ఱదామర పువ్వువలెను, ఎఱ్ఱగందపుఁబూఁతగల యాకాశమునందలి మహాపద్మమువలెను నుండెను.

హనుమంతుఁడా ప్రహస్తపుత్త్రుని బాణముల మోదులకుఁ గడునలిగినవాఁడై, తనప్రక్కన నున్న కడువిశాలమైన యొక గొప్ప బండను వేగముతోఁ బెల్లగించి, బలముకొలఁదిని విసరివేసెను. జంబుమాలియు నా గొప్పబండను బదిబాణములచేఁ దుత్తునియలుచేసెను. హనుమంతుఁడు తనకార్యముచెడినది చూచి, ఓర్వరాని పరాక్రమము గలవాఁడగుటచేఁ బగతునియవమానము సైరింపలేక, చేరువ నున్న యొక మ్రాఁకును బెల్లగించి, గిరగిర ద్రిప్పుచుండఁగా, బలవంతుఁడగు జంబుమాలి యది చూచి, నాలుగుసాయకములు ప్రయోగించి యామ్రాఁకును బడఁగొట్టి, మఱియైదుబాణముల నాతనిభుజమునను, ఒక్క బాణము నాతనిఱొమ్మునను, పదిబాణముల నెదురుఱొమ్మునను గొట్టెను. ఆహనుమంతుఁడు దేహమంతయు బాణములు నిండఁగాఁ గడునలుక గదుర వేగముతో నాద్వారపుగుదియను బెల్లగించి, బలిమి చెలరేఁగఁ గడువేగిరముగాఁ బల్మఱు త్రిప్పి యాజంబుమాలి వెడదఱొమ్మునఁ బడవేసెను. ఆగుదియమోదున కాప్రహస్తునికిఁ దలగాని, చేతులుగాని, తొడలుగాని, రథముగాని, గుఱ్ఱములుగాని, ఆయుధములుగాని కనిపింప వయ్యెను. అట్లు జంబుమాలి హనుమంతునిచే మోదఁబడి, పిండి చేయఁబడిన సొమ్ములతో నేలఁగూలెను. అంతట కింకరులును జంబుమాలియుఁ జచ్చిరన్న మాటను విని రావణుఁడును కినుక గదుర నెఱ్ఱని కన్నులుగలవాఁడై, బలవంతుఁడగు ప్రహస్తపుత్త్రుని మరణవార్తాశ్రవణజన్యకోపముచేఁ గన్నులు గిరగిరఁ ద్రిప్పుచు, మీఁఱిన బలపరాక్రమంబులుగల మంత్రిపుత్త్రులనేడ్వురను వానిమీఁదికిఁ బంపెను.

## 45-వ సర్గము

### హనుమంతుఁడు మంత్రిపుత్రుల నేడ్వురఁ బరిమార్చుట

రాక్షసాధిపతియగు రావణుఁ డానతియ్యఁగా, నగ్నిహోత్రుని చందమునఁ దేజరిల్లువారును, విలుకాండ్రును, బలశాలురును, విలువిద్దె నేర్చినవారిలోను, అస్త్రజ్ఞులలోను మేటులును, ఒండొరుల జయములు గోరువారును, ఎన్నరాని మగఁటిమిగలవారునునైన మంత్రిపుత్రు లేడ్వురును, సువర్ణాలంకృతములును, ధ్వజపతాకములు గట్టినవియు, ఉఱుమువంటి గమనమునందలి మ్రోఁతగలవియు, గుఱ్ఱములు గట్టిన వియునైన యరదములమీఁదఁ గూర్చుండి, కనకభూషణాలంకృత చాపములను జేతులఁ బట్టి, విండ్లనారులను మీటుటంజేసి, మెఱపులతోఁ గూడిన మొగుళులంబోలె వెలుఁగుచుఁ గడువేడ్కమీఱ స్వభవనములనుండి తఱలిరి. కింకరులు హనుమంతునిచే హతులైరన్నమాట విని, వారితల్లులు "అక్కటా! మాకొడుకులు మడిసిరిగా" యని బంధుమిత్రజనోపేతముగా నేడ్చుచుఁ దత్తరపాటునొందిరి. మేల్మి తొడవులఁ దాల్చిన యామంత్రిపుత్రు లేడ్వురును నేను ముందు నేను ముందని పోటీలువేసికొని వనద్వారదేశమున నున్న యా హనుమంతునిపైకిఁ గవిసి, క్రొక్కారుమబ్బు లుఱుములు మెఱుములు చెలరేఁగ వర్షముఁ గురిపించినట్లు, రథనేమిధ్వానము లుఱుములవలె మిన్నుముట్ట బాణవర్షములఁ గురిపించిరి.

ఆరాక్షసులు ప్రయోగించిన యమ్ములా వానరవీరునిమేను గప్పఁగా నతఁడు జడివానచేఁ గప్పఁబడిన పర్వతేంద్రునికైవడిఁ జూపట్టెను. వేగముగా నడచునట్టి శూరుఁడయిన యాహనుమంతుఁడు రాక్షసులు ప్రయోగించు శరములు తనకుఁ దగులకుండునట్లును, రథవేగమునఁ దనపై బాణములఁ బ్రయోగింప వీలులేకుండునట్లును జేసి, విలుకాండ్రగు నారాక్షసులతో యుద్ధక్రీడ సల్పుచు నాకసమున నింద్రధనుస్సులతోఁగూడిన మేఘములచేఁ జుట్టఁబడిన సర్వసమర్థుఁడగు వాయువుంబోలినవాఁడై, యంద ఱులికిపడునట్లొక్క గొప్ప బొబ్బపెట్టి, రాక్షససేన సడలించుచు, ఆరక్కసుల వధింపఁ దలఁచి, కొందఱ నఱచేతులతో నప్పళించి, కొందఱిని గాళ్లతోఁ గుమ్మి, కొందఱిని బిడికిళ్లతో

గ్రుద్ది, కొందఱిని గోళ్లతోఁ జీల్చి, కొందఱిని బొమ్ముతోఁ దాఁకి, కొందఱిని దొడల నడుమ నలిపి రూపుమాపెను. మఱికొంద ఱాతని యట్టహాసము విని యచ్చటనే నీల్గిరి. అట్లు మంత్రిపుత్రు లందఱు నచ్చి, నేలఁ గూలఁగా, వారిసైన్యమెల్ల వెఱపుచే దిగులుపడి పదిదిక్కులకుఁ బాఱెను. వారియేనుఁగులు వికృతస్వరములతో నఱచినవి. వారు వములు ద్రెళ్లినవి. విఱిగిన టెక్కెములును, గూండ్లును, గొడుగులును గల రథములచే నాయుద్ధభూమి నిండినదాయె. నెత్తుటివెల్లువలు మార్గములందుఁ బాఱఁజొచ్చెను. అప్పుడు లంకాపురమునఁ బలువిధము లైన యార్తనాదములు పుట్టెను. ఆయోర్వరాని మగఁటిమియు, హెచ్చుబలిమియుఁగల వానరవీరుఁడగు హనుమంతుఁడు తనమీఁదికి రేఁగిన యా మంత్రిపుత్రుల నేడ్వురను బిలుకుమార్చి, వెండియు నితర రాక్షసులతోఁ బోరాడఁగోరి యాద్వారదేశమునే పొందెను.

## 46-వ సర్గము

### రావణుఁడు సేనాధిపతుల నేవురను బంపుట

ఎక్కువబలశాలియగు హనుమంతుఁడు మంత్రిపుత్రుల నేడ్వురనుగూడ సంహరించె నన్నవార్త విన్నవాఁడైన రావణుఁడు లో లోపలఁ గొంత దిగులొంది, చాలసేపు యోజించి, విరూపాక్ష, యూపాక్ష, దుర్ధర, ప్రఘస, భాసకర్ణ లనెడి యేవురు సేనాధిపతులను రావించి, నీతిశాస్త్రము నెఱిఁగినవారును, వాఁడిమగలును, యుద్ధరంగమున వాయువువేగముంబోలు వేగముగలవారును, హనుమంతునిఁబట్టి తెచ్చుటయందుఁ బూనికిగలవారును నైన యాసేనాధిపులంజూచి, "ఓ సేనాధిపతులారా! మీరు పెక్కుగుఱ్ఱములును ఏనుఁగులును తేరులును గొని, విస్తారమయిన కాల్బలఁగమును దోడ్కొనిపోయి యా వానరుని శిక్షింపవలయును. మీ రా వానరునిఁ గదిసినప్పుడు మెలఁకువతో మెలఁగి, దేశకాలములకుఁ దగినపని చేయవలసినది. ఆతని యద్భుతంపుఁ గార్యమును బరికించి చూడఁగా నతఁడు సామాన్యమైన వానరుఁడు గాఁడని తోఁచెడిని. మనవధ నిమిత్తము ఇంద్రునిచే తపోబలమువలన సృజింపఁబడిన యెక్కువబలముగల దగు మహాభూతమై యుండవలెను. మనమందఱము గలిసి యింతకుమున్నెందఱినో నాగ

గంధర్వయక్షదేవాసురమహర్షులను జయించితిమి. కావున వారలే తప్పక మన కేదోయొక హాని చేసియుండవలయును. మీరు జాగ్రత్తతో నుండి యీవానరునిఁ బట్టుకొనవలసినది. మీరును ధైర్యసాహసములు గల యీవానరుని నలక్ష్యము చేయవలదు. తొల్లి వాలిసుగ్రీవులు, బలశాలియగు జాంబవంతుఁడు, సేనాధిపతియగు నీలుఁడు, తక్కుఁగల మైందద్వివిదులు మొదలగు విస్తారపరాక్రమముగలవారలగు పెక్కండ్రు వానరులను జూచితిని. కాని, వారికంత బలపరాక్రమములును, బుద్ధియు, బలిమియుఁ బట్టుదలయు, గొప్ప యాకారమును లేవు. ఇది యెద్దియో యొక్క పెనుభూతము వానరరూపముతో నున్నదని యెంచెదను. మీ రెక్కువ పట్టుదల గలిగి, యీతనిఁ బట్టవలయును. స్వర్గ మర్త్య పాతాళములందు దేవాసురమనుష్యు లనెడి ముల్లోకములవారును యుద్ధరంగమున మీయెదుట నిలువఁజాలరు. అయినను, జయాపజయములు నిక్కములు గావు గావున, యుద్ధమున జయముఁగోరు నృపాలుఁడు పట్టుదలతోఁ దనప్రాణసంరక్షణము చేయవలయును” అని వారి కానతిచ్చెను.

మిగుల శూరులైన యాసేనాధిపతు లేవురును, రాజానుమతి గొని, రథములను, మదించినయేనుఁగులను, వేగముగలగుఱ్ఱములను, బలములనుగొనివాఁడిగ్గైన యస్త్రశస్త్రములనుబట్టి అగ్నివలెఁ దేజరిల్లుచు నతివేగముతోఁదరలి యగ్నిహోత్రునిమాడ్కి వెలుఁగుచుఁ, దన తేజస్సుచేఁ గిరణములుగల సూర్యునిమాడ్కి వెలుఁగువాఁడయి, మిక్కుటమగు నుత్సాహము, పట్టుదలయుఁ గలిగి యెక్కువ తెలివియు, వేగమును, గొప్పదేహమును, శక్తియుఁ గలవాఁడయి ద్వారప్రదేశముననున్న యీవానరునిఁ జూచిరి.

ఆసేనాధిపతు లేవురును హనుమంతునిఁ జూచినవెంటనే నలుదెసల నతనిని ముట్టడించి, పలుతెఱఁగులగు భయంకరములైన యడిదములతో నాహనుమంతునిఁ గొట్టఁబూనిరి. అప్పుడు ఉక్కువియు, వాఁడిమిగలవియు, పచ్చనికొనలుగలవియు, కలువరేకులవన్నె గలవియునైన యైదుబాణములచే శత్రువులకు లొంగనివాఁడగు దుర్ధరుఁడు హనుమంతుని నెత్తిని గొట్టెను. హనుమంతుఁ డా దెబ్బలకుఁ గడు నలిగి, పదిదెసలును మాఱుమ్రోగునట్లు కిలకిలధ్వనిసేయుచుఁ బైకెగురఁగా,

మొనగాఁడగు దుర్ధరుండును రథమునఁగూర్చుండి విల్లెక్కు పెట్టి, కఱకు టమ్ములను గ్రుమ్మరించుచు నాహనుమంతుని నెదురుతాఁకెను. శరత్కాలమున గాలి వర్షించుచుండు మేఘమును జెదరఁ గొట్టునట్లు హనుమంతుఁడును రాక్షసుఁ డేయు నమ్ముల నెల్ల నివారించి, వానిబాణముల తాఁకుళ్లకు నొచ్చినవాఁడై, యుద్ధమునం దెక్కువ పట్టుదల పూని, తనదేహముఁ బెంచెను. అట్లు పెంచి పర్వతమున మెఱుపురాశి పడినట్లుగా, ఆదుర్ధరుని రథమునఁ గడు వేగముతోఁ బడి, యాతనితేరి గుఱ్ఱముల నెనిమిదింటినిఁ బరిమార్చి, తేరియిరుసు విఱిచి మూలఁద్రోసి, యా దుర్ధరుని మర్దింపఁగా, నాతఁడు క్రిందఁబడి ప్రాణములను వదలెను. అట్లు దుర్ధరుఁడు నిహతుఁడగుటఁ జూచి, శత్రువులకు లొంగనివారును, శత్రువులను హింసించువారునైన విరూపాక్ష యూపాక్షు లిరువు రలిగినవారలై, యాకసమునకుఁ గుప్పించి హనుమంతుని రెండుఱొమ్ముకళ్లతో నెదురుఱొమ్మునఁ బొడిచిరి. బలశాలియు, మగఁటిమి నింద్రునిం బోలువాఁడునైన హనుమంతుఁడును, బలశాలురైన యా విరూపాక్ష యూపాక్షులబాణములను బడఁగొట్టి, తాను గ్రిందికిదిగి, యొక్కచెట్టు నూడఁబెఱికి; యారాక్షసుల నిద్దఱను దల పగులఁగొట్టెను. అట్లు వారు ముప్వురు నాహనుమంతునిచేఁ జంపఁబడుటచూచి, బలశాలురగు ప్రఘసభాసకర్ణు లనువారిద్వరును జుట్టుకొనిరి. వారిలోఁ బ్రఘసుఁ డొకవైపున వాఁడియంచుగల పట్టసముతో నాహనుమంతునిఁ గొట్టెను. భాసకర్ణుఁడు మఱొక్కప్రక్కన నాహనుమంతుని శూలముతోఁ బొడిచెను. హనుమంతుఁ డా రాక్షసులచే నట్లు గొట్టఁబడి, సర్వాంగములనుండి కాఱిన నెత్తుటిచే మేను దడియ, బాలసూర్యునిమాడ్కి వెలుఁగుచుఁ గడుఁగినిసి, మృగములు, సర్పములు, వృక్షములునుగల యొకపర్వతశిఖరము నూడఁబెఱికి, దానిని వారియిరువురినెత్తిని వేసి వారిని బరిమార్చెను. అట్లు సేనాధిపతు లేవురును మడిసినతర్వాత, హనుమంతుఁడు గుఱ్ఱములతో గుఱ్ఱములను, ఏనుఁగులతో నేనుఁగులను, బంటులతో బంటులను బరిమార్చి, రథములతో రథములను విఱిచి, దేవేంద్రుఁ డసురులను బడఁగొట్టునట్లు తక్కినసైన్యమును బరిమార్పఁగా, నాయుద్ధభూమియంతయు నాచతురంగబలముల శవముల రాసులు రణభూమియం

దంతటను దారికట్టుపడియుండెను. ఆహనుమంతుఁ డట్లు సేనానాయ కుల నేవురను బీచమడఁచి, వారిబలములను జక్కాడి, మఱల ద్వారము నెక్కి ప్రజానాశము సేయుటకై సంకల్పించిన యమునిమాడ్కి వెలుఁగు చుండెను.

## 47-వ సర్గము

హనుమంతుఁ డక్షకుమారునిఁ జంపుట

రావణుఁడు తనసేనాధిపతు లేవురను బలఁగముతోఁగూడ హను మంతునిచేత మడిసిరన్నవార్త విన్నవాఁడై, తనముందర నున్నట్టి, యుద్ధగర్వితుఁ డయినందున యుద్ధము నెదురుచూచు నక్షయకుమారుని వైపు చూచెను. ప్రతాపవంతుఁడును, బంగారుమయంబయిన వింత ధనుస్సుగలవాఁడునైన యక్షకుమారుఁడు, రావణుఁడు కనుసైగచేతనే తన్ను ప్రోత్సాహపఱుప, యజ్ఞవేదికయందు బ్రాహ్మణోత్తములు మంత్ర పూర్వకముగా వేల్చిన హవిస్సులచేఁ బెంపొందిన యగ్నిహోత్రుని కైవడిఁ బైకెగిరెను. అట్లు రాక్షసవీరుఁడగు అక్షకుమారుఁ డుప్పొంగి, బాలసూర్యునిమాడ్కిఁ బ్రజ్వరిల్లునదియు, అపరంజితోఁ జేసిన గవాక్షములు గలదియు, అతిమాత్రమయినతపముచే సంపాదింపఁ బడినదియు, మేలిమి భూషణములచే నలంకరింపఁబడినదియు, రత్నభూష ణాలంకృతమయిన టెక్కెముతోఁ గూడినదియు, మనోవేగమువంటి వేగముతోఁబోవు చక్కని యెనిమిదిగుఱ్ఱములు పూన్చినదియు, దేవతల కును రాక్షసులకును దిరస్కరింపరానిదియు, అడ్డములేక సంచరించు నదియు, సూర్యునిమాడ్కిఁ దేజరిల్లునదియు, ఆకాశమునఁ బోవునదియు, చక్కఁగా నిర్మింపఁబడినదియు, అమ్ములపొదులును, ఎనిమిదికత్తులుగూడిన పలకయుఁగలదియు, వరుసలుగాఁ దీర్పఁబడిన శక్తులతోను, తోమరముల తోను గూడినదియు, విండ్లు, బాణములు మొదలగు అన్నియుపకరణ ములతోను, వెండిబంగారుమయములగుటచేఁ జంద్రసూర్యులమాడ్కిఁ దేజరిల్లు వాఁగెలుమున్నగువానితోను గూడినదియు, సూర్యునిఁబోలు నదియునైన రథమునెక్కి, గుఱ్ఱములయు, ఏనుఁగులయు, మహారథము లయు రొదలను భూమ్యాకాశములందు నిండించుచు, కవచములు మున్నగునవి దాల్చిన సేనలు కూడరాఁగా, అశోకవనద్వారమున నున్న

సమర్థుఁడైన యాహనుమంతునిఁ దాఁకెను. సింహమువంటి చూపుగల యాయక్షకుమారుఁడు జనసంహారమునకై పూనిన ప్రలయకాలయమునిఁ బోలియున్న యావానరునిఁ జూచి యాశ్చర్యమును తత్తరపాటునుం గలవాఁడై, యాతనిని గౌరవదృష్టితోఁ జూచెను.

ఎక్కువబలిమిగల యారావణపుత్త్రుఁడగు అక్షకుమారుఁడు గొప్పదిట్టరియయిన యావానరునివడిని, శత్త్రువులందుఁ జూపిన మగఁటిమిని తనబలిమినిజూచుకొని, నెమ్మదిపడి, వసంతర్తువునందలి సూర్యుని మాడ్కి వృద్ధినొందెను. యుద్ధమునఁ గదలని యక్షకుమారుఁడు పొగడఁదగిన పరాక్రమముగలవాఁడును, యుద్ధమునఁ బగతురకు లొంగనివాఁడునునైన యాహనుమంతునిఁ జూచి యలుక గదురఁగా నాతనిమీఁద మూఁడు కలికుటమ్ముల నేసెను. హనుమంతుఁ డహంకారియై యలసటను గొనక, శత్త్రువులనోడించుటచే వెల్లడియైన బలిమిగలవాఁడగుటం జేసి, యామూఁడు బాణములను సరకుచేయకుండెను. అంతట నక్షుండు మనమున వేడ్కపూని వింటిని బాణములను గొని, బంగారుమయములైన వంకీలు, భుజకీర్తులు, కుండలములును వెలుఁగుచుండ నొర్వరాని మగఁటిమిగలవాఁడై యావానరుం దాఁకెను. అక్షకుమారహనుమంతులకు నిరువురికిని దేవాసురులకు సైతము వింతగొల్పునట్టి సాటిలేని పోరు జరిగెను.

హనుమంతునికిని అక్షకుమారునికిని జరిగిన పోరు చూచి భూమి మ్రోఁగెను. సూర్యుఁ డెండగాయఁ డయ్యెను. గాలి వీవదయ్యె. కొండ లదరెను. ఆకసముమ్రోఁగెను. సముద్రము గలఁగెను. గురి చూచుట, బాణముల జోడించుట, వానిని విడుచుట యీవిషయములను జక్కఁగా నెఱిఁగినట్టి మొనగాఁడగు నక్షకుమారుఁడు చక్కని కొనలుగలిగి, ఱెక్కలతోఁగూడి, బంగారుములుకులుగలవై విషముతోఁ గూడిన పాములంబోలియున్న మూఁడు వాఁడియమ్ములను బల్మిఁ హనుమంతునితలమీఁదఁ బడనేసెను.

ఆ అక్షకుమారుఁ డేసినబాణములు హనుమంతునితలఁ దాఁకి యచ్చటినుండి నెత్తురు గాఱి కన్నులందు జాఱిపడఁగా నాహనుమంతుఁడు గన్నులు గిరగిరఁద్రిప్పుచు నప్పుడే యుదయించిన సూర్యబింబము మాడ్కియు, బాణములు గ్రుచ్చుకొనుటచేఁ గిరణపంక్తులతోఁగూడిన

సూర్యునిపగిదియుఁ గానఁబడెను. అట్టిసుగ్రీవునిమంత్రులలో మేటి యగు హనుమంతుఁడు, వింతవింతలైన యాయుధములను జేతఁ బట్టి, చిత్రమైన వింటిని దాల్చివచ్చిన రాక్షసేంద్రపుత్రుఁడైన యక్షకుమారునిఁ జూచి, గగ్గురుపాటు పుట్ట యుద్ధమునకుఁ బూనినవాఁడై గొప్ప బొబ్బరింత పెట్టెను. ఆహనుమంతుఁ డట్లలచి, మందరపర్వతపుఁ గొనయం దున్న కిరణములుగల సూర్యునిమాడ్కి వెలుఁగుచు,నాగ్రహ ముప్పొంగఁ దననేత్రాగ్నిజ్వాలలచే నాయక్షకుమారుని, అతనిబల వాహనములతో సైతము మండునట్లుఁ జూచుచుఁ జూచెను.

అంతట బాణములఁ బ్రయోగించువింత విల్లుదాల్చిన యక్షకుమారుఁ డనెడి వానకాలపుమబ్బు, మేఘము పర్వతోత్తమముపై వర్షించునట్లు, హనుమంతుఁడనెడి పర్వతముపై బాణములనెడి వర్షముం గురిపించెను. అంత మేఘగర్జనంబోలు కంఠనాదముగల యాహనుమంతుఁడు యుద్ధరంగమున హెచ్చుచుండు నాయక్షకుమారునివీర్యమును, తేజమును, బలిమిని, దిట్టతనమును జూచి, తనకు సాటియగువాఁడు యుద్ధమునకు వచ్చెఁగదా యని యుప్పొంగి గట్టిగా నఱచెను. అక్షకుమారుఁడు పసితనమువలన యుద్ధమునందు పరాక్రమ మడర, కోపము విజృంభింప, నేత్రములు గోపముచే నెఱ్ఱనై వెలుఁగుచుండ గడ్డితోఁ గప్పిన గొప్పనూతికడకు గజం బేగుదెంచున ట్లా యుద్ధమున నెదురులేని హనుమంతునిఁ గదిసెను. అట్లతఁడు మారుతిం గదిసి యతనిమీఁద లెక్కలేని బాణములఁ బ్రయోగింపఁగా, మారుతియు మేఘగర్జనముఁ బోలు నొక్క హుంకారము చేసి, పగతురు వెఱచునట్లు చేతులు కాళ్లను జాడించి నిమిషములో నింగి కెగసెను. రథమునెక్కిన వాఁడును, రథికులలో మేటియు, వెలుఁగుగలవాఁడును, రాక్షసశ్రేష్ఠుఁడును బలవంతుఁడునునైన యక్షకుమారుఁడు మేఘుఁడు పర్వతము మీఁద జాలవాన గురిపించునట్లు శత్రువుపై బాణముల వర్షించుచు నింగి కెగిరిన కపీంద్రుని వెంబడించి తాను నెగిరెను. మనోవేగుఁడును, యుద్ధమునఁ బగతురకు నోర్వరాని విక్రమము గలవాఁడునైన యాహనుమంతుఁ డక్షకుమారుఁ డేయుబాణములు దేహమున గ్రుచ్చుకొనకుండునట్లు నేర్పుతోఁ దప్పించుకొనుచు, బాణములనడుమ గాలివలెఁ జొచ్చుచు, శరములబారికిఁ దప్పించుకొనుచు నాకాశమార్గమునఁ

దిరుగుచుండెను. అట్లు వాయుపుత్త్రుఁడు దిరుగుచు, వింటినిఁ జేతఁబూని, యుద్ధమునందుఁ బట్టుదలగలిగి, పలుతెఱఁగులైన బాణములచే నింగిని గప్పుచున్న యాయక్షకుమారుని గౌరవముతోఁ జూచి, మనమునఁ జింత నొందెను.

గొప్పధైర్యశాలియయిన అక్షకుమారుఁడు ప్రయోగించిన బాణములచే నాహనుమంతునిఱొమ్ము వ్రయ్యలుకాఁగా, పనులతెఱఁగు లకలరూపు నెఱిఁగిన నిడుపుచేతులవాఁడయిన యాకపీంద్రుఁడు యుద్ధరంగమున శత్త్రువులను లోఁబఱచుకొనువాఁడయిన యాయక్షకుమారుని విషయమై "బాలసూర్యునివలెఁ దేజరిల్లువాఁడు, మహాబలముగల వాఁడునైన యీయక్షకుమారుఁడు పిన్నవాఁడయ్యు, పెద్దవానివలెనె యుద్ధమున గొప్పపని చేయుచున్నాఁడు. ఇతఁడు యుద్ధసంబంధికార్యములన్నిటిచేఁ బ్రకాశించువాఁడు గావున నితనిఁ జంపుటకు మనసురాకయున్నది. ఈతఁడు గొప్పధీరుఁడు; గొప్పవీరుఁడు; జాగ్రత్తగలవాఁడు; యుద్ధమున గొప్పకష్టములను సైత మోర్చువాఁడు. యుద్ధకార్యములందలి యెక్కువ నేర్పుచేత నీతనిని మునులును, యక్షపన్నగులును సదా పొగడుచుందురు. ఇతనికిఁ బూనికయు మగఁటిమియు హెచ్చుటచే నితఁడు నాయెదుటనే నిలబడి నన్ను జూచుచున్నాఁడు. వడిగాఁబోవునట్టి యీతనిపరాక్రమమునకు దేవాసురులు గూడ మనసునఁ గడగడ వణఁకుదురు. ఇతనిశౌర్య మప్పటప్పటికి హెచ్చుచున్నది. కావున నితని నిప్పుడె వధించుట యుక్తమని తోఁచుచున్నది. మండుచున్ననిప్పును పేక్షించుట తగదుగదా" అని యోచించి తనయెదిరియొక్క బలిమి పెంపును జూచి, తాను జేయవలసిన పనులరీతినిగూర్చి యాలోచించుచు, వడినిఁబూని, ఆయక్షకుమారుని వధింపఁదలఁచెను.

శూరుఁడయిన వాయునందనుఁడగు హనుమంతుఁ డట్లు తలఁచి, యాకాశమునఁ దిరుగుచు, వలపటికి దాపటికి నీడ్చినను రథముయొక్క బరువుమోయఁగలవియు, మెలఁకువతోను, గడువేగముతోనుఁ బోవునవియునైన యాయక్షకుమారునితేరిగుఱ్ఱముల నెనిమిదింటి నఱచేతితో నప్పళించి చంపెను. ఇట్లు హనుమంతుఁడు అక్షకుమారుని తేజీగుఱ్ఱములను గూల్చి, తేరియిరుసును విఱిచి, కాడి యెగురఁదన్ని బీభత్సచేయఁగా, యాకాశమునుండి క్రిందఁబడెను. మహారథుఁడయిన యక్ష

కుమారుఁ డా రథమును విడిచి, వింటిని వాలు జేతఁదీసికొని యాకాశ మున కెగిరెను. అప్పుడయ్యక్షకుమారుఁ డెక్కువతపోబలముచేఁ దన దేహమును నేల విడిచి స్వర్గమునకుఁ బోవుచున్న ఋషివలెఁ గనఁబడెను. వెంటనే తండ్రినిబోలు పరాక్రమముగల హనుమంతుఁడు గరుడుని యొక్కయు వాయువుయొక్కయు, సిద్ధులయొక్కయు సంచారముఁగల యాకాశమున సంచరించుచున్న యాయక్షకుమారుని వెంబడించి యతనికాళ్లను గట్టిగాఁ బట్టుకొనెను. గరుడుఁడు సర్పమునుబోలె తండ్రివలె మొనగాఁడయిన హనుమంతుఁడు అక్షకుమారుని పాదముల గట్టిగాఁ బట్టుకొని పలుమాఱు గిరగిరఁ ద్రిప్పి యాకాశమునుండి యుద్ధ భూమియందుఁ గూలునట్లు వేగముతో విసరివేసెను. అక్షకుమారుఁ డట్లు హనుమంతుఁడు గూలనేయఁ గ్రిందఁబడి, కాలునేతులు, నడుము మెడయు విఱుగఁగా, ఎముకలు పొడియయి, కన్నులు చితుకఁగా, కీళ్లువిఱిగి, ప్రక్కయెముకలు కుదుళ్లుతొలఁగి, నోట నెత్తురు గ్రక్కెను. హను మంతుఁ డంతటితో విడువక క్రిందఁబడిన యతనిని గాళ్లతోఁ ద్రొక్కి చంపి, రాక్షసాధిపుఁడయిన రావణుని కెక్కువ భీతిని గలిగించెను. అట్లు హనుమంతునిమూలమున నక్షకుమారుఁడు మడియఁగా, ఇంద్రాది దేవవతలును, పన్నగయక్షులును, జ్యోతిశ్చక్రమునందుఁ దిరిగెడి తపోధనులయిన ఋషులును దుష్టాత్ముఁ డయిన యక్షకుమారునిఁ జంపి నందు కాశ్చర్యపడినవారలై, యా హనుమంతునిఁ బలుతెఱఁగులఁ గొనియాడిరి. హనుమంతుఁ డట్లు నెత్తుటివలె నెఱ్ఱనైన నేత్రములు గలిగినవాఁడును, జయంతునిమాడ్కి బ్రకాశించువాఁడునైన అక్షకుమా రునిఁ బరిమార్చి, జననాశమునకై నడుముకట్టినయమునివలెఁ గ్రోధముచే మండిపడుచు, మఱల నాతోరణమునకే పోయిచేరెను.

## 48-వ సర్గము

### రావణుఁ డింద్రజిత్తును బంపుట

తరువాత మహాధీరుఁడగు రావణుఁడు హనుమంతునిచే నక్ష కుమారుఁడు చంపఁబడె నన్నవార్త వినినను, ధైర్యవంతుఁ డగుటచేఁ బుత్రశోకము నణచుకొని మనస్సున నెమ్మదిపూని పరాక్రమమున దేవేంద్రునిబోలు కోపవంతుఁడగు నింద్రజిత్తును బంపఁగోరి, "ఓరి

నాయనా! నీవు అస్త్రముల నెఱిఁగినవాఁడవు. శస్త్రవేత్తలలో శ్రేష్ఠుఁడవు; సురాసురులకైనను శోకము గలిగించువాఁడవు; ఇంద్రాది దేవతల యెడ సామర్థ్యమును జూపినవాఁడవు; బ్రహ్మదేవుని యనుగ్రహమునఁజేసి బ్రహ్మాస్త్రము బడసినవాఁడవు. ఇంద్రాది దేవతలైనను అసురులైనను నీయస్త్రముల కోర్చి యుద్ధరంగమున నిల్చి యుద్ధము చేయఁజాలరైరి. యుద్ధమునందు నీతోఁ బోరుసేసి యాపద నొందనివాఁ డొక్కఁడును లేఁడు. నీవొక్కఁడవే బాహుబలము గలవాఁడవు, తపోమహిమచే నొప్పిన వాఁడవు. దేశకాలవిభాగముల నెఱిఁగినవాఁడవు. బుద్ధిమంతులలో మేటివి. యుద్ధములందు నీకు పరాక్రమముచే సాధింపరాని దొక్కటియు లేదు. తెలివితో యోచించి చూచి నీకుఁ జేయ నలవి కాని పనియొక్కటియు లేదు. నీయస్త్రబలమును దేహబలమును నెఱుఁగనివాఁ డీముల్లోకములందును లేఁడు. నీబలపరాక్రమములును, అస్త్రబలమును నాబలపరాక్రమమును, అస్త్రబలమును బోలినవి. యుద్ధములందుఁ దప్పక జయమునొందునట్టి నీవు యుద్ధమునకుఁ బోతివేని, అప్పుడు నామనస్సు విచారము నొందదు. కింకరు లందఱు మడిసిరి. జంబుమాలి నీల్గెను. మంత్రిపుత్త్రులును, శూరులైన యయిదుగురు సేనానాయకులును జచ్చిరి. గుఱ్ఱము లేనుఁగులు రథములు గల నిండుబలములును మడిసెను. నీయనుఁగుఁదమ్ముఁడగు నక్షకుమారుఁడును నిహతుఁడయ్యెను. ఓశత్రుసంహారకా! నాకు నీబలిమియం దెంత నమ్మక మున్నదో అంత నమ్మకము వారియందు లేనేలేదు. కింకరులు మొదలగువారి నందఱిని బరిమార్చిన హనుమంతుని దేహబల బుద్ధిబలములను, లోపలి చేవను, మగఁటిమిని జూచి, స్వబలమును బరికించి, యాత్మబలమునకుఁ దగిన యుత్సాహము పూని శత్రువును బరిమార్పుము. శత్రుసంహారివైన నీ వా హనుమంతుని చెరువకుఁ బోయినప్పుడు మనసేనలకు నాశము కలుగక మునుపే, స్వబలమును పరబలమును జక్కఁగా గమనించి, ఓ యస్త్రవేత్తలలో శ్రేష్ఠుఁడా! శత్రువును జంపఁబూనుము.

ఈహనుమంతుఁడు సేనలను గుంపుగుంపుగా నొక్కపెట్టునఁ గొట్టువాఁడు కాఁబట్టి, సేనలు నిన్నుఁగాపాడఁజాలవు గనుక సేనలఁ దోడ్కొని పోకుము. ఇతఁడు వాయువేగమును మించిన వేగముగల వాఁడు గనుక నితనిమీఁదికి నిస్సారమైన వజ్రాయుధమును గొని

పోకుము. ఇతఁడు నిప్పువలె మండువాఁడు గనుక నితనిని బిడికిళ్లతో గ్రుద్దుటకును వీలుకాదు. కావున నీవిషయమును జక్కఁగా యోచించి, నీపని నెఱవేఱుటకై, నెమ్మదితోఁ గూడినవాఁడవై, దేవతాసంబంధములగు నస్త్రములను స్మరించుచుఁ బోయి, మొఱవ పోకుండునట్లుగాఁ గార్యములను జేయఁబూనుము. ఓరి నాయనా! నీవు పసివాఁడవు గావున నిన్నుఁ బంపుట యనునట్టి తలం పుచితముగాక యుండవచ్చును. అయినను, ఇల్లు తనవారుండఁగా ముఖ్యుఁడు పోవుట రాజనీతిధర్మములకును, వానినాచరించు క్షత్రియులకును యుక్తముగాదు గనుక నిన్నుఁ బంపుట యుక్తము. ఓ శత్రువుల నణఁచువాఁడా! సకలాస్త్రప్రయోగమునను నీకు సామర్థ్య మున్నది. కావున నీవు తప్పక యుద్ధము చేయవలయును. యుద్ధమున గెల్పును గోరవలయును" అని రావణుఁ డింద్రజిత్తును బురికొల్పెను.

దేవతలతో సాటియగు మహిమగలవాఁడును, ధీరస్వభావము గలవాఁడును, బుద్ధిమంతుఁడును, శూరుఁడును నైన యా యింద్రజిత్తు యుద్ధమునకుఁ బోవుటకై తండ్రికిఁ బ్రదక్షిణ మాచరించి, తనబంధుమిత్రులగు రాక్షసులు మర్యాదలు చేయుచుండ, యుద్ధమునకై గర్వించినవాఁడగుటచే వేడ్కపూనినవాఁడై, యుద్ధమునకు తరలెను. విలుకాండ్రలో గొప్పవాఁడు, శస్త్రములయు, అస్త్రములయు ప్రయోగోపసంహారముల నెఱిఁగినవారిలో మేటియునైనవాఁడును, తామర రేకులంబోలు కన్నులుగలవాఁడును నైన యింద్రుని బురుడించునట్టి యింద్రజిత్తట్లు తరలి, పర్వకాలములందలి కడలివలె నుప్పొంగి యిలు వెడలి, గరుడునిఁబోలు మగటిమిగలిగి తెల్లనివాఁడికోఱలచే నొప్పిన నాలుగు సింహములు పూన్చినదియు, అన్నియుపకరణములతోఁ గూడినదియు, నడ్డులేకుండఁ బోవునదియునైన యరద మెక్కి యా హనుమంతుఁ డున్న వైపునకు వేగముతో వెడలిపోయెను. వానరులలో శూరుఁడగు హనుమంతుఁ డా యింద్రజిత్తు రథధ్వనిని, వింటినారి చప్పుడును విని, తనకు సాటియగు వీరుఁడు వచ్చుచున్నాఁడని కడు వేడ్కతో నుప్పొంగుచుండగా, నింతలోపల యుద్ధవీరుఁడైన యింద్రజిత్తు కడు గొప్ప వింటిని, కఱకుటమ్ములను గొని యా హనుమంతుని మీఁదికిఁ గవిసెను. యుద్ధమునందలి వేడ్కతో బాణములు చేతఁబూని

యింద్రజిత్తు పోరునకు రాఁగా, నప్పుడు దిక్కులెల్ల మసకగ్రమ్మినట్లుండెను. భయంకరమృగములు మాఱుగొంతులతోఁ గూసెను. పక్షులన్నియు నెక్కువ మక్కువచేత చదల గుంపుగూడి యఱచినవి. ఆకాశమునఁ దిరుగు నాగయక్షులును, నక్షత్రమండలనివాసులగు మహర్షులును ఇంద్రజిత్తు హనుమంతుల యుద్ధచాతుర్యమునుఁ జూడవచ్చిరి. ఉత్సాహవంతుఁడైన హనుమంతుఁడు రథముమీఁదఁ గూర్చుండి వేగముతో వచ్చుచున్న యింద్రజిత్తును జూచి, పెడబొబ్బ పెట్టెను. ఇంద్రజిత్తన్ననో దివ్యరథారూఢుఁడై యాశ్చర్యము గలిగించెడి ధనుస్సును దాల్చి నారిమీటెను. ఆవింటినారిమ్రోఁత మేఘగర్జనసదృశముగా వినిపించెను. అప్పుడు మిగుల హెచ్చువేగమును, బలమును గలవారును, సమరమునం దొండొరులకు వెఱవనివారునునైన యాహనుమదింద్రజిత్తు లిద్దఱు మచ్చరముపూని దేవేంద్రాసురేంద్రులుంబోలె నొండొరులను డాకి యుద్ధముచేయఁబూనిరి. అట్లు వారు యుద్ధము చేయుచుండఁగా హనుమంతుఁడు మహారథుఁడును, శూరుఁడును, మేటి విలుకాఁడును, యుద్ధమునం దాఱితేఱినవాఁడునైన యా యింద్రజిత్తు ప్రయోగించిన బాణములను బడఁగొట్టి, చూచుట కలవికాని వాయుమార్గమునఁ దిరుగుచుండెను. అంతట పగతురమొనగాండ్రను జంపఁగల యింద్రజిత్తు వాఁడియైన నిడుదకొనలుగలవి, చక్కని ఱెక్కలుగట్టినవియు, బంగారపు వింత ములుకులుగలవియు, ముందుకు చక్కగా వంగినవియు, వజ్రాయుధపు తాఁకుడుతో సరియగు తాఁకుడుగలిగినవియు నైన బాణములను హనుమంతునిమీఁదఁ బ్రయోగించెను. ఇంద్రజిత్తుయొక్క రథచక్రముల చప్పుడును, భేరీమృదంగాది వాద్యముల మ్రోఁతలను, ధనుష్టంకారమును విని, మఱలఁ బైకెగిరి, ఆతఁడేయు బాణములగుఱి తప్పునట్లు, బాణములనడుమఁ దిరుగుచు, ఉత్సాహవంతుఁడును, యుద్ధమున నేర్పరియునైన హనుమంతుఁడు ఇంద్రజిత్తేయుబాణముల కెదుటఁ గనఁబడి చేతులు చాపుచు, మఱలఁ బైకెగురుచునుండెను. ఇవ్విధముగా నిద్దఱును జనులందఱి కాశ్చర్యకరమైన యుద్ధము గావించిరి. హనుమంతునియెడ నింద్రజిత్తునకు సందు దొరకదయ్యెను. అట్లే యింద్రజిత్తునెడ హనుమంతునికిని సందు చిక్కదయ్యె. దేవతలతోఁ సాటియగు మగఁటిమిగల యామారుతాత్మజ

రావణాత్మజు లిద్దఱు నొండొరులకు వెనుదీయక పోరుసేయుచు నోర్వ నలవికానివారై యుండిరి.

అప్పుడు తానుచూచికొట్టిన గుఱి తప్పుచుండఁగా, తాను బ్రయోగించిన బాణములు వ్యర్థములుకాఁగా, బహుజాగ్రత్తతో గుఱి చూచి, యేయునట్టి కడుధీరుఁడగు నింద్రజిత్తు వానరులలో మేటియగు హనుమంతునియెడఁ దనబాణములు వ్యర్థములగుటచే నతఁడు మడి యింప నలవికాకుండుట చూచి, యతనింజంపుటకై తగినయాలోచన కొంతతడ వాలోచించి, తానస్త్రవేత్తలలో మేటి గనుక, తనప్రతా పము వెలుఁగ, మగటిమి మెఱయ బ్రహ్మాస్త్రము వింట సంధించి యా హనుమంతునిమీఁదఁ బ్రయోగించి యాతనిం గట్టివేసెను:

హనుమంతుఁడు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునకుఁ గట్టుపడినవాఁడై, చెయువులుదక్కి, క్రిందఁబడి, తాను బ్రహ్మాస్త్రమునకుఁ గట్టువడెనని యెఱిఁగి, బ్రహ్మదేవుని వరప్రభావమువలనఁ గించిత్తేనియు నొప్పిలేనివాఁడై, తనకు బ్రహ్మయొసంగిన వరముచేఁ దనకా యస్త్ర బంధము ముహూర్తమాత్రమే యని తలఁచి యివ్విధమునఁ జింతించెను:

"ఈ యింద్రజిత్తు బ్రహ్మాస్త్రమునుండి విడిపించుకొనుటకు నాకు శక్తిలేదని తలఁచి యీ యస్త్రముచే నన్నుఁ గట్టినాఁడు. నేనును బ్రహ్మ దేవునియాజ్ఞ ననుసరింప వలయును. నన్నస్త్రముచే నితఁడు బంధించి నను, నా కేమీ భీతిలేదు. నన్ను సదా బ్రహ్మయు, దేవేంద్రుఁడును, వాయువును గాపాడు చుండుదురు. ఈ రక్కసులు నన్నుఁ బట్టుకొనుట లోను నొక్కగుణ మున్నది. రాక్షసులు నన్ను రావణునిముందున కీడ్చుకొని పోవుదురు. దానివలన నాకు రాక్షసేంద్రునితో సంవాదము గలుగును కావున నన్ను వీరు పట్టుకొననీ. అదియుఁ మంచిదే" అని శత్రువీరుల నడఁగించువాఁడును, పరికించి పనిచేయువాఁడును నైన యా వాయువునందనుఁడు చెయువులు మాని, యాయాశత్రువీరులు దాపునకువచ్చి మిక్కిలి బెదరించుచుండఁ బెద్దయుఱ పఱచెను.

అంత నారాక్షసు లా యస్త్రబద్ధుఁడై చెయువులుమానిన హను మంతుని ముప్పిరిపేనిన నారత్రాళ్లతోను చెట్టుపట్టలతోను గట్టిరి. అట్లు వారు కట్టుచున్నను, తనకు రావణునితో సంభాషింప వీలుగలిగెనను గడాయను నాతురతవలన శత్రువీరులు బిగించికట్టునట్టి కట్టును, వారు

చేయు నవమానము నోర్చియుండెను. అస్త్రముతోఁగట్టినకట్టు వేఱొక కట్టును సహింపదు గనుక, రాక్షసు లట్లుకట్టిన గోఁగునారపగ్గములకట్టుటచే హనుమానుఁడు బ్రహ్మాస్త్రమునుండి విముక్తుఁ డయ్యెను. అంత శూరుఁడయిన యింద్రజిత్తు రాక్షసులచే నారపగ్గములతోఁ గట్టఁబడిన యాహనుమంతునిఁజూచి, అస్త్రపుఁగట్టు మఱియొకకట్టు నోర్వదు గనుక, యాహనుమంతుఁడు బ్రహ్మాస్త్రముచే విడువఁబడినాఁడని తెలిసికొని, "ఓ రాక్షసులారా! మన మెంత తెలివితక్కువ పనినిఁజేసితిమి. రాక్షసులు మంత్రగతిం గూర్చి యోచింపరైరి. ఒక అస్త్రము కొట్టువడినయనంతరము, మఱల నింకొకయస్త్రము పాఱదు. ఇది తెలియక యందఱము మోసపోయితిమి" అని తనతోడి రాక్షసులతోఁ జెప్పెను. అప్పుడు హనుమంతుఁ డస్త్రమునుండి విముక్తుఁడయ్యు నొడలు తెలియనివానివలెఁ బడియుండెను. అప్పుడు క్రూరరాక్షసులు త్రాళ్లతో నతనిని జక్కఁగా బిగించికట్టి, కొయ్యలతోఁగొట్టుచుఁ బిడికిళ్లతోఁ బొడుచుచు బరబర యీడ్చుకొనిపోయి యారాక్షసేంద్రుఁడగు రావణుని నగరునకుఁ జేర్చిరి. అంత నింద్రజిత్తు హనుమంతుఁ డస్త్రవిముక్తుఁడై నారపగ్గములతో బిగింపఁబడియున్నాఁడనియెఱిఁగి, బలవంతుఁడైన యాహనుమంతుని మదించిన యేనుఁగుంబోలినవానిని మంత్రిసమేతుఁడై కూర్చుండియున్న యారావణునికిఁ జూపి, మహారాజా! ఇదిగో ఆదుష్టాత్ముఁడని తెలిపెను. అచ్చట నప్పుడున్న రాక్షసులందఱు "నితఁ డెవ్వఁడు? ఎవ్వని కొడుకు? ఎచ్చటనుండి వచ్చినవాఁడు? ఇచ్చట వీని కేమిపని? వీఁ డెవని బంటు?" అనియు, మఱికొందఱు "ఇతనిఁజంపుఁడు; కాల్పుఁడు; తినుఁడు." అనియుఁ గడునాగ్రహముతోఁ బలికిరి.

వా రట్లు మాటాడుచుండఁగా ఆమహాధైర్యశాలియగు హనుమంతుఁడు వెంటనే యామార్గముదాఁటి, రాక్షసేంద్రునియడుగుల సమీపమునఁ గూర్చుండి యున్న బహుదినములనుండి కొల్వుకొల్చునట్టివారలైన రాక్షసాధిపులను, రత్నములచే నలంకరింపఁబడిన దగు గృహమును జూచెను. ఎక్కువ వెలుఁగుగల యారావణుఁడు వెఱపుగలిగించు రూపు గలిగి, రాక్షసులచే నిటటు లాగఁబడుచుండు హనుమంతునిఁ జూచెను. వెలుఁగును బలిమియుఁగలిగి, సూర్యునిమాడ్కిఁ దేజరిల్లుచున్న రావణాసురుని హనుమంతుఁడును జూచెను. అంత

రావణుఁడు కోపముచేఁ గన్నులందుఁ గెంజాయ గదుర నాహను మంతునిఁ జూచి, చేరువఁ గూర్చుండియున్న గొప్పమంత్రులతో "ఇతఁ డెవ్వఁడో కనుఁగొనుఁడీ" అని యానతి యొసఁగెను.

## 49-వ సర్గము

### హనుమంతుఁడు రావణుని వర్ణించుట

అంత శత్రుభయంకరమైన పరాక్రమము గలవాఁడగు హనుమంతుఁడు యుద్ధమునకై రావణుఁడు రావలెనని తాను బ్రయత్నించియు రావణుఁడు నీతినెఱిఁగినవాఁడు గనుక సింహాసనమునందుండియే యింద్రజిత్తుమూలమునఁ దన్ను బంధింపఁజేసి, యక్కడికి రప్పించెనుగదా యని యాశ్చర్యపడినవాఁడై, రావణుఁడు తన్ను రప్పించెనని కినుకచేఁ గన్నులెఱ్ఱచేసి, యెదుటనున్న రావణునిఁ జూచెను.

ఆరావణుఁడు ధరించిన విలువగలదగు ముత్యాలసరములు గట్టిన కిరీటము సూర్యునివలెఁ దేజరిల్లుచుండెను. ఆతనియొడలియందలి భూషణములు వజ్రఖచితములును వెలలేని మణులు చెక్కినవియు, మనసుచే నిర్మింపఁబడినవో యనునట్లు తోఁపఁజేయునవియునై యుండెను. విలువగల పట్టుపచ్చడము నతఁడు గట్టెను. ఎఱ్ఱనిగంధమును, విచిత్రములైన పెక్కువిధములైన సువాసన ద్రవ్యములను బూసికొనెను. ఆతనిపదితలలును విశాలములును, చూడఁదగినవియునై, యెఱ్ఱనికన్నులును, భయంకరమైన చూపులునుగలిగి, వెలుఁగుచుండెడి వాఁడికోఱలును, వ్రేలాడెడి పెదవులును గలిగినవై యుండెను. అట్లు పదితలలతోఁ గూడిన రావణుఁడు నానాదుష్టమృగములతోఁ గూడిన శిఖరములుగల మందర పర్వతమువాడ్కిఁ దేజరిల్లుచుండెను. ఆరావణుఁడు కాటుకప్రోవువలె నల్లనివాఁడును, ఱొమ్మునందుఁ బ్రకాశించు ముత్యాలహారమును పూర్ణచంద్రునిఁబోలు మోమునుగలవాఁడునగుటంజేసి, కొంగలతోఁగూడిన మేఘమువాడ్కి వెలుఁగుచుండెను. బుజకీర్తులు దాల్చినవాఁడును, చక్కనివాసనగల గంధము నలఁదుకొన్నవాఁడును నైనందున నాతని భుజము లైదుతలలపాములవాడ్కి వెలుఁగుచుండెను. బాగుగా నలంకరించుకొన్న జవరాండ్రు వింజామరలు చేతఁబట్టుకొని విసరుచుండఁగా, మంత్రాలోచన బాగుగాఁ జేయఁగలవారును బలముచే మదించినవారు

నైన దుర్ధరుఁడు, ప్రహస్తుఁడు, మహాపార్శ్వుఁడు, నికుంభుఁడునను నలువురు మంత్రులును, ఇంకననేకులు బుద్ధికుశలతగలవారలగు మంత్రులును చుట్టు గూర్చుండియుండఁగా, రత్నములుచెక్కినదియు, మేటి పటికపు పఱచినదియునైన చిత్రమగు గొప్పసింహాసనమునఁ గూర్చుండి, నాలుగు సముద్రములచేఁ జుట్టఁబడిన మధ్యలోకముమాడ్కియు, సకల దేవతలచేఁ జుట్టఁబడిన దేవేంద్రునిమాడ్కియు మేరుపర్వతమున నీటితోఁగూడిన మబ్బుచందమునను వెలుఁగుచు నెక్కువ వెలుతురుతోఁ గూడి యారాక్షసవీరుఁడు సొంపుమీఱియుండెను. అప్పుడు వానర వీరుఁడు రాక్షసులు తన్ను బాధపెట్టుచున్నను, ఆబాధను గమనింపక, సింహాసనమునఁ బ్రకాశించుచున్న యారాక్షసరాజుం జూచి యెక్కువ యాశ్చర్యమునొంది యాతని కాంతికి మైమఱచినవాఁడై, యివ్విధమునఁ జింతించెను.

“ఆహా! ఏమి ఈరావణునిరూపము! అహా! యేమి యితని ధైర్యము! యేమియితనిబలము! ఆహా యేమి యితని ప్రకాశము! ఆహా! యేమి యితని సర్వలక్షణముతోడికూడిక! ఈతనికడ నన్యాయము మిక్కిలి హెచ్చుగా నుండదేని, ఇతఁ డింద్రాది దేవతలను, స్వర్గలోకమును బరిపాలింపఁ గలవాఁడై యుండియుండును. ఇతఁ డొనరించు జననిందితములగు క్రూరపుఁబనులచేతనే యితనిని జూచిన మాత్రమున దేవదానవమనుష్యులు భయంపడుదురు. ఇతఁ డలిగెనేని, ప్రపంచమెల్ల నొక్కటై జలమయము గావింపఁగలఁడు” అని యీ మొదలగు పలు విధములైన యోచనల నాహనుమంతుఁ డొనరించిన వాఁడయ్యెను.

## 50-వ సర్గము

### రావణుఁడు హనుమంతుని నడుగుట

నిడుదచేతులవాఁడయిన లోకరావణుఁడగు (జనుల నేడ్పించు వాఁడయిన) రావణుఁడు తనయెదురనున్న హనుమంతునిఁజూచి, మోమునఁ గోపము గదురఁ బ్రతాపముతోఁగూడిన యా హనుమంతునిం గూర్చి, “తొల్లి నేను కైలాస పర్వతమెత్తినప్పుడు ఎవఁడు నాకు శాపమొసగెనో, ఆభగవంతుఁడగు నందికేశ్వరుఁడు ప్రత్యక్షముగా

నీకోతిరూపముదాల్చి వచ్చెనో, లేక బాణాసురుఁడో" యని మనసున సందేహపడి యాలోచించెను.

అట్లాలోచించి యారాక్షసాధిపుఁడు కోపముచేఁ గన్నులెఱ్ఱన నేసి, మంత్రులలోఁ బెద్దయైన ప్రహస్తునిఁజూచి, "ఓమంత్రిశ్రేష్ఠా! యీ దురాత్ముఁ డెవ్వఁడో, ఎక్కడనుండి వచ్చినవాఁడో, ఎందుకు వచ్చినవాఁడో, రాక్షసకాంతలను బెదరించుటకును, అశోకవనము విఱుచుటకు నేమికారణమో, ఒరులకుఁ జొఱరాని మాపట్టణములోపలఁ బ్రవేశించుటచే నేమి ప్రయోజనమో, పోనీ, యుద్ధముచేయుట యెందుకో యడిగి తెలిసికొనుము" అని సమయోచితముగను, అర్థగౌరవము గలిగియుండునట్లును గొప్పగాను ఆనతిచ్చెను.

ప్రహస్తుఁడు రావణుని యానతిని శిరసావహించి, "ఓవానరా! ఊఱటపడుము. నీకు మేలగు. భయము వలదు. ఇంద్రునికడనుండివచ్చిన దూతవా? అట్లుండెనేని, నీవు భయపడక నిజమును చెప్పుము. లేక యమవరుణ కుబేరుల కడనుండి వచ్చిన దూతవా? ఈవేగురూపముఁ దాల్చి మాపట్టణముఁ బ్రవేశించితివా? గెల్వ గోరువాఁడైన విష్ణువు నిన్ను దూతనుగాఁ బంపెనా? నీరూపము వానరరూపముగాని, నీతేజస్సు వానరతేజస్సుగాదు. వాస్తవముగా నంతయుఁ జెప్పుము. నిన్నుఁ జంపక వదలెదము. లేక యసత్యము పలికితివేని, నీప్రాణములు నీవిగావు. లేక నీవెందు కిచ్చటికి వచ్చినాఁడవో ఆ సంగతి చెప్పుము" అని యడిగెను.

ఇట్లు ప్రహస్తుఁ డడుగఁగా వానరయూథనాథుఁడగు హనుమంతుఁడు తాను రాక్షసులకు ఱేఁడయిన రావణునిమంత్రినిజూచి, "ఓరాక్షసేంద్రా! ఇంద్ర యమవరుణులదూతనుగాను. కుబేరునితోఁ బరిచయములేదు. నన్ను విష్ణువుపంపలేదు. నేను మాఱురూపముదాల్పలేదు. నాది యీజాతియే. నేను వానరరూపముతోనే యిచ్చటికి వచ్చినాఁడను. దొఱకక నలవికాని రాక్షసాధిపుని దర్శనమునిమిత్తమై వనము విఱుచుట యను కార్యముచేసితిని. అంత మీరుపంపిన యాబలవంతులగు రాక్షసవీరులందఱు నాతో యుద్ధముచేయఁగోరి నాపైకి వచ్చిరి. నాప్రాణరక్షణమునిమిత్తమై నేను వారితో నెదురుదిరిగి యుద్ధము చేసితిని. దేవతలకేని, అసురులకేని అస్త్రములచే నన్నుఁగట్టుటకు వీలు

కాదు. బ్రహ్మదేవుఁడు నాకీవరము నొసఁగెను. రాజును జూడఁగోరి యీ యస్త్రమునకుఁ గట్టువడినట్లుంటిని. రాక్షసులు నన్నుఁద్రాళ్లతోఁ గట్టి నప్పుడే నేనస్త్రబంధమునుండి విడివడితిని. నేనొకరాజకార్యముతో నిచ్చటి కేతెంచితిని. పరాక్రమశాలియగు రామునికి నేను దూతను. ఓ ప్రభూ! నేను నీ కొకహితవచనము చెప్పెదను వినుము" అని చెప్పెను.

## 51-వ సర్గము

### హనుమంతుఁడు రావణునికి నీతిచెప్పుట

మహాధీరుఁడగు కోఁతులమేటియైన హనుమానుఁడు గొప్పదిట్టరియైన యారావణునిఁజూచి, భయపడక, యాతనితో నర్థగౌరవముగల వాక్యము నిట్లనియె.

ఓ రాక్షసాధిపా! నేను సుగ్రీవుని యాజ్ఞవలన నీలంకాపురమునకు వచ్చితిని.నీ తోఁబుట్టువగు వానరరాజు సుగ్రీవుఁడు నిన్ను క్షేమమడుగు మనెను. మఱియు, ధర్మార్థములకు విరుద్ధముగాకయు, ఇహపరసుఖములకు రెంటికిని సాధకముగా నుండునట్లు నీకుఁ దోడఁబుట్టువు వంటివాఁడగు సుగ్రీవుఁడు చెప్పిపంపినసంగతిఁ దెలిపెద నాలకింపుము.

విస్తారములయిన గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, కాల్బలము గల దశరథుఁడను ఱేఁడొక్కఁడుండెను. అతఁడు జగమునకుఁ దండ్రివలెఁ జుట్టమును, నింద్రునిమాడ్కిఁ దేజస్సుగలవాఁడునునై యుండెను. అతనికిఁ బెద్దకొడుకు రాముఁడని యొక్కఁడు గలఁడు. అతఁడు నిడుదచేతులు గలవాఁడు, జనులకోరికలను దీర్చువాఁడు, అన్నిపనులను జేయువాఁడు. అతఁ డొక్కకారణమువలనఁ దండ్రియుత్తరువు మీఱఁదనతమ్ముఁడగు లక్ష్మణునితోను, భార్యయగు సీతతోనుగూడి దండకారణ్యమునకు వచ్చెను. ఆతఁ డెక్కువదిట్టతనము గలవాఁడయ్యు దండ్రిమాట మీఱినచో దోషము సంభవించుననెడి కారణముచే నరణ్యమునకు వచ్చెను. విదేహదేశము నేలికయగు మహాధీరుఁడయిన జనకమహారాజునకుఁ గూఁతురును రామునిపత్నియునైన సీతాదేవి యచ్చట కనఁబడక పోయెను. ఆ రాజపుత్త్రుఁడగు రాముఁడు తమ్మునితోఁగూడ నాదేవిని వెదకుచు ఋశ్యమూకపర్వతమునకు వచ్చి

సుగ్రీవునితోఁ జెలిమి చేసికొనెను. అప్పుడు సుగ్రీవుఁడు రామునికి సీతాదేవిని వెదకియిచ్చునట్లును, రాముఁడును వాలినిఁ జంపి సుగ్రీవునికి వానరరాజ్యము నొసఁగునట్లు నొండొరు లొక నియమము చేసికొనిరి. అట్లే రాముఁడు సుగ్రీవుని యన్నయైన వాలిని సంహరించి, సుగ్రీవుని వానరరాజ్యపట్టాభిషిక్తునిఁ జేసెను. ఓరావణా! నీవు ముందే యెఱిఁగిన వానరేంద్రుఁడగు వాలిని రాముఁడొక్క బాణముచేతనే కూలనేసెను.

సుగ్రీవుఁడును ఆడినమాట తప్పనివాఁడుగనుక, రామునిదేవి యగు సీతనువెదకుటకై, పెక్కండ్రు వానరుల నన్నిదిక్కులకును బంపెను. వారందఱిప్పుడు భూపాతాళస్వర్గలోకములందును ఆ సీతాదేవిని వెదకుచున్నారు. వారిలోఁ గొందఱు గరుత్మంతునంతటి బలము గలవారు, కొందఱు వాయుదేవునితో సాటి వచ్చువారు; అడ్డము లేకుండ వడిగాఁ బోవువారు; బలాఢ్యులును. నే నన్నో హనుమంతుఁడను పేరుగలవాఁడను; వాయుదేవున కౌరసపుత్త్రుఁడను. నేను నూఱు యోజనముల దవ్వుగల సముద్రమును దాఁటి, యా సీతాదేవిని వెదకు నిమిత్తముగానే యీ లంకాపురమునఁ జొచ్చితిని. ఇచ్చటికి వచ్చి నీయింట వెదకఁగా, నా సీతాదేవి నిచ్చట గానవచ్చినది. ఓ గొప్ప పండితుఁడా! నీవు సకల ధర్మముల నెఱిఁగినవాఁడవు. తపస్సుచే సకలైశ్వర్యమును బొందినవాఁడవు. కావున, నొరునియాలి నపహరించుట తగదు. నీ బోటి బుద్ధిమంతులును న్యాయమును దప్పినవియు, పెక్కు చెఱుపులు గలిగించునవియు, మొదలు చెఱచునవియునైన పనులందుఁ జొఱఁబడరు. రామలక్ష్మణులు కోపముతో నేసిన బాణములముందట నిలుచుటకు దేవాసురులలో నెవ్వఁడును జాలఁడు: రామునికిఁ జేటొనర్చి, సుఖమును బొందఁగలవాఁ డొక్కఁడైన నుండఁబోఁడు.

ఓ రాక్షసేంద్రా! ఆ సుగ్రీవుఁడు చెప్పెడిమాట సీతనొసఁగుటచే ముందటితప్పు తొలఁగుటవలనను, అప్పటి యైశ్వర్యమునకు నేగిలేమి వలనను, రాఁబోవు మేలునకుఁ గారణమగుటవలనను భూతభవిష్యద్వర్తమానము లనెడి త్రికాలములందును హితమయినదియు, ధర్మమార్గమునుండి తప్పనిదియు, ప్రయోజనము నొసఁగునదియు నని యెంచి, యానృపాలునికి సీతాదేవి నప్పగించుము. ఇక్కడ సీత లేదని

మోసపుత్తువేమో? అట్లనుటకు వీలులేదు. సీతాదేవిని వెదకునిమిత్తమయి బయలువెడలిన వానరులకు దొరకని యా సీతాదేవిని నీగృహమునఁ గనిపెట్టితిని. ఇఁకమీఁద నేపని మిగిలియున్నదో, దానిని జేయ రాఘవుఁడు గలఁడు. వంతయే ప్రధానముగాఁ గలదగు సీతాదేవిని నీగృహమునఁ జూచితిని. ఓ రావణా! ఆ సీతాదేవి నీయింటనున్న యైదుతలలుగలపామని తలఁపుము. విషముతోఁ గలిసిన యన్నమును జఠరాగ్ని బొత్తిగా జీర్ణమగులాగు చేయఁ జాలనియట్లు, దేవాసురలలో నెవ్వరును ఆ సీతాదేవిని తమబలముచే దక్కించుకొనఁజాలరు. ఓ రావణా! నీవు బహుకాలము తపస్సుచేసి సంపాదించిన పుణ్యఫలమెయ్యదిగలదో, అది నీయాయుర్వర్ధకమైనది. అట్టి యాయుర్వర్ధకమైన పుణ్యఫలమును నశింపఁ జేసికొనుట యుక్తముగాదు. బ్రహ్మదేవుని వలనఁ జావులేకుండునట్లు వరముఁ బడసిన నన్నేల యీ బెదరింపులు బెదరించెదవని యందువేమో? నీవు తపస్సులొనర్చి పడసిన దేవాసురుల వలన చావులేమి యను వరమే నీవధమునకు గొప్పకారణమాయెను. సుగ్రీవుఁడు దేవతగాఁడు; అసురుఁడుగాఁడు; రాక్షసుఁడుగాఁడు; దానవుఁడుగాఁడు; గంధర్వుఁడుగాఁడు; యక్షుఁడుగాఁడు; పన్నగుఁడునుగాఁడు. కావున రాక్షసరాజా! నీవు సుగ్రీవునినుండి యెట్లు ప్రాణసంరక్షణము సేసికొనఁగలవు? ఓ రావణా! నే నిదివఱకు సంపాదించిన పుణ్యమెంతయోయున్నది. అదే నాప్రాణములను గాపాడదా యని యందువేమో. ధర్మఫలము, అధర్మఫలము నొక్కటేతడవ ననుభవమునకు వచ్చునా? లేక ధర్మము అధర్మమును బోఁగొట్టి తాను ప్రబలునాయని విచారించిన, ధర్మఫలమైన సుఖ మధర్మఫలమైన దుఃఖముతోఁ గూడ ననుభవమునకు రాదు.

ధర్మము సుఖమునే దానిఫలమునుగా ననువర్తించును. అట్లే యధర్మము దుఃఖమునే దానిఫలమునుగా ననువర్తించును. కాని ధర్మము అధర్మమును బాధింపఁజాలదు. కాఁబట్టి నీవు ముందుచేసిన ధర్మమిప్పు డొనరించిన యధర్మమును బోఁగొట్టఁజాలదు. ధర్మాధర్మములు రెండును దానిదాని ఫలముననుభవముచేతనే నశింపవలయును గాని వేఱొండుపాయములేదు. "అట్లే కానిమ్ము. నేను సంపాదించిన గొప్ప ధర్మమునకు ఫలము ననుభవించిన పిదపఁగాదా అధర్మఫలము

ననుభవించుట. అది యట్లు వచ్చినప్పటికిఁ జూచుకొందములే" యని యందువేమో ; నీవుచేసిన ధర్మఫలమును బూర్తిగా ననుభవించితివి. ఇఁక నీ వొనరించిన పరదారహరణరూపమైన యధర్మముయొక్క ఫలమును శీఘ్రకాలములోపలనే యనుభవింపఁ గలవు.

రాక్షసాధిపా! రాముఁడు జనస్థానముఁ బాడుచేయుటయు, వాలిని వధించుటను, రామసుగ్రీవు లొండొరులు చెలిమి యొనరించుకొనుటను జక్కఁగాఁ బరికించి, యాత్మహితమయిన తెఱఁగాలోచింపుము. నే నొక్కఁడనే చతురంగబలముతో నిండిన యీలంకాపురమును రూపు మాపఁ గలను. అయినను శ్రీరాముఁడు సీతాదేవి నపహరించిన తన శత్రువును దానే యణఁగద్రొక్కెదనని వానరశ్రేష్ఠులయెదుటఁ బ్రతిజ్ఞ చేసినవాఁడు గనుక, నే నీ లంకాపురమును ధ్వంసముసేయుట యతనికి సమ్మతముగాదు. రామునికిఁ జెఱుపుచేయువాఁడు సాక్షాద్దేవేంద్రుఁడైనను సుఖము బొందఁజాలఁడను నపుడు నీబోటివానిసంగతి చెప్పవల యునే? ఓరాక్షసాధిపా! నీయింటను నీవశంబున నుంచుకొనియున్న ఏయువతి సీతనుగా నెంచియున్నావో, ఆయువతి సీతగాదు; లంకాపురమునెల్ల బూదిచేయుటకై వచ్చిన కాలరాత్రియని యెఱుఁగుము. ఆమె సీతరూపమెత్తిన యమపాశము. దానిని కావలయునని యేల మెడకుఁ దగిలించుకొనెదవు. ఈపనివదలి, యేది నీకు మేలగునో యట్టి పనినిగూర్చి యాలోచింపుము. సీతయొక్క తేజస్సుచేరగిలి, రాముని యాగ్రహముచేఁ జక్కఁగా మంటలెగసి ప్రాకారాదులతోఁ గూడ నెఱియుచున్నది యీలంకాపురము చూడుము. వ్యర్థముగా స్వమిత్ర మంత్రిదాయాద సోదర పుత్ర హిత దారాభోగములతోఁగూడ నీలంకాపురమును పాడుసేయించుకొనకుము. ఓ రాక్షసేంద్రుఁడా! నేను రాముని దూతను. నాకు రామునిశక్తి తెలియును; గనుక నేను పక్షపాతము విడిచి నీకు హితము చెప్పెదను. కీర్తిమంతుఁడగు రాముఁడు స్థావరజంగమరూపములయిన సకలభూతములతోఁ గూడిన లోకముల నన్నింటి దహించి, మఱల నదేరీతిని సృజింపఁగలఁడు. విష్ణువుఁబోలు పరాక్రమముగల రామునికెదుట నిలిచి యుద్ధముచేయఁ గలవాఁ డీ దేవాసురయక్ష రాక్షససిద్ధవిద్యాధర గంధర్వ పన్నగ కిన్నరగరుడుల లోపల నెవ్వఁడును సర్వకాలసర్వావస్థలయందును లేఁడు. సర్వలోక

నాయకుఁడైన రాజేంద్రుఁడగు రామునికి గొప్పకీడు చేసితివి. కనుక నీవు ప్రాణములతోనుండుట గడుదుర్లభము. దేవ, దానవ, రాక్షస, గంధర్వ, విద్యాధర, యక్ష, పన్నగులెల్లరును యుద్ధములందు ముజ్జగములకేలికయగు రాముని యెదుట నిలువఁజాలరు. తనంతటఁ బుట్టిన నాలుగుమోములుగల బ్రహ్మదేవుఁడుగాని, త్రిపురములను సంహరించిన ముక్కంటియగు రుద్రుఁడుగాని, దేవతలకెల్ల ఱేఁడగు గొప్పయైశ్వర్యవంతుఁడయిన ఇంద్రుఁడుగాని యుద్ధములందు రామునిచేతఁ జిక్కిన వానిని రక్షింపఁజాలరు." అని హనుమంతుఁడు ధైర్యముతోఁ జెప్పినట్టి హితవాక్యమును దనక ప్రియమునుగా భావించి, సాటిలేని వీర్యముగల రావణుఁడు కినుకపూని కన్నులు గిరగిరఁద్రిప్పుచు నావానరవీరుని వధింప నాజ్ఞయొసఁగెను.

## 52-వ సర్గము

### విభీషణుఁడు రావణునికి హితంబు సెప్పుట

రావణుఁడు మహాధీరుఁడగు హనుమంతునిపలుకు లాలకించి, యెక్కువ యాగ్రహముగలవాఁడై, యాహనుమంతుని సంహరింప నానతియిచ్చెను. దుష్టబుద్ధిగలవాఁడగు రావణుఁ డట్టి యానతిచేయఁగా, దూతకృత్యము చేయవచ్చినవాని కిట్టి దండన విధించుటకు సమ్మతింపక, పనిచేయఁదగినరీతి నెఱుఁగఁ గలవాఁడును, మాటలందుఁ జమత్కారియునైన యావిభీషణుఁడు మంచిమాటలచేఁ గార్యము సాధింప నెంచిన వాఁడయి, శత్రువుల జయించునట్టి తనయన్నయగు రావణుని తిన్నని మాటలచే గౌరవించి మిక్కిలి హితమైన వాక్యముల నిట్లనియె:

"రాక్షసాధిపా! శాంతపడుము. రోషమును విడువుము. కలఁక దేఱినవాఁడవై యీనామాటను వినుము. మంచిచెడ్డల నెఱిఁగిన యోగ్యులైన రాజులు దూతకు వధము దండనముగా విధింపరు. ఓ శూరుఁడా! యీవానరుని వధించుట రాజధర్మమునకు విరుద్ధమయినది; లోకమర్యాదను మీఱినది. నీకును తగనిది. నీవు సకల ధర్మముల నెఱిఁగినవాఁడవు. నెనరుగలవాఁడవు. రాజధర్మము లన్నిటియందు నిపుణుఁడవు. జనులలోపల మంచిచెడ్డల నెఱిఁగినవాఁడవు. వాస్తవార్థము నెఱిఁగినవాఁడవు. వివేకులైన నీబోటులే యిట్లు కినుక పూనుదురేని,

అప్పు డింతవఱకు శాస్త్రములందుఁజేసిన పరిశ్రమయెల్ల వ్యర్థమేకదా. కావున శత్రువులకు లోఁబఱచుకొొన నలవికానివాఁడవు, శత్రువులను జంపువాఁడవునైన రాక్షసేంద్రుఁడా! ప్రసన్నుఁడవగుము. మంచి చెడ్డల విచారించి దూతకుఁ దగిన దండనను విధింపుము."

రాక్షసరాజగురావణుఁడు విభీషణునిమాటలు విని, యెక్కువ యాగ్రహము పూనినవాఁడై, "శత్రుసంహారీ! పాపాత్ములను వధించుటవలో నేమియుఁ బాపములేదు. కావున పాపాత్ముఁడైన యీవానరుని వధించెదను" అని యుత్తరము చెప్పెను.

బుద్ధిమంతులలోపల శ్రేష్ఠుఁడయిన విభీషణుఁ డన్యాయమే మూలకారణముఁ గలదియు, ఎక్కువకోపముతోఁ గూడినదియు, దుష్టులవలంబించునదియునైన రావణునిమాటను విని, వాస్తవమైన ధర్మసూక్ష్మమును దెలుపునట్టి మాట పలికెను: "లంకాపురము నేలికవు, రాక్షసులకు రాజవునైన యోరావణా! శాంతింపుము. ధర్మార్థయుక్తమైన నామాట వినుము. ఓరాజా! అన్ని దేశములందును, అన్ని కాలములందునుండు పండితులు దూతలను జంపరాదని చెప్పుదురు. ఇతఁడు దూతమాత్రమేకాఁడు. అక్షకుమారాదులను జంపుటచే నితఁడు మనకు మీఱిన శత్రువు. అయిన వీనిని సంహరింపఁ గూడదాయనిన, పెద్దలు దూతవధము యుక్తముగాదని చెప్పుదురు. వారికి పెక్కుతెఱఁగులైన దండనములు శాస్త్రములందు విధింపఁబడియున్నవి. కరచరణాద్యవయవములందు వికృతిని గలిగించుట, కొరడాలతోఁ గొట్టుట బోడి గొట్టుట, గుఱుతుపెట్టుట యీ మొదలగువానిని దూతకు దండనములనుగా విధింతురుగాని, దూతను జంపుట నేనింతకుమున్ను విన్నది కూడ లేదు. మంచిచెడ్డల నెఱుఁగుటచేఁ గార్యము నెఱిఁగినవాఁడును, ధర్మార్థములందే ప్రవర్తించు తలంపుగలవాఁడునైన నీయట్టివాఁడే యిట్లు కోపపడవచ్చునా? అదియుత్తమ మగునా? ఎప్పటికిని సత్పురుషులాగ్రహము నడఁచుకొొందురుగదా. ధర్మశాస్త్రవాదమునందును, లోకాచారములందును, శాస్త్రవిషయములను బుద్ధితో గ్రహించుకొొనుటయందును నీతో సమానుఁడు లేనేలేఁడు. నీవు దేవాసురులందఱిలోపల నుత్తముఁడవు. ఈదూతను వధించుటలో శాస్త్రవిరోధ మొక్కటియే కాక ప్రయోజనమొక్కటియుఁ గనఁబడలేదు. ఎవఁ రీదూతను బంపి

నారో, వారియం దీదండనమును విధింపుము. ఇతండు మంచివాఁడు, లేక, చెడ్డవాఁడు కానీ, ఇతఁడు పరులచేఁ బంపఁబడినవాఁడు. స్వతంత్రుఁడుగాని యట్టి దూత యొరులకై యొరులు చెప్పిపంపిన సంగతిని జెప్పినవాఁడు గావున నతనిని వధించుట యుక్తముగాదు. అదియుఁగాక, ఇతనిని జంపిన, సముద్రముదాఁటి రాఁగల మఱియొకనిని మనము చూడలేము. చూడకపోయిన మనకేమి నష్ట మందువేమో, యితఁడిచ్చట మనవలన మడిసినచో నిచ్చటి సంగతి రామలక్ష్మణులకుఁ దెలియఁబోదు. కావున వా రిచ్చటికి రాను వీలుపడదు. కనుక శత్రువినాశము గలుగఁబోదు. ఇతనిని జంపక విడిచితిమేని, ఇతఁడు సముద్రము దాఁటి పోయి సంగతి దెలుపఁగానే, రామలక్ష్మణులిచ్చటికి వత్తురు. అప్పు డనాయాసముగా శత్రువధము చేయవచ్చును. శత్రుపట్టణముల గెల్చువాఁడా! పై కారణమువలన నితనిని జంప యత్నము సేయవలదు. నీ వింద్రాదిదేవతలపై దాడివెడలుటకుఁ బ్రయత్నము చేయుము. యుద్ధముల కిష్టపడువాఁడా! ఇతఁడు నశించునేని, సముద్రము దాఁటి పోయి, చాలదూరమున నున్న గర్వితులైన ఆరాజపుత్రులను యుద్ధమునకయి పురికొల్పువాఁడగు దూత మఱొక్కఁడు లేఁడు. రాక్షసులమనసునకు సంతోషము గలిగించువాఁడా! శౌర్యము, పూనికి, దిట్టతనముగల దేవాసురులకైనను గెల్వ నలవికాని నీవు నీయొక్క యుద్ధప్రయత్నము చెడఁగొట్టుకొనుట యుక్తముగాదు. నీకు మేలుగోరువారును, మొనగాండ్రును, పెట్టుపోతలచే లోఁబడినవారును, సద్గుణములతో నిండిన సత్కులములందుఁ బుట్టినవారును, ధైర్యశాలులును, విలుకాండ్రలోపల మేటులునునైన చక్కని పనివాండ్రును, యుద్ధవీరులును, కోటికంటె హెచ్చుగా నీవశమున నున్నారు. ఆసేనలోఁ గొంత సేన నిచ్చి, నీదూతలను వారికడకుఁ బంపుము. వారు పోయి మూఢులైన యారాజపుత్రుల నడ్డగించి, శత్రువులందు నీప్రభావము తెలియఁబఱుపఁజాలుదురు" అని తమ్ముఁడగు విభీషణుఁడు చెప్పిన యుత్తమప్రియవచనములను విని, దేవతలకు శత్రువును, మహాబలుఁడును, రాక్షసవీరులకు ముఖ్యుఁడునునైన రావణాసురుఁ డతనిమాటకు సమ్మతించి యట్లు చేయఁ దలఁచెను.

## 53-వ సర్గము

రాక్షసులు హనుమంతునితోఁకకు నిప్పంటించుట

మహాబలుఁడగు రావణుఁడు దేశకాలములకుఁ దగినట్లుగా తమ్ముఁడగు విభీషణుఁడు చెప్పినమాటను విని, యతనితో నిట్లనియె: "ఓ విభీషణా! దూతవధము నింద్యమయినదని నీవు లెస్సఁగాఁ బరికించితివి. వధముకంటె నితరమైన దండనమేదియైనఁ దప్పక చేయవలయును. కోఁతులకుఁ దోఁక యిష్టభూషణముగదా. కావున నీవానరుని తోఁకకు నిప్పంటింపుఁడు. ఆ ట్లంగవికారముచేఁ జిక్కి దీనతతో మఱలిపోయిన యితనిని యితనిబంధుమిత్రదాయాదులు చూతురుగాక!" అని తమ్మునితోఁ జెప్పి, తన పనివారిని జూచి, "ఈవానరునితోఁకకు నిప్పంటించి, యీతనిని బట్టణమున నూరేగింపవలయు" నని యానతి యొసఁగెను.

ఆరావణునిమాటను విని, రాక్షసులు కోపముచేఁ గృశించినవారై, యా హనుమంతునితోఁకకు చినిఁగినపేలికలు చుట్టిరి. తోఁకకు వారట్లు పేలికలు చుట్టుచుండఁగా, కాఱుచిచ్చు ఎండుఁగట్టెల నాశ్రయించి వర్ధిల్లురీతిగామహావానరుఁడును తనదేహమును పెంచెను. ఆరాక్షసు లాహనుమంతుని తోఁకకు గట్టిగా గుడ్డలుచుట్టి, నూనెలోఁ దడిపి, నిప్పంటించిరి. బాలసూర్యునిమాడ్కి వెలుఁగుమోముగలవాఁడగు హనుమంతుఁడు కోపముచే నిండిన మనస్సుతోఁ గూడినవాఁడై, మండుచున్న యాతోఁకతోనే యారాక్షసులను గూలనేసెను. ఆలంకాపురమున నుండు రాక్షసులందఱు స్త్రీలు, బిడ్డలు, ముసలివాండ్రతోఁగూడ మండుచున్న యాహనుమంతునితోఁకను జూడఁబోయిరి. అప్పుడు వారు వచ్చి పట్టఁగా, హనునుంతుఁడు దాను శూరుఁడైనను సమయమునకుఁ దగినయోచన యొక్కటి చేయఁదొడఁగెను.

"ఈ రాక్షసులు నన్నుఁగట్టినను, నాకు వీరు చాలరు. ఈ త్రాళ్లు త్రెంచుకొని నేను మఱల వీరిని జంపఁగలను. నా యజమానుని మేలు కోరి యిచ్చటఁ దిరుగుచుండు నన్ను రాక్షసులు దమప్రభువు నుత్తరమునుబట్టి కట్టివేయుచున్నారేని నేనుజేసినపని కిది బదులుచేయుటెంత మాత్రము కానేరదు. నేనొక్కఁడనే యుద్ధరంగమున వీరినందఱిని

మట్టుపెట్టఁగలను. అయినను తానే రావణుఁడు మున్నగువారిఁ జంపఁ దలఁచి యున్నందున నేను వీరు కట్టుకట్టులు మొదలగునవి యోర్చి యున్నాను. నేను రాత్రి పట్టణములోపలఁ బ్రవేశించితిని గనుక, దుర్గ రక్షణవిశేషమును దెలిసికొనుచు బాగుగఁ జూడలేదు. అవశ్యముగాఁ దెల్లవాఱఁ బట్టణమంతయు చూడవలయును. వీరు నన్నుఁబట్టుకొని నాతోఁకను వెలిఁగించి త్రిప్పుటచే నేను మఱలఁ బట్టణ మెల్ల బాగుగాఁ జూచినట్లగును. కావున వీరు నన్ను బంధించి తోఁకను వెలిఁగించి తమ యిచ్చవొప్పున నొప్పింపనీ. నామనసు కేమాత్రము శ్రమలేదు" అని హనుమంతుఁడు తనలోఁ దా ననుకొనెను.

అంతటఁ గ్రూరపుఁబను లొనర్చు రాక్షసులు మహాబలవంతుఁ డయ్యుఁ దనయాకారమును కొంచెపఱచి యుంచుకొనియున్న యా హనుమంతునిఁ గట్టి సంతోషముతోఁ గూడినవారలై, శంఖభేరీవాద్య ముల మ్రోఁతలచేతను, తమచేతిచప్పట్లచేతను, గొప్పయఱపులచేతను బట్టణమెల్ల మాఱుమ్రోగునట్లు చేయుచు, నాహనుమంతునిఁ బుర మంతయుఁద్రిప్పిరి. అట్లు వా రీడ్చికొని పోవుచుండఁగా, వాయునంద నుఁడు పట్టణమెల్లఁ దిరిగి, విచిత్రములైన యేడంతస్తుల మేడలను, చలువరాలతో గట్టఁబడిన భూప్రదేశములను, చక్కఁగాఁ దీర్చికట్టిన యింటిముంగిళ్లను, రాజబాటలలోనికిఁబోవు చిన్నసందుగొందులను, రహస్యద్వారములను, మేఘములంబోలు నున్నతగృహములను జూచెను. నాలుగు రాజమార్గములు గలియుచోటులందును, నాలుగుకాళ్లమండ పములందును, రాజమార్గములందును జేరి యాలంకాపురమునందలి రాక్షసులందఱు "ఇదిగో చారు!"డని యరచిచెప్పుచుండిరి. ఆ పట్టణము నందలి స్త్రీలు, బాలురు, ముదుసలు లచ్చటచ్చటఁ గుతూహలముతోఁ గూడినవారై, మండుచున్న తోఁకతోఁ గూడిన యాహనుమంతునిఁ జూడఁబోయిరి. ఆ హనుమంతుని తోఁక మండుచుండఁగా, వెఱ్ఱి చూడ్కులుగల రాక్షసస్త్రీలు సీతాదేవికడకుఁ బోయి "ఓసీతా! నీతో మాటలాడుచుండిన యెఱ్ఱమూఁతిగల కోఁతితోఁకకు చింపి గుడ్డలుచుట్టి, నిప్పంటించి వాని నిదిగో కొనిపోవుచున్నారు చూడుము" అని యామె దిగులుపడునట్లు చెప్పిరి.

విశాలాక్షియగు సీతాదేవియు క్రూరురాండ్రయిన యా రాక్షసులు చెప్పిన యామాటను విని, తన ప్రాణమే పోయినట్లు తలంచినదై, శోకమున మునిఁగి యగ్నిహోత్రుని కడకుఁబోయి, యా హనుమంతునికి మంగళముగోరినదై, పరిశుద్ధమనస్సుతో నగ్నిహోత్రుని నివ్విధమున నుపాసనచేయఁ దొడగెను. "ఓ యగ్నిహోత్రుఁడా! నే నొనర్చిన పతిశుశ్రూష యుండునేని. నేనొనరించిన తపస్సుండునేని, నాయొక్క పాతివ్రత్య ముండునేని, హనుమంతునికిఁ జల్లనివాఁడ వగుము. జ్ఞానము గలవాఁడగు ఆరామునికి నాయందు దయగలదేని, అదృష్ట శేషముండునేని, ఓయగ్నిహోత్రుఁడా! హనుమంతునియెడఁ జల్లనివాఁడ వగుము. రాముఁడు తనతోఁడిచేరికను గోరుచున్నదాననైన నన్ను మంచినడవడితో నుండుదానినిగా నెఱుఁగునేని, అగ్నిహోత్రుఁడా! హనుమంతునికిఁ జల్లనివాఁడవగుము. సత్యముఁదప్పనివాఁడైన సుగ్రీవుఁడు నన్ను దుఃఖమనెడి కడలిని దరింపఁజేయునేని, హనుమంతునికి జల్లనివాఁడ వగుదువు గాక" అని యివ్విధమున సీతాదేవి యగ్నిహోత్రునిఁ బ్రార్థింపఁగా, అగ్నిహోత్రుఁడు వేఁడిమంటలు గలవాఁడయ్యు, కదలక, గుండ్రనిజ్వాలలుగలవాఁడై యా సీతాదేవికి క్షేమము దెల్పువానికై వడి జ్వలించెను. హనుమంతునితండ్రియగు వాయుదేవుఁడును తోఁకయందలి నిప్పుతోఁ జేరినవాఁడయి, సీతాదేవికి నెమ్మదిఁదెల్పువానికై వడిఁ జల్లగా వీచెను.

అప్పుడు హనుమంతుఁడు తనతోఁక యెఱియునప్పు డిట్లు చింతించెను: "ఈయగ్నిహోత్రుఁడు చక్కఁగా నెఱియుచున్నను, నాకు బాధ గలిగింపకున్నాఁడు. మంట లప్పటికప్పటికి హెచ్చుచున్నవి. కాని నాకు బాధ కనఁబడలేదు. తోఁకకొనయందు మంచుగడ్డ పెట్టినట్లున్నది. దీనికిఁ గారణమేమో తెలియలేదు. నేను సముద్రము దాఁటునప్పుడు రాముని ప్రభావమువలననే పర్వతరూపమయిన యాశ్చర్యము చూచితిని. ఆరాముని ప్రభావముచేతనే యీ యగ్నిహోత్రుఁడు నాయెడఁ జల్లనివాఁడుగనున్నాఁడు. సముద్రునికిని ధీమంతుఁడగు మైనాకునికిని అంత త్వరపా టుండునపుడు, అగ్నిహోత్రుఁడు మాత్ర మేల యట్లుండఁడు? సీతాదేవియొక్క దయాళుత్వముచేతను, రాముని తేజస్సు

చేతను, వాయుపుత్రోడి చెలిమిచేతను నన్నగ్నిహోత్రుఁడు దహింప కున్నాఁడు"

వానరోత్తముఁ డివ్విధమున గొంతతడ వాలోచించి, పర్వత శిఖరముమాడ్కి నెత్తయినదియు రాక్షససంచారము మెండుగా లేనిది యున్నైన గోపురద్వారముమీఁదికెగిరి దుమికి, మఱల నుత్సాహము పూని, క్షణములోపలఁ బర్వతసమానుఁడై, మఱల మిక్కిలి చిన్నదైన రూపము నొంది కట్లనెల్లఁ ద్రెంచివైచెను. అట్లు కట్లు విడిపించుకొని మఱలఁ బర్వతాకారుఁడై, యన్నివైపులఁజూచి, గోపురద్వారమున నున్న గుదియను జూచెను. నిడుదచేతులవాఁడగు హనుమంతుఁడు కాఱినుముతోఁ జేయఁబడిన యాగుదియను గైకొని, ఆ పురద్వార రక్షకుల నందఱిని బరిమార్చి, యుద్ధమునఁ బగతురకు భీతి గలిగించు పరాక్రమము గలవాఁడై, మఱల లంకాపురము నంతయుఁ జూచుచుఁ బ్రజ్వరిల్లుచున్న తోఁకయందలి యగ్నిజ్వాలలతో వెలుఁగుచు వేయి కిరణములచేఁ బ్రకాశించుచున్న సూర్యునిమాడ్కిఁ దేజరిల్లుచుండెను.

## 54-వ సర్గము

### హనుమంతుఁడు లంకను గాల్చుట

అంత హనుమంతుఁడు వచ్చిన కార్యమును నెఱవేర్చుకొన్న వాఁడై, పూనిక హెచ్చుచుండుటచేత మిగత కార్యముఁ గూర్చి యాలోచించెను: "ఇప్పుడు నా కిచ్చటఁ జేయవలసిన పని యేమి మిగిలి యున్నది? ఈ రాక్షసులకు మఱింత శోకముగలిగించు పని యిఁక మిగిలియున్నది. రావణునికి మిక్కిలి ప్రియమైన యశోకవనము పాడు చేసితిని. గొప్పరాక్షసులను సంహరించితిని. సేనలో నొక్కపాలు ధ్వంసముచేసితిని. ఇఁక కోట దగులఁబెట్టుట యొక్కటి మిగిలి యున్నది. కోటను బాడుచేసినయెడల, మీఁదికార్యము సులభముగా సాధింప వచ్చును. కొంచెపాటి ప్రయత్నము చేసికొని యీపని చేసితినేని, నేను బడిన శ్రమము సార్థకమగును. అంతియకాక, నాతోఁకయందు మండుచున్న యగ్నిహోత్రుని నీమేటిగృహములచేఁ దనివి నొందిం చుట యుక్తము."

అని యాలోచించి, హనుమంతుఁడు వెలుఁగుచున్న తోఁక గల వాఁడగుటంజేసి మెఱుపుతోఁగూడిన మేఘముమాడ్కి వెలుఁగుచు, లంకాపురమునందలి రాక్షసులయొక్క యిండ్లమీఁదను సంచరించెను. ఇట్లు లంకయందలి యుద్యానములయందును, ఇండ్లమీఁదను, మేడల మీఁదను చూడ్కి నిగుడించుచు నిర్భయముగా విచ్చలవిడిఁ దిరుగు చుండెను.

వాయువేగుఁడగు హనుమంతుఁడు ప్రహస్తునిగరుపై కెగిరి యచ్చటఁ జిచ్చుపెట్టి, యచ్చటినుండి లేచి, మహాపార్శ్వునియింటి మీఁదికి దుమికి ప్రలయకాలాగ్నిజ్వాలంబోలు మంటను దానికిఁ దగి లించెను. మహాతేజస్సుగల హనుమానుండు వజ్రదంష్ట్ర శుకసారణేంద్ర జిత్తులయు, జంబుమాలి సుమాలులయు, రశ్మికేతుసూర్యశత్రువు లయు, హ్రస్వకర్ణ, హ్రస్వదంష్ట్రులయు, రోమశ, యుద్ధోన్మత్త, ధ్వజ గ్రీవులయు, భయంకరుఁడయిన విద్యుజ్జిహ్వునియొక్కయు, హస్తి ముఖ, కరాళ, పిశాచ, శోణితాక్ష, కుంభకర్ణ, మకరాక్ష, యజ్ఞశత్రు, బ్రహ్మశత్రు, నరాంతక, కుంభ, నికుంభులయు మేడలయందన్నిటియం దును వరుసగా నిప్పుపెట్టెను. ఇట్లు నిప్పుపెట్టునప్పుడు విభీషణుని గృహముమాత్రము విడిచిపెట్టి, తక్కిన వారియిండ్లనెల్ల నొకదానిపై నుండి మఱియొకదానిపైకి దుముకుచు నన్నియిండ్లను వరుసగా దహించెను.

ఆతఁడు శ్రేష్ఠములగు నాభాగ్యవంతులయిన రాక్షసులమేడలం దున్న వారివిలువగల వస్తువులనెల్లను దహించెను. శౌర్యలక్ష్మీవంతుఁ డైన యా హనుమంతుఁడు ఆ రాక్షసులగృహముల నన్నింటిని దాఁటి, రాక్షసేంద్రుఁడగు రావణాసురుని గృహముజేరెను. అంతట నానా విధములగు రత్నములు చెక్కినదియు, మేరుపర్వత మధ్యభాగము మాడ్కి శోభిల్లునదియు, మేలిమివస్తువులచే నన్నింటిచే శోభిల్లునదియు నైన యా రాక్షసరాజగృహమునఁ దనతోఁకయందు వెలుఁగుచున్న యగ్నిహోత్రుని నుంచి, ప్రలయకాలపుజలదముమాడ్కి గర్జనము చేసెను. హనుమంతునితోఁకయం దున్న యగ్నియు వాయువుతోడి చేరికవలన మఱింత వడియు బలిమియుగలఁడై, ప్రలయకాలాగ్ని హోత్రునిమాడ్కిఁ బ్రజ్వరిల్లెను. జ్వలించుచున్న యగ్నిని వాయు

వాగృహములందుఁ బర్వఁజేసెను. అగ్నిహోత్రుఁడును వాయుసం యోగమునఁ గడువడితోఁ బర్వఁజొచ్చెను. పుణ్యము ముగియునప్పు డాకాశమునుండి క్రిందఁబడు సిద్ధుల గృహములమాడ్కి బంగారు కిటికీలు గలవియు, ముత్యాలతో నలంకరింపఁబడినవియు, పెక్కురతన ములు పొదిగినవియు నైన యా రాక్షసుల గృహము లెల్లఁ గూలినవి. రాక్షసులందఱు తమ యిండ్ల కంటుకొన్న యగ్నిని జల్లార్చి కాపాడు కొనుటయం దుత్సాహము తగ్గఁగా, తమసంపద లెల్ల బూదిగాఁ బోవఁగా "అక్కటా! యీ యగ్నిహోత్రుఁడే కోఁతిరూపముతో మనపురమునకు వచ్చెనా!" యని గొప్పరొద చేసిరి.

కొందఱు చంటిబిడ్డలు చంకనున్న స్త్రీ లేడ్చుచు మేడలమీఁది నుండి క్రిందఁగూలిరి. కొందఱుస్త్రీలు తలవెండ్రుకలు విఱియఁబోసి కొని, యగ్నిచేఁ జుట్టఁబడిన మేడలనుండి క్రిందఁగూలుచు, ఆకాశము నందలి జలధరములనుండి క్రిందఁబడిన మెఱుపులచందమునఁ బ్రకాశిం చిరి. ఆహనుమంతుఁ డప్పుడు తాను నిప్పుపెట్టుటచే వదలిపోవుచున్న వజ్రములు, మాణిక్యములు, వైడూర్యములు, ముత్యాలును గలిగిన యిండ్లను, ఆయిండ్లనుండి వేఁడిమికిఁ గరఁగి పాఱుచున్న బంగారు మొదలగు లోహములనుజూచెను. ఆయగ్నిహోత్రుని కెన్నికట్టెలు,ఎంత గడ్డి దొరకి నను తనివిగలుగ లేదు. ఆహనుమంతుఁ డెన్ని యిండ్లు దహించినను తనివి నొందఁడయ్యె. ఎందఱు రాక్షసులు గూలినను భూమి తనివినొంద కుండెను. ఆ యగ్నిహోత్రుని జ్వాలలు కొన్నితావులందు మోదుగు పువ్వులమాడ్కియు, కొన్ని ప్రదేశములందు మంకెనపువ్వులమాడ్కియు, కొన్ని చక్కట్లయందు కుంకుమపువ్వు పగిదియుఁ బ్రజ్వరిల్లినవి. అంత బలవంతుఁడగు హనుమంతునిచే లంకాపురమున కాధారమైన త్రికూట పర్వతశిఖరమున నుంచఁబడిన భీకరవిక్రమముగల యగ్నిహోత్రుఁడు తనజ్వాలలగుంపు నంతటఁ బర్వఁజేసి, వాయువుతోడ్పాటుచేఁ బ్రలయ కాలాగ్నిమాడ్కి నప్పటప్పటికి వృద్ధిఁబొంది, పొగ లేకుండఁ బైకిఁ బోవుచు రాక్షసుల శరీరములందలి క్రొవ్వుచే వృద్ధినొందిన జ్వాలలచే మిన్నుముట్టుచుఁ గోటిసూర్యప్రకాశమానమై, లంకాపురమంతయు వ్యాపించి, పిడుగువంటి గొప్పధ్వనులతో బ్రహ్మాండమును భేదించు చున్నదో యన్నట్లు తోఁచఁజేయుచు నాకాశమువఱకు వ్యాపించి,

ారర్వారాని వేఁడిమిగలదై, మోదుగుపువ్వుంబోలు జ్వాలలకోనలు
)గి యత్యంతాభివృద్ధినొందుచుండెను. మొదటమొదటఁ గాలిచల్లారిన
ండ్లనుండి లేచిన పొగచేఁ బర్వఁబడి వరుసలుతీరిన మేఘములు నల్ల
ావలమాఁడ్కి మెఱసినవి.

ఆ లంకాపురమునందలి యుత్తమరాక్షసు లందఱు లంకాపురము
లజీవరాసులతోను, వృక్షాది స్థావరములతోను దగ్ధమయినది చూచి
ఈతఁడు వజ్రాయుధముఁ దాల్చిన దేవేంద్రుఁడో, యముఁడో,
ంణుఁడో, వాయుదేవుఁడో, రుద్రుఁడో, అగ్నియో, సూర్యుఁడో,
బేరుఁడో, చంద్రుఁడో, కాలుఁడో కాని యెంతమాత్రము వానరుఁడు
ఁడు. అందఱికి సృష్టికర్తయై, అన్నిటికిఁ బోషకుఁడై, నాలుగు
ాములచే వెలయు బ్రహ్మదేవునియొక్క ప్రకోపమే రాక్షసుల
ాశముచేయుటకై వానరరూపముతో నిచ్చటికి వచ్చెనో! త్రివిధ
చ్ఛేదము (పుట్టుట పెరుగుట నశించుట యను మూడు తెఱఁగులైన
ాగము) లేనిదియు, కన్నులు మొదలగు నింద్రియములకు గోచరము
నిదియు, మనస్సునకుఁ గూడ నూహింప రానిదియు, అద్వితీయమైన
ము నైన విష్ణుతేజస్సే తన యసాధారణ మాయచేఁ గోఁతిరూపము
ల్చి యిప్పుడిచ్చటికి వచ్చినదో!" అని పలికిరి.

ఆ లంకాపురమునందలి రాక్షసులు తమగుఱ్ఱములు ఏనుఁగులు రథ
ులు, పక్షిమృగవృక్షములును బంధుమిత్రపరిజనులును మడియుటఁ
ాచి, యెలుఁగెత్తి "అయ్యో! తండ్రీ! అయ్యో! కొడుకా! అయ్యో!
ఘుఁడా! అక్కటా! చెలికాఁడా! హా! భోగములతో నిండిన మిక్కిలి
శుద్ధమైన యోప్రాణమా!" యని మిగులనోర్వరాని దగుటచేఁ గడు
కరమైన రోదనము గావించిరి. అగ్నిజ్వాలలచేఁ జుట్టఁబడినదియు,
ుద్ధవీరులయు, భటులయు నాశముచే సొంపు దఱిగినదియు, హను
ంతుని కోపాతిశయమునకుఁ జెడినదియునైన యాలంకాపురము శాప
్తమైనది పోలెఁ బ్రకాశహీనమాయెను. ఆలంకాపురమునందలి
ాక్షసులు తత్తరపాటును వెఱపును గలవారై దుఃఖపడుచుండుటను,
ంతట నగ్నిజ్వాలలు పర్వియుండుటను జూచి, హనుమంతుఁడు లంకా
రము బ్రహ్మదేవునిశాపముచేఁ బాడుపడినభూమియో యని తలఁచెను.
ానుమంతుఁ డవ్విధమున వృక్షశ్రేష్ఠములతో నిండినవనమును బాడు

చేసి, సమరమునందు గొప్పరాక్షసుల నందఱను బరిమార్చి, మేటి యిండ్లచే నొప్పిన యాలంకాపురమును గాల్చి తాను దలఁచిన కార్యము నెఱవేఱుటచే స్తిమితుఁడై త్రికూటశిఖరముకొన ప్రదేశము చేరి, తోఁక యందు మండుచున్న యగ్నిజ్వాలలుగలవాఁడు గనుక వేయికిరణములచే వెలుఁగు సూర్యునిచందమునఁ దేజరిల్లెను. ఇట్లు వనభంగము, రాక్షససంహారము, గృహదాహమును జేసి తానువచ్చిన కార్యము పూర్తియగుటచేత నిఁక రామునికడకుఁ బోవలసినదని తలఁచినవాఁడయ్యెను. వనధ్వంస రాక్షసవధ గృహదహనములను జేసి విరాజిల్లుచున్న యాహనుమంతుని వాయువేగముఁ బోలువేగముగల వానిని జూచి దేవగంధర్వసిద్ధకిన్నరమహర్షులు మున్నగువారు మిగుల స్తుతించిరి. మఱియు వారందఱు అంతటనుగాల్పఁబడిన యాలంకను జూచుచుమిగుల నాశ్చర్యపడిరి. ఇట్టివింత కార్యమును జేసిన యాహనుమంతునిఁ జూచి, "యితఁడు ప్రలయకాలాగ్నియో" అని సకలభూతములును వెఱచినవి. హనుమంతుని యద్భుతపరాక్రమముఁ జూచి సకలభూతములును మితిమీఱిన యుత్తమప్రీతినిఁ జెందినవి.

## 55-వ సర్గము

### హనుమంతుఁడు సీత నశించెనని వగచుట

మహాబలుఁడగు వానర శ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు లంకాపురము నెల్లదహించి, యావల తనతోఁకను సముద్రమున ముంచి చల్లార్చెను. అట్లతఁడు చల్లార్చి, యల్లాడుచుండు రాక్షసులతోఁ గూడినదై, రూపుచెడి యెల్లవైపుల నెఱియుచున్న లంకాపురమును బరికించుచుండఁగా, నతనికి గొప్ప భయమును, మనస్సున నొకవిధమైన యేవగింపును గలిగెను. తరువాత నతం డిట్లని చింతించెను.

"లంకను దహించుచు నేనెంత నీచపుఁబని చేసితిని! ఏమహాత్ములు మండుచున్న నిప్పును నీటితోఁ జల్లార్చునట్లు తమ మనస్సులందుఁ బుట్టిన కోపమును, జ్ఞానము తెచ్చుకొని యణఁచుకొనుచున్నారో, అట్టి పురుష శ్రేష్ఠులే పుణ్యాత్ము లనఁబడుదురు. క్రుద్ధుఁడైన యేమానవుఁడు పాపము సేయఁడు? క్రుద్ధుఁడైనవాఁడు గురువులను సైతము సంహరించును. కోపవంతుఁడు పరుసని మాటలతో సాధువులను నిందించును.

కోపమువచ్చినవాని కీమాట చెప్పవచ్చును, ఈమాట చెప్పరాదని తెలియదు. కోపవంతునికిఁ జేయరాని పని యని యొక్కటి లేదు. చెప్ప రాని మాట యని యొక్కటిలేదు. పాము పాఁతదైన తనపై కుబు సమును విడుచునట్లు, ఏమానవుఁడు తనమనస్సునఁ బుట్టిన కోపము నోర్పుతో నాఁపుకోనునో, అతఁడే పురుషుఁడని చెప్పఁబడును.

సీతాదేవి యిచ్చటనున్న సంగతి మఱచి, బుద్ధిహీనుఁడనై, లజ్జ మాని, కడు పాపిష్ఠుఁడనై, లంకాపురమును జిచ్చుపెట్టి, స్వామిని వధ మొనర్చినవాఁడనైతిని. ఛీ! యీనా బ్రదుకేల! మూఢుఁడనై నేను లంకాపురము దహించితిని గనుక సీతాదేవియుఁ దప్పక దహింపఁబడి నది గాయుండును. సీతాదేవియు దగ్ధురాలై యుండునేని, నాచేని కార్యము పాడై పోయనదే! ఏకార్యమునిమిత్తమై యింతప్రయత్నమో, ఆకార్యము చెడిపోయెను. నేను లంకాదహనము చేయుచు సీతారక్ష ణమును గావింపనైతిని. సీతను వెదకుట, రావణుని పురము పరికించుట, సీతను జూచుట, ఆసంగతి రామునికిఁ దెల్పుటయను నింత గొప్ప కార్యము రామునికిఁదెలుపుట మాత్రముకడమగాఁ చేయఁబడినది. కాని నేను క్రోధపరవశుఁడనై యీకార్యమును మొదలంటఁ జెరిచితిని. జానకి దప్పక యీమంటలోఁగలిసిపోయి యుండును. ఏలయన, ఈలంకా పురమున నేను దహింపని ప్రదేశమొక్కటి లేదు. పట్టణమంతయు బూదిసేసితిని. నాబుద్ధిలోపమువలన నీకార్యము సెడియుండునేని, నేనిచ్చటనే ప్రాణములఁ దొఱఁగుట యుక్తమని తోఁచెడిని. ఇప్పుడు నేనగ్నిలోఁ బడుదునా? లేక, బడబాముఖమునఁ జొత్తునా? సాగరము నందుఁ బడి యచ్చటి జలజంతువులకు నాదేహ మర్పింతునా? కార్య మంతయుఁ జెడఁగొట్టిన నేను ప్రాణములతోనుండి యేతీరున వానరుల జేనినిగాని నరోత్తములగు ఆరామలక్ష్మణులఁగాని చూడఁగలను? ముల్లోకములందును వానరస్వభావము చపలమని ప్రసిద్ధమైనదే కదా! కాఁబట్టియే నేను క్రోధరూపమైన లోపమున నీకార్యము చెడఁగొట్టి తిని గాదే! రజోగుణ సంబద్ధములగు కార్యములెల్ల నొకని యధికార మునకు లొంగియుండవు. ఈ రజోగుణవంతుఁడు దృఢమనస్కుఁడై యుండఁడు. నేను సీతారక్షణము చేయఁగలవాఁడనైయుండియు, సాగరుచేత సీతాదేవినిఁ గాపాడలేనివాఁడ నైతిని. సీతాదేవి వినాశ

మొందిన, రాజశ్రేష్ఠులైన రామలక్ష్మణులును వినాశ మొందుదురు. వారి వినాశవార్తవిన్నచో సుగ్రీవుఁడు బంధుసమేతముగాఁ బ్రాణములను వదలును. ధర్మస్వభావముగల భరతుఁ డీమాటను విని, సోదరప్రేమ గలవాఁడగుటచే శత్రుఘ్నసమేతముగాఁ బ్రాణముల వదలు ననుట కొకసందియము మున్నదే? కడు ధర్మనిష్ఠగల యిక్ష్వాకువంశ మెల్ల నాశ మొందఁగా, జనులందఱు దుఃఖమునొంది, మనసున తహతహపడుచు వినాశమునొందుదురు. కావున నేను అదృష్టహీనుఁడనై, ధర్మార్థములకు దూరుఁడనై క్రోధరూపమైన పాపమునకు లోఁబడినవాఁడనై తప్పక లోకమునకే చేటు దెచ్చి పెట్టినవాఁడనైతిని."

అని హనుమంతుఁడు వగచుచుండఁగా, ముందు జరిగినట్టి మంచి శకునములే కలిగెను. అట్లవి కలుగఁగా మఱల హనుమంతుఁ డిట్లు ధమునఁ జింతించెను: "నేను తలఁచినదియెల్ల సరిగాదు. సుందరములైన యన్ని యంగములుగల సీత తనప్రతాపముచే నశింపకయ యుండ వచ్చును. అగ్ని యగ్నిహోత్రు నేమియుఁ జేయదు. ఎక్కువ ప్రతాపముగల యారాముని దేవిని దనపాతివ్రత్యమహిమచే రక్షింపఁబడు దాని నగ్నిహోత్రుఁడు తాఁకనైనను జాలఁడు. నిక్కముగా నారాముని ప్రభావముచేతను, సీతాదేవియొక్క పుణ్యవిశేషముచేతను దహించు స్వభావముగలవాఁడయ్యు నీయగ్నిహోత్రుఁడు నన్ను దహింపఁడయ్యె. భరతుఁడు మొదలగు సోదరులకు ముగ్గురికిఁ బరదేవతయు, రాముని మనసున కెక్కినదియు నైనది గనుక, ఆదేవి యెట్లు నశించును? దహించు స్వభావము గలవాఁడయ్యు, ఈపావకుఁడు నాతోఁక నెట్లు దహింప కున్నాఁడో, అట్లే యాసీతాదేవిని గూడ దహింపకుండునుగాని యామె నాతఁడెట్లు దహించును? దేవీ ప్రభావమునం జేసియే సముద్రమధ్యమున మైనాకపర్వతము గనఁబడుటచేత నాయగ్నిహోత్రుఁడా సీతాదేవి నేమియుఁ జేయఁజాలఁడు. ఆమె తనయొక్క తపస్సుచేతను, సత్యము పలుకుటచేతను, భర్తనుదప్ప వేఱొక్కనిని ధ్యానింపమిచేతను ఆయగ్ని హోత్రుని దహింపఁగలదు గాని, ఆమె నగ్నిహోత్రుఁ డేమియుఁ జేయఁ జాలఁడు" అని హనుమంతుఁడు సీతాదేవియొక్క ధర్మప్రభావమును వర్ణింపుచుండఁగా, చారణులందఱు ఆకాశమునఁ గూడి, "రాక్షసుల గృహమునఁ జిచ్చుపెట్టినట్టి హనుమంతుఁడు జనులకుఁ జేయ నలవికాని

గొప్పపనిని జేసెను, ఈ లంకాపురము నలువైపులకుఁ బరుగెత్తు రాక్షసకాంతలతో యార్తనాదములతోఁ గూడినదై, జనకోలాహలములచే నిండి, పర్వతగుహంబోలె శబ్దించుచున్నది. అగడ్తలు, ప్రాకారములు, వెలుపటి ద్వారములు మొదలగు వానితోఁగూడ నీలంకాపురమంతయు మండిపోయినది. ఇంతపురమెల్ల దగ్ధమైనను సీతాదేవి దహింపఁబడకయున్నది. ఇదియే మాకు గొప్పవింతగా నున్నది" అని చెప్పుకొనుచుండుటను హనుమంతుఁడు వినెను. ఆహనుమంతుఁడు ఫలమును జూపినట్టి శకునములచేతను, విశేషగుణము గలవైన సీతా పాతివ్రత్య రామప్రభావాది సుగుణములచేతను, ఋషివాక్యములచేతను సీత క్షేమముతో జీవించియున్నదని యెఱిఁగి డెందమున నానందము నొందెను. అటుతర్వాత వానరుడు తానుదలఁచిన కార్యమెల్ల నెఱవేర్చికొన్నవాఁడై, సీతాదేవి యపాయము లేకున్నది యెఱిఁగి, మఱల తానును బ్రత్యక్షముగాఁ జూచి, మఱలుటకె పయనమాయెను.

## 56-వ సర్గము

### హనుమంతుఁడు లంకనుండి ప్రయాణమగుట

తర్వాత హనుమంతుఁడు శింశుపావృక్షముక్రిందఁ గూర్చుండియున్న సీతాదేవినిగాంచి, యామెకు నమస్కరించి, "దేవీ! దైవాధీనముగా నీకేమియు హాని కలుగకుండుట చూచుచున్నాను" అని చెప్పి, ప్రయాణమున కాయితము సేయుచుండెను. అట్టి హనుమంతుని సీతాదేవి పలుమాఱు చూచి, భర్తయందనురాగముతోఁ గూడినదయి యతనితో నిట్లనియె:

"ఓశత్రువీరుల సంహరించువాఁడా! నీవొక్కఁడవే రాక్షససంహారపూర్వకముగాఁ నన్నుఁగొంపోవుకార్యమును సాధింపఁ జాలుదువు. అయినను, ఈబలము గనఁబఱచుట నీకుఁ గీర్తికరమె కాని రామునికిఁ గాదు. శత్రుబలమును నుగ్గుసేయఁగల కాకుత్స్థుండు లంకాపురమును శరములతో నిండించి, నన్నుఁ గొనిపోయెనేని, అది యాతనికిఁ దగియుండును. మహాధీరుఁడును, యుద్ధవీరుఁడునైన యారాముని విక్రమమున కెది తగునో, ఆకార్యమును నీవు సేయవలసినది."

అని యర్థగౌరవము గలిగియుండునట్లును, సకారణముగను, ప్రేమ యుక్తముగను సీతాదేవి చెప్పినమాటను విని, "ఓదేవీ! కాకుత్థ్సుఁడు వానరశ్రేష్ఠసమేతుఁడై వచ్చి, యుద్ధరంగమున శత్రువులను బరిమార్చి, నీశోకము మాన్పగలఁడు" అని శత్రుసంహారియగు హనుమంతుఁడు సీతాదేవి నూఱడించి, ప్రయాణము సేయఁదలఁచి, సీతాదేవికి నమస్కరించి, తనయేలికను దర్శనము చేయఁగోరినవాఁడై, యరిష్టమను పేరు గల పర్వతోత్తమము నెక్కెను. ఆయరిష్టపర్వత మున్నతములైన పద్మకములనెడు చెట్లతో నిండిన నల్లనివనములవరుసలతోఁ గూడినదియు, శిఖరములనడుమ మేఘములు వ్రేలుచుండుటచేత నుత్తరీయము వేసికొన్నట్టు లుండునదియు, శుభము లొసఁగెడి సూర్యకిరణములచే నను రాగముచేత నిద్ర లేపఁబడినదో యన్నట్టు లుండునదియు, నేత్రములో యన్నట్టులుండు పైకిలేచిన కావిఱాలతోఁ గూడినదియు, నీటిప్రవాహముల మంద్రధ్వనులుగల దగుటచేత నధ్యయనము చేయఁ బ్రారంభించినట్లుండునదియు, తిన్ననైన పలువిధములైన సెలయేళ్ల చప్పుడులు గలదగుటచే గానముచేయునదివోలె నుండునదియు, మిక్కిలి పొడవైన దేవదారువృక్షము లుండుటచేఁ బైకిఁ జేతులెత్తినదో యన్నట్లుండునదియు, చఱియలనుండి పడు నీటిధ్వనులచే నంతట నఱచుచున్నట్లుండునదియు, చెదరిపోవునట్టి శరత్కాలమేఘములు గలదగుటచే వణఁకుచున్నట్లుండునదియు, గాలికి నెగురఁగొట్టఁబడిన వెదుళ్లను బొంగు వెదుళ్లు నుండుటచేఁ గూయుచున్నట్లుండునదియు, భయంకరములైన విషవంతములగు సర్పములు బుసకొట్టుచుండుటచే వేఁడినిట్టూర్పులు విడుచునట్లుండునదియు, గుహలందు మంచు దట్టముగాఁ గ్రమ్మియుండుటచే నింద్రియముల బంధించి, సమాధియం దున్నట్లు తోఁపఁజేయునదియు, మేఘశకలములంబోలు తిప్పలతోఁగూడిన దగుటచే నన్ని వైపుల దారి నడచిపోవుచున్న దానింబోలెఁ గనఁబడునదియు, ఆకాశమునొఱయుచున్న కొనలుగల దగుటంజేసి, యాకాశమున నొడలు విఱుచుకొనునట్లుండునదియు, హనుమంతుని కాళ్లతాఁకుళ్లచేఁ బలువైపులకుఁ జెదరిన పెక్కుగుహలుగల శిఖరములచే శోభిల్లునదియు, మద్దీ, తాడి, అశ్వకర్ణము లను చెట్లతోను పలువిధములైన వెదుళ్లతోను గూడినదియు, వెడల్పుగాఁ బర్విన పూఁచిన తీఁగలచే నలంకరింపఁబడినదియు;

బహువిధములగు మృగములతోఁ గూడినదియు, కావిఱాలతోఁ గూడిన యూఁటలుగలదియు, తీఁగెలయు చెట్టులయు గుంపులతోఁ గూడినదియు, సింహములకు సునికిపట్టయిన గుహలుగలదియు, పులులగుంపులతో నిండినదియు, పెక్కు సెలయేళ్లతోఁ గూడినదియు, ఱాలగుంపులచే క్లిష్టమైనదియు, మహర్షి, యక్ష, గంధర్వ, కిన్నర, పన్నగులు నివాసము చేయునదియు, తియ్యని దుంపలును, ఫలవృక్షములును గలదియునై యుండెను. హనుమంతుఁడు రామదర్శనమందలి యుత్సాహము తన్నుఁ బురికొల్పుచుండఁ గడువడితోఁ గూడినవాఁడై యట్టి రమ్యమైన యరిష్టపర్వతము నెక్కెను. ఆహనుమంతుని యడుగుల క్రిందఁబడిన యారమ్యమయిన యరిష్టపర్వతముయొక్క చరియలందలి ఱాళ్లు పొడిపొడియై గొప్ప చప్పుడుతోఁగూడ నలుదెసలకుఁ జెదరి పడిపోయెను.

శూరుఁడైన హనుమంతుఁడు పర్వతోత్తమ మెక్కి, ఆ లవణ సముద్రముయొక్క దక్షిణతీరమునుండి యుత్తరపుగట్టును బొందఁ గోరినవాఁడై, తనదేహమును బెంచినవాఁడాయెను. హనుమంతుఁడు తనదేహము నట్లు పెంచి పర్వతముకొనకెక్కి, మత్స్యములు, పాములు మున్నగు జలజంతువులచే భయంకరమై యుండుసాగరమును జూచి, తాను వాయునందనుఁడగుటచే నతనివలె వడిగాఁ బోవువాఁడై, యా యుప్పుకడలి దక్షిణపువైపునుండి యుత్తరపుగట్టునకుఁ బోవఁబూనెను. ఆ హనుమంతుఁ డెగురుటకై కాళ్లానినందున నాయరిష్టపర్వతము తన యందు వసించు జీవరాసులతోడను, వడఁకుచున్న శిఖరములతోడను, పడుచున్న మ్రాఁకులతోడను నేలకుఁ గ్రుంగుచు గొప్పధ్వని గలిగించెను. ఆహనుమంతుని తొడలవేగముచే పుష్పములుగల వృక్షములన్నియు విఱిగి చిందరవందరలై, పిడుగడిచినవి వోలె నేలఁ గూలినవి. ఆపర్వతపు గుహలలో నుండు ఎక్కువ బలిమిగలవగు సింగములును పీడితములై యాకాశము బ్రద్దలగునట్లు గర్జించినవి. ఆపర్వతమునందలి విద్యాధర స్త్రీలు భయముచేఁ దాఱుమాఱయిన వస్త్రములును, భూషణములును గలవారలై పర్వతమునుండి యకస్మాత్తుగాఁ బైకెగిరిపోయిరి. మితిమీఱిన పొడుగుగలవియు, బలిమిగలవియు, మండుచున్న వాఁడి నాలుకలును, మహావిషమును గలవియునైన గొప్పపాములు తలయు

మెడయు నలిగి క్రిందఁబడి చుట్టలు చుట్టుకొనెను. కిన్నరులు, పన్నగులు, గంధర్వులు, యక్షులు, విద్యాధరులు ఆపర్వతశ్రేష్ఠ మట్లు కదలుట చూచి, యాకాశమున కెగసిరి. పదియోజనముల వెడల్పును, ముప్పది యోజనముల యెత్తును గల యాయరిష్టపర్వతము బలిమిగల హను మంతునికాలియదఁటునకు నలిగినదై యెత్తయిన వృక్షములుగల శిఖరములతోఁ గూడఁ బాతాళమునకుఁ గ్రుంగి, భూమిమట్టమునకు సమమాయెను. అప్పుడు హనుమంతుఁ డనాయాసముగా భీకరమయిన గొప్పయలలచే దరిదాఁటుచున్న యుప్పునీటి సముద్రమును దాఁటఁ బూనినవాఁడై యాకాశమున కెగిరెను.

## 57-వ సర్గము

### హనుమంతుఁడు సముద్రము దాఁటివచ్చుట

చంద్రుఁడనెడి తెల్లగలువగలదియు, సూర్యుఁడనెడి బెగ్గురుపక్షి గలదియు, తిష్యశ్రవణనక్షత్రములనెడి నీటికోళ్లతోఁ గూడినదియు, మేఘములనెడి పాచితీఁగెలు పచ్చికపడియలుం గలదియు, పునర్వసు నక్షత్ర మనెడి సొరచేఁపలు గలదియు, అంగారకుఁ డనెడి గొప్ప మొసలియు, ఐరావతం బనెడి గొప్పదీవియు, స్వాతియనెడి హంససంచారముం గలదియు, వాయుసమూహ మనెడి యలలు గలదియు, చంద్రకిరణములనెడి చల్లని నీళ్లుగలదియు, యక్షులు, పన్నగులు, గంధర్వులు ననెడి వికసించిన కమలములు గలువలును గలదియునై, యపారమై రమ్యమయిన యాకాశమను సముద్రమును, వాయువేగముగల హనుమంతుఁడు శ్రమము లేకయే సముద్రమును బోగయోడవలె దాఁటఁబూనెను.

గొప్పయాకారముతోఁ గూడినవాఁడై యాకాశమునఁ బోవుచుండు వాయుపుత్రుఁ డయిన హనుమంతుడు ఆకాశమును మ్రింగువాని కైవడియు, చంద్రుని నొఱచువానివగిదియు, సూర్యమండలముతోను నక్షత్రమండలముతోను గూడ నాకాశమును గొనిపోవునట్లును, మేఘములగుంపు నీడ్చుకొని పోవునట్లును పోవుచుండెను. గొప్పమేఘములు హనుమంతుని కూడికవలనఁ దెల్లనివియు, నెఱ్ఱనివియు, నీలములైనవియు; పసుపుపచ్చనివియు, ఆకుపచ్చనివియునై ప్రకాశించెను. అట్టి మేఘమండల మధ్యమున హనుమం

తుఁడు మాటిమాటికిఁ జొఱఁబాఱుచు, మఱల వెలుపలికి వచ్చుచుఁ జంద్రునిమాడ్కిఁ దెలిసియుఁ దెలియకయు నుండెను. మఱియు శూరుఁడయిన హనుమంతుఁడు దెల్లనిబట్ట కట్టినవాఁడై పలుమబ్బులగుంపులందలి దారినిబోవుచు, మేఘమండలమునడుమఁ బోవునప్పుడు అదృశ్యుఁడును, మేఘములనుండి వెలువడినప్పుడు దృశ్యుఁడునై చంద్రునికైవడిఁ బ్రకాశించెను. ఇట్లు శౌర్య తేజములు గలవాఁడయిన హనుమంతుఁడు గరుడునివలె నాకాశమునఁ బోవుచు, మేఘములనడుమఁ జొచ్చుచు, వానినుండి వెలువడుచు, ఉరుమువలెబొబ్బవెట్టుచు రాక్షసవీరుల నందఱిని సంహరించి, తనపేరు వెల్లడిపఱచి, లంకాపురము నెల్ల చీకాకుపఱచి, రావణునికి వ్యసనము గలిగించి, భయంకరసేన నెల్ల నొప్పించి, సీతాదేవికి మ్రొక్కి, మఱలి సాగరమధ్యము నొంది, మైనాకపర్వతమును వీడ్కొని, యల్లెత్రాటినుండి విడువఁబడిన బాణముమాడ్కి వేగముతో వచ్చి మేఘసదృశమగు మహేంద్రపర్వతశ్రేష్ఠమును జూచి, సమీపమునకు వచ్చితి నన్న సంతముతోఁ గిలకిలధ్వనిని జేయఁగా, ఆ కిలకిలధ్వని పదిదిక్కులందును నిండెను. చెలికాండ్రదర్శనోత్సాహము గలవాఁడై ఖగమార్గమున వచ్చు హనుమంతుఁడు పలుమాఱు సింహనాదము చేసెను. తోఁక యాడించెను; ఆ గొప్పనాదమునకు సూర్యమండలమున ఆకాశమును బ్రద్దలగునట్లు తోఁచెను.

హనుమంతుఁడు వచ్చునప్పుడు సముద్రపు టుత్తరతీరమున గూర్చుండియుండిన శూరులైన బలవంతులగు వానరులందఱు గాలిచే ద్రోయఁబడుచున్న మేఘము యొక్క గర్జనముం బోలు గర్జనమున ఊరువేగమును విన్నవారై, తమమిత్రునిఁ జూచుటయం దాశతోనుండిరి

వానరులలో గొప్పవాఁడగు జాంబవంతుఁడు మనస్సునందమిక్కిలి యుప్పొంగి, తక్కిన వానరుల నందఱను జూచి, "హనుమంతుఁడు తప్పక కార్యము సాధించుకొని వచ్చెను. దీనికి సందియుము లేదు. అట్లైతఁడు కార్యమును సాధించుకొనక వచ్చియుండునేని, ఇవ్విధముగా నాదము చేసియుండఁడు" అని చెప్పెను.

ఆవానరు లందఱు ఆమహాత్ముని బాహువేగమును, తొడల వేగమును, విజయనాదమునువిని యానందముచే నచ్చటచ్చట గంతులు వైచిరి. హనుమంతునిఁ జూడఁగోరి చెట్లకొనలనుండి వైచెట్లకొనలకును

పర్వతశిఖరములనుండి పై పర్వతశిఖరములకును నెగిరిదుముకుచు నందఱు గూడిరి. చెట్లకొనలందలి కొమ్మలను బట్టుకొని, వాని తెమ్మలను బట్టలను బోలె విసరిరి. గాలి కొండలగుహలందు నిండినదై ధ్వనించుచందమున, బల్మిగల హనుమానుఁడు సమీపమునకు వచ్చి గొప్పబొబ్బరింత పెట్టెను. మబ్బులగుంపు మాడ్కి వచ్చుచున్నయా హనుమంతునిఁ జూచి, వానరు లందఱు చేతులు జోడించికొని నిలఁబడిరి. అటుతర్వాతఁ బర్వతము మాడ్కి గొప్ప యాకారము గలవాఁడైన హనుమంతుఁడు సంతసముచే నిండినవాఁడై పెక్కు వృక్షములతో దట్టమయిన యా మహేంద్ర పర్వతశిఖరమునందు రమ్యమైన సెలయేటిపట్టున తెక్కలు దెగిన పర్వతము మాడ్కి నాకాశమునుండి పడెను.

అంత వానరోత్తము లందఱు డెందములం దుప్పొంగి, యా మహాత్ముండైన హనుమంతు ననామయముగ వచ్చినవానినిఁ జుట్టుకొని, యెక్కువ ప్రీతి నొందినవారలై, కందమూలఫలములు దెచ్చి మర్యాద చేసిరి.

ఆ హనుమంతుఁడును జాంబవంతుఁడు మొదలగు పెద్దల కెల్లను, యువరాజగు నంగదునికి నమస్కరించి, తానును జాంబవదంగదుల చేతను, తక్కిన వానరులచేతను మర్యాదలువడసినవాఁడై, "చూచితిని సీతాదేవి" నని సంగ్రహముగాఁజెప్పెను. అట్లు చెప్పి, హనుమంతుఁడు కార్యసిద్ధిచే సంతుష్టుఁడై యంగదుని చేయిపట్టుకొని, మనోహరమైన యొక మహేంద్రపర్వతప్రదేశమునఁ గూర్చుండి వానరశ్రేష్ఠులందఱు వినునట్లు, "పతివ్రతయగు సీతాదేవి లంకాపురమున నశోకవనమున నుండఁగాఁ జూచితిని. భీతిని గలుగఁజేయు రాక్షసు లామెకుఁ గావలి యుండిరి. ఆమె ఒంటిజడఁ దాల్చి, రామునిదర్శనమందే యాసక్తి గల్గినదొటచే నుపవాసములు చేయుచున్నందున డస్సినదియు, జడలు దాల్చినదియు, మాలిన్యము గలదియు, భర్తృవియోగశోకముచేఁ జిక్కినదియునై యుండెను.

వానరు లందఱు గొప్పయర్థము గలదియు, అమృతముఁ బోలినదియునైన "చూచితిని" అనుమాట వినఁగానే మోదము నందిరి. వానరులలోఁ గొందఱు సింహనాదము గావించిరి. కొందఱు అవ్యక్త నాదము జేసిరి, కొందఱు గర్జన చేసిరి, కొందఱు కిలకిలధ్వనిని గావించిరి.

కొందఱు ప్రతిగర్జనము చేసిరి. కొందఱు లావై నిడుపు గలిగి చక్కనై యున్న తమతోఁకలను బైకెత్తి నేలమీఁద బాదిరి. మఱికొందఱు వానరులు సంతసముతోఁ బర్వతశిఖరములనుండి యెగిరిదుమికి యేనుగుం బోలెడి యా హనుమంతునిఁ దడవిరి.

అనంతరము సీతను జూచితి నని చెప్పి, వానరుల మధ్యమునఁ గూర్చుండియున్న హనుమంతునిఁ గాంచి అంగదుఁడు "ఓ వానరోత్తమా! బలవీర్యములందు నీకు సమానుఁ డెవ్వఁ డున్నాఁడు? నీవొక్కఁడవే సముద్రమును దాఁటి సీతను జూచి మఱలి వచ్చితివి ఆహా! నీ స్వామిభక్తి యెంతటిది! నీధైర్య మెంతటిది! నీమగఁటిమి యెంతటిది! దైవానుగ్రహముచే నీవు పతివ్రత యని పేరెన్నిక గన్న సీతాదేవిని గాంచితివి. దైవానుగ్రహమున శ్రీరాముఁడును సీతా విరహజనితమైన శోకమును విడువఁగలఁడు." అని హనుమంతుని శ్లాఘించెను. తరువాత నంగదుఁడును జాంబవంతుఁడును, నడుమఁ గూర్చుండియుండఁగా, తక్కిన వానరు లందఱును హనుమంతుఁడు సముద్రము దాఁటుట, లంకాపురము సొచ్చుట, సీతాదేవిని గాంచుట మొదలగు సంగతులు వినఁగోరి, యాతని మోముపైపుననే మోరలెత్తి చూచుచు, దోసిళ్లుకట్టికొని, చుట్టునుండు బండలపైఁ గూర్చుండిరి. వానరోత్తములచేఁ బరివేష్టితుఁడయిన యా యంగదుఁ డప్పుడు దేవతలచేఁ బరివృతుఁడైన వేల్పుఱేనిమాఁడ్కిఁ బ్రకాశించుచుండెను. కీర్తిమంతుండగు హనుమంతుఁడును, బాహుపురులను దాల్చిన ప్రసిద్ధుఁడైన యంగదుఁడును వానరగణముతోఁ గూర్చుండియుండఁగా నా పర్వతశిఖరము దేదీప్యమానమై యుండెను.

## 58-వ సర్గము

### హనుమంతుఁడు తనవృత్తాంతము దెల్పుట

తర్వాత నామహాబలులగు హనుమంతుఁడు మొదలుగాఁగల వానరోత్తములందఱు మహేంద్రపర్వతశిఖరమున నెక్కువ యానందముతో ముచ్చటలాడుచుండఁగా, జాంబవంతుఁడు సంతోషము నొందినవాఁడై, తనయందుఁ బ్రేమగలవాఁడయిన వాయునందనుఁడగు హనుమంతునిఁ జూచి, "నీ వెట్లులంకయందు సీతాదేవినిగాంచితివి? ఆమె

యచ్చట నెవ్విధమున నున్నది? క్రూరపుఃబనులు సేయువాఁడగు ఆరావణుఁడా దేవియం దెట్టినడత చూపుచున్నాఁడు? ఓ గొప్పవాన రుఁడా! యీ సంగతి యెల్ల మా కున్నది యున్నట్లు చెప్పుము. నీవలన నీ సంగతి విన్నవారమై యావల చేయవలసిన కార్యముగూర్చి యాలోచింతము. మన మచ్చటికిఁ బోయినప్పు డేమి సంగతి రామునికడ విన్నవింప వచ్చును? ఏది దాఁప నగును? బుద్ధిమం తుఁడా! అది యెల్ల 'మాకు వివరించి చెప్పుము" అని యడుగఁగా, హనుమంతుఁడు సంతోషముచే మేన గగుర్పాటొందినవాఁడై, సీతా దేవికి శిరముతో మ్రొక్కి, యా జాంబవదాదులతో నిట్లు తన సముద్ర తరణాది వృత్తాంతము చెప్పఁదొడఁగెను:

నేను సముద్రముయొక్క దక్షిణపుగట్టును జేరుకోరికతో నేమఱు పాటు చెందక మీయెదుటనే కదా మహేంద్రపర్వతమునుండి యాకా శమున కెగిరితిని. నేను పోవుచుండఁగా నాకొక ఘోరరూపము విఘ్నముమాడ్కి నడ్డపడెను. బంగారు శిఖరములు గలదై మిగుల మనోహరమైన యొక పర్వతము నా దారి కడ్డముగా నిలిచి, నాగమన వేగము నాఁపఁగా, అది నన్నాఁపవచ్చిన దని యెంచి, కనకశృంగము గల పర్వతోత్తమమును దాఁటి క్రిందఁ ద్రోయవలసినదని యెంచి, నాతోఁకతో నా పర్వతము నొక దెబ్బ గొట్టఁగా, సూర్యునిఁబోలె వెలిఁగెడి యాపర్వతశిఖరము వేయితునుకలై చిందరవందరలయి చెదరి పోయెను. అట్టి నా మహోత్సాహమును జూచి "ఓరినాయనా" యని నామనస్సున కానందము గలిగించువానిమాడ్కి నింపుగాఁ బిలిచి యా పర్వతుఁ డిట్లనియె:

"ఓ హనుమంతుఁడా! నేను నీకుఁ బినతండ్రిని. నీతండ్రికిఁ జెలికాఁడను. నాపేరు మైనాకుఁ డందురు. నేను సముద్రములోపల నుండువాఁడను. పుత్త్రుఁడా! తొల్లి గొప్పపర్వతముల కెల్ల ఱెక్క లుండెను. అవి ఱెక్కలు గల వగుటచేఁ దమ యిచ్చవొప్పునఁ దిరు గుచు, వాలినచోట నుండు నూళ్లను, జనులను బాధించుచుండినవి. అప్పుడు దేవేంద్రుఁడు పర్వతముల చెడ్డనడవడిం జూచి, కడు నలిగిన వాఁడై వజ్రాయుధముతో వేలకొలఁది పర్వతముల ఱెక్కలను ఖండిం చెను. అట్లు దేవేంద్రుఁడు పర్వతముల ఱెక్కలు నఱకుచు వచ్చు

నప్పుడు పుణ్యాత్ముఁడయిన నీ తండ్రి నన్నుఁ గొనివచ్చి యీ మహా సముద్రమునఁ ద్రోసెను. కావున నీ తండ్రివలన నేను దప్పించుకొంటిని. ఓశత్రుసంహారీ! రాముఁడు ధర్మపోషకులలో నుత్తముఁడు. మహేంద్ర సమవిక్రముఁడు. అట్టి రామునికి నేనును సాహాయ్యము చేయవల యును. కావున నీవు నాయెడఁ గొంత తడవు విశ్రమింపుము " అని మైనాకుఁడు చెప్పఁగా, నేనును పని తొందర యోజిఁగించి, యా మహా త్మునిచే నుత్తరువు గైకొన్నవాఁడనై తఱలితిని. ఆ మైనాకుఁడును గొప్ప మానవశరీరముతోను శైలరూపముతోను నంతర్ధానము నొం దెను. నేనును ఎక్కువ వేగముపూని, మిగిలినదారిపట్టి చాలదవ్వు పోయితిని.

అప్పుడు నేను సముద్రమధ్యమున నాగముల తల్లి యగు సుర సను జూచితిని. ఆ దేవి నన్నుఁ జూచి, "ఓ వానరోత్తమా! దేవతలు నిన్ను నా కాహారముగా నియమించిరి. కావున నేను నిన్ను భక్షింపఁ గోరెదను. నీవు బహుకాలమునకు మునుపే నా కాహారముగా నేర్పడి తివి" అని చెప్పఁగా, నేనును చేతులు జోడించుకొని, యడఁకువతో నిలఁబడి, మోమున విన్నఁదనము దోఁప నా సురసను జూచి " కాంతి మంతుఁడయిన దశరథపుత్త్రుఁడగు రాముఁడు తమ్మునితోను, భార్య యగు సీతతోను గూడి దండకావనమునకు వచ్చెను. దురాత్ముఁడగు రావణుఁడు ఆ రాముని దేవి యగు సీత నపహరించెను. ఆ రాఘువుని యానతినిబట్టి నేను సీతాదేవికడకుఁ బోవుచున్నాఁడను. నీ వా రాముని పాలనలోని దేశమందున్నావు. నీవును అతనికి సహాయపడవలసినది. అట్లుచేయనంటివా, నేను సీతాదేవినిఁ జూచి వచ్చి యాసంగతి రాము నికిఁ దెలిపి, పిమ్మటవచ్చి నీనోటఁబడెదను. సత్య ప్రతిజ్ఞ చేసెదను" అని నేను పలికితిని. ఆ కామరూపిణియగు సురస నేను జెప్పిన మాటను సరకుసేయక ; " ఎవ్వఁడు గాని నన్నుమీఱి పోఁజాలఁడు. ఇది నాకు బ్రహ్మదేవుఁ డొసఁగిన వరము" అని చెప్పి, తననోటిని పదియోజనముల వెడలుపుగలుగునట్లు తెఱచెను. నేను నాదేహమును బదియోజనముల వెడల్పుగలుగునట్లు పెంచితిని. మఱల నాసురస నా యాకారమునకుఁ దగినట్లుగా తననోటిని దెఱచుటచూచి, నేను క్షణములోపల నా దేహ మును గుఱుచపఱచి బొటనవ్రేలియంతటివాఁడనై, యా సురస నోటి

లోపల దూరి మఱు క్షణములోపల బయటికి వచ్చితిని. అంత సురస స్వస్వరూపము దాల్చి నాయెదుట నిలఁబడి "సాధువయిన యోహరి శ్రేష్ఠుఁడా! నీకు కార్యసిద్ధి యగును. సుఖముగాఁ బోయి రమ్ము. సీతాదేవిని మహాత్ముఁడగు రామునితోఁ జేర్పుము. నిడుదచేతులుగల యో వానరశ్రేష్ఠుఁడా! నిన్నుఁ జూచుటచే సంతోషమందితిని. నీవు సుఖముగా నుండుము" అని చెప్పి యంతర్ధానము నొందెను. నా యీ వింతకార్యమును జూచి, సకలభూతములును బాగు బాగని కొని యాడిరి.

తర్వాత నేను గరుడునిమాడ్కి విశాలమైన యాకాశమున కెగిరి పోవుచుంటిని. అట్లు పోవుచుండఁగా నానీడ నేదియో లాగి పట్టెను. అచ్చట నేమియు నాకంటికిఁ గనఁబడలేదు. నాగతివేగము తగ్గుటచేఁ బదిదిక్కులు చూడఁగా, నాగమనము నడ్డగించినది యేదియో కనఁబడకుండెను. అప్పుడు "ఇది యేమి వింతగా నున్నది! ఉన్నట్టుండి నాగమనమున కిట్టి యాటంకము గలిగె" నని కొంత తడవు చింతించి, క్రిందివైపు చూడఁగా, సముద్రమున నీటిపైన వెలికిలఁ బరుండియున్న భీకరమైన రాక్షస స్త్రీయొకతె యగపడె. అంతనారాక్షసి యట్టహాసము చేసి, గొప్ప బొబ్బరింత పెట్టి, ధైర్యముతోఁ గూడి, తత్తరపాటు మాని, "ఓ గొప్పమేనివాఁడా! యెక్కడికిఁ బోవుచున్నావు? నేను బహుదినములుగ నాహారము లేక యాఁకలిచే డస్సియున్నాను. నీవు నాకు మంచియాహారమవై నా యాఁకలిని దీర్పుము" అని నిష్ఠుర ముగాఁ బలికెను. అట్లే కానిమ్మని యా రాక్షసిమాట యొప్పు కొని, దానినోటివెడల్పుకంటె నెచ్చు వెడల్పుగలుగునట్లు నాదేహ మును బెంచితిని. అదియు నన్ను మ్రింగుటకై తననోటిని వెడ ల్పుగాఁ బెంచెను. నేను కోరిన రూపము దాల్పఁగలవాఁడననికాని, నే నింత గొప్ప రూపము గార్యార్థమై యెత్తి యున్నానని కాని యది యెఱుఁగదయ్యె. వెంటనే నేను నాదేహమును నిమిషము లోపల సంకోచపఱచి, దానినోటిలోపలఁ బ్రవేశించి దానిహృదయము నెత్తికొని పైకెగిరితిని. అట్లెగిరి, దానిరొమ్మును జీల్చి వెలుపలికి రాఁగా, పర్వతముఁ బోలినయారాక్షసి చేతులు వ్రేలవైచికొని సముద్రమునఁ బడెను. అప్పు డంతరిక్ష సంచారులయిన సిద్ధచారణులు మొదలగువారు

"క్రూరురాలైన సింహికను హనుమంతుఁడు శీఘ్రముగా వధించె"నని సంతోషముతోఁ జెప్పుకొనుచుండిరి.

నే నాసింహికను జంపి, యా ప్రాణాంతకమైన కార్యమును దలఁచుకొని, బహుదూర మేగి, పర్వతములచే నలంకృతమైయున్న లంకాపుర ప్రాంతపుసముద్రపు దక్షిణతీరముఁ జేరితిని. సూర్యుఁ డస్తమించు వఱకు నచ్చట నొక పర్వతమున నుండి ప్రొద్దు గ్రూఁకినతోడనే సర్వ రాక్షసులకు నివాసస్థలమైన లంకాపురమును భీకరపరాక్రములగు రక్షక భటులయిన రాక్షసులకుఁ దెలియకుండఁ బ్రవేశించితిని. అప్పుడు ప్రలయకాలపు మబ్బువలె గొప్పరూపము గలదైన యొక రాక్షసభామ యట్టహాసముచేయుచు నాముందటికి వచ్చి నిలఁబడెను. మండుచున్న అగ్నిహోత్రునివలె వెలుఁగు శిరోజములు గలదగుచు, నన్నుఁ జంపఁ గోరియున్న యాభీకరరాక్షసిని యెడమచేతి పిడికిలితో నొక గ్రుద్దు గ్రుద్ది క్రిందఁ ద్రోచి, ప్రదోషకాలమునఁ బట్టణమునఁ బ్రవేశించుచుండ' అప్పు డారాక్షసి, నాకు వెఱచినదై, "ఓవానరా! నేను లంకాపురమను' నన్ను నీవు పరాక్రమముచే గెలిచితివి కావున, ఈ లంకాపురమునందలి రాక్షసుల నందఱి నడ్డులేకుండ గెల్వఁ గలవు." అని చెప్పెను.

అంత, లంకాపురమున రాత్రియంతయు రావణునియంతఃపుర మున వెదకియు, సీతాదేవిని గాంచనైతిని. నే నట్లు సీతాదేవిని గాంచక, శోకసముద్రమును బొంది దానికి దరిగానక, మఱలఁ జూతునని వెదక నారంభించి, కడునెత్తయిన బంగారు ప్రాకారముతోఁ గూడిన యుద్యాన వనమొక్కటి చూచితిని. ఆ యుద్యాన వనప్రాకారముమీఁది కెగిరి దుమికి, ఆవనమునందున్న పెక్కువృక్షములను జూచితిని. ఆవనము నడుమ గొప్ప శింశుపావృక్ష మొక్కటి కలదు. ఆ చెట్టెక్కి చూడఁగా బంగారుమయమయిన యరఁటితోఁట గనఁబడెను. పతివ్రతయు, తమ్మి రేకులంబోలు కన్నులు గలదియు, శ్యామవర్ణయు, ఉపవాసములచే బెండుపాఱిన మోముతోఁ గూడినదియు, ఆరావణుం డపహరించుకొని వచ్చినప్పుడు ధరించియున్న యొంటిచీరనే కట్టుకొన్నదియు, తలవెండ్రుకలు నిండుగా దుమ్ముచేఁ గ్రమ్మఁబడినదియు, దుఃఖసంతాపముచేఁ జిక్కిన యవయవములతోఁ గూడినదియు, భర్తయొక్క హితమునే కోరునదియు నైన సీతాదేవి మాంసరక్తములం దాశగల యాఁడుపులులచేఁ

జుట్టఁబడిన యాఁడుజింక చందమున, అసహ్యరూపములుగల క్రూరఁ రాక్షసాంగనలచేఁ గావలి కాఁచబడుచు, ఆ శింశుపావృక్షము చేరువ గూర్చుండియుండఁగాఁ జూచితిని. ఆసీతాదేవి తన్ను రాక్షసాంగనలు చుట్టు గూర్చుండి మాటిమాటికి బెదరింపుచుండఁగా, రావణుఁడుతన్నుఁ బలువిధముల వేఁడికొన్నను, వానిని గోరక, రాక్షసస్త్రీలు పెట్టెడి కాఁకి యల నోర్వఁజాలక, ఒంటి జడనుదాల్చి, భర్తనుగూర్చియే చింతించుచు నేలమీఁదఁ బరుండి, శిశిర ఋతువునందలి తామరతీఁగ మాడ్కి నింపుదఱిగి నదై, మరణమునకు సిద్ధురాలై యుండఁగా, నేనట్టిస్థితిలోనున్న యా దేవింగాంచి, యా శింశుపావృక్షముననే దాఁగి యుంటిని. ఆ సమయ మున రావణుని యింటినుండి మొలనూళ్లయుఁ గాలియందెలయుఁ జప్పుడుతోఁ గూడిన యొకకోలాహలమును వింటిని. ఆ చప్పుడు విని నేను మిక్కిలి యులికిపడినవాఁడనై, నారూపమును విడిచి, యొకపక్షి వలెఁ జిన్నిరూపుదాల్చి దట్టమైన యాకులుగల యాశింశుపావృక్షము యొక్క కొమ్మయందే దాగియుంటిని.

తర్వాత మహాబలవంతుఁడగు రావణుఁడు తనభార్యలఁ దోడ్కొని, యాసీతాదేవి యున్నచోటికి కేగుదెంచెను. ఆసీతాదేవి ఆవచ్చెడు గొప్పబలిమికాఁడయిన రాక్షసునిఁజూచి, తొడలను ముడుచు కొని, పీన స్తనములను జేతులతోఁ గప్పుకొని, యెక్కువ భయము మనమునఁ దోఁప నులికిపడి యిటటు చూచుచు, ఎవరిని శరణు గానక వణఁకుచు జాలిచూపఁదగినదై కడువ్యసనముతోఁగూడి తలవంచియుండె. అట్టియా సీతాదేవినిజూచి, రావణుఁడు తాను తలవంచి నమస్క రించి, "ఓదేవీ! నన్ను దయతోఁ జూడు"మనియు, ఓగర్వముపట్టినదానా! ఇఁక రెండు నెలలలోపల నీ వహంకారముచే నన్నుఁగోరవేని, నీరక్త మును గుటగుట త్రాగుదు"ననియు నయభయములచే బెదరించెను.

సీతాదేవియు చెడుతలంపుగలవాఁడయిన రావణునిమాటను విని, మిక్కిలి యాగ్రహముపూనినదై, హితవాక్యముల నిట్లనెను: "ఓరాక్షసాధమా! ఇక్ష్వాకు వంశమునకు నాయకుఁడయిన దశరథమహా రాజునకుఁ గోడలును, ఎక్కువ ప్రతాపముగల రామునికిభార్యను నైన నన్ను నీవిట్లనరాని మాటల ననుచున్నాఁడవే? నీనాలుక తునిగి యేల క్రిందఁబడక యున్నది? ఓరి కులహీనుఁడా! నా పెనిమిటి దగ్గఱలేని

యప్పుడు నీశౌర్యము చూపుచున్నాఁడవు. ఓరీ పాపాత్ముఁడా! నీవు నామగఁడు లేనియప్పుడు నన్ను దొంగవలె నెత్తికొని పాఱివచ్చితివే? ఇప్పుడేల బింకములు కొట్టుచున్నావు? ఓరీ! నీవు రామునితో సాటి యగుదువే? రాఘవుఁడు యజ్ఞములందుఁ బూజింపఁదగినవాఁడు. సత్యము పలుకువాఁడు. యుద్ధములందు సామర్థ్యము చూపువాఁడు. అట్టి రామునికి నీ వే విషయమున సాటియగుదువు? నీ వతనిని కొలుచుట కైనను దగవు." అని నిష్ఠూరపు మాటలాడఁగా, పంక్తికంధరుఁడు కాటియందుంచిన నిప్పువలెనే కోపముచే మండిపడినవాఁడై గుండ్రనైన తన గ్రుడ్లను త్రిప్పి, తనకుడిచేతి పిడికిటిఁ బైకెత్తిపట్టి సీతాదేవిని జంపఁ బూనెను. అప్పుడు స్త్రీలందఱు గగ్గోలు సేసిరి. దురాత్ముఁడయిన రావణునితోఁగూడవచ్చిన యాతని భార్యలలోఁ బెద్దదైన మండోదరియను నామె మదనాతురుఁడయిన రావణుని నివారించి, "దేవేంద్రునిఁబోలు మగఁటిమిగల యోనాథా! యీసీతతో నేమి సుఖమనుభవింతువు? నీకడ దేవగంధర్వయక్షకిన్నర కన్యకలు పెక్కండ్రున్నారు. వారితో రమింపుము" అని సమాధానపఱచెను. అంత నందఱు రాక్షసకాంతలును రావణుని నిమ్మళపఱచి, స్వగృహమునకుఁ దోడ్కొనిపోయిరి. దశగ్రీవుఁడు వెడలిపోయినవెంటనే యాసీతాదేవికిఁ గావలియున్న రాక్షసకాంత లందఱు కడునిష్ఠూరంపు బెదరుమాటలతో నామెను నిందించిరి. ఆసీతాదేవి వారిమాటలను దృణప్రాయముగా నెంచెను. వారిమాటలును, బెదరింపులును ఆమెకడ నిరుపయోగము లాయెను. తర్వాత నారాక్షసులందఱు దమమాటలు మొదలగునవి యామెకడ సాగకుండుటఁ జూచి, యుత్సాహము మాని, యాదేవియొక్క మనోనిశ్చయమును రావణుని కెఱిఁగించి, తమవాగ్బాణము లామెయందు దూఱమిచేఁ బూనికిలేనివారై, యామెచుట్టును పరుండి నిద్రించిరి. అందఱు నిద్రించుచుండఁగా, తన భర్తృహితమునే కోరునట్టి సీతాదేవి తన దురవస్థను గూర్చి మిక్కిలి వగచి కన్నీరు విడిచెను.

ఆ సమయమున ఆరాక్షసులనడుమ నున్న త్రిజటయను నొక రాక్షసి, రాక్షసకాంతల నుద్దేశించి యిట్లనియె: "ఓ చెలులారా! మీరు నన్నుఁ దినుఁడు. సీతనశింపదు. జనక రాజపుత్రికయు, దశరథునికిఁ గోడలును, రామునిదేవియు నైన సీతాదేవి నేమియు ననకుఁడు. నే

నిప్పుడే భయంకరమై మేనికి గుగ్గురుపాటు పుట్టించునట్టి దైన యొకకల గంటిని. అది రాక్షసులకు చేటును, ఈ సీతయొక్క భర్తకు జయమును గలుగునని సూచించుచున్నది. మనమిప్పుడు జానకిని వేడుకొందము. ఆమె యనుగ్రహించు నేని, ఈ రాక్షసులసమూహమును రాఘవుని బారినుండి తప్పించి కాపాడఁగలదు. ఇదే యిప్పుడు నాకు యుక్తముగా దోఁచుచున్నది. నే నిప్పుడే సీతాదేవిం గూర్చి యిట్టి స్వప్నము గాంచితినో ఆసీతాదేవి సకలదుఃఖములఁ బాసి యుత్తమసుఖము నొందగల జనకాత్మజయగుసీత ప్రణతులగు వారియెడఁ బ్రసన్నురాలు కాగలదు." అని చెప్పఁగా, సీత తనమగని గెల్పువార్త యాలకించుటచే మనమున మోదమంది, యీమాట వాస్తవ మగునేని, మిమ్ము నందఱఁ గాపాడెద నని చెప్పెను.

నేనును ఆసీతాదేవియొక్క యట్టి క్రూరదశను జూచి, మనమున నెమ్మది నొందక "ఈజానకితో మాటాడుట కేది యుపాయమని యోచించితిని. అట్లు యోచించి యొకవిధమున నిర్ణయించుకొని యిక్ష్వాకువంశమును మొదలిడి కొంతవఱకుఁ గీర్తించితిని. రాజర్షులెల్లరు మెచ్చునట్టి నేను జెప్పిన మాటలను విని, సీతాదేవి కండ్ల నీరు దృష్టిని గప్పఁగా, "ఓ వానరశ్రేష్ఠుఁడా! నీ వెవఁడవు ? నీ వెవనినిమిత్త మిచ్చటికి వచ్చినాఁడవు ? ఎట్లు వచ్చినాఁడవు ? నీకు రామునితోఁ జెలిమి యెట్టిది ? ఇది యెల్ల నాకు నెఱిఁగింపవలయు" నని యడుగఁగా, నేనును ఆ దేవి కిట్లని చెప్పితిని.

"ఓ దేవీ! నీమగఁ డగు రామునికి సహాయుఁడును, భయంకరమైన పరాక్రమము గలవాఁడును, బలవంతుఁడును, శత్రువులను సంహరించువాఁడు నైన సుగ్రీవుఁ డను వానరేంద్రుఁ డొక్కఁడు గలఁడు. నే నా సుగ్రీవుని బంటను. నన్ను హనుమంతుఁ డందురు. సత్కార్యాచరణపరాయణుఁడగు నీప్రియుఁడగు రాముఁడు నన్ను నీ కడకు దూతనుగాఁ బంపఁగా, నేను వచ్చినాఁడను. ఓకీర్తిమతీ! యీ ముద్దుటుంగరము పురుషశ్రేష్ఠుఁడగు దశరథపుత్త్రుఁడైన శ్రీరాముఁడు నీ కానవాలుగా నిచ్చి పంపెను. ఓదేవీ! నేను నీవు చెప్పిన పని యెల్లఁ జేయఁగలను. నేనేమి చేయవలెను చెప్పుము. నిన్నిప్పుడే యా రామలక్ష్మణులకడకుఁ గొనిపోయెదను. ఏమిబదులు చెప్పెద" వని యడిగితిని.

దాని కామె "రాఘవుఁడు రావణుని సంహరించియె నన్నుఁ గొనిపోవును గాక!" అని చెప్పెను. అంత నేనును పతివ్రతయు, పూజ్యురాలునైన సీతాదేవికి నమస్కరించి, "దేవీ! రామునిమనస్సునకు సంతోషము గలిగించు ఆనవా లొక్కటి యొసఁగుము" అని యడిగితిని. అంతట సీతాదేవి నాచేత నొకశిరోరత్నము నొసఁగి, "ఓ హనుమంతుఁడా! నీ వీ రత్నమునుగొంపోయి శ్రీరాములచేతనిమ్ము. ఇది చూడఁగానే యాతఁడు నిన్ను గారవించును" అని చెప్పి, యంతియకాక మహావ్యసనమునొందిన దయి కొంత వర్తమానమును చెప్పెను. తర్వాత ఆమె చెప్పినసంగతి మనస్సున నిల్పుకొన్నవాఁడనై, సీతాసందర్శనజనిత సంతోషము మనమున నతిశయిల్ల నా సీతాదేవికిఁ బ్రణమిల్లి ప్రదక్షిణము గావించి ప్రయాణసన్నాహము చేయుచుండగా, సీతాదేవి వెండియు నన్నుద్దేశించి, "ఓ హనుమంతుఁడా! రామలక్ష్మణులకు నా సంగతి యెఱిఁగించి, వారు సుగ్రీవునితోఁ గూడ త్వరగావచ్చునట్లు చేయవలసినది. నే నిఁక రెండునెలలు మాత్రమే ప్రాణములతో నుందును. పిమ్మట నన్నీ క్రూరుఁడగు రావణుఁడు ప్రాణములతో నుంపఁడు. ఈలోపల రాముఁడు రాఁడేని నేను దిక్కులేనిదానివలె నీ రావణునిచేతఁ జిక్కి ప్రాణముల విడువవలసియుండును. కావున వేగిరముఁగా వారు వచ్చునట్లు చేయవలసినది" యని మాటిమాటికి నాతోఁజెప్పెను.

ఆ సీతాదేవి చెప్పిన మాటలను వినఁగా, నాకు రాక్షసులపై నాగ్రహము హెచ్చెను. తర్వాత నేను జేయవలసిన పని యేమని యాలోచించితిని. నేను పర్వతముతో సమాన మగునట్లు నాదేహమును బెంచి, రాక్షసులతోఁ బోరు నేయఁగోరి యశోకవనమెల్ల పాడుచేసితిని. ఆ వనమందలి చెట్లు విఱువఁగా నచ్చట నున్న మృగములును, పక్షులును భయపడి నలుదెసలకుఁ బాఱఁజొచ్చెను. ఆ యల్లకల్లోలమును విని యచ్చట నిద్రించుచున్న వికృతంపు మోములు గలవారగు రాక్షస స్త్రీలందఱు మేల్కొని, నన్నుఁ జూచి, దిగులుచే నంద ఱొక్కటిగాఁ గూడి రావణునికడ కేగి, "మహాప్రభూ! ఎవఁడో దుష్టుఁడగు వానరుఁ డొక్కఁడు అశోకవనముఁ బాడుచేయుచున్నాఁడు. ఆతనికి నీబల శౌర్యము లిట్టి వని తెలియన ట్లున్నది. రాజేంద్రా! నీకుఁ జెఱుపు నేసిన యా మదించిన వానరుని వధింపఁ జాలినవారిని బంపుఁ" డని విన్నవించిరి.

ఆ రాక్షసస్త్రీలవాక్యములను విని, రాక్షసరాజగు రావణుఁడు శత్రువులచే గెల్వ నలవి కానివారును, తన యిష్టము ప్రకారము నడచువారునైన కింకరు లనెడి యెనుబదివేలమంది రాక్షసులను నా మీఁదికి యుద్ధమునకై పంపెను. ఆ రాక్షసు లందఱు శూలములు రోఁకళ్ళు మొదలగు నాయుధములఁ గైకొని నామీఁదికి రాఁగా, వారి నందఱిని నే నయ్యశోకవనద్వారమునందలి గుదియతో బరిమార్చితిని. నేను సంహరింపఁగా మిగిలిన రాక్షసులు రావణాసురునికడకుఁ బోయి, "ఓ ప్రభూ! కింకరు లందఱు మడిసి" రని చెప్పిరి. వారట్లు చెప్పఁబోవఁగా, నాకును ఇంకఁ గొన్ని పాడుచేయ వలసినదని యొక తలంపు పుట్టెను. ఆనగర మధ్యమునఁ బురమున కెల్ల నలంకార భూతమైయున్న నగరుమీఁది కెక్కి, దానిని బాడుసేసితిని. రావణుఁడును, కింకరులు మడిసి రన్న వార్త విన్న వెంటనే, భయంకరరూపులును, శత్రువులకు భయంకరులునైన రాక్షసులను దో డిచ్చి, జంబుమాలి యను రాక్షసునిఁ బంపెను. చతురంగబలముతో వచ్చిన యుద్ధవీరుఁడైన యా జంబుమాలిని గడు భయంకరమైన యాగుదియతోనే కూల్చితిని. జంబుమాలియుఁ గూలె నన్న వార్త వినఁగానే రావణుఁడు బలవంతులైన మంత్రిపుత్త్రుల నేడ్గురను చతురంగబలముతోఁ బంపెను. వారినిగూడ గుదియతోఁ బరిమార్చితిని. వారును మడిసి రన్న వార్త విని యుద్ధమునఁ బరాక్రమము చూపువారును, శూరులునునైన యేవురు సేనానాయకులను బంపెను. నేనును వారి నందఱిని వారిసేనలను బిలుకుమార్చితిని. రావణుఁడు సేనాధిపు లేవురు సైతము మడిసి రన్న వార్తను విన్నవాఁడై పెక్కురు రాక్షసులను దోడిచ్చి మహాబలుఁడైన యక్షకుమారునిఁ బంపెను. ఆ యుద్ధవీరుఁడయిన మండోదరీపుత్త్రుఁ డగు అక్షకుమారుఁడు కవచము దాల్చి, ఖడ్గము చేతఁబట్టి యాకాశమున కెగిరి, నాపై బాణములను బ్రయోగించుచుండఁగా, నే నాతనికాళ్లను బట్టికొని పలుమారు గిర గిర త్రిప్పిఁ క్రిందఁబడవేసి చూర్ణము సేసితిని. అక్షకుమారుండును మడిసె నన్న వార్తను వినినవాఁడయి, బలవంతుఁడును, యుద్ధమునఁ బగతురకు లొంగనివాఁడునునైన రావణుఁడు తన రెండవకుమారుం డగు ఇంద్రజిత్తును బంపెను. నేనును ఆ రాక్షసబలము నంతయుఁ జీకాకుపఱచి, ఆ యింద్రజిత్తుతో యుద్ధము చేసి, యాతని తేజము

తగ్గించి, యెక్కువ ముదము నొందితిని. రావణుఁడును ఇంద్రజిత్తు తప్పక నన్ను వధింపఁగలఁ డను గొప్ప నమ్మక ముంచి యెక్కువ క్రొవ్వు గల రాక్షసవీరులతోఁ గూడ నా యింద్రజిత్తు నంపియుండె. ఇంద్రజిత్తు నాబల మోర్వ రాకయుండుటను, తనబలము క్రుంగుటను జూచి, అతి వేగముతో బ్రహ్మాస్త్రము ప్రయోగించి నన్ను బంధించెను. అంత రాక్షసు లందఱు నన్ను గోఁగునారపగ్గములతోఁ గట్టి రావణునిసమీపమునకుఁ గొనిపోయిరి. అప్పుడు రావణుఁడు నన్నుఁజూచి, "ఓ వానరా! నీ వేల లంకకు వచ్చితివి? ఏల వనము ధ్వంసముచేసితివి? ఏల రాక్షసులను వధించితివి?" అని యడిగెను.

"ఓ రాక్షసేంద్రా! సీతాదేవిని వెదకునిమిత్తమే నేను లంకాపురము సొచ్చితిని. నేను వాయుదేవున కౌరసపుత్త్రుఁడను. వానరుఁడను. నాపేరు హనుమంతుఁడు. నేను సుగ్రీవునిమంత్రిని. రాముని దూతనుగా వచ్చినవాఁడను. ఆ సుగ్రీవుఁడు కొంతసంగతి చెప్పి పంపఁగా, నేను నీకడకు వచ్చితిని. ఎక్కువ ప్రతాపము గల సుగ్రీవుఁడు నీ కుశలమడిగి, నీతోఁ గొంత సంగతి చెప్పుమని చెప్పి పంపెను. ఆసంగతి ధర్మార్థకామములతోఁ గూడినదియు, నీకు మే లొసఁగునదియునై యున్నది. "నేను విస్తారవృక్షములు గల ఋశ్యమూకపర్వతమున నుండఁగా, యుద్ధవీరుఁడయిన శ్రీరాముఁడు సీతాదేవిని వెదకుచు నాతోఁ జెలిమి యొనరించికొని, "సీతాదేవి నెవ్వఁడో రాక్షసుఁ డపహరించెను. ఆమెను వెదకి తెచ్చి యిచ్చుటకై నీవు సకలవిధముల సహాయ పడవలె" నని కోరెను. నేనును వానరరాజ్యమును వాలి యపహరించెను కావున వాలివధము నొనరించి నారాజ్యము నిప్పింపవలసినది యని కోరితిని. తర్వాత మే మిరువురము అగ్ని సాక్షికముగా చెలిమి యొనరించికొంటిమి. రాముఁడు వాలిని సంహరించి, వానరరాజ్యము నా కొసఁగెను. నేనును వాగ్దత్తము చొప్పున శ్రీరామునకు సీతాదేవిని వెదకి తెచ్చి యీవలయును గదా. ఓ రావణా! నీకడ సీత యుండునేని వెంటనే తోడ్కొని వచ్చి రాముని కప్పగించుము. నీవు తడవుచేసితివేని వీరులగు వానరులు నీసైన్యమును నిన్నును మట్టుపెట్టుదురు. వారిప్రభావ మెవ్వరికిఁ దెలియదు? వారు దేవతలచేఁ బిలువఁబడి వారికి సాహాయ్యము చేయఁబోవుదురు గనుక నీవు వారిచేతఁ జిక్కకమునుపే సీతాదేవిం

తెచ్చి రామున కర్పింపుము" అని తనమాటగా నాతోఁజెప్పిపంపెను అని నేను రావణాసురునితోఁ జెప్పితిని. కుపితుఁడై యారావణుఁడు నన్ను దహించున ట్లుఱిమిచూచి, నాప్రభావ మెఱుఁగనివాఁడగుటచే నన్ను వధింపఁ దన భటుల కాజ్ఞ యొసఁగెను. అప్పు డచ్చట రావణునికిఁ దమ్ముఁడయిన విభీషణుఁ డను నొక్కఁడు సభలోఁ గూర్చుండి యుండెను. అతఁడు బుద్ధిమంతుఁడు, యోగ్యుఁడును గనుక, నానిమిత్తముగ రావణుని వేఁడికొని, "రాక్షసశార్దూలా! యీదండనము విధింపకుము. నీవు చేయునట్టి పని రాజనీతికి విరుద్ధముగానున్నది. దూతను వధింపరాదని శాస్త్రములు మొఱ లిడుచున్నవి. హితము చెప్పునట్టి దూత తనయజమానుఁ డెంత చెప్పి పంపెనో, అది యంతయు నట్లు చెప్పును. ఆతనిమాటలలో నెంత తప్పిదమున్నను, వాని కేదియో విరూపము గలిగించి పంపవలయునే కాని, వధించుట యెంతమాత్రము శాస్త్రసమ్మతము గాదు" అని చెప్పఁగా, రావణుఁడు తనబంటులను బిలిచి, యీతనితోఁకను గాల్చివేయుఁడని యానతిచ్చెను. అంత నోర్వరాని పరాక్రమము గల యా రాక్షసులు వేడ్క వూని, నాతోఁకకు చింపి గుడ్డలతునుకల నెల్లఁ జుట్టి నూనెలోఁ దడిపి యగ్ని రగిలించి నన్నుఁ గొయ్యలతోఁ గొట్టుచుఁ బిడికిళ్లతో గ్రుద్దుచు, వీధుల వెంబడి నూరేగింపఁ బూనిరి. రాజద్వారమునకుఁ జేరినవెంటనే నేనును అంతకు ముందున్న గొప్పరూపమును కుఱుచపఱచి, యాకట్లను వదలించికొని, యథాప్రకారమైన శరీరము నందినవాఁడనై, యా రాక్షసుల నందఱిని ఇనుపగుదియతోఁ గూల్చితిని. తర్వాత నా నగర ద్వారమున నెగిరి నాతోఁకయందు మండుచున్న యగ్నిహోత్రునితో లంకాపురము నంతయుఁ బ్రాకారగోపురములతోఁ గూడఁ బ్రలయ కాలాగ్నిహోత్రునిమాడ్కిఁ దత్తరింపక దహించితిని. నే నా లంకాపురమున దహింపనితావు గోపాద మంత యైనను లేమిచేత సీతాదేవి కూడ భస్మమాయెనో యని వెఱచి, వ్యర్థముగా రాముని కార్యము చెడఁగొట్టితినే యని విచారమునం దుండఁగా, "ఈ లంకాపుర మెల్లఁ గాలినను, సీతాదేవికి హాని కలుగలేదు. ఇదేమివింత!" యని యాకాశమునఁ జారణులు చెప్పుకొనియెడి వార్తను వింటిని. నేను వారివింత మాటను వినుటచేతను, కొన్ని శుభశకునములును గలుగుట చేతను,

తోఁక మండుచున్నను, అగ్ని నన్ను దహింపకుండుటచేతను, చల్లని గాడ్పులు వీచుటచేతను సీతాదేవి క్షేమముతో నున్నదని యెఱిఁగిన వాఁడనై, యామెను మఱలఁ జూచి, యామెకడ నుత్తరువు తీసికొని, యచ్చట నున్న యరిష్టపర్వత మెక్కి మిమ్ముఁ జూడఁ గోరికతో మఱల వాయుమార్గమున కెగిరి, వాయువు, సూర్యచంద్రులు, గంధర్వులు యక్షకిన్నరాదులు తిరిగెడి మార్గమున వచ్చి యిచ్చట దిగి మిమ్ముఁ జూచితిని. రాముని ప్రభావముచేతను, మీ తేజస్సుచేతను, సుగ్రీవుని కార్యసిద్ధి యగునిమిత్తము నే నీకార్యము చేసితిని. అచ్చట, నేఁ జేసి నదియెల్లఁ నెఱిఁగించితిని. ఇప్పుడు నేఁ జేయక విడిచినకార్య మెద్ది కలదో, అది యెల్ల మీరు చేయుఁ డని చెప్పెను.

## 59-వ సర్గము

### హనుమంతుఁడు లంకలోని సంగతులఁ జెప్పుట

హనుమంతుఁడు తనరాకపోకలవృత్తాంతమునంతయు నెఱిఁగించి మఱికొంతసంగతి చెప్పఁబూనెను: రాఘువుని ప్రయత్న మీడేరెను. సుగ్రీవుని పట్టుదలయు సఫలమయ్యెను. ఆసీతాదేవియొక్క పాతివ్రత్యము చూడగా ఆ సీతాదేవియొక్క పాతివ్రత్యముచే సాధింప రానిది యొక్కటియు లే దని నాకు నిశ్చయము గలిగెను. అయిన నేల యా సీతాదేవి రావణుని భస్మముచేయలే దనిన, రావణుఁ డును సకలవిధములుగా తపస్సుచేసి, కోపము వచ్చిన, లోకము లను దహింపను, సంతోషము వచ్చిన, లోకములను రక్షింపను జాలిన వాఁడు. ఆతఁడు సీతాదేవియొక్క యంగము స్పృశించినను, ఆ తపో మహిమచేతనే మండిపోకకుండెను. అట్లయినచో, సీతాదేవిశీలము దుర్బలము గదా. అట్టి శీలము మన కెందు కుపయోగపడు నని తలఁపఁ బోకుఁడు. జానకి కెవ్వఁడైనఁ జే టొనరించి, కోపము వచ్చునట్లు చేసె నని, ఆదేవి తనకోపపాత్రమైన యతని భస్మముచేయును గాని, అగ్ని జ్వాలగ్రైన నాతీరునఁ జేతితోఁ దాఁకినవాని నేమియుఁజేయఁజాలదు. అట్లయినచో భృత్యుఁడు గెల్చిన రాజు గెల్చినట్లె కదాయగును. సీతా పాతివ్రత్యప్రభావసాహ్యముచే మనమే రావణుని గెల్చి సీతాదేవిం దోడ్కొనియే రామలక్ష్మణులను జూత మనిన, ఇప్పుడు కార్యమెంత మాత్రమయి యున్నదో మీకుఁదెలిపితిని. జాంబవంతుఁడు మొదలగు

వారంద ఱొప్పుకొన్నచో, అట్లు పోయి, రావణుని జయించి, సీతను దోడ్కొని వచ్చియె రామలక్ష్మణులం జూచుట యుక్తము. మనము చాలుదుమో చాలమో యని సంశయింపవలదు. రాక్షసులసమూహ ముతో నిండిన లంకాపురము నంతయుఁ బాడుసేయుటకును, మహాబలుఁ డగు రావణాసురుని వధించుటకును నే నొక్కఁడనే చాలుదును. శూరులును, బలవంతులును, అస్త్రవిద్య నేర్చినవారును, పట్టుదల గల వారును, వీర్యము గలవారును, జయాపేక్షగలవారునునైన మన మిందఱ మున్నప్పుడు, ఆ రావణుని గెల్చుట కొక సందియ మున్నదే. నే నొక్కఁడనే యుద్ధరంగమున రావణుని సేనలతోను, కాల్బలము తోను, సోదరులతోను, పుత్రమిత్రపరివారముతోను సంహరింపఁ గలను. ఆ రావణుఁడు ప్రయోగించెడు బ్రహ్మాస్త్రము, ఐంద్రాస్త్రము, రౌద్రా స్త్రము, వాయవ్యాస్త్రము, వారుణాస్త్రమును, ఇంద్రజిత్తు ప్రయో గించు మూఁడ నలవికాని యస్త్రముల నన్నింటిని నివారించి, యాలంక లోని రాక్షసులనందఱను వధింపఁ గలను. మీయనుజ్ఞయైనచో నా రావణునిపుత్త్రు నింద్రజిత్తును గూడ జయించెదను. నేను తలఁచుగ గాలవాన గురిపించితినేని, అది యుద్ధరంగమునందు దేవతలను గూడ సంహరింపఁ గల దనునప్పు డాముక్కడిరాక్షసులు నా కొక లెక్కలోనివారే. సముద్రమైనను జెల్లెలికట్టదాఁటును. మందర పర్వతము కదలను వచ్చును. శత్రుసేన యుద్ధరంగమున జాంబ వంతుని గదలింపఁ జాలదు. రాక్షసులగుంపు లన్నిటిని, వారికంటె గొప్పవారిని ఈ వాలినందనుఁ డయిన యంగదుఁ డొక్కఁడే నాశము చేయఁగలఁడు. పనసనీలులతోడ లతాఁకుడునకు మందరపర్వతము గూడ తుత్తునియలై పోవును. అట్లుండ నీ రాక్షసులు వారిబలిమి కేపాటివారలు? ఈ మైందద్వివిదు లశ్వినీదేవతల పుత్త్రులు. మహాబలులు. దేవాసురగంధర్వయక్షపన్నగగరుడులలోపల నీమైందద్వివిదుల కెదుట నిలిచి యుద్ధము చేయువాఁ డెవ్వఁడును లేఁడు. వీ రిరువురును బ్రహ్మ దేవుని వరమువలన నెక్కువ బలము గలిగినవారు. వీ రమృతము భక్షిం చిన వారు. వానరులందఱిలోపల శ్రేష్ఠులు. అశ్వినీదేవతలమోమోటము నకై సర్వలోక సృష్టికర్తయగు బ్రహ్మ ఎవరివలనను మరణము లేకుండు నట్లు వీరికి వర మొసఁగెను. వీరులయిన యీ వానరశ్రేష్ఠు లిరువురు వర

బలమువలన గర్వించినవారలై, సురల గొప్పసేనను సంహారించి, యమృతమును ద్రాగిరి. అందఱు వానరులటుండనీ. వీరిద్ద ఱిలిగిరేని, చతురంగ బలముతో నిండిన లంకాపురమును ధ్వంసము చేయఁగలరు. నేనే రాక్షసుల నందఱిని జంపి, లంకాపురము నంతయుఁ గాల్చి బూదిచేసితిని. మరియు రాజమార్గములందుఁ జేరి, మహాబలులగు రామలక్ష్మణులు అందఱికంటె మించినవారలై యున్నారు. వానర రాజగు సుగ్రీవుఁడును రామునిసాహాయ్యమువలన సర్వోత్కృష్టుఁడై యున్నాడు. నేను కోసలేంద్రుఁడగు రామునికి దాసుఁడను. నేను వాయుపుత్త్రుఁడను. నాపేరు హనుమంతుఁడందురు" అని లంకాపురమెల్ల చాటితిని. చెడు నడత గలవాఁడయిన రావణునియశోకవనమధ్యమున శింశుపావృక్షముక్రిందఁ బతివ్రతయు, దీనతను బొందినదియు, రాక్షసకాంతలచేఁ జుట్టఁబడినదై దుఃఖసంతాపముచేఁ జిక్కినదియై మేఘములచేఁ జుట్టఁబడిన దాటవలనఁ గాంతిలేక యుండు చంద్రరేఖమాడ్కిఁ బ్రకాశింపక యుండునదియు, దేవేంద్రుని భార్యయగు శచీదేవి నహుషునిచే నిరోధింపఁ బడినట్లు రాక్షసస్త్రీలచే నిరోధింపఁబడినదై యున్నను, రామునందే చెలిమి గలిగి, ఎల్లప్పుడు రామునే తలంచుచు, ఆశచి దేవేంద్రునందే మనస్సు గలిగి యుండినట్లు రామునందే మనస్సుగలదై రావణుఁ డపహరించిననాటి యాయొంటిబట్టనే కట్టుకొన్నదై, దుమ్ముక్రమ్మియుండ, దుఃఖసంతాపములచే మనమున సంతసము లేనిదై, భర్తయొక్క మేలుగోరుటయందే యాసక్తి గలదై, రాక్షసులు చుట్టుకూర్చుండి మాటిమాటికి బెదరించుచుండఁగా, దైన్యము నొంది, భర్తను గూర్చిన చింతయే ముఖ్యముగాఁ గలదై, నేలమీఁదఁ బరుండి హిమవంతఋతువునందలి తామరతీఁగ మాడ్కి శోభలేనిదై, రావణునినుండి మనస్సును మఱలించి, మరణమునకు సిద్ధపడినదియునై యుండునట్టి సీతాదేవిని గాంచి, యామెకు నమ్మిక కలిగించి, యామెతో మాటాడి నాయభిప్రాయ మంతయు నెఱిఁగించితిని. రామసుగ్రీవులకుఁ జెలిమి కలిగె నని చెప్పినవార్తను విని, యాదేవి మిక్కిలి సంతసించెను. ఆమె యొక్క యెక్కువ ఆచారమును ఎక్కువ పతిభక్తియుఁ దప్పుచేసినట్టి యారావణు నేల వధింపకున్న దనిన, తనభర్తయైన రాముఁడు రావణుని సంహారించుటకు నిమిత్తమాత్రముగా నుండవలె ననియే. ఆదేవి యుపవాసే చిక్కిన దేహముగలది. దానికి బరువై

యోగము తోడుగాఁగా, పాఠ్యమినాఁ డధ్యయనము చేసెడి విద్యార్థి యొక్క విద్యవలెఁ గృశించి యున్నది. ఓ వానరపుంగవులారా! సీతాదేవి యిట్లు దుఃఖమే ముఖ్యముగాఁ గలదై యున్నది. అచ్చటి సంగతి యెల్లఁ జెప్పితిని. ఇఁక నేమి చేయవలెనో దాని నాలోచింపుఁడని హనుమంతుఁడు వానరుల కందఱకుఁ జెప్పినవాఁడయ్యెను.

## 60-వ సర్గము

### అంగద జాంబవంతుల సంభాషణము

అంగదుఁడు హనుమంతుని మాటను విని, వానరులం జూచి "ఓ వానరులారా! మీరు సీతను జూచినవారైనను, సీతాదేవిని దోడ్కొనక రామునికడకుఁబోయి "అయ్యా! మేము సీతను జూచితిమి కాని తేనయితిమని చెప్పుట మీపరాక్రమమునకు యుక్తముగా" దని తోఁచెడిని. దాఁటుటయందుఁ గాని, శత్రువులను బరిమార్చుటయందుఁ గాని మనతో సమానుఁ డీ దేవాసురులలోపల లేఁడు. హనునుంతుఁడు రాక్షస వీరుల నందఱ నిర్విధమునఁ బరిమార్చినప్పుడు మన కిఁక నాటంక మేమి యున్నది? జానికిని దోడ్కొనియే పోవుదము" అని చెప్పెను.

జాంబవంతుఁ డను వానరశ్రేష్ఠుఁడు వాలిపుత్రుని సంకల్పమును విని, యెక్కువమోదము నొంది, "రాజపుత్రా! నీ వాలోచించినతెఱఁగు యుక్తము గాకపోలేదు. అయినను రామునియభిప్రాయ మెట్లున్నదో, అట్లె మనము కార్యము నడపించుట యుక్త మని తలఁచెద" నని అంగదునకు బదులు చెప్పెను.

## 61-వ సర్గము

### వానరులు మధువనంబు ప్రవేశించుట

తర్వాత, అంగదుఁడు మొదలగు శూరులయిన వానరులును, కపిశ్రేష్ఠుఁ డయిన హనుమంతుఁడును జాంబవంతుని మాటయే మంచిదని యొప్పుకొనిరి. అంత వానర వీరులందఱు సంతోషభరితులై హనుమంతుని ముందిడుకొని మహేంద్ర పర్వతమువదలి గొప్పరూపమును, ఎక్కువబలిమియుఁ గలిగినవారలును నైనందున మేరుమందర పర్వతములను, మదించిన గొప్పయేనుఁగులను బోలినవారై, యాకాశమును

గప్పుచు వచ్చుచున్నారో యనిపించుచు, సకలభూతములచే గౌరవింపఁబడుచున్నవాఁడును, ధైర్యవంతుఁడును, ఎక్కువబలమును వడియుఁగల గలవాఁడును నైన హనుమంతుని దృష్టులపై నెక్కించికొని మోయుచున్నారో యనునట్లు రెప్పవాల్పక యతనిని ప్రేమతోఁ జూచుచు, శ్రీరాముని కార్యసిద్ధిని, దానిమూలమున గొప్పకీర్తిని నిశ్చయించుకొని పనినెఱవేర్చినవారును, కార్యసాధనముచేత నితరులకంటె గొప్పవారును, రామునకుఁ బ్రియవృత్తాంతము చెప్పఁబూనినవారును, యుద్ధమునందెక్కువ కోరికగలవారును, రామునికిఁ బ్రత్యుపకారము చేయుటకు నిర్ణయించుకొన్నవారును, గొప్పమనస్సుగలవారునునై యాకాశమునకెగిరి దుముకుచు, సకల జంతువుల మనసున కింపొదవునదియు, ఎవరికిని లోపలికిఁ బోవ వీలుకానిదియు నైన సుగ్రీవునియొక్క మధువనమును బొందిరి. వానరేంద్రుఁడగు సుగ్రీవునియొక్క ఆమధువనము నతనిమేనమామయగు దధిముఖుఁడను వానరవీరుఁ డెల్లప్పుడు కాపాడుచుండును. ఆ వానరులందఱు వానరేంద్రునిమనమునకు మిక్కిలి సంతోషప్రదమైన యా మధువనమును చొచ్చినంతనే మిక్కిలి యుత్సాహముగల వారలైరి.

అంత నావానరు లందఱు ఆ గొప్ప మధువనమును జూచి యుప్పొంగి, యంగదుని మద్యము గ్రోల ననుమతియిమ్మని కోరిరి. అంతట నంగదుఁడును జాంబవంతుఁడు మొదలగువారి యనుమతిఁ గైకొని, మద్యముగ్రోలుటకు వారికాజ్ఞ యొసఁగెను. అంత వానరులందఱు అంగదునియానతిచేఁ బ్రేరితులయి, మిగుల మోదమునుబొంది, మేనగగుర్పాటు గలుగఁగా గంతులు వైచుచుండిరి. కొందఱు పాటలు పాడిరి. కొందఱు ముందుకువంగిరి. కొందఱు చిందులు ద్రొక్కిరి. కొందఱు పకపకనవ్విరి. కొందఱు పైనుండి క్రిందఁబడిరి. కొందఱు తిరుగులాడిరి. కొందఱు దుముకులాడిరి. కొందఱు వదరుచుండిరి. కొంద ఱొండొరులను బట్టుకొనిరి. కొంద ఱొండొరులను దాఁటుచుండిరి. కొంద ఱొండొరులను మాటలాడుకొనుచుండిరి. కొంద ఱొండొరులతో విహరించిరి. కొంద ఱొకచెట్టునుండి మఱియొక్కచెట్టుపైకి దుమికిరి. కొందఱు చెట్టుకొననుండి నేలమీఁదికి దుమికిరి. హెచ్చుబలిమిగల కొందఱు నేలనుండి చెట్టుకొనల కెగిరిరి. ఒకవానరుఁడు పాటపాడు

చుండఁగా, మఱొక్క వానరుఁడు పకపక నవ్వుచు వానిమీఁదికి వచ్చెను. నవ్వువానికడకు నొకఁడు వికవిక నవ్వుచు వచ్చెను. ఏడ్చు వానికడ కెగఁబడుచు నొక్కఁడు వచ్చెను. ఆ యెగఁబడివచ్చువాని కడ కింకొక్కఁ డార్చుచువచ్చెను. అవ్వానరసేన యివ్విధమున మద్య పానముచే మితిమీఱిన చేష్టలుగలదై, మిగులఁ గలఁతఁజెందియుండెను. ఆ వానరులలో మద్యపానముచేయువాఁడును, మత్తుగొననివాఁడును, ఆ మద్యపానముచేఁ దనివినొందనివాఁడును నొక్కఁడైనను లేఁడయ్యెను.

ఆవనమును గాపాడుచున్న దధివక్త్రుఁడనువాఁడు, వానరులం దఱు వనపాదపములందలి మద్యమును గ్రోలుటను, ఆవృక్షములందలి యాకులను, పువ్వులను రాలఁగొట్టుటను జూచి, కోపముఁజెంది వారి నందఱి నడ్డగించెను. ఆ వానరులందఱు రేఁగి యాదధివక్త్రి నదలిం పఁగా, వనపాలుఁడును, ముసలివాఁడునయిన యెక్కువ తేజస్సుగల వానరవీరవృద్ధుఁడగు దధిముఖుండు వారిని బోఁఱఁదోలి వనమును గాపాడఁదలఁచి, కొందఱిని ధైర్యముతో నిష్ఠురముగా మాటలాడెను. మఱి కొందఱిని గట్టిగా నఱచేతులతోఁ గొట్టెను. కొందఱితోఁ గలిసి జగడమాడెను. కొందఱిని బ్రతిమాలెను. ఆదధిముఖుఁడు బలవంత ముగా నడ్డగించినను, భయము లేనివారలై యావానరవీరు లందఱు గూడి యాదధిముఖునిఁ జుట్టుకొని, గర్వముచే మాటలాడినఁ దప్పి దము వచ్చునని తలంపక యతిశయించి, యతనిని గోళ్లతో గీఱుచుఁ బండ్లతోఁ గొఱుకుచు, చేతులతోను పాదములతోను బాఁదుచు, ఆ గొప్ప మధువనమునందలి యనుభవ యోగ్యములైన యన్ని పదార్థము లను కాఁజేసిరి.

## 62-వ సర్గము

### వానరులు మధువును గ్రోలుట

వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు "వానరులారా! మీరు నిర్భయులై మద్యము గ్రోలుఁడు. మీదారి కెవ్వఁ డడ్డమువచ్చినను వారినందఱను వధించెదను" అని చెప్పఁగా, వానరోత్తముఁడగు అంగ దుఁడు "వానరులారా! కార్యమును నెఱవేర్చికొని వచ్చిన యీ హను మంతుఁ డొక్కవేళఁ జేయరానికార్యమును జెప్పినను జేయవలసినదే.

అట్లుండ, ఈ మంచికార్యమును జేయుట కేమి సందియమున్నది? కావున మీరు యథేష్టముగా మద్యము ద్రాగుడు" అని ప్రోత్సాహపఱచెను. అంగదునినోటినుండి వచ్చిన మాటను విని వానరశ్రేష్ఠులందఱు 'మంచిది మంచిది' యని సంతోషపూర్వకముగా నంగీకరించి, యంగదుని గారవించిరి.

అట్లు ఆతనిని గారవించిన తర్వాత వారందఱు నదీప్రవాహము మాడ్కిఁ గడువడితో మధువనమునఁ బ్రవేశించిరి. అట్లు ప్రవేశించి, వనరక్షకుల నందఱ నదలించి బెదరించి, యంగదుని యుత్తరువును బట్టియు, సీతాదేవిని చూచుటవినుటలం బట్టియు ధైర్యముగలవారై, యావనమునందలి తేనెనంతయుఁ ద్రాగి, తియ్యని పండ్లను దినిరి. తమ్ము దలించుటకై వచ్చిన వనపాలుర నందఱిని గొట్టిరి. వానరులందఱుగూడి బానెడు తేనెను దెచ్చిపెట్టికొని యందఱు దానిని ద్రాగిరి. కొందఱు తేనెను త్రాగిరి. ఇతరులు కొట్లాడుచుండిరి. కొందఱు వానరులు తేనెను గ్రోలి, తనెపెరలనుబారవైచిరి. తేనెమైనముఁదిని క్రొవ్విన వారై యొండొరులను గొట్టుకొనిరి. కొందఱు వానరులు మిక్కిలి మత్తులై, చెట్ల మొదటి కొమ్మలను బట్టుకొని నిలిచిరి. కొందఱు వానరులు చెట్ల క్రింద నాకులను బఱచుకొని పరుండిరి. కొందఱు వానరులు మైకముచే నొడలెఱుఁగక వెఱ్ఱివారివలెఁ బడియుండిరి. కొందఱు సంతోషముచేఁ బులకాంచిత గాత్రులైరి. కొంద ఱొండొరులను ద్రోసికొనిరి. కొంద ఱొడలెఱుఁగక తొట్రుపాటు చెందిరి. కొందఱు సింహనాదము నేసిరి. కొందఱు సంతోషసూచనముగాఁ గూఁతలుపెట్టిరి. కొందఱు నేలమీఁదఁ బరుండిరి. కొందఱు చెప్పరాని యసహ్యపుఁబనులఁ జేసి నవ్విరి. మఱికొంద ఱట్టి యితరకార్యములను జేసిరి. మఱికొంద ఱట్టి పనులను జేసి, తాముచేసినవానిని గూర్చి చెప్పుకొనిరి.

దధిముఖునిసేవకు లందఱు భయంకరులయిన యావానరులు బెదరింపఁగా వెఱచి మూలమూలలకుఁ బాఱిపోయిరి. వారు మోకాళ్ళు బట్టి వెనుకకువంచి మూడిచూపఁబడిరి. ఇట్లెల్లఁ బీడితులై వారు మిగుల క్లేశమునుచెందినవారయి దధిముఖునికడకువచ్చి, "హనుమంతుఁ డాజ్ఞ యొసఁగఁగా వానరులందఱు బలాత్కారముగా మధువనము నంతయుఁ బాడుసేసి"రని చెప్పిరి. దధిముఖుండును వానరవీరులందఱు మధువన

మును ధ్వంసముచేసినందు కలిగినవాఁడై, తనసేవకులగు వానరులనూఱ డించి "మీరిక్కడికి రండు; మనము పోదము. అచ్చట మద్యముద్రాగి మదించియున్న యావానరవీరుల నందఱను మనసామర్థ్యముచే నివారింత"మని చెప్పి వారిం దోడ్కొని యావానరవీరులమీఁదికిఁ బోయెను. వీరులగు వనరక్షకులును దధిముఖునిమాట విని యాతనితోడ మఱల వారి మీఁదికిఁ బోయిరి. దధిముఖుండును గొప్పచెట్టు నొక్కటి పెళ్లగించి చేతఁబట్టుకొని వారిం గొట్టఁబోయెను. వాని సేవకులగు వనపాలురును తమయజమానిమాటను మనముననిడుకొని తమచేతులలో ఱాలను, చెట్లను, కొండలను ఎత్తికొని, చెట్లమీఁదను, నేలమీఁదను గూర్చుండియున్న యావానరవీరుల నందఱను జూచి వారిమీఁదికి దుమికిరి.

ఆదధిముఖుండు తమమీఁదికిఁ గోపముతో వచ్చుచున్నాఁడని యెఱిఁగి, హనుమంతుఁడు మొదలగు వానరవీరులంద ఱాతనిమీఁదికిఁ గవిసిరి. వారిలో నంగదుఁడు కుపితుఁడై, చెట్టొక్కటి చేతఁ బట్టికొని వచ్చి దధిముఖుని రెండుచేతులతో బాదెనుగాని, ఆతఁడు తనతండ్రి మేనమామయగుటచేఁ దనకు మన్ననచేయఁ దగినవాఁడని మదోద్రేకముచే నెఱుఁగక యతనిని క్రిందఁద్రోసి, తనబలిమికొలఁదిని గ్రుద్ది వాని యెముకలు పొడియగునట్లు చేసెను.

ఆదధిముఖుఁడు చేతులు, దొడలు, మూఁపులు విఱిగి, శ్రమ చెంది, రక్తమునఁ దడిసి, కొంతతడవు మూర్ఛచెంది, కొంతసేపటికిఁ దెలివినొంది యాగ్రహముతో వారిని గొయ్యలతోఁ గొట్టఁబోయెను కాని, వారు తిరిగి కొట్టరాఁగా, వారికి వెఱచి యెట్టకేలకు వారిచేతుల నుండి విడిపించికొని, యావలికివచ్చి తన పనికాండ్రగు వనపాలురను బిలిచి రహస్యముగా, "వీరిక్కడ నిల్లె యుండనిండు. మనము రాముని తోఁగూడనున్న మనరాజగు సుగ్రీవునికడకుఁ బోయి, ఇది యంతయు యంగదుని దోషమని చెప్పెదము. అంత వానరేంద్రుఁడు కుపితుఁడై యీ వానరవీరుల నందఱిని బరిమార్పింప గలఁడు. ఈమధువనము మనరాజగు సుగ్రీవుని కిష్టమైనది. తాతముత్తాతలనాఁటినుండి వచ్చినది. అందమైనది. దేవతలకు నైతము చొచ్చుటకు వీలుగానిది. ఇట్టి వనము వానరవీరులు పాడుచేసి రన్నవార్త విన్నతోడనే, సుగ్రీవుఁడు

మద్యపానాసక్తులైన ఆయువృత్తీతీన ఈవానరుల నందఱిని వీరి స్నే
తులను గూడ సంహరింపఁగలఁడు. వీరు రాజునుత్తరువును మీఁ
వారు గనుక ఈక్రోవ్వినవారి నందఱిని సంహరింప వలయును. వ
రేంద్రుండు వీరిని సంహరించె నేని, మనకసితీఱును" అని చెప్పి
పాలురను దోడ్కొని, నిమిషములో సూర్యపుత్రుఁడగు సుగ్రీవుఁడు
తావునకుఁ బోయిచేరి, రామలక్ష్మణులను, సుగ్రీవునిఁ జూచి, సమభ
మిపై నిట్టనిలువునఁ బడెను. అట్లు మహాధీరుఁడైన దధిముఖుఁడు
పాలురతోఁ గూడ నేలఁబడి, విన్నని మొగముతోఁ గూడిన వాఁ
సుగ్రీవుని మంగళ పాదములకు మ్రొక్కి, వానిని గట్టిగాఁ బట్టుకొనెఁ

## 63-వ సర్గము.

### దధిముఖుఁడు సుగ్రీవునికడకు వచ్చుట

అంత వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు నేల సాగిలఁ
మ్రొక్కిన యాదధిముఖునిఁ జూచినతోడనే మనమున నులికిపడినవాఁడై
"ఓదధిముఖా! లేలెమ్ము. ఏల యిట్లు నాపాదములమ్రోల సాగి
బడితివి? నీ కభయ మొసఁగెదను. సంగతి యంతయు విస్తరించి చెప్ప
మని యా దధిముఖుని నడిగెను.

ఆమహాత్ముఁడగు సుగ్రీవుఁ డట్లు సమాధానపఱుపఁగా, వి
వంతుఁ డగు దధిముఖుఁడు లేచి యతనితో నిట్లనెను:—"మహారాజ
ముందు ఋక్షరజుఁడుగాని వాలిగాని నీవుగాని యథేష్టముగా నను
వింపని మధువనమునందలి మధువునువానరవీరులు గ్రోలిరి. వనపాలు
వీరిని బెదరించినను, వారిని సరకుసేయక యచ్చటి ఫలములను భక్షింపు
మధువు నింకను గ్రోలుచున్నారు. కొంచెము మిగిలియున్న దానినిగూ
గొందఱు పాఱఁబోయుచున్నారు. కొందఱు దానిని సైతము ద్రా
చున్నారు. మేము పోయి యడ్డగించినచో మాపైఁ గనుబొమ్మ
చిట్లించుచున్నారు. వానరపుంగవు లట్లు కోపగించుకొని కొట్టఁబోయి
వనపాలురను గూడ బెదరించి యావలికిఁ దఱుముచు, కొందఱిని చే
లతో బాదిరి; కొందఱిని మోకాళ్లతోఁ గ్రుమ్మిరి; కొందఱిని నే
మీఁదఁ బడఁద్రోసియిచ్చవచ్చినట్లు బరబరయీడ్చిరి;కొందఱి నాకాశవ
పైపున కెగురఁదన్నిరి; కొందఱి కపానమునుఁ జూపిరి. ఓ మహారాజ

సంతోషపడి, వారినందఱిని వేగిరము మాకడకుఁ బంపుఁడని చెప్పి పంపె"నని యంగదునితో దధిముఖుఁడు చెప్పెను.

మాటలలో నేర్పరియగు అంగదుఁడును దధిముఖుఁడు చెప్పిన మాటను విని, వానరుల నందఱిని జూచి "వానరశ్రేష్ఠులారా! యీ సంగతి రామునికిఁ దెలిసినట్లున్నది. పనియైన వెనుక నిచ్చట జాగు చేయుట మనకుఁ దగదు. వానరవీరులారా! యథేష్టముగా మధువు గ్రోలి యలసటఁ దీర్చుకొంటిమి. ఇఁక మిగిలినపని యేమి? మాతండ్రి యగు సుగ్రీవుఁ డెచ్చట నున్నవాఁడో, అచ్చటికిఁ బోవుటయే. మీరందఱు గూడి యెట్లు నన్నుఁ జేయమందురో, అట్లు చేయువాఁడను. పని యందు మీకు లొంగినవాఁడను. నేను యువరాజనయి యున్నను, మీ కానతి యొసఁగఁ జాలను. కృతకృత్యులైన మిమ్ము బెదరించుట యుక్తము గాదు" అని వానరులతోఁ జెప్పెను.

ఇట్లంగదుఁడు చెప్పినమాటను విని, వానరులందఱు మనసున నుప్పొంగి, "ఓ రాజపుత్రా! వానరశ్రేష్ఠా! రాజయి యుండియు నెవ్వఁడు నీవలె మాటాడును? లోకమున నధికారగర్వముచే మదించినవాఁ డంతయుఁ దానే యని యెంచుట వాడుకగదా? ఈమాట నీకుఁ గడుఁదగి యున్నది గాని, మఱియొక్కనికిఁ గాదు. ఇట్టి నీ వినయత యిఁక రాఁబోవు మేలునకుఁ దగిన యోగ్యతను దెల్పుచున్నది. మనయేలికయగు సుగ్రీవుఁ డెచ్చటనున్నాడో యచ్చటికిఁ బోవుట కుత్సాహము గలవారమై యే తెంచితిమి. నీయుత్తరవులేక యీ వానరులందఱు మడుగెత్తి మఱియొకయడుగు పెట్టుటకైనను శక్తులము గాము. ఇది నిక్కమని చెప్పుచున్నాము" అని యంగదునితోఁ జెప్పిరి.

ఇట్లు వారు చెప్పఁగా, అంగదుఁడును "సరే బయలుదేఱి పోవుదము"అని చెప్పి పైకెగురఁగా, అతనిని, హనుమంతుని వెంబడించి తక్కిన వానరులును గూడనెగిరి, యంత్రములచే నెగురఁ జిమ్మఁబడిన పర్వతములమాడ్కి నాకాశమును సందులేకుండఁ గప్పి, వాయుప్రేరితములైన మేఘములచందమున గొప్పయఱపు లఱచుచుంగదు వేగముతో నెగిరిపోయిరి.

అంగదుఁడు రాకమునుపే సుగ్రీవుఁడు కమలలోచనుఁడును, శోకపీడితుఁడునునైన రామునిఁజూచి, "ఓరాఘవా! యూఱడిల్లుము. తప్ప

కుండ వారు సీతను జూచిరి. గడువు మీఱిన తర్వాత వారిచ్చటికి రాజాలరు. పనినెరవేర్పని వానరు లిట్టి పనికిఁ బూనికొనవచ్చునుగాని యువరాజును నిడువచేతులవాఁడునైన వానరోత్తముఁడగు అంగదుఁడు తప్పక దీనముఖుఁడై, మనసున భ్రమమును, వెఱపునొందును. ఈ మధు వనము మా పెద్దలనాఁటిది. వారిచేఁ గాపాడఁబడినది. ఇట్టి యీవనమును సంతోషింపని యంగదుడు ధ్వంసముచేసి యుండడు. మంచివ్రతముల నాచరించునోరామా! ఊఱడిల్లుము. కౌసల్యా సుపుత్రజననియయ్యెను నామాట వినుము. హనుమంతుఁడే సీతను జూచియుండును. మఱొక్కఁడు కాదు. హనుమంతుఁడు తప్ప మఱొక్కఁ డీపనిని సాధింపఁ జాలఁడు. ఓ మతిమంతులలో శ్రేష్ఠుఁడా! సూర్యునియందే వెలుఁగు ఉండునట్లు ఆ హనుమంతునియందే కార్యసాధనశక్తియు, చాతుర్య మును, పూనికయు, ధైర్యము నున్నవి. జాంబవ దంగదులు ప్రేరకులు గాను, హనుమంతుఁడు చేయువాఁడుగాను నుండు కార్యము తప్పక యనుకూలించును. మీఱిన విక్రమముతోఁ గూడినవాఁడా! నీవిపుడు చింతను వదలిపెట్టుము ” అని శ్రీరామునితో సుగ్రీవుఁడు పలికెను.

తర్వాత హనుమంతుఁ డొనర్చిన కార్యసాధనముచేఁ గిష్కింధకు సమీపించి, కార్యమనుకూలించెనని తెలుపువారిమాడ్కి నఱచుచుండు వానరులయొక్క కిలకిలధ్వని యాకసమున సమీపముననే వినవచ్చెను. సుగ్రీవుఁడు వారికిలకిలరవమునువిని తనతోఁకను నిడుపుగా నెత్తిన వాఁడై మనసున హర్షము నొందెను. వానరులును శ్రీరాముని జూడఁ గోరినవారై, అంగదహనుమంతులను ముందుంచుకొని వచ్చిరి. అంగ దుఁడు మొదలగు వానరులందఱు కడుమోదముతోఁ గూడినవారై వచ్చి, రామలక్ష్మణ సుగ్రీవులమ్రోల వ్రాలిరి. మహాబాహువగు హనుమంతుఁడును రామునికి సాష్టాంగముగా దండముఁబెట్టి, సీతాదేవి పాతివ్రత్యనియమముగలదై, యక్షతగా నున్నదని యారాముని కెఱిఁగించెను. తర్వాత సుగ్రీవలక్ష్మణులును ఆహనుమంతునియందే కార్య మనుకూలించుట నెఱిఁగి, సంతుష్టులై యాతనిని గౌరవముతోఁ జూచిరి. శత్రుసంహారియగు శ్రీరాముఁడును సీతాదర్శనవార్తాశ్రవణముచే సంత సించినవాఁడై హనుమంతుని మర్యాదచేసెను.

## 65-వ సర్గము

### హనుమంతుఁడు సీతాదేవివృత్తాంతము రాముని కెఱిఁగించుట

తర్వాత వానరులందఱు చిత్రవనములు గల ప్రస్రవణపర్వతముఁ జేరి, యంగదుని మున్నిడుకొని, రామలక్ష్మణులకును సుగ్రీవునికిని బ్రణమిల్లి, సీతాదేవి రావణుని యంతఃపురమున నుంచఁబడి యుండుట, రాక్షసస్త్రీలు బెదరించుట, ఆదేవి రామునియం దనురాగము గలిగి యుండుట, ప్రతినయొనర్చుట మొదలగు వృత్తాంతములను దెలిపిరి. అంత రాముఁడు సీతాదేవి యక్షతయై యున్నదను వాక్యమును విన్న వాఁడై, "సీత యెచ్చట నున్నది? నాయం దెట్లున్నది? సీతం గూర్చిన యీసంగతి నాకు విస్తరించిచెప్పుఁ" డని వానరుల నడిగెను. అంత వానరులు సీతాదేవివృత్తాంతమును బాగుగ నెఱిఁగిన హనుమంతుని నాసంగతి చెప్పుటకై పురికొలిపిరి.

మాటలందు నేర్పరియైన హనుమంతుఁడును వానరులమాటలను విని, సీతాదేవిని దాను జూచివచ్చిన తెఱఁగు చెప్పఁబూని యా రామునితో నిట్లనెను: "ఓ రాఘవా! నేను సీతాదేవిని వెదకుటకై నూఱు యోజనముల దవ్వుగల సముద్రమును దాఁటితిని. దక్షిణ సముద్రము యొక్క దక్షిణతీరమున దుష్టస్వభావుం డయిన రావణుని దైన లంక యను పట్టణ మున్నది. ఓరామా! ఆ లంకాపురమున రావణుని యంతఃపురముననుండి, తనమనస్సెల్ల నీయందే యుంచికొనియున్న పతివ్రత యయిన సీతాదేవిని గాంచితిని. అచ్చట నుద్యానవనమున నొక శింశుపా వృక్షముక్రింద సీతాదేవి యున్నది. ఆమెకుచుట్టును రాక్షస స్త్రీలు కావలికాచుచు నెల్లప్పుడు ఆమెను బెదరించుచున్నారు. దుఃఖములకుఁ దగని యాదేవిని రాక్షసస్త్రీలు దుఃఖపెట్టుచున్నారు. ఆమె ఒంటి జడనుదాల్చినదై, మోమునఁ గళలేక మిమ్ముగూర్చియే చింతించుచు, నేలఁ బరుండుచు, మంచుకాలమందలి పద్మముమాడ్కి శోభ లేనిదై, రావణునియందు మనస్సు లేమిచే మరణమునొందుటకు సిద్ధపడు చుండఁగాఁ జూచి, తమయందుమనస్సుకలిగి యుండుట యెఱిఁగి, యిక్ష్వాకువంశము నెల్లఁ గీర్తించి తిన్నగా నాయందు నమ్మకము గలిగించుకొంటిని. తరువాత నాదేవితో మాటలాడి నేను గొనిపోయిన

యుంగరము నొసఁగితిని. ఆమెయు తమకును సుగ్రీవునికిని గల్గిన చెలిమి వార్తను విని యెక్కువ సంతోషము నందినది. ఓ పురుషశ్రేష్ఠా! ఈ సీతాదేవి పరపురుషుని తలంపకుండుట మొదలగు ఆచారములును, ఉగ్రతపస్సును, తమయందుభక్తియుఁ గలిగియున్నది. ఓ రాఘవా! మీరు చిత్రకూటమున నుండఁగా, తమరు వాయసముమీఁద బ్రహ్మాస్త్రము నేసినదియు, తమరు సీతాదేవియొక్క బొట్టు మాసిపోవఁగాఁ జెక్కిళ్లయందు మణిశిలతోఁ దిలకము దిద్దినదియుఁ జెప్పి యావలనొక శిరోరత్నము నొసఁగె. "ఓహనుమంతుఁడా! దీనిని రాఘవునికిఁ జూపుము. అతఁడెక్కువ యానందము నొందును. దీనిని జూచి నన్నుఁ జూచినట్లె యానందించు ననియు, ఇఁక ఒకనెలమాత్రము ప్రాణములతోనుందునుగనుక నన్నంతలో పిల్చుకపోవలయు ననియు" నాతోఁ గృశాంగియు, బతివ్రతయు, ఆఁడుజింకవలెఁ గదలెడి కన్నులుగలదియు నైన ఆదేవిచెప్పెను. ఓ రాఘవా! నాతోఁ జెప్పిన సంగతి యిదియ. రాజపుత్రా! సముద్రముదాఁటు నుపాయము విచారింపుఁడు" అని హనుమంతుఁడు శ్రీరామునితోఁజెప్పి, ఆ రామలక్ష్మణు లిద్దఱు నమ్మిక కలిగి యున్నారని యెఱిఁగి, వారికి శిరోరత్నమునొసఁగి సీతాదేవి నోటిమాటగాఁ జెప్పిన మఱికొంత వృత్తాంతమును వరుసగాఁ జెప్పినవాఁ డయ్యెను.

## 66-వ సర్గము

### శ్రీరాముఁడు చూడామణిని జూచి దుఃఖించుట

హనుమంతుఁ డిట్లుచెప్పి యా మణి నీయఁగా, రాముఁడును దానింగైకొని ఱొమ్మున నుంచికొని, లక్ష్మణ సమేతుఁడై విలపించి, నేత్రములనుండి కన్నీరుధారలు ధారలుగాఁ గార్చుచు, సుగ్రీవునిం జూచి యిట్లనియె! "ఓ కపీంద్రా! వత్సలయగు ఆవు దూడమీఁది ప్రేమచే నెట్లు చన్నుచేఁపునో, అట్లు నామనస్సును ఈమణిశ్రేష్ఠముయొక్క దర్శనముచేఁ బ్రేమవలనఁ గరఁగుచున్నది. ఇది యెక్కడిది యనిన, ఈ మణిని నా మామగారు పెండ్లియప్పుడు వైదేహి కరణముగా నొసఁగెను. అప్పుడిది ఆ జానకి శిరస్సున ధరించినప్పు డెట్లు శోభిల్లుచుండెనో, అట్లె యిప్పుడును శోభిల్లుచున్నది. ఓ చెలికాఁడా! ఈ

రత్నము సముద్రమునఁ బుట్టినది. సజ్జనులచేఁ బూజింపఁబడినది. రాజసూయయాగమునందుఁ గడుసంతుష్టుఁడైన దేవేంద్రుఁ డీ రత్నము మామామకు నొసఁగెను. ఇప్పు డీమణిశ్రేష్ఠదర్శనముచే మాతండ్రియు, మామగారును గనఁబడి నట్లున్నారు. ఈమణి యీ నా ప్రియురాలి యొక్క శిరస్సునందు శోభిల్లుచుండును. ఈమణ్యవలోకనముచే నా ప్రియురాలే సమక్షమునకు వచ్చినట్లున్నది. నరుఁడు దప్పిగొన్న వానిని నీళ్లిచ్చి తనివినొందించునట్లు, జానకి నన్ను మాటలనెడి నీటిచేఁ దడుపుచు నాకేమిసంగతి చెప్పిపంపినది? ఓరి నాయనా! నాకుఁ బలుమా ఱా సంగతి వినిపింపుము" అని హనుమంతుని నడిగి, లక్ష్మణునిఁజూచి, "లక్ష్మణా! వైదేహి లేకయే వచ్చిన యీ సముద్రమునఁ బుట్టిన మణినిమాత్రము చూచుచున్నాఁడనే. దీనికంటెఁ గడు విచారకరమైనసంగతి మఱొక్కటి యున్నదా? సీత నారాక నెదురుచూచుచు నొకనెలదినములదాఁకఁ బ్రాణములతో నుండునేని, నాదేవి చాలకాలము బ్రదికియుండినదనియే చెప్పవలెను. ఓరినాయనా! నేను నల్లనికన్నులుగలదగు ఆసీతను బాసి యొక క్షణమైనఁ బ్రాణములతో నుండఁజాలను. ఓరి హనుమంతుఁడా! నన్నును నా ప్రియురాలగు సీతయుండు తావునకుఁ గొనిపొమ్ము. ఒకవేళ నా ప్రియకాంత యెచ్చటనున్నదో తెలియక యుండిన నిమ్మళముగా నుండవచ్చును గాని, ఒకచోట నున్నదని సంగతి తెలిసిన తర్వాత నే నొకనిమిషమైన నుండఁజాలను. మిక్కిలి పిఱికిదియు, చక్కని పిఱుఁదులు గలదియు, సుగుణవతియునైన నా ప్రియురాలగు సీత యాఘోరరాక్షసులనడుమ నెట్లున్నది? చీఁకటినుండి తొలఁగినను, మేఘములచేతఁ గప్పఁబడిన శరత్కాలచంద్రునిమాడ్కి రాక్షసులచేఁ జుట్టఁబడిన యా సీతాదేవియొక్క ముఖమును బ్రకాశహీనమై యుండును. హనుమంతుఁడా! సీత నాకేమి చెప్పిపంపినది? సవిస్తరముగా నిప్పుడు చెప్పుము. నీ మాటలను వినియయినను రోగి మందుచే జీవించినట్లు నేనును జీవించెదను. సౌందర్యవతియు, ఇంపుమాటలు పల్కునదియు, గొప్పపిఱుఁదులు గలదియు, నన్నుఁబాసియున్నదియు నైన సీత నాకేమి సంగతి చెప్పిపంపెను? తెలుపుము" అని హనుమంతుని శ్రీరాముఁ డడిగెను.

## 67-వ సర్గము

### హనుమంతుడు సీతాదేవి చెప్పినవృత్తాంతము రామునికెఱింగించుట

మహాత్ముఁడగు రాముఁ డడుగఁగా, మారుతి సీతాదేవివృత్తాంత మంతయు రామున కెఱింగించెను: "ఓ పురుషశ్రేష్ఠా! ముందు మీరు చిత్రకూటపర్వతమున నున్నప్పుడు జరిగిన యొకవృత్తాంతము నాకు గుఱుతుగాఁజెప్పెను. అదేదియనఁగా, మీరు పర్ణశాలయందు నిద్రించుచుండఁగా, జానికి తమకంటె ముందుగా నిద్రలేచి కూర్చుండెను. అప్పు డొక కాకి యాదేవి స్తనములనడుమ గీఱెను. తర్వాతఁ దా మామె తొడమీఁదఁ దలయుంచి పరుండి నిద్రించితిరి. మఱల నావాయసము వచ్చి, మాటిమాటికి నాదేవి స్తనమధ్యంబున ముక్కుతో గీఱి, యాదేవి కెక్కువ బాధను గలిగించెను. దేవి ఆపక్షియొక్క బాధనోర్వఁజాలక సుఖనిద్రయందున్న తమ్ము లేపెను. తమరును దేవియొక్క స్తనములందు గీఱిన తెఱఁగుఁజూచి, నల్లత్రాచుమాడ్కిఁ గనలి, నిట్టూర్పు విడుచుచు, "ఓ పిఱికిదానా! ఎవఁడు నీ స్తనములనడుమ గీఱెను? ఎవఁ డుగ్రమయిన యైదు తలలపాముతోఁ గ్రీడించుచున్నాఁడు?" అని చెప్పి, నెత్తుటఁ దడిసినగోళ్లతో యాదేవి కెదుటనే కూర్చుండియున్న వాయసమును జూచి, యతఁడు వాయువేగముగలవాఁడును, భూమియందుఁ దిరుగుచుండువాఁడును, పక్షిశ్రేష్ఠుఁడు నైన యింద్రుని పుత్త్రుఁడగు కాకాసురుఁ డని యెఱిఁగి, దానిమీఁది కోపముచేఁ గన్నులు గిరగిర త్రిప్పి, దానిని సంహరింపవలెనని నిశ్చయించుకొన్నవాఁడవై తాము కూర్చున్న యాసనమునుండి యొకదర్భను దీసి దానియందు బ్రహ్మాస్త్ర మభిమంత్రించి, యావాయసముపైఁ బ్రయోగించితిరి. ఆదర్భ ప్రళయ కాలాగ్నివలె ధగధగమండుచు నా కాకాసురునిమీఁదికిఁ బోయెను. అంత నాతఁడు దానికి వెఱచి పరుగెత్త నారంభింపఁగా, నాదర్భ వానిని వెంబడించిపోయెను. వాఁడు తండ్రిని, వేల్పుల నందఱను, మహర్షులను శరణు చొచ్చియు, ముల్లోకములను దిరిగియు శరణము గానక, మఱలఁ దమకడకే యేతెంచి తమ్ము శరణు చొచ్చెను. ఆకాకాసురుండు చంపఁ దగినవాఁడయ్యు, సాగిలఁబడి శరణు చొచ్చుటచే నతనియందుఁ గరుణ తలఁచి, తమరు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమూఱక మఱలదు గనుక

నతనిదక్షిణనేత్రమును మాత్ర మా యస్త్రముచే సంహరించి, ప్రాణములతో విడువఁగా, నా కాకాసురుఁడు తమకును, దశరథమహారాజునకును నమస్కరించి, తమకడ సెలవుగైకొని నిజనివాసమునకుఁ జనియెను." అని తనమాటగా మీతోఁ జెప్పుమని చెప్పి నాతో వెండియు నిట్లనెను. "ఓ వానరోత్తమా! రాఘవుఁ డస్త్ర వేదులలో మేటియు, బలము, సుగుణములు గలవాఁడయ్యు, రాక్షసులయం దేల యస్త్రములఁ బ్రయోగింప కున్నాఁడు? గరుడపన్నగ గంధర్వ సురాసురులలో నెవ్వరును రాముని నెదిరింపఁ గలవారు లేరు. ఆరాఘవునికి నాయందు మక్కువ గలదేని, వాఁడియమ్ములతో ననియం దారావణుని సంహరించి యుండును. తన యన్న యనుమతి గైకొని లక్ష్మణుఁడైనను వచ్చి యీ క్రూరరాక్షసుని సంహరింపరాదా? ఆ పురుషోత్తముఁ డేల నన్నుఁ గాపాడకున్నాఁడు? పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులిద్దఱు వాయ్వగ్నులంబోలు తేజముగలవారు. దేవతలకైనను గెల్వ నలవికానివారు; సమర్థులు. అట్లుండియు నన్నేల యుపేక్షించియున్నారు? శత్రుసంహారులు, సమర్థులు నయ్యు, వారు నన్ను పేక్షచేయుట చూడఁగా, నాజన్మాంతర పాపకర్మము గొప్పగానున్న దని తోఁచెడి. దానికే సందేహాము లేదు."

అని సీతాదేవి కన్నీటితోడ దీనముగాఁ బలికిన మాటను విని, మఱల నేనును ఆదేవి కిట్లని పలికితిని: "ఓదేవీ! నిక్కముగాఁ జెప్పెదను. రాముఁడు నీవియోగశోకముచే నన్ని వస్తువులం దాశమాని చింతించుచుండును. రాముఁడు శోకపీడితుఁడైయుండునప్పుడు లక్ష్మణుఁడును వగలపాలగుచుండును. ఓదేవీ! యెట్టకేలకు నీపోబడి తెలిసెను. ఇది వ్యసనమునకుఁ దరుణము గాదు. ఈక్షణముననే దుఃఖములకు ముగింపు గాంచఁగలవు. పరాక్రమవంతులును, మేటిమగలును నైన రామలక్ష్మణు లిరువురును నిన్నుఁ జూచునుత్సాహాముతో నున్నారు. గావున, నేను పోయి చెప్పఁగానే వచ్చి లంకాపురమును ధ్వంసము చేయఁగలరు. మఱియు బవరమున రావణుని బంధుజనసమేతముగా మట్టుపెట్టి, నిన్ను స్వపురమునకుఁ గొనిపోవుదురు. ఇది నిక్కము. మఱియు రాముఁడు దెలియఁ దగినదియు, అతనికి సంతోషము గలిగించునదియు నైన యెుకయానవా లొసఁగుము" అని యడిగితిని. ఆదేవి దిక్కులెల్లఁ జూచి, జడపైఁదాల్చునట్టి యుత్తమమణిని కొంగుముడినుండి విప్పి నా

చేతఁ బెట్టెను. రఘువంశోద్ధారకా! నేనును నీకుఁ జూపుటకై యాదివ్య మణిని గైకొని యాపూజ్యురాలగు సీతాదేవికి మ్రొక్కి ప్రయాణమునకుఁ ద్వరపడఁగా, సౌందర్యవతియైన జానకియు, ప్రయాణత్వరతో మేనిని బెంచుచున్న నన్నుఁజూచి, కన్నులందుఁ గన్నీరు నిండఁగా, కన్నీటిచే మాటలు తడఁబడఁగా, నా పోకకై దిగులుపడి, దుఃఖవేగమునకు నొచ్చినదై "ఓహనుమంతుఁడా! మృగరాజులంబోలు రాజపుత్రులగు రామలక్ష్మణులకును, సుగ్రీవునికిని, వానిమంత్రులకును నా క్షేమము చెప్పుము. నిడుదచేతులవాఁడగు రాఘవుఁ డెట్టు నన్నీ శోకసాగరము నుండి గట్టెక్కించునో, అట్లు నీవు చెప్పవలసినది. ఈ నా యోర్వరాని దుఃఖమును, ఈరాక్షసస్త్రీల బెదరింపులను రామునికిఁ జెప్పవలసినది" అని దుఃఖముతో నీవృత్తాంతమును జెప్పినది. నీవు ఈ వృత్తాంతమును విన్నవాఁడవై, సీతాదేవి పూర్ణక్షేమముతో నున్నదానిఁగా నెఱుఁగుము.

## 6౩-వ సర్గము

హనుమంతుఁడు సీతాదేవి చెప్పినసంగతి రామునకెఱిఁగించుట

"ఓ నరశ్రేష్ఠా! నేను ప్రయాణసంభ్రమమున నుండఁగా, మఱల నా దేవి నీయందలి యనురాగముచేతను, నాయందలి విశ్వాసముచేతను నన్ను గారవించి వెండియు నాతో నిట్లనియె: "ఓ వానరశ్రేష్ఠా! నే నిప్పుడు చెప్పిన తెఱఁగునఁ బలువిధములుగా, ఆరాముఁ డెట్లు వేడిగా వచ్చి యాహవమున రావణునిఁ బరిమార్చి నన్నుఁ బొందునో, ఆ ప్రకారముగాఁ జెప్పవలెను. శత్రువుల నణఁచునట్టియోశూరుఁడా! నీకిష్టమేని, యొకమఱుగుప్రదేశమున నుండి కొంతయలఁత దీర్చుకొని రేపు బయలు వెడలి పొమ్ము. అదృష్టహీనురాల నైన నాకడ నీవు కొంతసే పుంటివేని, నాదుఃఖమునకుఁ గొంతతడవు శాంతి యుండును. శౌర్యముగలవాఁడా! నీవు రామలక్ష్మణులను, సుగ్రీవాది వానరులను దోడ్కొని రాఁబోవుచున్నావు. నీవు వచ్చునంతలోపల నాప్రాణములుండుట సందేహమే. దానికి యోచన యక్కఱ లేదు. మొదటనే దుఃఖములందుఁ జిక్కిన దానను, దీనురాలను నైన నన్ను నిన్నుఁజూడమిచేఁ గలుగుశోకము మఱింత దుఃఖములందుఁ ద్రోయును. ఓ వానరేంద్రా! నీకు సహాయులై యుండు వానరులవిషయమున నిదిగో నాకొక గొప్పసంశయము గలుగు

చున్నది. అదేదియనఁగా, ఆవానరసేనలుగాని, ఆరాజపుత్రులగు దశరథతనయులుగాని, యెట్లీ సముద్రమును దాటఁగలరు? ఈసముద్రము దాటుటకు గరుడునికిని, నీకును, వాయువునకును మీకు ముగ్వురకు మాత్రమే శక్తిగలదు. ఓకార్యవేత్తలలో శ్రేష్ఠుఁడా! నిర్వహింపనలవి కాని యీ కార్యము నెఱవేఱువిషయమునఁ దగిన యోచన యేమి యాలోచించెదవు? చెప్పుము. శత్రువీరుల సంహరించువాఁడా, నీ వొక్కఁడవే యీకార్యమును సాధింపఁజాలినవాఁడవు. నీబలాతిశయము లోకప్రసిద్ధమైనది. రాముఁడు చతురంగబలముతో వచ్చి, యుద్ధరంగమున రావణునిఁ బరిమార్చి, జయశాలియై నన్నుఁ దననగరమునకుఁ గొనిపోయెనేని, అది యీ రామునకుఁ గీర్తికరమైయుండును. నానాథుఁడు లేనియప్పుడు, ఆ రాక్షసుఁడు నన్నెట్లు వంచనతోఁ దెచ్చెనో, అట్లు నానాథుఁడును వానికి వెఱచి నన్నుఁ గొనిపోవుట యుక్తముగాదు. శత్రుసేనలను నొందునట్టి యీ రాముఁడు లంకాపురమును సేనలతో నిండించి, పురమెల్ల ధ్వంసముచేసి నన్నుఁ గొని పోవునేని, అది యతనికిఁ దగియుండును. ఓ శూరుఁడా! యుద్ధమున మొనగాఁడును, మహాధీరుఁడును నైన యీ రామునిమగఁటిమి యాతని కెట్లు యుక్తమగునో, అట్లు చేయుము."

అని సీతాదేవి యర్థగౌరవముతోను, హేతువుతోను, వినయముతోను జెప్పినమాటను విని నే నిట్లు బదులు చెప్పితి. ఓ దేవీ! వానరసైన్యములకెల్ల నాయకుఁడైన వానరశ్రేష్ఠుఁడగు బలవంతుఁడయిన సుగ్రీవుఁడు నిన్నుఁ గనుఁగొను విషయమున మిక్కిలి శ్రద్ధ వహించియున్నాఁడు. పరాక్రమవంతులును, సత్త్వవయు, బలముంగలవారును, మనోవేగముతోఁ బోవువారును, ఆనతిచొప్పున నడచువారును నైన వానరు లతనికడఁ బెక్కండ్రున్నారు. వారు క్రిందను పైనను నడుమను ఆటంకములేకుండ సంచరింపఁగలరు. వారెంతటి పనులందైనను ముందు వెనుకలఁ జూడరు. వాయు మార్గమునఁ బోవునట్టివారును, మహాత్ములును, బలముచే గర్వించిన వారునునైన వానరులు పెక్కండ్రు పలుమాఱు భూమండలమెల్లఁ జుట్టి వచ్చియున్నారు. వారిలోఁ గొందఱు నాకు సమానులును, కొందఱు నాకంటె హెచ్చినబలముగలవారు నున్నారేకాని, నాకంటెఁ దక్కువ

ముగలవాఁడు కలికమునకైనను లేఁడు. నేనే యిచటికి వచ్చి
న్నాఁడు, వారు వచ్చు విషయమున నొక సందియమున్నదే. రాజులు
రపనులకు సామాన్యులనేకాని గొప్పవారి నంపరుగదా. కాఁబట్టి
గాదేవీ! ఈ వ్యసనము వలదు. వానర శ్రేష్ఠులంద ఱొక్క యెగురు
నే యిచ్చటికి వచ్చి చేరుదురు. నరశ్రేష్ఠులగు రామలక్ష్మణు లిద్దఱు
వీఁపుమీఁద నెక్కి నవోదితులగు సూర్యచంద్రులమాడ్కిఁ
రిల్లుచు, మహాభాగ్యవంతురాలా! నీకడకు రాఁగలరు. సింహ
లంబోలు రామలక్ష్మణులు విండ్లనుదాల్చి యీలంకాపురద్వారమునకు
చ్చినప్పుడు నీవే చూడఁగలవు. గోళ్లు కోఱలు నాయుధములుగా నుప
గాగించువారును, సింహశార్దూలములఁబోలు మొనగాండ్రును, మేటి
నుఁగులబోలువారును నైన వానరులందఱు గుమిగూడి యిచ్చటికి
ఁగా, వారిని నీవేచూడఁగలవు. పర్వతములతోను మేఘములతోను
టియగు వానరవీరులు లంకాపురమునందలి మలయపర్వతపు దరుల
ందుఁ గూర్చున్నవారై, చేయఁబోవు సింహనాదమును త్వరలోనే
వినఁగలవు. నీతోడ వనవాసము ముగించి మఱల నయోధ్యాపురము
ఁబోయి పట్టాభిషేకముచేసికొనిన రాఘవునిఁ ద్వరలోనే చూడఁ
వు" అని యిట్టిగుగున నేను ధైర్యపుటింపుమాటలు పలికి సమా
నపఱుపఁగా, తమ వియోగశోకముచే నొచ్చినదయ్యు జానకి
యింపుమాటల విని కొంతతడవు నిమ్మళము నొందినదాయెను" అని
నుమంతుఁడు రామునకు సీతాదేవివృత్తాంతము నెఱిఁగించిన
ఁడాయెను.

శ్రీమదాంధ్రవచన రామాయణమున సుందరకాండము సమాప్తము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951

# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | ... | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనమహాభారతము:— | | | |
| ,, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, అరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | ... | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము:— | | | |
| బాలకాండము | ... | 2 | 8 |
| అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| అరణ్యకాండము | ... | 2 | 8 |
| తక్కినకాండలు | | అచ్చగుచున్నవి | |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | ... | 1 | 12 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| న్యాయవిచారణ, (ప్రహసనము) | ... | 0 | 12 |
| శ్రీతిలకుగారి సెక్యూరిటీకేసుఉపన్యాసములు | ... | 0 | 14 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| భారతరమణీమణులు, 1 భాగము | ... | 1 | 4 |
| డిటో 2 భాగము | ... | 0 | 10 |
| డిటో 3 భాగము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరి, | ... | 0 | 12 |
| ,, టీకతో | ... | 1 | 4 |
| పంచతంత్రము, వచనము | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| పతివ్రతలచరిత్రలు | ... | 3 | 0 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I-భాగము | ... | 1 | 0 |
| II-భాగము | ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292 ఎస్ప్లనేడ్, మద్రాసు—1.